



శ్రీ శివాధ్యాన్నమః

# శ్రీశివపురాణము

శ్రీ ముదిగొండ నాగవీరేశ్వరకవి

విరచితము



శ్రీ కింకవీంద్రఘటాపంచాననేత్యాది బిరుదాంచితులును శతావధానులు నగు

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారిచేఁ

బరిష్కృతము

మొదటికూర్పు - ౬౦౦ ప్రతులు

నెం. 6583, మార్కెట్టు వీథి - సికింద్రాబాదు

ఓరియంట్ ప్రెస్ నందు ముద్రితము

 1947 [ వెల రు. ౧౦ లు




క. శంకరునిన్ శాంకరినిన్
శాంకరినిన్ విఘ్ననాథు, శైలాదిని ని
శ్శంకన్ గొలిచిన వారికి
సంకటములు సురుఁగు సకల, సౌఖ్యము లమరున్.

ము॥ నా॥

శ్రీః

# పీఠిక

ఈశివపురాణ మష్టాదశపురాణములలో నొకటి. దీని యాంధ్రీకర్త బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి గారు. ఇన్నాళ్లకీమహాగ్రంథము తెలుగులోని కనువదింపఁబడుట భాషాసరస్వతి యదృష్టము. అదృష్ట మేలననగా నొకగ్రంథము మంచికవిచేతిలోఁ బడుట పుణ్యవిశేషము. ఆకాశిపోకాశికవి కావ్యమును బాడుచేసి సమర్థుఁగు మరల ముట్టుకొనుటకుఁగూడ కొంకునట్లు చేయును. మొదటనీకవియొక్క మహాప్రతిభావిశేషము, వైదుష్యము, రచనలోని నేర్పు, అనంతమార్గముల విహరించగలయీయనపద్యరచన, పూర్వకవులయందలిపరమాదరము, విమర్శనీయములు. వీనిలోఁ గొన్నిటిని స్థాలీపులాకన్యాయముగ నెత్తి చూపి తరువాత పురాణమును గుఱించి ముచ్చటించెదను. ఒకగ్రంథ మొకకవి వ్రాయుటకధికారము కావలయును. ఆ యధికార మీయనయొద్ద నెంతవఱ కున్నది? ఆందులోనియ్యదిమహాగ్రంథము. అనంత మైన శక్తికలవాఁడు గాని యిట్టి గ్రంథము వ్రాయుటకుఁ దలపెట్టఁడు. పుటకిఱువదియెనిమిది పంక్తుల చొప్పున నిది యేడువందల యెనుబది పుటల గ్రంథము. సుమా రాఱు వేల పద్యములు.

అప్పకవి సత్కవియొక్క లక్షణము చెప్పుటలోఁ బూర్వకవీశ్వరవాక్ప్రయోగదక్షతగూడ నొక్కటిగాఁ జెప్పెను. ఈకవికి శ్రీనాథుఁడు, పోతన్న, తిక్కన్న, చేమకూర వేంకటకవి ప్రధానముగా నభిమానపాత్రములు. వీరిలోఁ బోతన్నగారియందీకవికిఁగల భక్తికిఁ బరిమితి లేదు. ఎన్నిచోట్లనైనఁ బోతన్నగారి పద్యములు పుణికి పుచ్చుకొనును. దీని కచ్చముగాఁ బోతన్నగారి యందలి భక్తియే కారణము కాకపోవచ్చును. విష్ణుపారమ్యమును బోధించు పురాణము భాగవతము. ఈపురాణము శివపారమ్యమును బోధించునది. భాగవతములో సర్వదా విష్ణుదేవునకుఁ బరమాత్కృష్ట్యము చెప్పఁబడును. ఇచట శివునకుఁ జెప్పఁబడును. రెండును భక్తిమతములే రెండును మఱల వైదికమతములే. ఈగ్రంథములకు సామ్యము మిక్కిలి యున్నది. అందుచేత నీకవి భాగవతమువలెఁ జాలచోట్ల రచన చేయుట వస్తుమర్యాదను బాటించుట యేమో! భక్తిని బోతన్నగారిట్లు చెప్పిరి.

మ. తనుహృద్భాషల సఖ్యముం, శ్రవణముం, దాసత్వముం, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయుం, సంకీర్తనల్, చింతనం

బును, నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఁ హరి న్నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్ర మంచుఁ దలఁతుఁ సత్యంబు దైత్యోత్తమా!

(భాగవతము)

గీ. శ్రవణమును గీర్తనంబునుస్మరణసేవనములునుఁ దాస్యమునునర్చనయునువంద
నమును,సఖ్యంబు.సాత్మార్పణమును న నెడు, నవవిధాంగములుండితనర్చుభక్తి.

[శివపురాణము 94 పేజీ]

ఇది సామాన్యము.

సీ. శీతాంశుధరు నెంచు చిత్తంబుచిత్తంబు । భవునకుర్చన చేయు పాణిపాణి.

... ... ... ...

సీ. పరమశివార్చనాపదవి నొందఁగలేని । యిక్కగా దది పాఁపడొక్కగాని

... ... ... (శి. పు. 2.4. 215 పే.)

ఈ పద్యములు పూర్తిగా ప్రహ్లాదచరిత్రలోనివి. పార్వతీదేవి సరిగా రుక్మిణీదేవి వలెనే మాటాడును.

కం. పంచాననధన మగు నఁ । గొంచక యొండెవఁడు పెండ్లిగొనఁగలఁ డంబా!
పంచాననధనము నిలఁ । వంచకమతి యొక్కనక్క వడయునె యెందుఁ.

(శి. పు. 274 పే.)

ఉ. శ్రీయుతమూర్తి! యోపురుషసింహమ! సింహముపాలిసొమ్ము గో
మాయువు కోరినట్లు మదమత్తుఁడు చైద్యుఁడు... (భాగవతము.)

క. భూషణములు శ్రుతులకు పరి । పోషణములు దృఢవికాసబోధాగతి కా
శ్లేషణములు సుఖసిద్ధికి । తోషణములు మదికి నీమృదులభాషణముల్.

(శి. పు. 310 పే.)

మ. పొలఁతుల్ మాయలమారు లెంతయును నప్పూబోఁడు లున్నట్టిచో
జెలమిఁ జేరఁగరాదు బ్రహ్మనయినఁ హేలావిశేషంబునఁ
కలఁతంబుచ్చి యలంత్రు గిత్తవలె లోగంజేతు రవ్వారియ
త్తలపుల్ క్రూరము లుల్లముల్ విసము సిద్ధాక్షిణ్యాలీనాతుకల్. (శి. పు. 226 పే.)

మ. తలఁపుల్ చిచ్చులు మాట లుజ్జ్వలసుధాధారల్ ప్రియుండైన పూ
విలుతుఁ మెచ్చర యన్యునిఁ నలతు రే విశ్వాసముఁ లేదు క్రూ

రలు తోడుక్ బత్తినైన చంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయుం డ్రెక్కడ! వారి వేడబము లా వేదాంతసూక్తంబులా!

(భాగ. స్కం. 9)

ఈరచనలోని సాను ము చూచునది. మఱియు శ్రీనాథుని పోకడలు.

సీ. పరుగిడు నేఁటి పకనురవిభుజాడ । కృష్ణవేణీసరోజకిసలపాణి (శి.పు. 529 పే.)
సీ. ప్రసహించు నేఁటిటిపశ్చిమప్రాకార। మురసి గంగయమ్నసాగరముకొమ్మ (కా. ఖం.)
క. కిగ్గాడి దైత్యుఁ డీశం । డెగ్గనకయె........ (శి. పు. 452 పే.)

ఈ కిగ్గాడిశబ్దము పింగళి సూరన్నగారిది.

మఱి తిక్కన్నగారి పోకడ:—

చ. అలతులఁబోదురే సురుఁ షు నభ్రిధునీతనుజుండు చిన్వగో
నలిగిన కిరినోర్వఁగల యాజసిసుం డెవఁ డల్లకర్ణుఁడుక్
బలియుఁడు ద్రోణజుండు పరిపంథివిదారణధీరుఁ డట్టివా
రల గెలుపొందువారలె పురద్విషుసాయము లేక పాండవుల్! (శి. పు. 513 పే.)

ఈకవి యెన్ని మార్గములనైన పోఁగలఁడు. ప్రౌఢమార్గమునసంచరింపఁగలఁడు అని కొన్ని తక్కువ రచనలవంక పోడని లేదు. అల్పములైన యమకములు, శ్లేషల యందు గూడ తన మనస్సును జొప్పించును ఈ చేమకూర వెంకన్న ననుసరించిన యమకములు చూడుడు,

క. గంగావతరణమునకే, గంగాఁ దగ దెవరు కొంత కాలం బిటు లా
గంగానలె జేఁడపడ, గంగా శిక్షించునాజ్ఞ గడచినవారిక. [శి.పు.164]

క. లేమావివిరులతూపుల, లేమా! మన మెదిరి గెలువలే మార్తిబడక
లేమామరు నేలఁగ నా, లేమాకులజొంపములఁ గలియఁ గన్గొనుమా!

(శి. పు. 360 పే.)

క. గంగా! మాకలుషము లడ, గంగా పొనరింపు మమ్మ! కారుణ్యామెసం
గంగా నీసరిధునికలు. గంగా విన మెందునిజము కంజాతముఖీ!

(శి. పు. 674 పే.)

మఱి శ్లేష :—

గీ. చక్రదుఃఖానహుండైన సత్పుమగ్రి, వసువును హరించినను సుమనితఁ జెంది
ననుగ నల వోఁదిరవరియించెనుగలాదు, కాముకులుగాంతు రేయెందుఁగల్మషముఁ.

(శి. పు. 344 పే.)

ఈ చూపించిన యుదాహరణలవలనయీకవి యెంతమందికవుల ననుకరించినను నీయన యభిమానము పోతన్నగారియందె యెక్కువ. చివరకు దన వంశవర్ణనము చేయుచు,

సీ. ఎవ్వాని శుభనామ మేప్రొద్దు నుడివిన, జనులకు పాపసంచయముతొలఁగు.

(శి. పు. 6 పే.)

ఈరీతిగా నెన్ని యేనియుఁ జూపించవచ్చును. ఇది పూర్వకవుల వాక్ప్రయోగ దక్షత. ఈమహాపురాణమునందున్న గుణము లన్నియు చిట్టాగా వ్రాసిచూపించను గాని యొక్కొక్కగుణమున కొకటిరెం డుదాహరణములుగా చూపింతును.

శబ్దప్రయోగౌచిత్యము :

గీ. ఎంతయేనియు శుశ్రూష హెచ్చుచుండె, చెప్పుమిప్పుడు కృపతోడ శివునితత్త్వము

... ... ... ... (శి. పు. 9 పే)

ఇందలి శుశ్రూషాశబ్దము వ్యుత్పత్త్యర్థములో నెంత యందముగా నున్నది!

గీ. చారుకస్తూరి కాగరుచందనాను, లేపనసుగంధబంధురాటోపమెసఁగు

వాఁడురుచిరతరామాల్యవస్త్రయుగ్మ, కలితుఁడగువాఁడుశంభుండు కాంచఁబడియె

(శి. పు. 278 పే)

ఇందు 'కాంచఁబడియె' నన్న ప్రయోగము మిక్కిలి యుచితముగా నున్నది. దీని యౌచిత్యము కథలో నున్నది. మేనక తన కూఁతును పార్వతిని శివున కీయ నన్నది; అతఁడు పిచ్చిబికారి యని. చివరకు విష్ణువు పోయి శివునిఁ బ్రార్థించి ప్రసన్నునిఁ జేసుకొనెను. అప్పుడు మేనక వచ్చి చూచెను. ఇంత యందగాఁడైన శివుఁ డాపెచేఁ జూడఁబడెను. ఇందు శివునియొక్క పరమేశ్వరత్వము వ్యంగ్య మగుచున్నది.

కవి పూర్వకవుల నింత యనుసరించుటచేత నాయన కొక స్వతస్సిద్ధమైన రచన లేదనికాదు. ఎచ్చటెచ్చటనో వారియందలి గౌరవముచేఁ బూర్వకవుల ననుస రించుటేగాని, కవి సహజముగాఁ దన ప్రత్యేకమైన పలుకుబడికలవాఁడు. ఈపలుకుబడి గ్రంథమందంతటను గలదు. సమర్థులైన సర్వకవులకు ప్రవాహముగా తాము చేయు రచనయొక్క సాంతత్యముయొక్క సామాన్యదశ సర్వత్ర కనుపట్టుచుండఁగా నొక్కొక్కచోట నా సాంతత్యములోనుండి కొన్ని విశేషములు పర్వతమునందు

శృంగములవలె భాసించుచుండును. ఇట్టి ఘట్టములవలన ప్రతి మహాకవిరచనయు నొక గౌరవాధిక్యము సంపాదించుకొనును. అట్టి ఘట్టములు కొన్ని చూపించెదను.

శా. ఐనన్ బుత్త్రిక! శైవతత్త్వమును విశ్వాద్యుండు పద్మేక్షణుం
 డేనున్ నిక్క మెఱుంగఁ జాల మిఁక నెల్లే నర్కునిన్ దీపమ
 ట్లేనిప్పట్ల నెఱుంగఁ జెప్పెదను విన్మీ! నాదు వైదుష్యవి
 జ్ఞానశ్రీపరిమాణ మెంతపఱి కొజ్జం జేసి రంజించునో! (శి. పు. 20 పే)

పద్యరచన స్వతంత్రమైన పలుకుబడిలోనుండి పుట్టినది. "ఒజ్జం జేసి రంజించునో" యన్నమాట పలుకుబడిలోని ప్రౌఢి కుదాహరణము.

ఉ. కోరుము నీదు వాంఛితము కోమలి! నే నొడఁగూర్తు నంచుద
 వ్వారయ కేను బల్కితి... [శి. పు. 174 పే]

దూర మాలోచింపక యనుటకు దవ్వారయ కనుటలోఁ గొంత ప్రౌఢి కలదు.

శా. అవ్రజాంగుఁడు పద్మజున్ గని మహాహర్షంబునన్ మ్రొక్కి నా
 నావేదోక్తుల సన్నుతుల్ సలిపి వాజ్నాథా! మదీయాంగనా
 భావారూఢునిఁ బుత్రు నిమ్ము...... [శి. పు. 174 పే.]

'మదీయాంగనాభావారూఢునిఁ బుత్త్రిని' మ్మనుటలో భావగాంభీర్యమును జూడుఁడు!

లయగ్రాహి॥
 కొండ అలు కొంది ధృతిఁ జెంది సురబృందముల
 నుం దురమునం దెదిరి మ్రిందిరి కడంకన్ [శి. పు. 35 పే]

ఇది తారకాసురకుమారుల యుద్ధము ఈయుద్ధభాగములో లయగ్రాహి యింత సుకుమారముగా వ్రాయుట శైలిలో నొక మృదువైన పాక మేర్పడినవాఁడుగాని వ్రాయలేఁడు.

చికురముల వర్ణన: —

సీ. నమ్మకము లైన నీలరత్నమ్ములోఘు
 నమ్ములో తుమ్మెదలో చికురమ్ములొక్కొ!

రత్నములు నమ్మక మైన వనుట యెంత చక్కనిమాట! అన్నిటికంటె నపూర్వమైనశక్తి యీకిరింది పద్యములయందుఁ గన్పించుచున్నది. త్రిపురాసురులు చేసెడి దుండగములు దేవతలు బ్రహ్మతోఁ జెప్పుకొనుచుండిరి,

ఉ. పొద్దు కదుర్ నడిఁబుడమి బోర్ల గిలున్ బురము ల్గనంబడన్
హద్దును దప్పి తారలు హిమాంశుఁడు డాఁగుచు దిర్గుచుండు రే
సుద్దియు లేక బిక్కనడి చూచుచు నుండు జముండు మేటి యా
పద్దశఁ గడ్పుచుంటి మిది పద్మభవా! కనరాదె నీకిటుల్.

చ. ఎపుడొ దివంబు పైఁబడి సురేశులతో నిసుముం బొనర్తు ర
ష్టపుఁను దేటి చూచి కడు నబ్బుర మొందుచు దిబ్బ సేతు మం
చపకృతు లాడి పోవుదురు హా! యిఁక నేమి యొనర్తు మిత్త్రరిన్
దెపదెపలాడు మామదుల! దీనతఁదీర్పు మనుగ్రహమ్మునన్॥

(శి.పు.402 పే)

ఈపద్యములలోని వర్ణన యేపూర్వకవులును జేసినది కాదు. మీస్వర్గమంతయు బూడిద చేయుదుము, దిబ్బ జేయుదుము అనుటలో నున్న యౌచిత్యము చెప్పరాకుండ నున్నది. ఈమాటలయందు దాయాదులయొక్క మాత్సర్యము పరమరమ్యమైన వ్యంగ్యభూత మైనది. ఇందు రసము చిప్పిలు చున్నది. మొదటిపద్యముమిక్కిలి చిత్రముగా నున్నది. ఈరచన మహాకవులు మాత్రమే చేయఁగలరు. సామాన్యులు చేయలేరు. ఇది యంతయు నీకవియొక్క స్వతంత్రవావదూకత్వము.

లోకోక్తిసంగ్రహము :—

లోకోక్తిసంగ్రహమునం దీకవి యందె వేసిన చేయి. లోకోక్తిసంగ్రహణము నందే కాదు, లోకసంగ్రహణమునందును గొప్ప ప్రతిభాశాలి. కుబేరునిచరిత్రలో గుణనిధి హద్దు మీరి ప్రవర్తించుచుండెను. ఈకథ కాశీఖండములో శ్రీనాథుఁడు గూడ వ్రాసెను. ఈరెండు రచనల పోలిక తర్వాత వ్రాసెదను. ఈగుణనిధి 'చూపుల గుజ్జుమువలె నతఁ డేపు మెయిన్ బెరుగుచుండె' నఁట! ఈ పురాణమున ఈ చూపుల గుజ్జుమువంటి లోకములోని వాడుకమాట లెన్నికావలసిననన్నియున్నవి. ఇంక లోకసంగ్రహణముం జూడుఁడు. కుమారఖండములో రెల్లుతోటలోఁ బెరిగిన కుమారస్వామిని దీసికొని రమ్మనిశివుఁడు ప్రమథగణములతోనందీశ్వరునిబంపించెను వారు వచ్చుచుండఁగాఁ గృత్తికలు వచ్చి కొడుకుతోఁ జెప్పికొనిరి. కొడు కైన కార్తికేయుఁడు మీకు భయము లేదని చెప్పును. ఈఘట్టముమిక్కిలి రమ్యముగా నున్నది. అనఁగా,లోకసహజత్వము కొట్టవచ్చిన ట్లున్నది.

మఱియు, విఘ్నేశ్వరసృష్టి, శివవినాయకులయుద్ధము, శివునకుఁ బార్వతియందలి

ప్రేమ, మఱలఁ దన పట్టుదల, వినాయకుని తల తెగిపోయినతరువాతపడ్డదుఃఖము, ఇవి యన్నియు లోకసంగ్రహణమునకుఁ బరమోదాహరణములు. ఈగ్రంథ మంతయు లోకానుభవము గల్గిన రచన గాని వెఱ్ఱిమొఱ్ఱిరచన కాదు.

ఆంధ్రభాషాపాటవము : —

ఈకవి సంస్కృతాంధ్రశబ్దములు సహస్రములు లక్షలు తెలిసినవాఁడు. ఏయే కవులో యెచ్చటెచ్చటో ప్రయోగించిన రమ్యములైన తెలుఁగు శబ్దముల నన్నిటిని దెచ్చి వాడును. అనేకరూపములు వాడును. మోసమునకు మోస యను రూప మున్నది. తిక్కన్నగారు వాడిరి. ఈకవియు దానిని వాడెను.

సంస్కృతము : —

తెలుఁగుకవులు సంస్కృతసమాసములు గూర్చుటలో సులభార్థము సులభగ్రథనము చేయవచ్చును. అట్లుగాక, అర్థవత్తుగా, తార్కికసంబద్ధముగా సమాసగ్రథనము చేయుట యొక ప్రతిభాలక్షణము

ఉ. కన్నెను గాంచి యచ్చెరువుఁ గాంచి మునీంద్రుఁడు మన్మథాస్త్రసం
పన్నమనమ్ముతో నృపతివర్యున కిట్లనె .. ( శి. పు. 13 పే)

ఇచటి "మన్మథాస్త్రసంపన్నమనమ్ము" అన్నసమాసము ఇందాకటి "మదీయాంగనాభావారూఢుని" అన్న సమాసము వంటిది. ఒక విలక్షణమైన భావము గర్భమునందుఁ గల కూర్పు. ఇట్టి సమాసములు చేయుటకుఁ గవికిఁ బ్రతిభ కావలయును.

తెలుఁగులు : —

క. గెల పండిన యనటుల జొబ్బిలు పానకములఁ దనర్చు విరివగు నెమ్మా
వులఁ బండ్ల మెక్కి యుక్కునఁ జెలఁగి వదరఁ జేసె రామచిల్కలదండుల్
[ శి. పు. 73 పే]

సీ. సంజ కెంజాయల జానగు చందురు... ( శి. పు. 90 పే)

సీ. ఎలమావులును, నిమ్మ, లీత, చిట్టీతలు... [ శి. పు. 117 పే]

ఇట్లనేకపద్యములు అచ్చతెనుఁగుతనమునే వెలయించుకొనుచుండును.

ఉ. ......భీతచిత్తులై

ఎప్పటి కప్పుడే గడప నెంతురు కాలము కంజసంభవా!

ఈరీతిగా లోకసంగ్రహణము, తెలుఁగుపలుకుబడి, తెలుగుమాటల సమృద్ధి కూలంకషముగా నున్న రచన యిది.

వేదపరమార్జత : —

ఈగ్రంథ మంతయు వైదికార్థములనే చెప్పును. కాని, యొకమహావిషయమును జెప్పఁదలఁచితిని. తారకుని చేత దెబ్బలు తిని కుమారస్వామి మూర్ఛ పోయెను.

గీ. స్కందుఁ డద్దాన మూర్ఛిల్లి క్షణములోన
ఋషిగణస్తూయమానుఁడై యెఱుక చెంది [శి.పు. 350 పే]

మూర్ఛపడిన స్వామి ఋషిస్తోత్రములచేత మేల్కాంచె ననుట శివతత్త్వస్ఫూర్తి మద్వాక్యము.

శిల్పము : —

శిల్పమన్న శబ్దమున కర్థమిదమిత్థమని చెప్పుటకు వీలులేదు. లోకోత్తర సౌందర్య మెచ్చట పొడసూపునో యది శిల్ప మనిచెప్పవచ్చును. కథను జెప్పుటలోఁ గ్రొత్త రకముగాఁ జెప్పుట గొప్ప శిల్ప మని నాయుద్దేశ్యము. ఆంధ్రవాఙ్మయములో కథా కథనరమ్యత పలుమంది పలురకములుగాఁ జూపించిరి. ఈ కవి కొన్నిచోట్ల కథను జెప్పుటలో రమ్యతనే చూపించెను.

చివరకు శివుఁడు పార్వతి నంగీకరించెను. దివ్యస్త్రీలు పరిహాసము చేసిరి. అంత నిందిర యిట్లనియె, సావిత్రియిట్లనియె, అదితియిట్లనియె, ఆ వెంటజాహ్నవియిట్లనియె, నిట్లు దేవతాస్త్రీ లందఱు తలాయొకమాట యనిరి. ఇవి చిన్న చిన్న వచనములు. వారందరన్నమాటలు పద్యములు. ఈ రచనవలన పెండ్లిసంబర మంతయు, పరిహాస మంతయు, పెండ్లికొడుకుతో ముత్తైదువలాడు ముచ్చటలే-వ్యంగ్యభూతములై కథా ఘట్టము పరమసౌందర్య మనిపించుకొన్నది. వారట్లనిరి; వీరిట్లనిరి, అని వచనములు వ్రాసి, యన్నమాటలు పద్యములుగా వ్రాయుట, పోతన్నగారి భాగవతములోని యొక రచనాపద్ధతి. ఈ రచనాపద్ధతిని ప్రస్తుతమున నీ సౌందర్యోత్పాదనకై విని యోగ పరచుట యీ కవియొక్క ప్రతిభ. మరల నీ రచనాపద్ధతినే శివుఁడు తన పెర్య మేమైనదని, వెదకుటలో జూపించెను. శ్వేతాద్రివాయుస్వర్ణదీవసుమత్యాదులు కుమారునికథఁ జెప్పుదురు. అచటఁగూడ నీ సౌందర్య మున్నది.

ధ్వనులు : —

ధ్వనియన్న శబ్దమే విచిత్రమైన యర్థముగలది. సుకవిరచనలో రస మెప్పుడును వ్యజ్యమాన మగుచునే యుండును. కాని యల్పాల్పధ్వనులు, వస్తుకృతవస్త్వాదులు, శబ్దగతాదులు ప్రత్యేకముగా నుండఁ గొందఱు పండితులు వానినే చూచి యదియే

ధ్వనిమద్రచనాకావ్య మనుకొందురు. శబ్దగతము లైన మఱికొన్ని వ్యంగ్యములు చూడుఁడు.

గీ. అరయ నాధారశూన్యమా నాకసంబు నందు జెక్కలు లేని నా డెంద మనెడు
పులు గెగురుచుండె నద్దాని భూరిదయను నరసి పోచునుగాత చంద్రార్థమౌళి
(శి. పు. 211 పే)

ఈవాక్యము పార్వతి సప్తర్షులతో నన్నది. ఇది యలంకారకృతవస్తుధ్వని. రూపకాలంకారముచేత జీవుఁడు, ఇది శైవము కనుక నీజీవుని రక్షించుపరమేశ్వరుఁడు వ్యంగ్యభూతు లగుచున్నారు.

కం. కందర్పారికిఁ గన్నియ, నుండానము జేయఁ బూనను జుడీ! ఋషిసం
క్రిందనులు మీర లెఱుఁగని చందము లే దరసి చెపుడు చదురెదియేనిన్.
(శి. పు. 240 పే)

శివునకుఁ గూతు నీయ నన్న హిమవంతుఁడు చెప్పిన మాట లివి. 'పిల్లను నే నీయను' ఈవాక్యములోని రెండు నుకారములు ద్వితీయచరణములో యతిస్థానమం దుంచుటచేతఁ బ్రథమనుకారమునీాది సముచ్చయముచేత హిమవంతునియనిష్టము వసిష్ఠాదులయం దతనికిఁ గలగౌరవము వ్యజ్యమానము లగుచున్నవి. ఇది సముచ్చయగతమై ధ్వని భాసించుట.

కం. బాగుగ బాగుగ నడిగితి వోగుణనిధి! వామదేవ! యున్నతభావా!
(శి. పు. 697 పే)

వామదేవుఁడు కుమారస్వామినిఁ బ్రణవార్థ ముపదేశింపుమనియడిగెను. ఆహా! ఎంత చక్కని ప్రశ్న యడిగినా డని కుమారుని యానందము. 'బాగుగ బాగుగ' నన్న వీప్స చేత నీయానంధము ధ్వనిత మగుచున్నది.

ఇమిడిక :—

మ. హిమశైలేంద్రుఁడు మేనకన్ జనకరాజేంద్రుండు ధన్యన్ వణి
క్సమనుండౌ వృషభానుఁ డంతిమను మెచ్చుల్ మీఱఁ బెండ్లాడ మీ
కుమర్తుల్, సీతయు, రాధయున్ గ్రిమముగా నుత్పన్నలై శర్వు, న
ర్యమవంశ్యుం డగు రాముఁ, గృష్ణుని వివాహం బాడువా రిమ్మహిన్.

పాకము :—

చ. అరుణమరీచి యంత నుదయాచలపీఠము నెక్కి పర్వత
స్ఫురదసమానమంజుళకరపుంజములన్ వెలయించి యూర్ధ్వని

స్ఫురదమలాంశుజాలముల శైలవరోన్నతశృంగపల్వలాం
తరనళినాళిఁ గూడఁ బ్రిమదమ్మునఁ బూయఁగఁ జేసె వాసిగన్.

ఆధునికత :—

ఈకవి భావముల యందును, శబ్దములు స్వీకరించుట యందును గూడఁ జాల నాధునికుఁడు.

సీ. కాలపూరుషుఁడు రంగచ్చంద్రియంత్రింబునుండి దార్చిన వగిపిండి యనఁగ

ఇది వెన్నెలవర్ణన. పిండిమరతోఁ బోలిక. ఇట్టివి చాల గలవు. నాగా. డచ్చీలు నౌకరు, తంటా, డాబులు, ఇటువంటి శబ్దములు యథేచ్ఛముగా వాడును.

సహాయము, యథార్థము, అనుకూలము ఈశబ్దములు సాహాయ్యము, యాథార్థ్యము, ఆనుకూల్యము అన్నరూపములకు బదులు తెలుఁగుకవులు యథేచ్ఛముగా వాడిరి. ఈకవియు వాడెను. నన్నయ్యగారు "అనుకూలవతి" అనుశబ్దము వాడెను, ఒకాయన ఆనుకూల్యవతి యని యుండవలె ననె నఁట! ఆనుకూల్యవతి యన్న శబ్దమున కనుకూలవతి యన్న యర్థమే రాదేమో! లోకములో ననుకూలవతియనియే వాడెదరు. తెలుఁగుకవులది యిది యొక ప్రత్యేకసంప్రదాయము. వీరికి సర్వత్ర పాణినీయము పట్టదు. కొందఱు పూర్వాంధ్రకవుల సమాసములలోఁ బాణినీయము ప్రకారము విగ్రహము కుదురదు. ఈసంప్రదాయముయొక్క ప్రత్యేకత తెలియని వారికిఁ జాల తప్పులుగాఁ గన్పించును.

తల్తురు, సెల్వు ఈశబ్దములలోని యల్లోపముగూడఁ జాలమంది చేసినదే.

నే నింతవఱ కచ్చముగా గుణములే చెప్పి యీకవినిబొగడుచున్నాననుకొందురేమో! అందందుఁబొరపాట్లును గలవు. "ప్రమాదో ధీమతా మపి." ఇంత గ్రంథము వ్రాసి, యిన్ని పోకడలు పోయి, యిన్నిశబ్దముల సుష్ఠుస్వరూపము తెలిసిన యీకవియొక్క గ్రంథములో స్ఖాలిత్యములు కనిపించినచో నవిప్రమాదపతితములనుకొనక తప్పదు. ఈకవియే,

శా. ఎందెందేనియు భ్రాంతిహేతుకముగా నేదేని దోసం బుండు టా
ప్పుం దదక్షేంద్రుల కేని యంతనె యెటుల్ పోనోపు సర్వంకషా
స్పందప్రోద్ధతభారతీరుచిరశుంభద్గుంభసంరంభముల్

అని వ్రాసెను. అట్టి భ్రాంతిమూలకములు నాకుఁ దోఁచినవి కొన్ని వ్రాయుదును. ఈ శబ్దస్వరూపనిర్ణయమున నాకే భయము. పరునిది భ్రాంతియనుకొన్నవానిదే భ్రాంతి కావచ్చును.

*1 గోత్రగ్రామణీట్పుత్రి — గ్రామణీ + ఈట్ — ఈరెండును శ్రేష్ఠవాచకములే.

2 సఖురాండ్రు — ఈరూపము చేయవచ్చునో చేయకూడదో తెలియదు.

3 బాలుఁడ నేన చాలు ప్రేల్మిడిఁ గనుగొంచుచుండుఁడు — బాలుఁడ నేన చాలుదుఁగా - అనవలయునేమో.

4 నాతో వాదా యను — ఈతృతీయావిభక్తిప్రత్యయమునకు హ్రస్వము రాదు.

5 నాదు గుణములందుఁ బ్రాముఖ్యతం జెంది — తద్ధితమీఁదఁ దద్ధితఁ జేయఁ గూడదు.

ఈ చూపించినవాని స్వరూపమువలననే యివి ప్రమాదపతితములని తెలియగలవు, ఇంత గ్రంథము వ్రాసికొనుచుఁ బోవునపుడు సహస్రాక్షునకైనను బొర

---

*1. గోత్రగ్రామణీట్పుత్రి -- ఇట్టివి -- గిరివరేశ్వరతనూజారణవినోదంబు సలిపె నిర్జరులు వొగడ- ఇత్యాదులు పెక్కులు మహాకవి ప్రయోగములు సులభములు.

2. సఖురాండ్రు — అహోబలపండితీయము "ఇతాంజ సః కిశ్చ -- (శబ్దానుశాసనసూ) ఈ దంతాత్కవిధానార్థ మిదం సూత్రం - ... సఖుఁడు సంబంధి శిష్యుండు సవ్యసాచి ఇతి భారత భీష్మపర్వ వచనే, సఖియు ఇత్యేవపాఠ స్సాధుః -- అసమాసే -- అకారాంతత్వాభావాత్ - సమాసే మత్సఖుఁడు ఇత్యేవం రూపం (పాణినీయసూ) రాజాహస్సఖిభ్యష్టచ్ -- ఇతి సమాసాంత విధానాత్" అని వ్రాసిన ఆంధ్రవ్యాకరణ భాష్యకారుఁ డహోబలపండితుఁ డొకండనే - సహైవ వర్తత ఇతి సఖః — ఇతి వ్యుత్పత్త్యావా అకారాంతత్వాన్నిర్వాహః -- యని వ్యుత్పత్తిభేదముచే అకారాంతసఖ శబ్దమున్నిరూపించినాఁడు. ఇపు డకారాంతసఖ శబ్దమునకు - దారార్థేత ఉదపిరః - అను శబ్దానుశాసనసూత్రమునఁ గాని - బాలవ్యాకరణ సంధిపరిచ్ఛేదములోని 37 వ సూత్రముచే గాని నిర్వివాదముగ సఖురాలు, సఖురాండ్రు రూపములు సిద్ధించును.

3. బాలుఁడ నేన చాలు - చాలుదుఁగా - అని యనవలెననుటకు - శక్తః అను పదార్థవివక్షలోఁ జెనుఁగున శక్తుఁడను, చాలుదును అని యనవలెను. ఇట నట్టిభావము కాదు. ఇక అలమిత్యవ్యయార్థ వివక్షయందు - నేన చాలు నీవేటికి యని చెప్పుట దోసఁగు కాదేమో !

తక్కినవి రెండును ప్రామాదికములే. సవరణలు.

4. నీకు వాదాయను.

5. ప్రాముఖ్యముఁ జెంది.

ము. నా.

పాటులు పడకతప్పవు. ఇంతమాత్రముననే 'భారతీరుచిరకుంభద్గుంభసంరంభముల్' ఎట్లు పోనోపును?

ఈ కవియు నేనును నేక గురుపాద రేణువులము.

క. వ్యాకరణ మొక్కత్రోన మహాకవు లొకత్రోవ కోశమఖల మొకత్రో
వై కన్పట్టెడునీభా,షాకావ్యమ్ములను దరచు చదివినకొలఁదిన్.

చ. తెనుగునకున్న వ్యాకరణదీపము చిన్నది. ......... (తి॥ వెం॥ కవులు.)

మేము తిరుపతి వెంకటేశ్వరుల శిష్యులము. మాసాంప్రదాయము వారిది. శబ్దప్రయోగమునందు, శబ్ద స్వరూపసిద్ధియందు, మాకు లోకము ప్రమాణము. మా కును శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారి వాదమునకును చాల దగ్గర సంబంధము.

ఏవంవిధకవితారచనాబహుగుణపరిష్టుఁడైన యీకవి యీ శివపురాణము వ్రాయుట కెంతయుఁ దగినవాఁడు.

పురాణము పంచలక్షణి, పంచలక్షణి యనగా, ప్రబంధమున నష్టాదశవర్ణనల కలిమి యెంతలక్షణమో యంతలక్షణము. సర్గము, ప్రతిసర్గము, వంశము. మన్వంతరము. వంశాను చరితము, ఇవి ఐదు లక్షణములు. పురాణముల యందలి బహు కథలు వరుసగా వచ్చినవికావు. కుబేరుని కథయున్నది. ఈ కుబేరుని జన్మ పద్మ కల్పమున జరిగెను, అతఁడు మేఘవాహన కల్పములో యాజ్ఞదత్తియయ్యెను. ఈ సర్గప్రతి సర్గములు ఒకదానితో నొకటి కలిసిపోవును. వంశము, వంశాను చరితము- వీనిలో భిన్నగ్రంథముల యందు సమైక్యము కన్పించదు. దితిగర్భమున నింద్రుఁడు దూఱి గర్భస్థశిశువును వ్రక్కలించుట, హిరణ్యకశిపువధానంతర ఘట్టముగా శివ పురాణమున నున్నది. సముద్రమథనానంతర వృత్తముగా రామాయణమున నున్నది. ఇట్లే కథలలో ననేక భేదములుండును. ఇవి యుగాంత చరితల సం యోగము చేతనేమో యిట్లు సందిగ్ధములగుట.

ఇది పురాణ మైనను మహాకావ్యము. దీనియందుఁ బ్రతిపాద్యమైన వస్తు వేది? అది శివపారమ్యము. ఉపక్రమోపసంహారాది షడ్లింగ తాత్పర్యములచేతశివపార మ్యమే యీపురాణమునందుఁ బ్రతిపాద్యమైన వస్తువు. తద్వ్యస్త్వభ్యాసముదీనియం దున్నట్లు మఱియేపురాణమందును గన్పించ లేదు. అన్యపురాణమునం దన్యకథా తాడనమే లెక్కువ. ఈపురాణమునందు శివవిరహిత మైన ఘట్టమేలేదు. శివకథా

సృష్టి తక్కినదైన కథ యీగ్రంథములో సాగరోపాఖ్యానము తప్ప నాకు మఱి యొక్కడు కన్పించ లేదు. ఈపురాణము పురూరవశ్చక్రవర్తికథను, సాగరులకథను విస్తరించి చెప్పి శ్రీరామచరిత్ర టూకీగా నేల చెప్పెనో తెలియదు. భారతభాగవతములలోఁగూడ నీరామకథ పెంచఁబడియే యున్నది.

ఈపురాణమునకు నాయువుపట్లు నాలుగు ఖండములు. ఒకటి లింగవైభవఖండము. తక్కిన మూడును జివర మూడు ఖండములు — కైలాసఖండము, వాయవీయ ఖండము, విద్యేశ్వరఖండము.

లింగవైభవఖండ మంతయు సర్వభారతదేశమందలి సర్వశివక్షేత్రములలోని లింగోద్భవకథాసంపుటము. ఈఖండము చదివినచో సర్వక్షేత్రగమనపుణ్యము లభించుననుటకు నెవ్వఁడు చాలును? దక్షిణదేశమునందలి లింగములు, ఉత్తరదేశమునందలి లింగములు సర్వలింగములయొక్క కథలు నీఖండమునందు గలవు.

కైలాసఖండము నిజముగా నీపురాణమునకు బీజభూతమైనది. ఈగ్రంథము శైవపారమ్యబోధకము. సదాశివుఁడు పరమేశ్వరేశ్వరుఁడు, మూలవస్తువు. సర్వమాయననుండి నిర్గమించెను. ఆయనను మించినవాఁడు లేఁడు. ఆయనలో సహస్రాంశమున మహేశ్వరుఁ డుదయించెను. మహేశ్వరునిలో సహస్రాంశమున రుద్రుఁడుదయించెను. రుద్రునిలోసహస్రాంశమున విష్ణుఁ డుదయించెను. విష్ణునిలోసహస్రాంశమున బ్రహ్మ పుట్టెను. మహేశ్వరవిష్ణుబ్రహ్మలు వాయ్వాదకపృథివీతత్త్వములకధిపతులు. సమష్టిరూప మొకసదాశివుఁడే. సర్వచరాచరసృష్టి, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఈసదాశివుని లీలావిశేషము. అనుమానప్రయోగమునకిం దవకాశము లేదు. అయ్యది ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమనంబు లను పంచావయవంబులలోఁగూడుకొనినధూమంబుయొక్క దర్శనంబునఁ బర్వతంబున కగ్నిమద్భావంబుచెప్పు' ఇత్యాది సర్వము చూచునది.

ఈఖండములో 706వ పుట మొదలు 710వపుటవఱకుఁ జదివినచో నీశివపురాణము ప్రతిపాదించఁ దలఁచుకొన్న మహావిషయము వ్యక్తము కాఁగలదు. ఒకవిధముగాఁ జూచినచో నద్వైతమతమునకు నీపరమశైవమతమునకు భేదము లేదు. 'శివశక్తిసంయోగంబున నానంద ముద్భవిల్లును', 'బృహి ధాత్వర్థ మగు బృంహణత్వము, బృహత్త్వము బ్రహ్మశబ్దము పంచబ్రహ్మమయుండగు సదాశివునియందు విశ్వప్రతీతితో వెలయు చున్నవి'. ఈవాక్యములసూక్ష్మార్థసంయోజనముచేసినచో నీమతముయొక్క రహస్యము తెలియును. వేదాంతము సాంఖ్యమును యోగమును

రెండు ప్రవాహములుగఁ దనలో నెట్లు కలుపుకొనెనో యీశివాద్వైతము గూడ యోగసాంఖ్యములను దనలోనికిఁ దెచ్చుకొన్నది. కైలాసఖండమున యోగసాంఖ్య మతముల సంయోగముగూడ నున్నది. ఇది శివపురాణపరమరహస్యము.

వాయవీయఖండమునందుఁగూడఁ గథాంశమే యెక్కువ యున్నది. పశుపాశపతి స్వరూపము – కాలప్రమాణము – సృష్టిలయముల స్వరూపము కలదు. చివరవిద్యేశ్వరఖండము పార్థివలింగార్చనాప్రాశస్త్యము, కొన్ని శైవవిధులు బిల్వభస్మరుద్రాక్షమాహాత్మ్యములు మాత్రమే చెప్పుచున్నది. ఇవి శైవుల కనుష్ఠేయములు, పాఠ్యములు.

ఇఁక లీలాఖండమునందు శివుని సర్వావతారవైభవచరిత్రగలదు. మనము గ్రంథములు చదువుచుండగా బహుపురాణగతవిషయములు తెలియక చాలసంగతు లర్థముగావు. అనేకసందేహములు పొడముసు. ఎన్నియో సందేహము లీపురాణపఠనమున నివారితములగును. ఒక యుదాహరణము. నేను నన్నయ్యభారతములో నరణ్యపర్వములోని నలచరిత్రము చదివినపుడెల్ల నలదమయంతులనడుమ దౌత్యము నెరపిన హంసయొక్క కథ తెలియక మిక్కిలి యిబ్బందిపడుచుంటిని. ఆ హంస యెవరు? ఎందుకు వచ్చినది ? సర్వజ్ఞురాలివలె మాటాడును. "అయ్యా! ఏను నీకుఁ బ్రియంబుసేసెద. నీహృదయేశ్వరియైన దమయంతిపాలికింబోయి నీగుణంబులు దానికి వర్ణించి" యిత్యాది వాక్యములు హంస నలునితో ననును. నలునికి దమయంతి ప్రియురాలని యాహంస కెట్లు తెలియును? ఈ శివపురాణము చదువువఱకును నాకీసంశయము విడలేదు. నన్నయ్యగారు తాను నానాపురాణవిజ్ఞాననిరతుఁడనని చెప్పుకొనెను. ఆయనకు శివపురాణములోని యీ రహస్యము తెలియును. నలదమయంతులు పూర్వజన్మములో ఆహుకుఁడను భిల్లుఁడును, అతని భార్యయును. వారిద్దరియందు శివుఁడు సంప్రీతుఁడై మీరు నలదమయంతులుగా బుట్టుదురు. నేను మీకు హంసనై దౌత్యము నెరపుదునని ప్రసాదించెను. ఈ హంస సాక్షాత్పరమేశ్వరుఁడు. నన్నయ్య కథారచనలోని యీ రహస్యము తెలిసెను. ఈపురాణమీ రీతిగా బహుసంశయనివృత్తిహేతు వైనది.

భాగవతమున శివునికంటె విష్ణువధికుఁడు ఇచ్చట విష్ణువునకంటె శివుఁడధికుఁడు. బాణాసురకథ యున్నది. శివజ్వరము, వైష్ణవజ్వరము యుద్ధము చేయుదురు. హరివంశోత్తరహరివంశభాగవతములలో నీకథ యున్నది. అచట శివజ్వరమోడిపోవును. ఈ పురాణములో వైష్ణవజ్వరము వచ్చి శివజ్వరమును శరణు వేడును. ఇట్లు విష్ణు

పారమ్యమును బోధించు గ్రంథముల కిది యెదురు. కృష్ణుఁడు భాగవతాదులలోఁ బరమేశ్వరుఁడు. అతఁడు సర్వవ్యాపకుఁడు. బాణుని వాకిలి కావలికాచు శివుఁడు భాగవతములో కృష్ణునిముందు నిలువలేకపోయెను. ఇచట కృష్ణుఁడు శివుని బ్రీతి మాలుకొనెను. కృష్ణుఁడు శివభక్తుఁడు.

ఈ పురాణమున వంశము, వంశానుచరితము, వానికవిగా పురాణ లక్షణములు గదాయనియే చెప్పఁబడక, ఆయారాజులు శివార్చనవలన సద్గతిగాము లైనట్లు రచయింపఁబడుట పురాణపరమార్థప్రతిపాదకముగా నున్నది.

ఈపురాణములో శివునియొక్క పరమాత్మ్యము చెప్పఁబడినను మాటిమాటికి శివకేశవులకు భేదము లేనట్లే చెప్పఁబడుచున్నది.

గీ. వెన్ను నొల్లక నన్గొల్చుచున్నవాఁడు,నన్నలగివెన్నునిఁ గొల్చుచున్న వాఁడు.
వీర లిర్వురు జను వీట వేగుచుందు,రంబుజహితుండుచంద్రుఁడున్నంతదనుక
(శి. పు. 123 పే)

కాని యీపద్యమునందు సదాశివపారమ్యమునకు భంగము లేదు. ఏల ననఁగా సూర్యచంద్రు లున్నంతవఱకే గదా! తదనంతరకాలము సదాశివాధీనము. తావత్పర్యంతము శివకేశవులకు భేదము లేకుండ ననుష్ఠించుట చేయఁదగినది. ఇట్లుచాల చోట్ల నున్నది.

ఇది భక్తిమత మని చెప్పితిని. భక్త్యతిశయము పలుతావుల నుద్ఘాటింపఁబడుచుండును. కాని, భక్తి జ్ఞానమునకు మార్గముగా స్వీకరింపఁబడినట్లును గలదు. ఇది చూడుఁడు. 'నన్ను బూజించు భక్తులు ఆర్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థియు, జ్ఞానియు ననువారలై నాల్గువిధంబులుగ నన్నర్చింతురు. ఉత్తరోత్తరు లుత్తములు. అందఱియందు జ్ఞాని నాకుఁ బ్రియతరుండు. అతండు నారూపుగఁ దెలియుము. నేనుజ్ఞానగమ్యుండనుగాని, తదితరములకు సాధ్యుండను గాను.' (శి. పు. 122 పే)

దీనినిబట్టి యిది భక్తిమతమా? యద్వైతమతమా? ఇది శివాద్వైతమతము. సాలోక్య, సామీప్య, సారూప్యములను దాటి జ్ఞాని పొందఁదగిన పరమేశ్వరైక్యము ఈపురాణ మంగీకరించుచున్నది. ఇది వైదికమతము.

ఉ. లేవు ధరిత్రి జన్మములు లేవు వ్రతంబులునుం దపంబులుఁ [శి.పు.179 పే.]

తారకాసురునివలనఁగలిగిన బాధలు దేవతలు బ్రహ్మతోఁ జెప్పికొనుట జన్మములు లేవనుటతోడనే వైదికమతము.

ఈ శివపారమ్యము పలువిధములుగాఁ బ్రతిపాదింపఁ బడినది. భగవద్గీతలోఁ గృష్ణుఁడు తన్నుపాసింపుఁ డని చెప్పినట్లు శివుఁ డిచ్చటఁ జెప్పెను.

సీ. అనుపలయందును బ్రహ్మవు రుద్ర - లందెప్ప, నీలలోహితుఁడవు నీవు దేవ!
ఘనపర్వతములందుఁ గనకాద్రి వగయ నక్షత్రమండలిలోనఁజందురుఁడవు
ఇత్యాది, (శి.పు.౩౫౮ పే)

ఇది భగవద్గీతలోని విభూతియోగమునంటిది. ఇంకను జూడుఁడు.

గీ. దుష్టు లగు వారిఁ బొలియింప శిష్టజనుల,రక్షణముసేయ ధర్మసంరక్షణంబు
సేయుటకుఁగాదె నే నిట్లు చెన్నలరుట...

క. మీ కెప్పుడెప్పుడు బెడదలు, చేకూరిన నన్నుఁ దలపు సేయుం డవు డే
మీకష్టంబులు దీర్చెద... [శి.పు.౩56 పే]

శ్లో॥పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్

శ్లో॥ సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ

ఇత్యాదిగీతావాక్యస్ఫోరకములుగా పైపద్యములు లేవా? ఇంత వైదికమతమై వీరశైవపువాసన లేక పోలేదు.

క. శివనిందను బొనరించిన, యవివేకిం జంపవలయు నటుదప్పినఁ ద
క్కువ లాడి తిట్టవలె... [శి. పు. 222 పే.]

ఇందలి శైవమత మీరీతిగా నున్నది. ఇంతవఱకు నేను కవియొక్క ప్రతిభాది నిరూపణము చేసితిని. పురాణపరమార్థమును నిరూపించుటకుఁ బ్రయత్నించితిని. అసలు పురాణరచనమునుగూర్చి చెప్పనే లేదు. దానినిగుఱించి చెప్పక పీఠికపూర్తి చేయరాదు. ఇదివఱకు కాళిదాసు వాల్మీకినుండియే సహస్రధా గ్రహించె ననుకొను చుంటిని. ఈపురాణము చదివినతరువాత కుమారసంభవకథ యంతయు నీపురాణము నుండియే గ్రహించె నని తెలిసినది. పార్వతీపరమేశ్వరుల రతివర్ణన యనౌచిత్యముగా మమ్మటభట్టు చెప్పెను. అది కాళిదాసునిది కాదు. శివపురాణము లోనిదేమో!*కాళిదాసు దీనినుండి కొన్ని గ్రహించెను. కొన్ని పరిత్యజించెను. ఇట్టివి కొన్ని యీపురాణమునందుఁ గన్పట్టుచున్నవి. సప్తర్షులు పార్వతియొద్దకుఁబోయి

* పార్వతీపరమేశ్వరుల రతివర్ణన శ్రీకాళిదాసకవియే విశేషించి రచించినాఁడు. శివపురాణములో నెక్కడు లేదు. ను ॥ వా ॥

"పురుషోత్తముండు నీ కొప్పిదమైన భర్త, యసితోత్పలమూర్తి, మనోజవిద్యలం గొప్పసమర్థుఁడు" అనియు, "కాముకక్రీడలఁ గౌశలుం డాహరి" యనియుఁ జెప్పుదురు. ఈలాటి వన్నియుఁ గాళిదాసు తొలగించెను. అసలు కాళిదాసుని గ్రంథములోఁ బార్వతీతపఃపరీక్షకై శివుఁడు సప్తర్షులనే పంపడు.

నిజానకు నిది పురాణము. కాళిదాసునిది కావ్యము. రెంటిని బోల్చనే రాదు, ఔచిత్యము కావ్యదృష్టి. పురాణములో నానావిధములైన మనుష్యసృష్టిని నిరూపించ వచ్చును. కావ్యమున కున్నన్ని యిబ్బందులు పురాణమునకు లేవు. నే నీపీఠికాది యందుఁ జూపించిన కవిప్రతిభాలక్షణములు పురాణరచన కవసరము లేదేమో యనిపించును. అందుచేతఁ దాదృక్ప్రతిభాప్రాచుర్యము పురాణరచనలో సర్వత్ర అక్కఱ లేదు. ఊరకే సులభమైన పద్ధతిగా సర్వజనులకుఁ గథాంశము, నిర్ధార్య మాణవిషయము సులభగోచర మగునట్లు రచించుటయే పురాణశైలి. అందందె చ్చటెచ్చటనో తొలగించినచోఁ దక్కిన యీసర్వగ్రంథ మట్టిశైలిలోనే వ్రాయఁ బడినది. కుబేరుఁడు తొలిజన్మలో యజ్ఞదత్తుఁ డన్న బ్రాహ్మణునికొడుకు. అతఁడే చివరకుఁ గుబేరుఁ డయ్యెను. ఈకథ కాశీఖండమున శ్రీనాథుఁడు వ్రాసెను. ఇద్దఱి రచనలు పోల్చి చూచినచోఁ గావ్యశైలికిఁ బురాణశైలికిఁ గలభేదము సుస్పష్టముగఁ దెలియును. కవితాంశమునందు సామ్య ముండక తప్పదు. పైగా సంస్కృతపురా ణములోననే యట్లుండెనో? ఈకవి శ్రీనాథు ననుకరించెనో? ఈపోలికలు చూడుఁడు

గీ. ఎడపడపఁ దనూభవుం డెచట నుండుఁ, గానరాఁడని గృహభర్త గాంచనరుగ
నింతతడవును నాయొద్ద నిచటనుండి, యరిగె చదువంగ నని భర్త కతివ మొఱగు

గీ. స్నానమాడెనె వార్చెనే సంధ్య యగ్ని, హోత్ర మొనరించెనే యింతి పుత్రుఁ డనిన
స్నానమాడెను వార్చెను సంధ్య యగ్ని, హోత్ర మొనరించె ననుచును నువిద మొఱగు.

(కాశీ. ఖం. 178 పే.)

చ. కనపడ డేమి పుత్రకుఁడు కన్నుల కెప్పుడటన్న నాకె బ
ల్కును బలుమాఱు లానిగమపుంజముల్ మఱి శబ్దశాస్త్రసూ
త్రనిచయముల్ గడుఁ జదివి తత్సహపాఠులతోడ నిప్పుడే
యనఘచరిత్ర! దేశికునియాలయమేఁగఁ గఁ బోయె నంచనుల్.

ఉ. స్నానముచేసెనే విధిగ సంధ్యనువార్చెనె భస్మపుండ్రముల్
మానక తాల్చెనే సుతుఁడు మద్దునుగట్టె భుజించెనే శివ

ధ్యానము చేసెనే గురుని యంతిక మొంది త్రియింబకించెనే
మానిని! యన్నఁ దత్సతి సమస్తమునుర్ నెఱవేర్చెఁ గొడ్కనుర్.
(శి. పు. 54 పే.)

ఇవి పద్యాలకు పద్యములు. ఇట్లు చాల గలవు. శ్రీనాథునిరచనలో నొక కావ్య దృష్టి యున్నది. ఈరచనలో నొక పురాణదృష్టి యున్నది. శ్రీనాథుని రెండు పద్యములు "అతివ మొఱఁగు", "ఉవిద మొఱఁగు" అని యంతమై రెండుపద్యముల భావములయం దున్న సామ్యమును బోధించును. మఱియు రెండవపద్యములో చివరి రెండుచరణములకు బింబప్రతిబింబభావము నిరూపింపఁబడినది. ఈ రచన కాశీఖండములో శ్రీనాథుఁడు ధారాళముగా చేసిన యొక శిల్పపుపద్ధతి. దీనిని శ్రీనాథుఁడు నన్నయ్యగారి యరణ్యపర్వములో నొకచోటనుండి గ్రహించెను. ఈరచనాశిల్పదృష్టి కావ్యకర్తయైన శ్రీనాథున కున్నది. పురాణకర్త కది యక్కరలేదు. వదలిపెట్టెను.

సీ. సచ్ఛ్రోత్రియులు ననూచానులు సోమపీథులునైన కులముపెద్దలఁ దలంచి మొదలైన శ్రీనాథుని పద్యమునకు నీశివపురాణములో "కిముధ నైర్విద్యానవద్యాయది" మొదలైన సంస్కృతశ్లోకోక్తులు చూనిపిన పద్య మున్నది. రెండుపద్యములు చదివినచో కావ్యపురాణశైలుల తారతమ్యము విస్పష్టముగ గోచరించును. గ్రంథవిస్తర మెందులకు? రెండుశైలుల తారతమ్యము పరమముగా విస్పష్టీకరించుచు నొక్క యుదాహరణము చూపి మానివేసెదను.

గీ. దీక్షితాయని! యిటురావె తేగదే మ, దీయమా నుంగరము రత్నదీపితమును
పర్వమం దిచ్చె నెద్దాని ప్రభుఁడు నాకు, నీవు చేకొంటి వెద్దాని నెయ్యమునను.
(శి. పు. 57 పే.)

శా. అంగోద్వర్తన వేళ నీవు దరహాసాంకూరముల్ లోచనా
పాంగప్రాంతములం దిగుర్ప నొక సయ్యాటంబు కల్పించి నా
యంగుళ్యాభరణంబు పుచ్చుకొనవా యాయుంగరం బిప్పుడే
శృంగారింపని చేతఁ బావకునకుర్ జేయర్ హవిర్దానముర్. (కా. ఖం. 182 పే.)

ఈ భావమును జెప్పుటకు కావ్యకర్త వృత్తమును స్వీకరించెను. పురాణకర్త గీత పద్యముతో సరిపెట్టుకొనెను. అంగోద్వర్తనసమయము, ఒక సయ్యాటము, ఆయుంగరము పుచ్చుకొనుటకు కావ్యకర్త కల్పించెను. ఆయుంగరము తాల్పకుండ నేనీపూట హోమము చేయను,అన్న భావమును కల్పించెను. కావ్యకర్త రసోత్పాదనము చేయవలసి యున్నది. వ్యభిచారాదిభావములచేత రసోల్బణమునకై నిత్య

ప్రయత్నము కావ్యకర్త చేయును. పురాణకర్తకు రస మక్కఱలేదని కాదు. కాని యంతకంటె కథను జెప్పుకొనిపోవుట యెక్కువ ప్రధానము.

ఈరీతిగా శివపురాణ మంతయు నూటికి తొంబదిపాళ్ళు పురాణశైలిలో నడచినది. పురాణశైలికి దానికి గల లక్షణములు దాని కున్నవి. భావసంబంధమైన లక్షణములు. అవి యెట్లీపురాణమునందు గలవో చూపించెదను.

భావసంబంధముగఁ బురాణదృష్టి వేఱు, కావ్యదృష్టి వేఱు. పురాణేతిహాస కావ్యనాటకములు వరుసగా దీసికొన్నచో నుత్తరోత్తరము రసదృష్టి యెక్కువగాఁ బ్రతిపాదించుకొనును. పురాణమునకు రసదృష్టియే లేదు. వేదములో ప్రతిపాదింపఁ బడిన విషయములే యథాతథముగానో,కొంత మార్చియో పురాణములు చెప్పును. వేదములకు రసదృష్టి యెంత యున్నదో పురాణములకంతే యుండును. అవి ధర్మ బోధకములు-విషయబోధకములు. అంతకంటె నితిహాసములు కొంత ముందుకు వచ్చినవి. భారత రామాయణము లన్నచో వానియందు సంపూర్ణముగా రసదృష్టి యున్నదని చెప్పను గాని, కథాదృష్టి అనఁగాఁ బాత్రపోషణాదికములు, కొంత యౌచిత్యము, నాయకుఁడు, తద్గుణవర్ణనము మొదలైన కావ్యగుణస్పృష్టి కలదు. ఇది దాటి కావ్యము కడకు వచ్చువఱకు ప్రాధాన్యము వర్ణనయందైనను రసదృష్టి యెక్కు వగుచున్నది. నాటకమునందు రసదృష్టి ప్రధానమైనది. వేదపురాణములు ధర్మబోధచేత లోకమును ధర్మాచరణమునందుఁ బ్రవర్తింపఁజేసి మోక్షపర్యవసాయి ఫలదాత లగుచున్నవి. కావ్యములు మోక్షవస్త్వాభాసరూపరససాధనానిష్ఠములు. కావ్యకక్ష్య వేరు. వాని కవి స్వతంత్రములు. పురాణములు స్వతంత్రములు కావు, వేదమూలములు. రసమున కౌచిత్యవిచారము పట్టినంత పురాణేతిహాసములకుఁ బట్టదు. కథాంశలు లోకమునం దున్నట్లు యథాతథముగా చిత్రించును. కావ్యములు నీచిత్రణమును చేయును; కాని కావ్యములు లోకచిత్రణమును రసదృష్టితో నౌచిత్యదృష్టితో చేయును. అనగా కావ్యములో నున్న పాత్రకు లోకములోనున్న బహువిధములైన యనుభవములలో నేది యుచితమో అదియే యుండును పురాణమం దట్లుకాదు. వాడు శివుడైననుసరే, విష్ణువైననుసరే, ఒక మహర్షియైననుసరే, వారియందు మానవస్వభావ మెంత విపరీతపుత్రోవలో పోవునో అన్నితోవలు పోయినట్లే వ్రాయఁబడును. చెప్పఁదలఁచుకొన్న పరమార్థ మేమనగా లోకము మాయాతీతము. ఈమాయను జయించవలయును, అన్న వేదాంతరూపమైన ధర్మ బోధకోసమే. పార్వతీపరమేశ్వరుల శృంగారవర్ణన, కామోపభోగవర్ణన చేసినచో

హారియందు దోషారోపణచేయుటకు గాదు. లోకస్వభావ మిది యని చూపుటకు. శివుఁడు పార్వతిని జూచి చిక్కిలి మన్మథాస్త్రతాడితుఁ డయ్యెను. అతఁడు పార్వతీ వర్ణనము చేసెను. ఈవర్ణనము ఏడుపద్యము లున్నవి (187వ పుటలో). ఇంతయుఁ జేసినతరువాత "భవనంబునకేగ విధించి యాత్మతాగలుషతజెందినందులకు గాట ముగా మదినొచ్చి క్రచ్చరన్" అని యిట్లు పశ్చాత్తాపము చెందును.

ఉ. కూడని తెర్వునం జనితి కోమలిపై నటు లాసజేసితిన్
కూడె నిటుల్ తపంబునకు గొప్పగ విఘ్నము లన్యభామినిన్
బాడిసెడంగ వర్ణనలఁ బాడితి నోడితి ధర్మమార్గపున్
జాడను వీడితిన్ జడునిచందమునన్ క్రుటిలోన నక్కటా ! (శి.పు.183 పే.)

ఈశివుఁ డొక సత్పురుషుఁడైన ఋషివలె నుండెను. పరమేశ్వరునివలె లేఁడు. కాళి దాసుని కుమారసంభవము కావ్యము గనుక నందులోఁ బరమేశ్వరుఁడు.

కావ్యము సూటిగా నొక కథయే చెప్పును. పురాణము దారిలో లక్షకథలు చెప్పికొంచు పోవును.

క. మరుఁ గాల్చినట్టి యనలం,బురవై లోకములఁ గాల్పు నుంకించఁగ ని
ర్జరు లప్డువెఱచి ధాతన్, దరిసి యటులు దెలుపఁగా నతండు కదువడిన్.

గీ. హిమగిరికి వచ్చియద్దానినిమ్మతోడఁ,గొలదిగానొక్కయెడఁ జేర్చిసలిలరాశి
కడకుఁగొనిపోవనంతనక్కడలియజుని,గాంచిపూజింపననియెనిక్కరణినజుఁడు
( శి.పు.193 పే)

ఇక్కడనుండి మఱికొంత కథ యున్నది. ఇది బడబానలమైన కథ. దీనితోఁ గావ్యమునకు సంబంధము లేదు. ఇందుఁబార్వతీవివాహసందర్భములో విష్ణ్వాదులు వచ్చి శివునితోఁ బార్వతిని బెండ్లియాడుట కొప్పుకొమ్మందురు.శివుఁడు స్త్రీసంగమ ము బ్రహ్మజ్ఞానబాధక మనును. చివర కంగీకరించును. పార్వతిమతి విఱచుటకు సప్తర్షులను బంపించును. వారికిఁ బార్వతి శివమహిమ చెప్పును,శివుఁడుభిక్షుకుఁడై మేనకదగ్గరకుఁ బోవును. కొంతసేపు మేనక శివునకుఁ దనకూతు నీయ ననును. ఈయవద్దని శివుఁడు వైష్ణవవేషములో వచ్చి మేనకకుఁ బుద్ధులు పెట్టును. సప్తర్షులు వచ్చి హిమవంతునితోఁ బార్వతిని శివున కిమ్మని బోధ చేయుదురు. వైష్ణవుఁడు హిమవంతుని మనసుగూడ విరచును. వశిష్ఠుఁడువచ్చి హిమవంతునితో శివుఁ డంతవాఁ డింతవాఁడు, తప్పకుండ నీయవలయు నని చెప్పును.ఆసందర్భములో

అనరణ్యుని కథ చెప్పును. చివరకు హిమవంతుఁడొప్పుకొనును.తీరా శివుఁడు పెండ్లికి వచ్చినతరువాత శివుని పిచ్చి వేషము చూచి మేనక తనకూతు శివున కీయననును. ఇ మ్మని చెప్పిన నారదుని నిందించును. శివుని నే పెండ్లియాడుదు నన్న పార్వతిని నిందించును. బ్రహ్మాది దేవతలు, హిమవంతుఁడు మేనక నొప్పించుటకు లక్షప్రయత్నములు చేయుదురు. చివరకు వివాహము జరుగును. ఇది యంతయు నేమి? పట్టి లోకము. లోకములోఁ బెండ్లిండ్లు, సంబంధాలు కుదుర్చుకొనుట, వానిని జెడఁగొట్టెడివారు, పొసగఁ దోఁచెడివారు, కొంతసేపౌ నని, కొంతసేపు కాదని. ఈపార్వతీవివాహఘట్టము శివపురాణములోఁ గాస్త కూస్త లేదు. నూటయేబది పుటలున్నది. నడుమ నడుమ శివమహిమనుగూర్చి యుండును. పురాణ మనఁగా పట్టి కలగలుపు కథ.

తరువాత కుమారస్వామికథ. పురాణమునకుఁగథ యెంత ప్రధానమో దేవతా విషయములు, కొన్ని మహావిషయములు చెప్పుట యంత ప్రధానము. తారక కుమారులయుద్ధము జరుగుచున్నది. వీరభద్రుఁడును, దారకాసురుఁడును యుద్ధము చేయుచుండిరి. తారకాసురుఁడు వీరభద్రుని మూర్ఛనొందించెను. వీరభద్రునకుఁ గోపము వచ్చెను. వచ్చి,

గీ. ఇపుడె సమయింతు నిద్దైత్యు హీనచరితు
నని కడంగుడు నారదుం డతిరయమున
వచ్చి యిట్లని వాకుచ్చె వరద! యుడుగు
మీవు షణ్ముఖవధ్యుఁ డీయింద్రవైరి. [ శి.పు. 343 పే ]

అంత వీరభద్రుఁడు వానిని జంపఁగలిగియు వదలిపెట్టిపోయెను. వీరభద్రుఁడు చంపఁగలిగినపుడు కుమారస్వామిజననమున కింత ప్రయత్న మెందులకు?ఇది పరమ రహస్యము. చంపఁగలుగును గాని చంపరాదు. ఇదిసూక్ష్మదృష్టితోఁ జూచినఁగాని తెలిసికొ రాని యర్థము. ఇట్టి రహస్యములు పురాణములయందుఁ జమత్కారము గానుండును.

ఇందులో వల్లికథ యొకటి క్రొత్తది. దీనికి ద్రావిడదేశమునం దున్నంత ప్రచారము తెలుఁగుదేశములో లేదు. ద్రావిడదేశమున శివభక్తికంటెషణ్ముఖభక్తి యెక్కువ. వల్లి యొక భిల్లుని కూతురు. ఆమెను గుమారస్వామి పెండ్లియాడును. ఈకథ యొక టీపురాణమునఁ గావ్యశైలిలో మిక్కిలి రమ్యముగావ్రాయఁబడినది.

కథయందే రమ్యత యున్నది. కుమారస్వామి యొకభిల్ల వేషముతో వల్లిని బోయి చూచును. చూచి,

క. కలికీ! వలపుల చిలుకల, కొలికీ! వలరాచవాని గొనబా లేఁబూ
 ములికీ! చలమూనక నా, పలుకీడేర్పం దలంపు బద్మదళాక్షీ!
 (శి.పు. 360 పే)

ఈపద్యములోని యమకము కలికి, కొలికి, ములికి అన్న తెలుఁగుమాటలతోఁ గూడి యాటవికశృంగారమునకు దోహదముగా నున్నది.

గణపతిఘట్టము — ఇచ్చట కథ యంతయు భార్యాభర్తల పట్టుదలకు సంబంధించినది. పార్వతి గణపతిని సృష్టి చేసెను. అతనితోఁ బ్రమథులందఱు యుద్ధము చేసిరి. గణపతి యందఱ నోడించెను. శివుఁడు విష్ణ్వాదులతో యుద్ధమునకు వచ్చెను. అందఱును యుద్ధము చేసిరి, కాని కుమారస్వామియు, వీరభద్రుఁడునువిఘ్నేశ్వరుఁడు తమసోదరుఁ డని యుద్ధము చేయలేదు. తండ్రి యుద్ధము చేయుచున్నాఁడుం కొడుకులు చేయరు. కొడుకులు తల్లివైపు, తమ్ముని వైపు. తనకొడుకులు తనతోఁబాటు యుద్ధము చేయనప్పుడు తండ్రి యాకొడుకుల నేమియు ననడు. ఇంతకన్న లోక మేమి యున్నది? కాదు. ఆశివుఁ డేల యుద్ధము చేయవలయును?

గీ. వినయమును జూపినట్లైన వెలదికీశుఁ, డోడె నని లోకు లాడెదరొక్కవరుస
 నాయెడల నిగ్రహము చేయ నాతి కగునె?...... (శి.పు. 371 పే)

ఇది శివుని పట్టుదల. తా నాడుదానికిఁ జాలలేడందు రని యీయుద్ధము చేయుట. పైగా భార్య న న్నింత యెదిరించునా? యన్నపట్టుదల. చివరకు విఘ్నేశ్వరుఁ డు చనిపోయెను.

గీ. శివుఁడు కోపం బుడిగిబాలుశిరసుజూచి, వగచె నెంతయుదుఃఖైకవశ్యుడగుచు

ఇంతియే కాక వీరభద్రుఁడు, గుహుఁడు, యుద్ధమునకు సహాయమువచ్చిన విష్ణువు, బ్రహ్మదేవుఁడు నందఱును దుఃఖించిరి. అపుడు నారదుఁడు పార్వతియొద్దకుఁబోయి నీవు లొంగవద్దని యెక్కులుపులు పెట్టెను. ఆబిడ గణపతిని బ్రతికించిననే తాను కోపము మానెదనని చెప్పెను. మును లందఱుఁ బార్వతిని బ్రార్థించిరి. మఱి యింకొక చమత్కారము, తనకొడుకును జంపినది తన భర్త. పార్వతి ఖంజ, కాళి, కరాళి, బగళాది మహాశక్తులను సృష్టించి దేవతలనందఱను బాధించెను. ఇదియేమి! భర్తమీద కోపమువచ్చి పిల్లవానిని గొట్టినట్లున్నది. బంధువులు బంధువులు పోట్లాడు

కుందురు. వీరిలో ఏ రేమియు ననుకొనరు. తోడువచ్చినవారిమీద విఱుచుకొని పడుదురు. ఇదియు లోకస్వభావమే. చివరకు విఘ్నేశ్వరున కేనుగతలకాయ యంటించిరి. అతఁడు మరల బ్రదికెను. పార్వతి ఈవికారపుకొడు కేమి యని దుఃఖించ లేదు. కుటుంబకలహ మెట్లో యొకట్లు సర్దుకొన్నదికదా యని యూరుకొన్నది కాఁబోలు. పైగా ప్రమథగణములలోని యెవరిశిర స్సింతకంటె మంచిది ?

ఇట్లు పురాణకథాపరమార్థము లోకసంగ్రహణ మని చెప్పుట కెన్ని యేని యుదాహరణములఁ జూపించవచ్చును.

ఇవికాక పురాణము సూక్ష్మధర్మములనుగూడ నుపదేశించును గదా! ఆసూక్ష్మ ధర్మము లీకథలలో నిమిడియేయుండును. పైకి కథగా కన్పించును. లోపల మహార్థ మిమిడియుండును. తత్త్వదృష్టితోఁ జూచినచో పురాణకథలలో నూటికి తొంబది యర్థవాదములు. ఈ యర్థవాదము లట్లుండఁగా సూక్ష్మధర్మములు గూడ కొన్ని యుండును. ఈ వినాయకుఁడు బ్రతికినతరువాత శివుఁడు గణపతివ్రతము చెప్పెను. వ్రతోద్యాపనవిధానము చెప్పెను. "తత్రత్యా దేవమునివరు లెల్లరు ప్రత్యయమొప్పార నమ్మహావ్రతం బీశ్వరసాన్నిధ్యంబున నెరపి" ఇందులోని సూక్ష్మార్థము "ప్రత్యయ మొప్పార" ననుటలో నున్నది. కనులయెదుట జరిగినకథ. చచ్చినవానిని బ్రతికించిరి. వెంటనే యతనికి గణపతి పట్టాభిషేకము. తత్ క్షణమే యందఱు నంగీకరించిరి. ఎందుకుఁ బనికిరానివాని కొక గొప్పయుద్యోగము రాజుగా రిచ్చిరనుకొండు. ఆమరు నిముసమునుండి వానికి సర్వమర్యాదలు బలియును. ఇతనికి గణేశపట్టము గట్టిరి. అంతటి కుమారస్వామికి రాలేదు. తాను భూప్రదక్షిణము చేయలేక పార్వతీపర మేశ్వరులను నిరువదియొక్కమారు ప్రదక్షిణించెను. ఈకథ యెట్టిదైనను తల్లిదండ్రు లగు పార్వతీపరమేశ్వరులను నిరువదొక్కమారు ప్రదక్షిణించినచో భూప్రదక్షిణ ఫలితము ప్రాప్తించునన్న ధర్మ మీకథారూపమునఁ జెప్పఁబడినది. పురాణకథల కిది యింకొకప్రయోజనము.

సర్వపురాణములు దేవాసురుల విరోధకథావస్తుప్రధానములుగాఁ గన్పించును. తారకాసురునిసంగతి చూచినచో నతఁడు స్వర్గమును జయించి దేవతలను బాధించెను. తక్కిన సర్వలోకములను సుఖముగాఁ బాలించెను. అతనిని గుమారస్వామి యేందుకు జంపవలయును ? ఇది దేవతలయెడఁ బక్షపాతము. విష్ణుపురాణమైనను, శివపురాణమైనను శివకేశవు లిద్దఱును పక్షపాతులే. దేవతలను వెనుకవేసికొని రాక్షసులను వధించుట. ఇది లోకసామాన్యదృష్టితోఁ జూచిన న్యాయమే. ఒక

రాచఱికమువారున్నారు. వారు కొంద ఱుద్యోగస్థుల నియమించిరి. ఇతరులు వారి నెదిరించి రాచఱికమును సాగనీయరు. పోలీసుదళాధిపతి వచ్చి సామాన్యప్రజలను గాల్చును. ప్రజానాయకులను కారాగారమునం దుంచును. ఇది లోకమునందు జరిగెడిదే. అట్లే యీ శివకేశవగతాధికమైన యాధ్యాత్మికసామ్రాజ్యమునందు యాజ్ఞికసామ్రాజ్యమునందు దేవత లధికారులు. హవిర్భాగార్హులు వారే. అందుచే వారి నెదిరించిన ననఁగా నధికారమున కెదురుతిరిగిన రాక్షసులను శివకేశవులు ద్రుంచుట "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి". దీని కార్య ద్రావిడసంఘర్షణార్థము కొందఱు చెప్పుచున్నారు. ఈదేవాసురులకు బురాణములయం దనేకస్థలములయందు ననేక భేదములు కన్పించుచున్నవి. ఈపురాణములో చమత్కారమైన భేదము కలదు.

గీ. పొలిచినట్టి నిశాటుల బొదివిపట్టి, యుశనుఁ డాత్మీయమంత్రప్రయుక్తి మరల.
బ్రతుకఁజేయుచునుండె గీష్పతియుమృతసు, రలను బ్రతికించె నోషధీకలనమునను.

(శి. పు. 417 పే)

కొంచెము సూక్ష్మముగాఁ జూచినచో దేవాసురు లిద్దఱివి రెండు భిన్ననాగరకతలుగా కన్పించును. దేవతలది ప్రకృతిశాస్త్రసంబంధమైన నాగరకత. దానవులది దీనికి వ్యతిరేకమైననాగరకత. వైదికనాగరకత ప్రకృతిశాస్త్రసంబంధమైననాగరకత. వేదమునందు ప్రకృతిశాస్త్రవిషయము లనంతములు. ఖగోళకథ లనంతములు. వీనిలో నెన్నియో పురాణకథలుగా మార్చబడి చాలామందిని భ్రాంతులనుగా జేయుచున్నవి. బాణాసురకథలో శివజ్వరము, వైష్ణవజ్వరము, శివవిష్ణుతత్త్వముల సూక్ష్మతరవిషయములయొక్క యల్పతాధికతలను జెప్పెడి విషయమనుకొందును. ఇట్లే బహువిషయములు వానివెనుకనున్న సూక్ష్మమైనతత్త్వమును బోధించుటకుఁ గల్పింపబడ్డ కథలుగాఁగన్పించుచున్నవి. విష్ణువు జలంధరుని భార్యయైనబృందతో శంఖచూడుని భార్యయైన తులసితో వ్యభిచరించినట్లు వారిద్దరు విష్ణువును శపించినట్లు కథలు. ఈవిష్ణు వేమి? ఈవ్యభిచార మేమి? ఆబృందయుఁదులసియునోషధులు తులసి విష్ణుప్రియమైన మొక్క. తులసి శ్లేష్మహారి. వైద్యశాస్త్రప్రకారము చూచినచో దీనికిఁ గొంత సమన్వయము కుదుర్చవచ్చును. బ్రహ్మవిష్ణుమహేశ్వరు లలో బ్రహ్మ రజోగుణప్రధానుఁడు. విష్ణువుసత్వగుణప్రధానుఁడు. శివుఁడుతమోగుణ ప్రధానుఁడు. ఈ మూడుగుణములు మానసికములై సత్వరజస్తమోగుణములుగా నుండఁగా శారీరకములై వాతపిత్తశ్లేష్మములుగా నయ్యెను. దీని కెక్కడసంబంధమో! పూర్వమెంతయో ప్రకృతిశాస్త్రపరిశోధన జరిగి, యివియన్నియు నిశ్చితార్థములుగా

చేయఁబడి, వాని ప్రచారముకొఱ కీకథారూపము కల్పించబడియుండును. ప్రచార స్వరూపము మిగిలి వానివెనుకజరిగిన పరిశోధన, తన్మహార్థము లంతర్హితములై నేటి కివి పుక్కిటిపురాణములుగా మిగిలిపోయినట్లు తోచుచున్నవి.అంధవిశ్వాసము ప్రతిపక్షులకుఁ గొంతసాహాయ్యకారి యగుచున్నది. ఇంతటి మహాపరిశోధన జరిగి యామహార్థము లన్నియుఁ గథారూపమున మిగిలిపోవుటకు నెన్ని యుగములు కావలయునో విచారింపవలయును. ఎంత వెనుకకుఁ దోసినను బాశ్చాత్యుల పదివేల సంవత్సరముల లెక్క చాలునట్లు తోచదు.

ఇప్పటికే గ్రంథవిస్తర మైనది. ఇతరపురాణములలోఁ జెప్పఁబడిన యనేకవిషయములు దీనిలో మఱలఁ జెప్పఁబడినవి. నారదపంచూడసంవాదము భారతములోని దిందులో నున్నది. ధర్మముయొక్కచతుర్యుగములయందలిస్వరూపమిచ్చటనున్నది.

మఱియు నొక్క విషయము. ఈపురాణము లొకదానినిజెప్పి మఱియొకదానిని జెప్ప వని లేదు.

గీ. చెలిమిగలవారిఁ గనఁగ నుజ్జ్వల మయి తగు
కొమరులం జూడ సరసమై కొమరు మిగులు
కామినులఁ జూచినంత వక్ర మగుచుండు
పగఱఁ గనగ నారక్తమై పరగు నక్షి ॥ (శి.పు. 517 పే)

ఇది యేదో నేత్రశాస్త్రమువలె నున్నది. ఇట్టిది మఱియెచ్చటను గన్పించదు. మఱియొక విషయము,

గీ. బాపఁ డాశౌచమును బాయుఁ బదిదినముల
కల్ల క్షత్రకులుఁడు ద్వాదశాహములకు
పదియు నైదుదినములకు వైశ్యుఁ డొక్క
నెలకు శూద్రుఁడు శుద్ధిఁగొనెదరు భువిని ॥ (శి.పు.427 పే]

ఇది యాశౌచవిషయము. అభినవషడశీతియు నిట్లే చెప్పుచున్నది. అభినవషడశీతి నేఁ డమలులో నున్న ధర్మశాస్త్రము.

ఈరీతిగా నీపురాణము బహుమహావిషయరత్నఖనియై యాంధ్రజాతి కొకతీరరాని కొఱఁత దీర్చినదియై పొలిచినది.

ఈకవి పురాణము కాక యొక కావ్యముల్రవాసినచో నెట్లుండునో యనిపించుచున్నది. ఈయనయందుఁ గావ్యరచనాశక్తి పరమాద్భుతముగా నున్నది.

గీ. అనిరథంబెక్కి యాన్పుడరుగుచుండఁ, దోడనేగంగయునుసముత్తుంగభంగ
రంగదున్నతమీనతిమింగిలాహి, నక్రచక్రాంగచక్రాభినందితయయి.

ఇట్టిరచన కావ్యరచన.

శ్రీముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు నా కీగ్రంథమునకుఁ బీఠిక వ్రాయ వలసినదిగా మద్గురుపాదులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి యాజ్ఞ యైనదని నాల్గునెలలక్రిందఁ బంపిరి. ఇంత జాగోర్చిన యాయనయోర్మికి నానమశ్శతములు. ఒక యొత్తిడిలో నే నీగ్రంథము కొంచె మాలస్యముగాఁ జదువక తప్పినదికాదు. ఈమహాపుణ్యకథ నాచేతఁ జదివించి యొకజనుష్పారమ్య మైన పుణ్యమును నేను బలవంతముగా సంపాదించుకొనునట్లు చేసిన శ్రీ నాగవీరయ్య శాస్త్రిగారికి భవిష్యజ్జన్మలలోఁ గూడఁ గృతజ్ఞుఁడను గాక తప్పదు.

నమః శివాభ్యామ్.

విశ్వనాథ సత్యనారాయణ, ఎమ్. ఏ.,
ఉయ్యూరు రాజావారి కళాశాల, బెజవాడ.

వ్యయ కార్తికశుద్ధ సప్తమి బుధవారము.



శ్రీశివాయ గురవే నమః

# ఉపోద్ఘాతము

ఉత్తమకవితాసన్నివేశమూలచేతను, ఇతివృత్తావయవసంయోగితచేతను, సమగ్ర శైవవాఙ్మయసంఘటనముచేతను శివపురాణము పురాణవాఙ్మయమున ఉత్తమ స్థానము నొందినది. శివపురాణమునకును, కుమారసంభవమునకును కథావిషయ మందును, మనోహరరచనలయందును, హృదయంగమభావములందును మాత్రమే కాక కొన్నియెడల శ్లోకములందును బింబప్రతిబింబభావము గోచరించుచున్నది. రామాయణ మహాకావ్యరసాస్వాదతన్మయుఁడై తత్కవితాచ్ఛాయలు ప్రతిబింబించు నట్లు రఘువంశ, మేఘసందేశముల రచించినవిధమున నీపురాణపఠనమున నుద్బోధితుఁడై కాళిదాసు కుమారసంభవమును రచించియుండవచ్చును. సాధారణముగా పురాణవాఙ్మయమున గోచరించు సుహృత్సమ్మితోపదేశముకంటె విలక్షణమైన ధ్వనివైఖరినే శివపురాణ మవలంబించినది. పురాణలక్షణములగు సర్గప్రతిసర్గాది వర్ణనములతోఁబాటు ధర్మసందేహనిర్ణయములు నచ్చటచ్చట గోచరించుచున్నను విశేషభాగములు రసవంతములగు కథావర్ణనలతో నిండియుండుటచేఁ గావ్యమును స్మరింపఁ జేయుచున్నది.

శివలీలలు తత్సతీప్రభావము, ఆమె రూపాంతర మగు పార్వతీమాహాత్మ్యము జ్యేష్ఠపుత్రుఁడగు గణేశచరిత్రము, కనిష్ఠుఁడగు స్కందుని యవతారము క్రమముగా నొక్కొక్క ఖండమున వర్ణింపఁబడుటచేఁ గథలో నానుపూర్వి పోషింపఁబడినది ప్రభావద్యోతకములగు కథలు వివిధములైనను సర్వత్ర శివసంబంధ మనుస్యూతమై యున్నది, శివకుటుంబవృత్తాంత మంతయుఁ బ్రతిపాదింపఁబడుటచే విపులమగు శైవ వాఙ్మయ మిందిమిడియున్నది. శివకథాజిజ్ఞాసువుల కిది యొక నిధానమైనది.

మహర్షులు యజ్ఞయాగాదులందు నిర్వృత్తకర్ములై శేషించినకాలమును సద్వినియోగ మొనర్చుకొనుటకుఁ బురాణశ్రవణ మొనర్చెడివారఁట. ధ్యాననిరతియందు కథాశ్రవణము, శ్రవణనిరతియందు ధ్యానము దృఢభక్తిసంపాదనకు సాధనము. భక్తిదార్ఢ్యము శీఘ్రసిద్ధికి కారణము. నిర్వ్యాపారత వ్యసనములకు మూలము. పురాణశ్రవణము నిర్వ్యాపారతను నిర్మూలించుటయేగాక దృఢభక్తిని గూర్చునది యగుటచే సత్పురుషుల కుపాదేయ మైనది.

ఆదర్శప్రాయులగు మహాపురుషుల జీవితము లనేకములు పురాణములలోఁ గన్పట్టును. వారి నడవడి సాధకుల కొజ్జబంతి. వారి యనుభవములు సందేహనివర్తకములు. వారి చిత్తస్థైర్య ముత్సాహదాయకము. వారి చరిత్రలు శ్రోతల చిత్తములపై నున్నతాదర్శముల ముద్రించును. భ్రమరకీటన్యాయమున వారిని భావించి తత్సదృశులగుటయు సంభవించును. పురాణశ్రవణ మిట్లు వీరపూజకు దీక్షాకంకణము.

వైదికవాఙ్మయమున సాక్షాత్కరించిన తత్త్వము సూత్రవాఙ్మయము నల్పాక్షరముగ నసందిగ్ధముగఁ గ్రమవిశేషయుతముగ నిర్మింపఁబడినది. ఆవిజ్ఞానమే పురాణవాఙ్మయమున వివిధానుభవములతో, వివిధదృష్టాంతములతో, విపులవర్ణనములతోఁ, ఆకర్షణీయములగు నర్థవాదములతోఁ, బ్రరోచకములగు కథాసన్నివేశములతోఁ జిత్రింపఁబడినది. ఆర్షవిజ్ఞానము వేదములయం దంకురించి, సూత్రములయందుఁ బల్లవించి, పురాణములందుఁ బుష్పించి ఫలించినది. అర్థవాదయుతములగుటచేతను, సూక్ష్మవిషయప్రతిపాదకములగు చర్చలు కనిపింపకుండుటచేతను సామాన్యమానవులకై పురాణము లుద్దేశింపఁబడినట్లు తోఁచును. కాని ఉదాహరణయుతములగు కథలు, ప్రబలసందేహనివర్తకము లగుటచే మధ్యమాధికారులకును, ప్రరోచకార్థవాదసంబంధముచే హృదయంగమములై యుత్తమాధికారులకును అభిరుచి కల్గించును. కనుకనే పురాణములు మహర్షులచేతను, ప్రవక్తలచేతను, సామాన్యమానవులచేత నాదరింపఁబడుచున్నవి.

కొంతకాలమునుండియు పురాణవాఙ్మయముపై భారతీయులలోఁ గొందఱికి వైముఖ్యము ప్రబలినది. దీనికిఁ దగినకారణము లేకపోలేదు. సుమారొకశతాబ్దమునుండియు విదేశవిద్యాసంబంధముచేఁ బ్రజలలో భారతీయవిజ్ఞాన స్వరూప స్వభావములు మఱుగుపడినవి. క్రమముగా స్వవిజ్ఞానమున నప్రమాణబుద్ధియు, పరవిజ్ఞానమున బ్రత్యయబుద్ధియు వృద్ధిపొందినవి. ఈ గ్రంథములందలి యర్థవాదములలోని గంభీరార్థము గోచరించుటలేదు. పురాణములు వారి కర్థవిహీనములై యొక జాతిజీవికకొఱకు కల్పింపఁబడిన గ్రంథములైనవి. మహర్షి రచితములు కావనితోఁచినవి. ఆధునిక పండితకర్తృకము లను వాదము బయలుదేరినది.

పురాణములలో నర్వాచీనకథలు గోచరించుట వీరి వాదమున కొకకారణము. వేదశాస్త్రవాఙ్మయములందు వలె ప్రతిపదసార్థక్యముతో రచన, బిగువు పద్ధతి నవలంబించుట పురాణలక్ష్యము కాదు. వానిని గురుముఖమున చర్చించి చదువు పద్ధతియు చిరకాలమునుండి నశించినది. అట్టియెడల సందర్భమున కుపస్కారకములగు

మరికొన్ని యర్వాచీనగాథలు వానిలోఁ బ్రక్షిప్తములగుట కవకాశములు లేక పోలేదు. ప్రబలనిదర్శనములు లేక గ్రంథములే కల్పితము లనుట మాత్రము సాహసము.

ఈగ్రంథము లన్నియు 'బూతుపురాణము' లని కొందఱకుఁ దోఁచుచున్నది. నీతులతోఁబాటు బూతులను బురాణములందుఁ బొడగట్టవచ్చును. నీతు లుపాదేయములుగను, బూతులు పరిత్యాజ్యములుగను వర్ణింపఁబడియుండును. పురాణము లందలి ఉదాత్తవిషయములపై దృష్టినిలుపక తద్భిన్నములను మాత్రమే పురస్కరించుకొని వానిని నిందించుట, వార్తాపత్రికలలో వివాహవిషయము లనుమాత్రము పఠించి, పత్రికలు వివాహప్రయోజనములనుటవంటిది.

కొందఱు పురాణములలోని కొన్ని విలక్షణాచారముల నూతగొని, ఆకాలమున యట్టి యాచారములు సర్వసామాన్యముగ నుండెడి వనుచున్నారు. అట్టివానిలో ద్రౌపదీవివాహ మొండు. దీనినిబట్టి ఆకాలమున స్త్రీలు బహుభర్తృకలై యుండుట ఆచారమని వాదింతురు.

అట్టి యాచారము సంఘసామాన్య మైనచో వ్యాసనారదాదిమహర్షులు పాండవులతో నాయాచార మపూర్వ మనియు దానివలనఁ గలుగు కష్టనష్టములయెడ జాగరూకులై యుండుఁ డని నీతి బోధించుటకును, గొన్నినియమముల నేర్పరచుటకును హేతు వేమియో గోచరింపదు.

జిజ్ఞాసువులై పురాణములఁ బఠించువారలకు వానిలోవివిధశాస్త్రగ్రంథగ్రంథులను విపరించువాక్యరత్నములుదొరకును. అష్టైశ్వర్యములకాకరమయ్యునుదిగంబరుఁడై భిక్షాటన మొనర్చుచు,అర్ధాంగమున నంబికనుదాల్చియు జితేంద్రియుఁడై, యోగము ననుష్ఠించుచు,అంగిట విషమునుదాల్చియు మృత్యుంజయుడై తరుణవయస్సునొంది నిటలాక్షుఁ డయ్యును శాంతుఁడై భక్తుల కభీష్టముల నిచ్చు మహాదేవునిచరిత్రము భక్తుల కెట్టి నీతిని బోధింపదు? గుణాగుణములు తమ సహజవైరమును బరిత్యజించి పరమేశ్వరునం దన్యోన్యభావమున వర్తించినవి.

దేవతాస్వరూపములోని రహస్యము లేమి? ప్రతీకోపాసనము విగ్రహారాధనము అను రెంటికిని భేద మేమి? దేవతలు శక్తివిశేషములా? దేవుఁ డొక్కఁడా లేక పల్వురా? సర్వశక్తిమంతుఁడగు భగవంతుఁ డొక్కఁ డుండ వివిధప్రయోజనములకు వివిధదైవతముల నారాధింపవలయునా? దేవతలకును, మంత్రములకును సంబంధ

మేమి? మంత్రోచ్చారణమున దేవతలు సంతుష్టు లగుదురా? అను సందేహములు సామాన్యముగా కలుగును.

ఈశ్వరప్రతీక మారంభదశయందు చిత్తవృత్తినిరోధమున కొక రమ్యమగు నాకృతిగ భాసించి, ఆకర్షించుటయేగాక క్రమక్రమముగ, ఉత్తరోత్తరసోపానముల నధిష్ఠించు సాధకున కాలంబమై జ్ఞానాభివృద్ధికిని, ఆత్మసాక్షాత్కారమున కుపకరించును. విగ్రహములు శిలలతోఁ జేయఁబడినను వానిని శిలాబుద్ధితోఁ బూజించుట ఆరురుక్షువున కుపకరింపదు. లింగాకారమునుండి ఈశ్వరావతారము మార్కండేయునకు గోచరించునట్లును, స్తంభమునుండి నారసింహావతారము ప్రహ్లాదునకు ప్రత్యక్షమైనట్లును విగ్రహముల దేవతాబుద్ధితోఁ బూజించెడి యాస్తికులకు ఉపాస్యదైవరూప మా శిలావిగ్రహమునుండియే సాక్షాత్కరించును. నాటకదర్శన కాలమున నటునియందు వ్యక్తి విశేషబుద్ధికలవానికి ఆనందము కలుగనివిధమునను కావ్యమును పత్రాత్మకముగా భావించు భావనావిహీనునకు రసప్రాదుర్భావము కలుగనివిధమునను భక్తివిహీనునకు విగ్రహములచేఁ బ్రతిపాదింపఁబడు దేవతారూపము గోచరింపదు. కాముకునకు ప్రియురాలి ప్రతికృతి విరహాపనోదకమైనచో భక్తునకు విగ్రహరూపము మనసు కరగించునది కాకపోదు.

పురాణములందు వర్ణింపఁబడిన వివిధదేవతారూపములందు గంభీరార్థముండును. అర్ధనారీశ్వరరూపము నుదాహరణముగ గైకొందము. దీపమును వెలుఁగును విడదీయుటకు వీలులేనట్లు పరశివునకును, అతని మహిమ యగు శక్తికిని యెడబాటు సంభవింపదు. దీపము కదలకున్నను దానినుండి కిరణప్రసారము సంభవించినవిధమున నిష్పందతత్త్వమునుండి స్పందవిశేషములు (Vibrations) ప్రసరించును. అవి నామరూపాత్మకముగ విభాగము జెందును. కాన నీయాదిమిథునమునుండి ప్రపంచమంతయు నభివ్యక్తమగును. కనుకనే కాళిదాసుఁడు వాగర్థములవలె నీమిథునము కలసియున్నదని, ఈరూపమహిమను అల్పాక్షరములతో నసదృశముగ వర్ణించెను.

వృషభ మీశ్వరుని వాహనము. అదినాలుగు పాదముల సంచరించుధర్మస్వరూపము. ధర్మము నధిష్ఠించి పరమేశ్వరుఁడు విహరించును. ఈశ్వరుఁడు త్రినేత్రుఁడు. తృతీయనేత్రము జ్ఞానమునకుఁ జిహ్నము. జ్ఞానదృష్టిసిద్ధించినవానికివ్యామోహము కలుఁగదు. కనుకనే తృతీయనేత్రమున నీశ్వరుఁడు మన్మథుని దహించెనందురు. వృద్ధిక్షయములు లేని ఆత్మకళ యితని శిరస్సునఁ జంద్రరేఖ. జ్ఞానధార నిర్మలగంగాప్రవాహము. పంచభూతములును బంచవక్త్రములు. చెంగునదాటు హరిణమువంటి

మన స్సాతనిచే జిక్కినది. జాగ్రదాదిచతురవస్థలుచతుర్బాహువులు. వ్యోమకేశత నాగభూషణత దేశకాలాతీతత్వమును సూచించును. అహంకార మనుగజాసురుని జంపి గజచర్మాంబరధారియై 'మీరు నట్లానర్పుఁ' డని భక్తుల కుపదేశించుచు నటించును. నామరూపాత్మక మగు ప్రపంచమును భస్మ మొనరించి తనవిభూతిని బ్రకటించును. అతఁడు స్థాణువే గాడు. సర్వజ్ఞుఁడును.

శక్తిని దేహార్థమునం దాల్చిన శివుఁడు శక్తిమంతుఁడు. శక్తిశక్తిమంతుల కభేదము. దేవతలు బ్రహ్మాండములోని శక్తివిశేషములు. భక్తుల ననుగ్రహించుటకు కరచరణాద్యవయవములు గల రూపములనుగ్రహింతురు. స్వభావముగావారు పరోక్షప్రియులు. వివేకదృష్టిచే గ్రాహ్యులు. దృక్పథము మారనప్పుడు దైవసాక్షాత్కారము సంభవింపదు. ఇంద్రియములకు గోచరింపనందున దైవము లేడందురు. శరీరమును ధరించి దైవము ప్రత్యక్షమైనను వివేకవిహీనుఁడు దుర్యోధనుఁడు కృష్ణునివలెఅతనిని దైవముగాఁదలంపడు. శ్రద్ధాభక్తులు గలవానికిఁబ్రహ్లాదునకువలె సర్వగతుఁడై వివిధశక్తులతో భగవంతుఁడు గోచరించును.

గోళాంతరముల కేగుట చిరకాలము జీవించుట పశుపక్ష్యాదులభాష నభ్యసించుట క్షుత్పిపాసముల జయించుట అంతర్ధానము నొందుట హస్తిబలమును పొందుట కాయవ్యూహవిద్య నభ్యసించుట సిద్ధులను దర్శించుట దూరదృష్టి దూరశ్రవణాదుల నొందుట అష్టైశ్వర్యముల నవలంబించుట మొదలగు వర్ణనములు సామాన్య దృష్టికి అసంభవముగ గోచరించిన నవిశ్వాస్యములుకావు. యోగసూత్రాదుల యందా యాసిద్ధులకు సాధనములు వర్ణింపబడినవి. శాస్త్రసిద్ధములగు సత్యములను సంప్రదాయమూలమున నాచరించిననేగాని యథార్థము బయల్పడదు.

సంస్కృతభాష యందు నిజముగ నిట్టి విశేషములున్నచో మీరేల వెలువరింపరని ఆంగ్లవిద్యా విశారదులు పండితులపై దండెత్తుదురు. ఆంగ్ల భాషలోని పరమాణుశతఘ్ని నిర్మాణాదుల వారేల వెలువరింపరాదు! లోకక్షేమమునకై యొకప్రభుత్వమీశక్తులను దాచుట న్యాయ్యమైనచో పలుమఱు రాక్షసపీడ ననుభవించిన మహర్షులీ యోగరహస్యములను దాచుటయు న్యాయ్యమే! యోగవిశేషానుభవములు సర్వసామాన్యముగ లోకమున కందింపవలయునన్న నది యొక మానవునకు సులభ సాధ్యముకాదు. ఒక ప్రభుత్వము విశేషవ్యయ ప్రయాసముల కొడిగట్టి చిరకాలము ప్రయత్నించిననేగాని కృతార్థత కన్పట్టదు.

కనుక కేవలమనుగాయదృష్టితోఁగాక న్యాయ్యదృష్టితోఁ బురాణములఁ బరిశోధించుట ప్రాచీన విజ్ఞానపునరుదయమునకు కారణము. విజ్ఞాన విశేషముల కాకరము లగుటవలననే నన్నయ్యకాలమునుండి నేటివఱకు నెన్ని నాగరికతలు మారిన నెన్ని రాజ్యములు మారినను పురాణశ్రవణాదులు నశింపలేదు. పురాణ వేత్తృత్వము పలువురాంధ్ర కవులకు యోగ్యతా విశేషముగఁ బ్రాచీన కాలమున రాజులచే స్తుతింపఁబడినది. నేడు వివిధశాస్త్రములతోఁబాటు పురాణ పరిశ్రమము కూడ నొక విద్యగా పరిగణించి విశ్వవిద్యాలయములవారు పరీక్షా బహూకరణాదుల నేల నిర్మింపరాదు ?

చారిత్రక విశేషములు గోళాంతర విశేషములు భూగోళ విశేషములు యోగ రహస్యములు నోషధి మాహాత్మ్యములు మంత్రశక్తులు వివిధశాస్త్ర సంప్రదాయ ములు మొదలగు విజ్ఞాన రత్నములు పురాణఖనుల నుండి త్రవ్వి తీయవచ్చును. ఈ ప్రయోజనములకై పురాణములఁ బరివర్తించి సంస్కృత భాషానభిజ్ఞులకిచ్చుట పండితుల విధి. వారు వివిధశాస్త్ర విజ్ఞాన మహిమచే పురాణముల పరిశోధించుట ఆవశ్యకము. ఇట్టి విధినినిర్వహించుటకే బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రి గారిచే శివపురాణ మాంధ్రీకరింపబడినది.

అనూచానశైవాచార్యవంశమున జన్మించి తద్విజ్ఞానమును సమగ్రముగ గ్రోలుట వీరి ఆంధ్రీకరణమున కొక ప్రధానయోగ్యత. ఆంధ్రీకరణమున నన్నయాదుల మార్గమే యవలంబింపఁబడినది. రసవంతములగు ఘట్టములఁ బెంచుట, నీరసములను దుంచుట యను పద్ధతివలన తెలుఁగున పురాణములు కావ్యశోభ నొందినవి. కాని ఈమార్గమునం దొక లోప మున్నది. పురాణములలోని విమర్శనీయాంశములు సంస్కృతభాషానభిజ్ఞులకు సమగ్రరూపమునఁ బ్రికటమగుటలేదు.

శివపురాణమున నుమాఖండమున గన్పట్టు కాలజ్ఞానము, మృత్యుంజయ యోగ ములు మొదలగు ఘట్టము లింకను విపులీకరించినను లాభదాయకములే. లేదా ఆ యుదాత్తయోగముల మూలమును తగిన వివరణములో ప్రకటించినను మేలే.

సమకాలికుల కవిత్వశైలినిగూర్చి ముచ్చటించుట వివిధవిమర్శలకు తావిచ్చును. ఐనను బురాణవాఙ్మయముపై మనోగతభావములఁ బ్రకటించుటకు వ్రాయు నీ పంక్తులలో నాకుఁ దోచినంతవఱకు నీ యాంధ్రీకవితలోని గుణములఁ జూపుట అప్రకృతము కాదు. గ్రంథపఠన మారంభించినది మొదలు సమాప్తిచేయువఱకు నెచ్చటను విసుగుజనింపలేదు. ఉత్తరోత్తరము రసవంతమై యాకర్షించినది. ప్రాచీన

కవులయందు సర్వసామాన్యమగు చక్కని శైలియు, ధారాశుద్ధియు నీకవివర్యునకు దైవదత్తములు. కనుకనే ఈ మహాగ్రంథము నిర్విఘ్నముగ నాంధ్రీకరింపఁబడినది.

కవితాహంకారమున గాక శివకైంకర్యదీక్షాతత్పరతచే నీగ్రంథ మాంధ్రీక రింపఁబడినది. పద్యరూపమున నీ గ్రంథము నాంధ్రీకరించు నదృష్టము తొలుత తనకే సంభవించినదని యీకవి మురియుచున్నాఁడు. పోతనవలెనే ఈఘనకార్య మున తన జన్మము కృతార్థ మైనదని యుప్పొంగుచున్నాఁడు. పితరుల కీగ్రంథ మంకితమిచ్చుటచే బితౄణము ఆంధ్రీకరణముచే ఋషిఋణము, భక్తివిశేషముచే దేవఋణములు దీరినవి. ఈగ్రంథమందంతటను భక్తి యంతర్వాహినియై ప్రవ హించినది. నిరంతర శివనామాస్వాదపరిపూరిత మగు జిహ్వనుండి యీ కవిత స్రవించినది.

ఒకే శైలూషి సందర్భానుగుణముగ వివిధభూమికల ధరించినట్లు భావానుగుణ ముగా శైలి పలువిధముల మార్పు నొందినది. అప్రయత్నముగ రచింపఁబడినట్లు అనేకపద్యములు గోచరించును. శివునిపై దండెత్తు మన్మథునివర్ణించుసందర్భమున అతనిసౌకుమార్యము ఈపద్యమున మనోహరముగ గోచరించుచున్నది.

వాడిన రాలిపోవు సుమవర్గము కాండచయంబు పుష్ప నా
నేడకొ బారు పుల్గు లొక యేవపు వారువముల్ స్వరూపమే
జాడను లేని తెమ్మెరలు చచ్చువజీరులు తోడుకుండు రే
తే డబలల్ బలంబులు సరే యిఁక రుద్రునితోడఁ బోరుటల్.

(శి.పు. 184 పే. 99 ప)

గంపెడుబిడ్డలఁ గన్నతల్లి ధనవంతురాలగు గొల్లరాలుతోఁ దనహృదయములోని యుత్క్రోశమును బట్టలేక ముఖాముఖి పోరాడుచున్నది,

ఉప్పరము లున్న వనుచుం
గొప్పగ నగ లున్న వనుచు గొప్ప ననుచు నీ
వెప్పుడు ద్రుళ్ళుకు బంగరు
కుప్పలు గల రోసి! నాకుఁ గొడుకులు గూతుల్.
దుడ్డుగలుగ నేమి గొడ్డుదానవు నీవు
తినుట కివ్వ లేని దిక్కు లేరు
బిడ్డ లున్నదానఁ బేర్మి నా కెన యాడ
తల్లక్రిందు లగుచుఁ దపసు గొనిన! (శి.పు. 569 పే. 234, 235 ప)

సీసపద్యరచనయందు శ్రీనాథుని పోకడలు కొన్నియెడలఁ గన్పించుచున్నవి.

ఇంద్రనీలముడాలు నీసడింపఁగఁజాలు,నీలంపు మైనిగనిగలవాని
వేయిరేకుల తమ్మివిరులఁగెల్వఁగఁజాలు, విరివైన కనుదోయి వెలయువాని
చెనటుల సమయింపఁ జేవగల్గినసాధ,నములొప్పు నాల్గుహస్తములవాని
అమృతంబుకన్న తీయగ నొప్పు మాధురి,గురిపించు నెమ్మోము గొమరువాని
పలురకములైన రతనాల వెలసి ధగధ,గలుదనర్చు కిరీటంబు గ్రాలువాని
కౌస్తుభంబను మణి యెదఁ గలుఁగువాని, పసిడిపుట్టంబు గట్టిన బాలు నొకని.
(శి.పు.23 పే. 189 ప)

చాపపాశాంకుశచటులపాశారవిం,దము లొప్పు నాల్గుహస్తములతోడ
బాలేందురేఖావిభాసితం బగుచు నం,దంబుఁ జెందిన కిరీటంబుతోడ
పద్మరాగచ్ఛాయ పరిఢవించిన మనో,జ్ఞములైన మాల్యాంబరములతోడ
మందహాసపు ఠీవి మానుగుల్కెడు దయా,స్పదములై తగు కటాక్షములతోడ
భవ్యకాశ్మీరగంధలేపములతోడ
ముంగురులు మూగు కస్తూరిబొట్టుతోడ
భువనములకెల్ల భ్రమసేయు మూర్తితోడ
శంకరార్ధాంగలక్ష్మి సాక్షాత్కరించె. (శి.పు పే140 ప72

స్త్రీనిందాస్తుతులు శివకేశవులచే మిక్కిలి మనోహరముగాఁ జేయఁబడినవి. సతీవియోగము నొందిన శివుఁడు స్త్రీని నిందించుటయు, లక్ష్మీపతి యగు కేశవుఁడు గృహస్థాశ్రమధర్మమును బొగడుటయు సందర్భసహజములు.

అపవిత్రములలోన నగ్రిమం బగు చోటు,బొంకుల కెల్లను బుట్టినిల్లు
కపటవర్తనములఁ గనఁ జేయు నెఱజాణ, చెడుగోతఁబడఁద్రోయు చెడ్డఘోటి
అనువుగా భ్రమసేయ నైంద్రజాలికవిద్య,నమ్మియేలినచోటినాగుఁబాము
సాహసంబుల కెల్ల జంకనట్టి వలఁతి, పాయంగనీయని పరమధనము
ఒనరఁగాఁగట్టుత్రాడులందుక్కుగొలుసు, క్షణికసంతోషమెసగుకొర్రికాఁరుతీగ
స్త్రీ యనఁగ దానితోఁబొత్తు జెందవలదు, బ్రహ్మనిష్ఠులకెందేని బద్మనయన!

అఖిలతాపంబుల హరియించు నౌషధం, బార్తికంధిని దాటునట్టి నౌక
చిత్తంబు రంజిల్లఁ జేయఁ జాలిన విద్య, సకలసౌఖ్యములకు జన్మభూమి
ప్రతిదినంబును గొత్తబరగు చక్కనివిందు, కొమరారుకోలమున కమరతరువు
అన్నపానంబుల నందఁ జేసెడు దైవ, మతిథిజనంబుల నరయుతల్లి.

దేవయజ్ఞంబునందు నెంతేని తోడు, కష్టసుఖములయందుఁ బాల్గొంచు జోడు
ఆత్మసతి యగుఁగావున నందజకును,బెండ్లి యాడంగఁదగు గాదె పేర్మి యలర.
(శి. పు. పే 209 ప 67.)

పోతనవిష్ణుభక్తివలె గ్రంథకర్తశివభక్తి వెల్లువలై పారినది.

శీతాంశుధరు నెంచు చిత్తంబు చిత్తంబు,భవు సమర్చనసేయు పాణి పాణి
ప్రమథనాథుని జేరు పదములు పదములు, శివుని సన్నుతి సేయు జిహ్వ జిహ్వ
విశ్వేశు కథ విను వీనులు వీనులు,కాలకాలుని జూచు కనులు కనులు
పరమేశుఁ గొల్చెడు భాగ్యంబు భాగ్యంబు, దర్పకారికి నొంచు తనువు తనువు
పురహరునిఁ గొల్వఁబూనిన బుద్ధి బుద్ధి, శ్రీశనాయకునకు మ్రొక్కుశిరముశిరము
శంకరుని భక్తిఁబడసిన చదువుచదువు, నాగభూషణు సేవించు నరుఁడు నరుఁడు

పరమశివార్చనాపదవి నొందఁగ లేని,యిక్క గా దది పాపడొక్క గాని
ఖండేందుధరభక్తి గనకయున్నట్టి య,న్నరుఁడు గా డాతండు వఱఁడుగాని
శ్రీకంఠమూర్తిని జెలగి మ్రొక్కఁగ లేని, శిరము గా దది పాపభరము గాని
భోగిభూషణుపూజఁ బూని సేయఁగ లేని, కేలు గా దది చెడ్డ తేలు గాని
శంకరుని మదిఁ జెందఁగాఁ జాలనట్టి, తెలివి గా దది చెడ్డ తెవులు గాని
అమ్మహేశ్వరు కొలువుకై యమరనట్టి,కలిమి గా దది పేరడ్సు బలిమి గాని
[శి. పు. 215 పే. 116ప]

సందర్భానుగుణముఁగ లోకోక్తులీకవిత నలంకరించినవి.

చూపులగుజ్జమువలె నత డేపుమెయిం బెరుగుచుండ (శి.పు. 53 పే. 410 ప)
ఉడుము కేటి కోరి! యూరివార్త [శి.పు. 82 పే. 141]
పరులకోసరముగ బావి దూకుట మేలె (శి.పు. 98 పే. 257 ప)
కొండ నెత్తి తలం దాల్చుకొనఁ దరంబె [శి. పు. 184 పే. 100 ప]

ఇత్యాదులు పెక్కులు.

స్వభావోచిత మగు భూమికను ధరించిన నటుఁడు తననాట్యకౌశలముచేసామాజికుల చిత్తవృత్తుల నాకర్షించినవిధమున స్వాభిరుచి కనుగుణ మగునితివృత్తమును గ్రహించిన కవియుఁ దనకవితాకౌశలముచేఁ బాఠకుల నాకర్షించును. సూత్రప్రాయముగ నీగ్రంథములోని విశేష మిది. గ్రంథము శివపురాణము. నాయకుఁడు శివుఁడు. ఆంధ్రీకర్త శైవుఁడు.విషయము శివప్రభావము. కవిత్వము శివంకరము. పాఠకుల కిఁక శివములకుఁ గొఱఁత యేమి?

గ్రంథరాజమా! ఆంధ్రమాత యంకమందును, ఆస్తికుల గృహములందును. దేవతల పీఠములందును, భక్తుల హృదయములందును, సహృదయుల చిత్తము లందును సరసముగ నాచంద్రార్కము వర్ధిల్లుము.

ఓం తత్సత్ శివమ్

తూములూరి శివరామకృష్ణశాస్త్రి.
థియసాఫికల్ కాలేజ్, మదనపల్లి.



శ్రీశివాభ్యాం నమః

# మున్నుడి

శ్లో॥ అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః
కామికాద్యాగమానాం తు శూలపాణిరితి స్మృతిః

స్కాందపురాణ సూతసంహిత

పరమకారుణికాంతరంగుఁ డగు పరమేశ్వరుని యుద్బోధంబున జగత్కల్యాణము కొఱకై చెలికారపు నుడుల వ్యాసభట్టారకుండు రచించిన పదునెనిమిది పురాణములలో మేలిమిమీఱు శ్రీ శివమహాపురాణమును ప్రాచీనాంధ్రకవివర్యులు మొదలుకొని నేటివఱకు కలరు కవివర్యులెవరును బద్యరూపముగఁ దెనిఁగింపకుండుట నా భాగధేయవిశేషము. నే నొకప్పు డొకరి యింట నున్న యీశివపురాణంబును జూచి కొంచెము భాగము చదివి యానఁదించి తదాంధ్రీకరణేచ్ఛ యనివార్యంబుగఁ బొడమ నావాసరమందే పొత్తంబు నారంభము నొనర్చి యనతికాలంబున నేకొండొక భాగంబుఁ దెలిఁగించి విజ్ఞులగువారలకుఁ జూపెట్టఁగా నవ్వారు మురిసి నాయుద్యమంబున కూఁత యొసంగిరి. అంత నే నామోదముతో మఱికొంత రచించి శ్రీ శ్రీ కవిచక్రవర్తులును, నాగురులును నగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారు శతావధానులవారి సముఖమున కేఁగి వారికి వినిచితిని. వారును విని యానందించి మఱికొన్ని విశేషంబులు నాకుఁ గఱపి యేతదాంధ్రీకరణప్రయత్నమునకుఁ బూర్తిగ నుత్సాహం బొసంగిరి. మొదటఁ గొన్ని ఖండంబులు మాత్రమే రచించి ముగించుద మనుకొని యట్లొకటి రెండు మాఱులు మధ్యమధ్యఁ జాలగాలము విరామం బొనర్చియు, మహామహులగు కొందఱి ప్రోత్సాహముతో నెట్లో శివానుగ్రహంబు బలిమితో నిప్పటివఱకు శివపురాణంబును సర్వంబు నాంధ్రీకరింపఁ గలిగినందులకు భక్తవత్సలుం డగు శివునకును, నిందు నాకుఁ బ్రేరకు లగువారలకును జోత లొనర్చెదను. ఇఁక శివపురాణంబును గుఱించియు, నాయాంధ్రీకరణంబును గుఱించియు నొకించుక ముచ్చటించెదను. శ్రీదేవీభాగవతప్రథమస్కంధములోని,

శ్లో॥ మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్
అనాపలింగకూస్కాని......

యనెడు శ్లోకోక్తి ననుసరించిన, యష్టాదశమహాపురాణపరిగణనలో నీశివపురాణము చేర్పఁబడక యుపపురాణములలోఁ జేర్పఁబడినందునఁ గొందఱిద్దాని నుపపురాణం బని యందురు. ఇట్లే భాగవత మన, దేవీభాగవతమేకాని శ్రీభాగవతము కాదని యాశ్లోకముయొక్క తాత్పర్యము. అందులకు శ్రీభాగవతవాదు లట్లొప్పుకొనరు. శ్రీభాగవతమే మహాపురాణం బనియు, దేవీభాగవత ముపపురాణం బనియుఁ జెప్పుదురు.

శ్రీభాగవతమందుఁగల మహాపురాణపరిసంఖ్యలో శివపురాణము పేర్కొనఁబడినది.

శ్రీభాగవతే ద్వాదశస్కంధే సప్తమాధ్యాయే.

శ్లో॥ బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ । శైవం లైంగం చ గారుడం
నారదీయం భాగవతం । ఆగ్నేయం స్కాందసంజ్ఞితం
భవిష్యద్బ్రహ్మకైవర్తం । మార్కండేయం చ వామనం
వారాహ మాత్స్య కౌర్మాణి । బ్రహ్మాండాఖ్య మితి త్రిషట్
బ్రహ్మన్నేతం సమాఖ్యాతం । శాఖాప్రణయనం మునేః ॥

మఱి యందే ద్వాదశాధ్యాయమునం దష్టాదశపురాణంబుల పరిమితియుఁగూడ నిట్లు నిర్దేశింపఁబడియె.

శ్లో॥ బ్రాహ్మ్యం దశసహస్రాణి । పాద్మం పంచోనషష్ఠి చ ।
శ్రీవైష్ణవం త్రయోవింశ । చ్చతుర్వింశతి శైవకం
దశాష్టౌ శ్రీభాగవతం । నారదం పంచవింశతి ॥ ఇత్యాది.

ఇట్లే స్కాందపురాణ సూతసంహితయందు

శ్లో॥ బ్రాహ్మ్యం పాద్మం వైష్ణవం చ । శైవం భాగవతం తథా॥ అని యుపక్రమించి – బ్రహ్మాండం చేతి పుణ్యోయం । పురాణానా మనుక్రమః ॥ యనియు, నిట్లే విష్ణుపురాణము కౌర్మము, మాత్స్యము వామనపురాణము, లింగపురాణము మున్నగువానియం దష్టాదశమహాపురాణసంఖ్యలో శివపురాణము లెక్కింపఁబడినది. ఏకారణముననో దేవీభాగవతమందు మాత్రము "వచతుష్టయం"బని వాయుపురాణంబును మహాపురాణంబుగఁ గైకొని యాయది యుపపురాణములందుఁ జేర్పఁబడియె. ఆవాయుపురాణముగూడ శివపారమ్యప్రతిపాదకమే. బహూక్తి ప్రామాణ్యప్రాబల్యంబునను, వైయాసికశైలీపరిజ్ఞాన పరిపాటీవిశేషంబునను శ్రీశివపురాణ మష్టాదశమహాపురాణమాలారత్నం బనియే విజ్ఞులారయుదు రని విశ్వసించెదను.

ఇఁక నీయది సంహితాభేదంబులతోఁ బాఠభేదంబులతో రెండుతీరులఁబలుకడల ముద్రింపఁబడినది. అందుఁ బ్రధానములై శ్రీకాశీపట్టణముద్రితగ్రంథం బొకఁడును బొంబాయి పట్టణ ముద్రితగ్రంథ మొకఁడును గన్పట్టుచున్నవి. గ్రంథంబులు రెండును సాకల్యంబుగఁ జదివినపిమ్మట నొక్కటిగానే కన్పట్టును గాని గ్రంథములలో నేదేని యొకభాగము మాత్రముఁ జదివెడువారికి వేఱువేఱు గ్రంథములు రెండని దృఢముగఁ దోఁచును. అందు నాకు మొదట దొరికినది బొంబాయి ప్రతి. అద్దాని ననుసరించియే పరివర్తనము చేసితిని. పిదపఁ గాశీప్రతినిఁగూడఁ బరికించితిని గాని మార్పు చేయవలసిన యవసర మగుపడ లేదు. ఇఁక నాపరివర్తనమందు

"కం. మక్కికి మక్కియొనర్చుట, చక్కనిమార్గంబు గాని•చందముగుట నా
చక్కి విడనాడి నా యీ, ఫక్కిన్ బొనరింతు లలిత•పద్ధతిమెఱయన్"

అని నేను గ్రంథారంభములో నొడివినట్లు నేను మక్కికిమక్కిగాఁ దెనిఁగింపక శ్రీభారతకవులు, శ్రీనాథకవీంద్రుఁడు మున్నగువారి పథంబు ననుసరించి యొకచో మూలముకన్నఁ బెంచియు, మఱియొకచోఁ దగ్గించియు, నిఁకనొకచో వేఱురీతిగఁ బొనరించియు, వేఱొకచో స్కాందపురాణము, శ్రీభాగవతము, మహాభారతము, శ్రీజాబాలోపనిషత్తు, కాలాగ్నిరుద్రోపనిషత్తు మున్నగువానినుండి విశేషాంశంబులఁ గొన్నిఁటిన్ గైకొని యిందుఁ జేర్చియును, గొన్నిచోట్ల యథామూలం బనునట్లనుసరించియును గొంచెము స్వతంత్రించియే తెనిఁగించితిని.

ఇఁకను మూలగ్రంథములో సంహితలు గాను వానిలోఁ బ్రత్యేక భాగంబులు ఖండంబులుగా నున్నవి. నేనిందు సంహితలను పేరుఁదొలగించి యన్నిటికిని ఖండంబులని యేర్పరచితిని. మఱియు శివలీలల నెఱింగించు శతరుద్ర సంహితకు లీలాఖండంబనియు లింగ చరిత్రంబులఁదెల్పు కోటిరుద్ర సంహితకు లింగవైభవ ఖండంబనియుఁ బేరిడితిని. మఱియుఁ బ్రారంభమందు నున్నవిద్యేశ్వర సంహిత యను దానిని సందర్భమును బట్టి చివరయందద్దిరాణించునని చివరలో విద్యేశ్వర ఖండముగాఁ జేర్చితిని. ఇఁక నిందుఁ బార్వతీఖండ కుమార ఖండంబులను లింగ వైభవ ఖండంబును మూలమునకన్నఁ బెంచి వ్రాసితిని. కైలాస వాయవీయ విద్యేశ్వరఖండంబులను మూలమున కన్నఁ దగ్గించి వ్రాసితిని. లీలాఖండంబు నుమాఖండంబును, గొంచెము గుంచించియు, సృష్టిసతీయుద్ధ ఖండంబులను యథారూపంబులుగను విరచించితిని, ఇఁక మూలమందొకమాఱు చెప్పిన యుపాఖ్యానంబులను జెప్పిన శివలీలలను వక్తృశ్రోతృవిభేదంబుచే, బలుమాఱులు

మరల మరలఁ, జెప్పబడియుండుట నవ్వానినట్లు చెప్పినఁ బునరుక్తి కాదన్నను బాఠకులకు విసువు కల్గించునని యిందు మానితిని.

రెండుమాఱులు చెప్పిన యుపమన్యు చరిత్రంబు ఘట్టమందు రెండవ మాఱు అద్దానికి మాఱుగాఁ బద్మపురాణమునుండి కొనివచ్చి మార్కండేయచరిత్రంబు వ్రాసితిని. మఱియు బ్రహ్మదేవుని పంచమ శిరఃఖండన చరిత్రంబు మాత్రము లీలాఖండములో నొకమాఱును లింగవైభవ ఖండమందొక మాఱు నించుక భేదంబుతో జెప్పఁబడినది. ప్రసక్తిని బట్టి వక్తృశ్రోతృభేదంబున మూలానుసారంబుగఁ దెనిగింపక తప్పినదికాదు. ఇఁక నందందుఁ గొలఁది పాటిమార్పులు, ఒకచో వేఱుకిరీతిగఁ బొనరించియు ననెడునుడికుదాహరణంబుగ నొనరించితిని. ఇప్పినంబుగ నాచితి చెడనియట్లుగాఁ గొంత స్వతంత్రించి కృతిని వ్రాసినను గోపాలుఁడూరిపొలిమేరను మీఱక యెట్లు పసులమేపుకొనుచుఁ గాఁచుకొనునో యట్లే నేనును మూలగ్రంథమునకు దవ్వుగ నడువక మూలంబు సరసఁ బరికించుమనే పరివర్తనంబొనరించితిని.

పలువురు పూర్వమహాకవులు ద్రొక్కిన మార్గంబౌట, గుణగ్రాహులగు పాఠకమహాశయు లిద్దాని నేరంబుగ యోజించరని భావించెదను.

ఇఁకను బార్వతీఖండములోని హిమాద్రివర్ణనాది ఘట్టములలో శ్రీ కాళిదాస మహాకవిగారు తమ కుమారసంభవకావ్యములో వర్ణించిన కల్పనలు కొన్ని గన్పట్టును. గావున నాకల్పన లాకావ్యమునుండి యెత్తివ్రాసినట్లు చదువరులకుఁ దోఁచును గాని యాకల్పన లన్నియుఁ గృష్ణద్వైపాయనునవే. శ్రీకాళిదాసమహాకవి శ్రీవ్యాసుని యందలి గౌరవబుద్ధిచేతనో, శ్రీవ్యాసకల్పనలయందలి స్వారస్యవిశేషాస్వాదలాలసచేతనో యవ్వారి కల్పనలను శ్రీశివపురాణమునుండియు, మఱి యితరపురాణముల నుండియుఁ బడసి తెలుచుగాఁ దమ కావ్యంబులయందు వాడియున్నారు. తావన్మాత్రమున వారి కేమియుఁ బకర్షగలుగలేదు. ఇఁక నేనిందు మూలములోని శ్లోకములను దెనిఁగించినందున నేఁ గాళిదాస కల్పనలను దొంగిలించినట్లుగా విజ్ఞులు దలంపరని హెచ్చరించెదను.

శ్రీవ్యాసకల్పనలను శ్రీకాళిదాస మహాకవ్యనువాదంబులను గనుఁగొనుఁడు. శివపురాణపార్వతీఖండప్రథమాధ్యాయమున,

శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశివై । గిరీశో హిమవాన్ మహాన్
పర్వతో హి మునిశ్రేష్ఠ । మహాతేజా స్సమృద్ధిభాక్

పూర్వాపరౌ తోయనిధీ।సువిగాహ్యా స్థితో యతః
నానారత్నాకరో రమ్యో । మానదండ ఇవ క్షితేః॥

కాళిదాసకవికృత కుమారసంభవకావ్యమందలి ప్రథమసర్గములో,

శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా । హిమాలయోనామనగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదండః॥

శివపురాణ పార్వతీఖండస ప్తమాధ్యాయమున,

శ్లో॥ దృష్టిః పుత్రివతోఽప్యద్రేః।తస్మిన్ తృప్తిం జగామ న
అపత్యే పార్వతీత్యాఖ్యే । సర్వసౌభాగ్యసంయుతే ॥
మధో రనంతపుష్పస్య । చూతే హి భ్రిమరావళిః
విశేషసంగా భవతి । సహకారే మునీశ్వర! ॥
పూతో విభూషిత శ్చాపి।స బభూవ తయా గిరిః
సంస్కారవత్యేవ గిరా । మనీషీవ హిమాలయః
ప్రభామహత్యా శిఖయే । వదీపో భవనస్య చ
త్రిమార్గ యేవ సన్మార్గ । స్తద్వ ద్గిరిజయా గిరిః ॥

కాళిదాసకవికృత కుమారసంభవకావ్యమందలి ప్రథమసర్గములో,

శ్లో॥ మహీభృతః పుత్రవతోఽపిదృష్టి। స్తస్మిన్నపత్యేనజగామతృప్తిమ్
అనంతపుష్పస్య మధోర్హి చూతే । ద్విరేఫమాలాసవిశేషసంగా ॥
ప్రభామహత్యా శిఖయేవ దీపః । త్రిమార్గయేవ త్రిదివస్యమార్గః
సంస్కారవత్యేవ గిరా మనీషీ।తయా సపూతశ్చ విభూషితశ్చ ॥

శివపురాణపార్వతీఖండస ప్తమాధ్యాయమున,

శ్లో॥ అథ దేవీ శివా సాచో।ప్రదేశసమయే మునే
పపాఠవిద్యా స్సుప్రీత్యా । యత్తచిత్తా చ సద్గురోః
ప్రాక్తనాజన్మవిద్యాస్తాం । శరదీవ ప్రిపేదిరే
హంసాళి స్స్వర్నదీం నక్త । మాత్మభాసో మహౌషధిం॥

కాళిదాసకవికృత కుమారసంభవ ప్రథమసర్గములో,

శ్లో॥ తాంహంసమాలా శ్శరదీవగంగాం । మహౌషధిం నక్తమివాత్మభాసః
స్థిరోపదేశా ముపదేశకాలే । ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః ॥

శివపురాణపార్వతీఖండషోడశాధ్యాయమున,

శ్లో॥ తేన క్రూరా ఉపాయాన । స్సర్వే హతబలాః కృతాః
వికారే సన్నిపాతేవా । వీర్యవం త్యౌషధాని చ
యత్రాస్మాకం జయాశాహి । హరిచక్రే సుదర్శనే
తత్కుంఠిత మభూ త్తస్య । కంఠే పుష్ప మివార్పితమ్ ॥

కాళిదాసకవికృత కుమారసంభవద్వితీయసర్గమందు,

శ్లో॥ తస్మిన్నుపాయా స్సర్వేనః । క్రూరే ప్రతిహతక్రియాః
జయాశాయత్ర చాస్మాకం । ప్రతిఘాతోత్థితార్చిషా
హరిచక్రేణ తే నాస్య । కంఠే నిష్కమి వార్పితమ్ ॥

శివపురాణపార్వతీఖండషోడశాధ్యాయమున,

శ్లో॥ తతోనైవవధా యోగ్యో । యతో వృద్ధి ముపాగతః
విషవృక్షోపి సంవర్ధ్య । స్వయం ఛేత్తు మసాంప్రతమ్ ॥

కాళిదాసకవికృతకుమారసంభవద్వితీయసర్గమందు

శ్లో॥ ఇత స్సదైత్యః ప్రాప్తశ్రీః । నేత ఏ వార్హతిక్షయమ్
విషవృక్షోపిసంవర్ధ్య ! స్వయంచేత్తుమసాంప్రతమ్॥

శివపురాణపార్వతీఖండవింశాధ్యాయమున,

శ్లో॥ అద్యప్రభృతి తేదాసః । తపోభిః క్రీతఏవ తే
క్రీతోస్మితవసౌందర్యాత్ । క్షణమేకం యుగాయ తే॥

కాళిదాస-కుమారసంభవపంచమసర్గములో

శ్లో॥ అద్యప్రభృత్యవనతాంగితవాస్మిదాసః।
క్రీత స్తపోభిరితివాదినిచంద్రమౌళే ॥

ఇత్యాదులూహ్యంబులు. పెక్కేల కుమారసంభవకావ్యం బంతయు శివ పురాణస్థభావసంకలితమే- అయదియే కాదు- శ్రీ కాళిదాసకవికృతరఘువంశ కావ్యమునందును, శాకుంతలాదినాటకనాందీఘట్టములయందును గవి, శ్రీ శివ మహాపురాణభావములనే కైకొనికై సేసినారు. కనుండు.

శివపురాణ పార్వతీఖండసప్తమాధ్యాయమున,

శ్లో॥ దధౌ నిదానం దేవానా। మానందస్యేప్సితంశుభమ్
దేహసాదాదసంపూర్ణ। భూషణాలోధ్రసంముఖా
స్వల్పభేన్దుతుయేకాసా।విచేయర్క్షావిభావరీ
తదాననమ్మృత్సురభి। నాయంతృప్తోగిరీశ్వరః
మునే రహస్యుపాఘ్రాయ। ప్రేమాధిక్యంబభూవతత్

శ్రీ కాళిదాసకవికృతరఘువంశకావ్య తృతీయసర్గమందు,

శ్లో॥ శరీరసాదాదసమగ్రభూషణా। ముఖేనసాలక్ష్యతలోధ్రపాండునా
తను ప్రకాశేనవిచేయతారకా। ప్రభాతకల్పాశశి నేవ శర్వరీ॥
తదాననం మృత్సురభిక్షితీశ్వరో।రహస్యుపాఘ్రాయనతృప్తిమాయయౌ॥

శివపురాణపార్వతీఖండసప్తమాధ్యాయమున,

శ్లో॥ అరిష్టశయ్యాంపరిత। స్సద్విసారిసు తేజసా
నిశీథదీపావిహత। త్విషఆసన్న రంమునే॥

కాళిదాసకవి రఘువంశతృతీయసర్గములో

శ్లో॥ అరిష్టశయ్యాంపరితోవిసారిణా। సుజన్మనస్తస్య నిజేన తేజసా
నిశీథదీపాస్సహసాహతత్విషో। బభూవురాలేఖ్య సమర్పితా ఇవ॥

శివపురాణయుద్ధఖండప్రథమాధ్యాయమందు,

వ్యూఢోరస్కో వృషస్కంధః

కాళిదాసకవి రఘువంశప్రథమసర్గములో,

వ్యూఢోరస్కో వృషస్కంధః

శివపురాణవాయవీయసంహితాత్రయోవింశాధ్యాయమునం బార్వతీదేవినిఁ గూర్చి శివునివచనము,

శ్లో॥ త్వం హి వాగమృతం సాక్షాద్। అహ మర్థామృతం పరం
వాగర్థమయ మేవే తత్ । జగత్ స్థావరజంగమమ్॥

కాళిదాసకవి రఘువంశప్రథమసర్గములోఁ బ్రథమశ్లోకము,

శ్లో॥ వాగర్థావివసంపృక్తౌ । వాగర్థ ప్రతిపత్తయే ॥

శివపురాణవాయవీయసంహితోత్తరభాగచతుర్థాధ్యాయమున,

భూమ్యంభోగ్నిమరుద్వ్యోమ । క్షేత్రజ్ఞార్కనిశాచరాః
అధిష్ఠితామహేశస్య । శర్వాద్యైరష్టమూర్తిభిః ॥

కాళిదాస శాకుంతలనాటకనాందీశ్లోకము సువిదితమే. ఇట్లు కాళిదాసమహాకవి శివపురాణమును బలుమాఱులు చదివి తద్గతభావవిశేషంబులను గ్రహించి తనదు కావ్యంబులందుఁ గీల్కొల్పుట పాఠకుల కెఱుకగాకయుండదు.

ఇఁకను పార్వతీఖండములో మేనకాకుపితావస్థ కొండొక రసాభాసాస్పదంబుగ నుండును. కాని యదియంతయు శివమాయావిశేషవిలసితంబే యగుట శ్రీపరమేశ్వరి యగు పార్వతీదేవివలె నెగ్గలేక శివపరీక్షయం దోటమిఁజెందిన మేనకచెయిదమును జెప్పెడు నాభాగంబును బూర్తిగ వదిలివేయక కొంత క్లుప్తపఱచి విరచించినందులకును, లింగవైభవఖండములో మూలములోఁ జెప్పఁబడని మఱికొన్ని దివ్యలింగములు తెలుగు, తమిళము పేరులుగల యూరులందు వెలసియుండుట నవ్వాని స్వరూపంబు లారసి యిందుఁ జేర్చినందులకును, మన్నింప విమర్శకులకు మనవి చేసికొనియెదను.

ఇఁక మూలగ్రంథరచనాకాలంబున కిప్పటికాలంబునకుఁ బ్రపంచ ధర్మంబులు చాలగ మాఱియుండుటను బట్టి చదువరుల కందందుఁ గొన్ని యెడల నించుక వ్యత్యాసంబుగఁ దోఁచినఁ దోఁచవచ్చును గాని విజ్ఞులట్టివానిఁ బాటింపరని తలంచెదను.

సంస్కృతాంధ్రవ్యాకరణాంశములు :—ఈకృతియందలి నాల్గవపేజీలో శైవాచార్యసత్కృతియందలి, చంపకమాలలోని "అలికమునగ్గ నృశానుదృశ ♦ నందని శంకరుఁ" డను నెడ దృక్ఛబ్దమునకు టాప్‌ప్రత్యయము చేసినరూపము పూర్వకవుల

గ్రంథంబులందు సులభ ప్రాప్తముగాదు. ఇఁక యథా వాచా నిశా దిశా అనుభా గురిమతరీత్యా ఆకారాంతముగా (టాబంతము) చేసికొని యద్దాని తత్సమముగా యోజించఁగోరుచున్నాను.

కౌశలశబ్దము, స్వార్థమందు (కుశలశబ్దార్థమందు, ఒకటి రెండుచోట్ల వాడఁబడినది. సూ అర్శఆదిభ్యోఽచ్ నుండి సాధువు చేసికొనవలయును.

పునీతశబ్దము రెండుమాఱులుచ్చరింపఁబడినది. ఇయ్యది సంస్కృత శ్రీభాగవతములో వ్యాసభట్టారకునిచే వాడఁబడినది.

శ్రీ భాగవతేఽష్టాదశాధ్యాయే బలివచనే

30 శ్లో॥ తథాపునీతాతనుభిః పదైస్తవ.

లింగవైభవ ఖండంబులోని కృత్తివాసేశశబ్దము మూలగ్రంథమందు సంజ్ఞావాచకంబుగఁ బఠించుటఁ జేసి యద్దాని నేను నట్లే యనువదించితిని.

ఇఁక నాంధ్రనియతియందుఁ గవిత్రయేతరులగు పెక్కురు మహాకవుల ప్రయోగంబుల ననుసరించి ప్రస్తుతము దేశ్యములట్లు కన్పట్టు నితరభాషాపదములను గొండొక గ్రహించితిని. అట్లే విశ్రమ ప్రాసంబులందు రేఫశకట రేఫసాధర్మ్యంబును గూడ నిర్విశంకంబుగ నంగీకరించితిని.

ఇఁక నాకవనంబును గూర్చి నే నేమియు వ్రాయఁజాలను. సౌరభంబున్న రసజ్ఞులే యాస్వాదించి యానందింతురు. సహృదయాః ప్రమాణం.

ఇఁకను మా గురులును గింకవీంద్రఘటాపంచాననాది బిరుదాంచితులును నగు శ్రీ కవిచక్రవర్తులు బ్రహ్మ॥శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిలవారు శతావధానులు పుత్రోవా శిష్యోవా యనువచన ప్రకారము * నాయందలి శిష్య వాత్సల్యము చే నా యీ కృతినిఁ బరిశోధించుటయుఁ గాను ముందుగఁ దమకును నాకును నిష్టదైవమగు శ్రీపరదేవతను గూర్చి.

---

* నేనొకప్పుడొక గొప్ప తెవులు మప్పున గారింపఁబడి రాజకీయవైద్యాగారమందుండినప్పుడు శ్రీ శ్రీ శాస్త్రిలవారాశీర్వాదింపుచు నీ పద్యమును వ్రాసిపంపిరి.. ఆమీఁద వెంటనే యారోగ్యమును జెందితిని.

చ. పరమశివాంఘ్రిభక్తున క ♦ పారకృపారస మూర్తియైన శం
కరుఁ డాగి నాగవీరయకు ♦ గాదిలి శిష్యునకాయువుక్ నిరం

మ. జననీ! శైవపురాణమొక్కరుఁడుమ ♦ చ్ఛాత్రుండు దెల్గించెదా
నిని నేనిష్ఠ బరిష్కరింపవలయున్ ♦ నీదాకటాక్షావలో
కనమున్ లేక ఘటించుటెట్టు లిదిమ ♦ త్కాసంబు శాసించి మా
టనుదక్కించుమతండు యోగ్యుఁడుగిరీ ♦ డ్భక్తుండు కామేశ్వరీ!,

అని స్తుతించి గ్రంథము నంతయు సమగ్రముగాఁ బ్రత్యక్షర శోధనముగా సవిమర్శముగా దిలకించి పరిష్కరించి గ్రంథమును నిర్దుష్టంబు నొనరించి నందులకు వారి యడుగుఁ దమ్ములక నేక ప్రేమపూర్వకాభివందనంబుల సమర్పించుకొను చున్నాఁడను.

మఱియు నాకవనంబులో నాకును శ్రీ మా శాస్త్రిలవారికిఁ గూడ మఱుఁగై, కొన్ని దోసఁగులు మిగిలిన మిగులవచ్చునేమో అట్టివానిని సదయులును,గుణదోష గ్రహణ పారీణులు నగు పరిశీలకులు, నాకుఁ దెల్పిన పునర్ముద్రణమందు దిద్దు కొనియెదను.

ఇఁకను బ్రూపులు దిద్దుకొనుటయందలి పొరపాట్లచేఁ బలుచోట్లఁ బరుషసరళ వ్యత్యయంబులును, నరసున్నల తబ్బిబ్బులును, రేఫశకట రేఫ వ్యత్యాసంబులును, విసంధులు, స్పేసుల తాఱుమాఱులు మున్నగునవి పొసంగినవి. పాఠకు లవ్వానిని అంటనివత్తులు, సున్న లేగాక, అక్కరంబులను మఱియు న స ప వ థ ధ డ ఢ మున్నగు నక్కరంబులను యథోచితంబుగ దిద్దుకొన వేడికోలు.

మఱియు భ్రమచేఁ గొన్ని పద్యములందు విశ్రమప్రాసంబులు లోపించినవి. ఆ వ్వానిని మఱికొన్ని మిక్కిలి యవసరంబులైన యచ్చుదోసఁగులను దప్పొప్పులపట్టి కలోఁ జూపుచున్నాఁడ నవ్వాని నట్టులు సవరించికొని చదువుకొనఁ బ్రార్థన.

---

తరమగు సౌఖ్యమున్ సిరియు ధన్యత మాన్యత యిచ్చి వెంకటే
శ్వరుఁ డిడునాశిషంబునను ♦ భవ్యయశంబు ఘటించుఁగావుతన్.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
శతావధాని.
29—3—44.

శ్రీరసాగరము బిల్డింగ్సు,
గవర్నరుపేట, బెజవాడ.

ఇఁక నొకమాఱు అడుగుటతోడనే పీఠికను వ్రాయుట కంగీకరించి పొత్తమును బంపినమీఁద దయతో నానుపూర్విగఁ గృతి నంతయుఁ జదివి సవిమర్శముగాఁ బీఠికను వ్రాసి పంపిన యుదారచరిత్రులు, విద్వత్కవివతంసులు శ్రీరాజా రంగాప్ప రాయకళాశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులును, కవిసమ్రాట్టులు నగు బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఎమ్. ఏ., గారికిని, శివపురాణ రచనాకాలంబునందే కొన్ని భాగంబులను విని యానందించి, పరిష్కరించి యద్దాని పరిపూర్తిమీఁదఁ దా నొక పీఠికను వ్రాసియిచ్చెదమని పిదప గ్రంథముఁ బంపినంత సాకల్యంబుగఁ జదివి వాత్సల్యముతోఁ బీఠికను వ్రాసిపంపిన విద్వద్వర్యులును, మదనపల్లి థియసాఫికల్ కళాశాలాప్రధానాంధ్రోపాధ్యాయులును, వైయాకరణశిరోమణులు నగు బ్రహ్మశ్రీ తూములూరి శివరామకృష్ణశాస్త్రులవారికిని శాశ్వతము త్రికరణపూర్వకముగఁ గృతజ్ఞతాభివందనంబుల సమర్పించుకొందును. మఱియు నీ శివపురాణముద్రణమున నావీలుకొలఁదిగ నోపికతో గ్రంథమును ముద్రింపించిన మాసోదరులు ఓరియంట్ ముద్రాక్షరశాలాధికారులు బ్రహ్మశ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారికిని, వారి యనుజులు శ్రీ సాంబశివరావుగారికిని నభినందనంబుల నుడువుచు గ్రంథముద్రణమునకై విస్తారధనము లిచ్చి యచ్చొత్తించిన శ్రీనిధుల కితోధిక శ్రేయోభాగ్యంబు లిచ్చుటకుఁ బరమేశ్వరునిఁ బ్రార్థించుచుఁ బాఠకమహాశయుల నిఁక శివపురాణపఠన భాగ్యపదవిం బ్రవేశపెట్టుచు నింతతో నీయుపోద్ఘాతంబును ముగించుచున్నాఁడను.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
**ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి,**
శికింద్రాబాద్, (దక్కన్.)



శ్రీ శివాభ్యాన్నమః.

ఉ. శైవపురాణరాజమును ♦ జక్కఁగ ముద్రిణమ్ముఁ బొనర్పఁగా
శ్రీవిలసిల్లు దాతృకుల ♦ శేఖరు లెక్కుడు ద్రవ్య మిచ్చినా
రీవిమలాత్ములన్ దయను ♦ నెప్పుడు సాంబునుగాత నామహా
దేవుఁడు శంకరుండు గణు ♦ తింపఁగఁజాలని సౌఖ్య మిచ్చుచున్.

మహారాజపోషకులు

రూ మ॥రా॥శ్రీ

221 మిరియాల రామలింగయ్య, సుల్తాన్ బజార్, హైద్రాబాద్.
201 రావుసాహేబు-బూర్గు మహాదేవు శికింద్రాబాద్.
201 ప్రొద్దటూరి వీరన్న, చిన్నవీరన్న
201 కైలాస శరభయ్య
201 బెలిదె జగదీశ్వరయ్య
201 బచ్చు వీరన్న
201 గుండా ఆగయ్య

రాజపోషకులు

మ॥రా॥శ్రీ

101 అమ్మనబోలు రాజయ్య
101 బుద్దోలు వీరన్నగారి రంగయ్య
101 సుక్ దేవ్ శ్రీకృషన్
101 మరిపల్లి శంకరయ్య
101 వనమాల వెంకయ్య
101 మోహన్‌లాల్ మాలానీ
101 తేలుకుంట బాలకృష్ణయ్యగారి వెంకటేశం, కాశయ్య
101 తేలుకుంట నారాయణ
101 రేచింతల మల్లయ్య, బొలారం
100 ముస్త్యాల శంకరయ్య, వెంకయ్య
100 ముస్త్యాల హనుమంతరావు, మానయ్య

రూ మ॥రా॥శ్రీ

100 రావ్‌సాహెబుచిదుర దుర్వాసులు
100 బూర్గు వీరయ్యగారి భార్య శకుంతలమ్మ

ప్రధానపోషకులు

మ॥రా॥శ్రీ

75 కొణతాల నర్సిములు, రాజేశ్వరయ్య
75 అమరము రాజయ్య
50 బెజగంవీరన్నగారిరాజేశ్వరరావు
50 ఇందూరి యీశ్వరయ్య
50 దండు పెంటయ్య
50 లింగ వీరన్న
50 లోకుల కుసుమయ్యఅండ్ బ్రదర్సు
51 కల్వ రామయ్య అండ్ బ్రిదర్సు
50 చీకోటి మల్లయ్య అండ్ బ్రదర్సు

పోషకులు

25 బ్ర॥శ్రీ ములుగు బుచ్చయ్యలింగం

మ॥రా॥శ్రీ

25 వుప్పలంచి బాబయ్య
25 సానికె కాశయ్య
25 మాసెట్టి వెంకన్న అండ్ సన్సు
25 నాళ్ళ హనుమయ్య
25 గంగాభిషన్ మోహన్‌లాల్ బట్టలదుకాణం
25 ఉప్పల గౌరీశంకర్

రూ మ॥రా॥శ్రీ
25 మొలుగు వెంకటయ్య
25 గంధె నరసింహులు
25 మిరియాల తిరుమలయ్య
25 తేరాల రాజేశ్వరరావు
25 చీలా నారాయణ
25 తడిక బాలరాజయ్య
25 నీల నర్సయ్య
25 మొలుగు రాజయ్య
25 గంగ సాంబయ్య
25 హరినాథుల బాలయ్య
25 పబ్బా శంకరయ్య
25 ముచ్చర్ల భూమయ్య

రూ మ॥రా॥శ్రీ
25 అమ్మనబోలు వీరన్న, విశ్వనాథం
25 తాడిసెట్టి రాజయ్య
25 సి. ఈశ్వరయ్య, గుం. వెంకయ్య, మోటూరి బ్రహ్మయ్య
25 నార్ల సోమయ్య
25 బచ్చు రాఘవయ్య
25 లింగ సుందరయ్యగారి కనకయ్య
25 దండు ఆగయ్య

చందాదారులు

20 సాధు బాగయ్య
15 పడకంటి శంకరయ్య
15 వీరబోయిన నర్సిములు



# విషయ సూచిక


| సృష్టి ఖండము | పేజీ |
|---|---|
| ఇష్టదేవతాస్తుతి | 1 |
| కవిస్తుతి | 2 |
| శైవాచార్యాదిసత్కృతి | 3 |
| వంశానుక్రమణిక | 4 |
| కృతిసమర్పణము | 5 |
| గ్రంథారంభము | 6 |
| శౌనకాదిమునులు సూతుని శివపురాణమునువినుచున్నియడుగుట | 8 |
| సూతుఁడు హర్షించి ప్రారంభము సేయుట | 9 |
| శౌనకాదిమునులు సూతుని శివతత్త్వంబుతీ రెఱింగింపు మనుట | 9 |
| కథాప్రారంభము - నారదముని తపస్సొనరించుట | 10 |
| నారదముని తపస్సిద్ధియైన దనుకొని త్రిమూర్తులకడ కేగుట | 11 |
| నారదుఁ డహంకరించుట | 12 |
| నారదుఁడు శ్రీమతిని జూచి మోహించుట | 13 |
| విష్ణుమూర్తి శ్రీమతినిఁ బెండ్లాడి వైకుంఠమునకుఁ దోడ్కొనిపోవుట | 15 |
| నారదుడు విష్ణువునుశపించుట | 16 |
| నారదుఁడు పశ్చాత్తప్తుఁడగుట | " |
| విష్ణువు నారదునకు హితోపదేశంబు చేయుట | 17 |
| నారదుఁడు తీర్థయాత్రసల్పుట | 19 |
| నారదుఁడు బ్రహ్మయొద్దకేగి, శివతత్త్వంబుఁ జెప్పుమనుట | 19 |
| బ్రహ్మదేవుఁడు నారదునకు శివతత్త్వంబుతీ రెఱింగించుట | 20 |
| శివుఁడు సగుణుండై యేర్పడుట | 21 |
| సగుణశక్తి యేర్పడుట | 21 |
| విష్ణుమూర్తిజననము | 23 |
| విష్ణుమూర్తి తపస్సు చేయుట | 24 |
| బ్రహ్మదేవుని జననము | 25 |
| బ్రహ్మదేవుఁడు తపస్సొనరించుట | 25 |
| బ్రహ్మదేవునకు విష్ణుమూర్తి యగుపడుట | 26 |
| బ్రహ్మ విష్ణుల వివాదము | 26 |
| లింగోత్పత్తి | 27 |
| బ్రహ్మవిష్ణువులు లింగాద్యంతంబుల జూడఁబోవుట | 28 |
| శబ్దబ్రహ్మోత్పత్తి | 28 |
| అక్షరమూర్తిప్రకటనము | 30 |
| శక్తివిశిష్టేశ్వరసాక్షాత్కారము | 31 |
| శివుఁడు బ్రహ్మముఖమున రుద్రుడనై పుట్టెద నని చెప్పుట | 32 |
| శివుఁడు త్రిమూర్తులకుఁ గృత్యభేదంబు నిరూపించుట | 33 |
| బ్రహ్మవిష్ణ్వాదుల కాయుర్నిరూపణము | 34 |
| శివపూజావిధానము | 36 |
| బ్రహ్మకు విష్ణువుశివలింగపూజ సర్వార్థకారి యనుట | 39 |
| హరిబ్రహ్మదులు శివలింగముల ధరించి పూజించుట | 40 |
| ప్రత్యేకపుష్పపత్రార్చనాఫలనిరూపణము | 45 |
| ధాన్యపూజాఫలనిరూణాము | 46 |
| అభిషేకఫలనిరూపణము | 47 |

| | పేజీ |
|---|---|
| శ్రీరుద్రోత్పత్తి | 49 |
| దేవాదిసృష్టి | 50 |
| కుబేరుని పూర్వజన్మచరిత్రము | 53 |
| గుణనిధి కళింగరాజపుత్త్రుఁడై పుట్టుట | 60 |
| గుణనిధి కుబేరుఁడై శివునకు జెలికాఁడగుట | 61 |

సతీఖండము

| | పేజీ |
|---|---|
| నారదుఁడు బ్రహ్మను సతీదేవీ చరిత్రంబుఁ జెప్పుమనుట | 65 |
| సంధ్యను జూచి బ్రహ్మయుఁ దత్పుత్రులును మోహించుట | 66 |
| బ్రహ్మ మున్నగువారల కగ్నిష్వాత్తాదులు పుట్టుట | 67 |
| బ్రహ్మ సంధ్యయొద్దకు వశిష్ఠుని బంపుట | 69 |
| వశిష్ఠుఁడు సంధ్యకు మంత్రోపదేశంబు చేయుట | 71 |
| శివుఁడు సంధ్యకు సాక్షాత్కరించుట | 71 |
| శివుఁడు సంధ్యకు వరంబు లిచ్చుట | 72 |
| సంధ్య రెండవజన్మము-అరుంధతి యని నామకరణము | 74 |
| అరుంధతీవశిష్ఠుల వివాహము | 74 |
| శివునకు మోహంబుఁ గూర్పుమని బ్రహ్మ మన్మథుని బంపుట | 75 |
| మన్మథుఁడు శివునకు మోహంబుఁ బుట్టింపలేననుట | 77 |
| బ్రహ్మ విష్ణుమూర్తియొద్ద కేగి శివునకు గామోపాయం బడుగుట | 78 |
| విష్ణుమూర్తి బ్రహ్మతో శివశక్త్యవతారంబునకై యత్నింపుమనుట | 78 |
| దక్షుఁడు మహేశ్వరినిగూర్చి తపస్సొనరించుట | 79 |
| శ్రీపరదేవత దక్షునకుఁ బ్రత్యక్షమగుట | 79 |
| శ్రీపరదేవత దక్షునకు వరంబిచ్చుట | 80 |
| దక్షుఁడు వీరిణిని బెండ్లాడి మిథునసృష్టి యొనర్చుట | 81 |
| దాక్షాయణీ జననము | 83 |
| సతీదేవి నందావ్రతంబు సేయుట | 84 |
| సతీదేవికి శివుఁడు ప్రత్యక్షమగుట | 85 |
| శివుఁడు సతీదేవికి వరం బిచ్చుట | 86 |
| సతీశివవివాహము | 88 |
| సతీశివవిహారములు | 89 |
| ప్రావృట్కాలవర్ణనము | 90 |
| శివుఁడు సతీదేవికి జ్ఞానమార్గంబు నుపదేశించుట | 93 |
| ప్రయాగలో దేవమునులుయజ్ఞం బొనర్చుట | 96 |
| దక్షుఁడు శివుని శపించుట | 97 |
| నందికేశ్వరుఁడు దక్షునకుఁ బ్రతిశాపం బిచ్చుట | 97 |
| దక్షుఁడు నందికేశ్వరుఁడుమున్నగువారిని శపించుట | 97 |
| నందికేశుఁడు భృగ్వాదిమునులకు శాపం బిచ్చుట | 98 |
| దక్షయజ్ఞము | 98 |
| సతీదేవిదక్షయజ్ఞమునకుఁబోవుటకు శివుని సెల వడుగుట | 100 |
| సతీదేవిదక్షయజ్ఞమునకుఁ బోవుట | 101 |
| సతీదేవి విష్ణ్వాదిదేవతల నుపాలంభించుట | 102 |
| సతీదేవి దక్షుని దెగడుట | 104 |

| | పేజీ |
|---|---|
| సతీదేవి దేవతలను శపించుట | 106 |
| సతీదేవి యోగాగ్ని చేదగ్ధమగుట | 106 |
| ఆకాశవాణి దక్షుని శపించుట | 107 |
| శ్రీవీరభద్రజననము | 108 |
| శివుని సెలవుచే వీరభద్రుఁడుదక్ష యజ్ఞమున కరుగుట | 109 |
| ఉత్పాతంబులకు వీరిణి మున్నగు వారు భయపడుట | 110 |
| ఇంద్రాదులు వీరభద్రునితో యుద్ధము చేయుట | 111 |
| విష్ణువు వీరభద్రునితో యుద్ధము సేయవచ్చుట | 112 |
| విష్ణువీరభద్రులయుద్ధము | 113 |
| వీరభద్రుఁడు యజ్ఞశిరశ్ఛేద నంబు సేయుట | 114 |
| భృగ్వాదిమునులశిక్ష–వీర భద్రుఁడు దక్షునిజంపుట | 115 |
| విష్ణ్వాదిసురలు కైలాసమునకుఁ బోవుట | 116 |
| కైలాసగిరివర్ణనము | 117 |
| విష్ణ్వాదులు శివుని దర్శించి ధ్యానం బొనర్చుట | 118 |
| విష్ణువుశివునితో దక్షునిబ్రతికించి యజ్ఞమును బూర్తి చేయింపు మనుట | 120 |
| శివుఁ డనుగ్రహించుట | 121 |
| దక్షుఁడు జీవించుట | 121 |
| దక్షుఁడు శివుని సన్నుతించుట | 121 |
| శివుఁడు దక్షునకుహితంబుచెప్పుట | 122 |
| క్షుపదధీచులకలహావృత్తాంతము | 124 |
| మహామృత్యుంజయమంత్రము | 125 |
| శివుఁడు దధీచిమునికివరమిచ్చుట | 126 |
| విష్ణువు దధీచితోఁ బోరవచ్చుట | 127 |
| విష్ణుదధీచుల యుద్ధము | 127 |
| క్షుపుఁడుదధీచినర్థించి యుద్ధము నుడుపుట | 129 |


## పార్వతీఖండము – ప్రథమాశ్వాసము


| | పేజీ |
|---|---|
| సూతుని శౌనకాదులు పార్వతీ జన్మచరిత్రంబు చెప్పు మనుట | 130 |
| హిమవద్గిరివర్ణనము | 131 |
| మేనకాహిమవద్వివాహము | 133 |
| మేనక మున్నగువారికిసనకాదుల శాపము. | 134 |
| సనత్కుమారుఁడు మేనకాదుల ననుగ్రహించుట | 136 |
| విష్ణ్వాదిదేవతలు హిమవంతుని యొద్దకు వచ్చుట | 137 |
| విష్ణ్వాదులుమేనాహిమవంతులను దపంబు సేయుమనుట | 138 |
| విష్ణ్వాదులు పరదేవతనుగూర్చి ధ్యానము సేయుట | 138 |
| విష్ణ్వాదులకుఁ బరదేవత సాక్షాత్కరించుట | 139 |
| విష్ణ్వాదులు పరదేవతను మఱల జన్మంబునొంది శివునిఁ బెండ్లి యాడు మనుట | 140 |
| పరదేవత దేవతలకు వరము లిచ్చుట | 141 |
| మేనకాహిమవత్తపోవర్ణనము | 143 |
| మేనకకుఁ బరదేవత ప్రత్యక్ష మగుట | 144 |
| పరదేవత మేనకకుఁ గోరిన వరము లిచ్చుట | 145 |

పేజీ

మేనకకు నూర్గురు కొడుకులు పుట్టుట 146

పర దేవతా తేజము మేనకా గర్భంబునఁ జేరుట 146

విష్ణ్వాదులు మేనాగర్భస్థ యగు పర దేవతను స్తుతించుట 147

శ్రీపర దేవతావతారఘట్టము 147

విష్ణ్వాది దేవతలు పర దేవతను దరిసి స్తుతించుట 148

హిమవంతుఁడు పుత్రీజననోత్సవము సేయుట 149

నామకరణము 150

శ్రీపార్వతిబాల్యక్రీడాభివర్ణనము 151

నారదాగమనము 153

నారదుఁడు పార్వతికి దిగంబర జటిలుఁడు మగఁ డగు ననుట 153

గిరిరాజుతో నారదుఁడుపార్వతి శివపత్ని యగు ననుట 154

హిమవంతునితో మేనక పార్వతికిఁ బెండ్లి సేయు మనుట 157

పార్వతీస్వప్నవృత్తాంతము 158

హిమవంతునిస్వప్నవృత్తాంతము 158

శివుని లలాటఘర్మజలమునుండి కుజుఁడు పుట్టుట 160

శివుఁడు హిమాద్రికివచ్చితపంబు సేయుట 160

హిమవంతుఁడుశివునిసందర్శించుట 161

హిమవంతుఁడుపార్వతీపరిచర్యల గొనుచుండు మని శివు నర్థించుట 164

శివుఁడు పార్వతీ దేవినిజూచుట 164

పార్వతీపరమేశ్వరుల సాంఖ్య వేదాంతపథవివాదము 166

పేజీ

శివుఁడు పార్వతీ పరిచర్యను గొనుట కంగీకరించుట 168

పార్వతి చెలులతోఁ బ్రతిదినము శివునకు బరిచర్య సేయుట 168


## ద్వితీయాశ్వాసము


సూతుఁడు శౌనకాదులకుఁ దారకా సురోదంతంబుఁ జెప్పుట 171

వజ్రాంగుని యుత్పత్తి 172

వజ్రాంగుని విజయము ,,

తారకాసురుఁడు పుట్టుట 175

తారకాసుర తపోవర్ణనము ,,

బ్రహ్మదేవుఁడు తారకాసురునకు వరంబులిచ్చుట 176

తారక దిగ్విజయము 177

దేవతాపీడనము ,,

దేవతలు బ్రహ్మదేవునకుఁ దమయార్తిన్ జెప్పుకొనుట 178

బ్రహ్మదేవుఁడు కుమారజన్మార్థమై యుపాయంబుఁ జెప్పుట 180

ఇంద్రుఁడు మన్మథుని రప్పించుట 181

ఇంద్రుఁడు మన్మథునకు దేవ కార్యంబుఁ దెలుపుట 181

మన్మథుఁడు రతివసంతులతో హిమాద్రి కరుగుట 185

వసంతోదయవర్ణనము 185

పార్వతి పరిచర్యకై శివునియొద్దకు వచ్చుట 186

మన్మథాస్త్రచోదితుండగు శివుడు పార్వతిఁ జూచి వర్ణించుట 186

శివుఁడు పశ్చాత్తాపంబునొందుట 188

| | పేజీ |
|---|---|
| శివుఁడుఫాలనేత్రాగ్నిచే మన్మథుని దహించుట | 188 |
| రతీవిలాపము | 189 |
| దేవతలు మన్మథుని బ్రతికింపుటకై శివునిఁ బ్రార్థించుట | 190 |
| శివుఁడు మన్మథుని మఱొకప్పుడు బ్రతికింతునని వరమిచ్చుట | 192 |
| శివుఁడుగణములతోఁ గైలాసమున కేగుట | 192 |
| పార్వతిభీతిల్లి చెలులతోఁ నిలుఁ జేరుట | 193 |
| శివునిఁగూర్చి పార్వతి విరహ దుఃఖంబు నొందుట | 194 |
| నారదుఁడు హిమవంతునియొద్దకు వచ్చుట | 194 |
| నారదుఁడు పార్వతిని శివునకై తపంబుఁ జేయుమనుట | 194 |
| పంచాక్షరీ మంత్రవైభవము | 195 |
| పార్వతి మేనకా హిమవంతుల సెలవొంది తపంబున కేగుట | 196 |

## తృతీయాశ్వాసము

| | |
|---|---|
| పార్వతీ తపోవర్ణనము | 198 |
| పార్వతి శివునిచే నపర్ణయనిఖ్యాతి నొందుట | 199 |
| మేనకా హిమవంతులు వచ్చి పార్వతినిఁ జూచి పోవుట | 202 |
| విష్ణ్వాదులు శివసన్నిధి కరుగుట | 203 |
| విష్ణ్వాది దేవతలు శివునిస్తుతించుట | 204 |
| విష్ణ్వాదులు శివునిఁ బార్వతిని బెండ్లాడుమనుట | 205 |

| | పేజీ |
|---|---|
| శివుఁడు విష్ణ్వాదులకుఁ గామని రసనంబుఁ జెప్పుట | 206 |
| శివుఁడు స్త్రీసంగమము బ్రహ్మజ్ఞాన బాధకమనుట | 208 |
| శివుఁడుపార్వతిని బెండ్లాడుట కొడంబడుట | 209 |
| శివుఁడు సప్తర్షులనుదలచిన నవ్వారు వచ్చుట. | 209 |
| శివుఁడు సప్తర్షులను పార్వతీతపః పరీక్షకై యనుపుట | 210 |
| సప్తర్షులు పార్వతియొద్దకేగి శివుని నిరసించుట | 210 |
| పార్వతి సప్తర్షులకు శివమహిమంబుఁ జెప్పుట | 213 |
| పార్వతి సప్తర్షులకుఁ దన నిర్ణయంబు జెప్పుట | 215 |
| శివుఁడు పార్వతిని పరీక్షించుటకై యతియై చేరుట | 216 |
| జయ యతికిఁ బార్వతీతపఃకారణంబుఁ జెప్పుట | 218 |
| యతి పార్వతికి శివుని నిరసనం బుపన్యసించుట | 219 |
| పార్వతి శివాక్షేపములకు సమాధానంబులు చెప్పుట | 221 |
| శివుఁడు సాక్షాత్కరించి పార్వతినిఁ గైలాసంబునకు రమ్మనుట | 22 |
| పార్వతి శివునితోఁ దలిదండ్రుల నడిగి తన్ను బెండ్లాడుమనుట | 22 |
| శివుండంగీకరించి కైలాసంబున కేగుట. | 22 |
| పార్వతి దీక్షాంతముచేసి తల్లిదండ్రుల యొద్దకుఁ బోవుట. | ,, |

పేజీ

శివుడు బిక్షుక వేషంబుతో మేనా సన్నిధిని నర్తనము సేయుట 227
మేనకతోఁ గృతకనటుఁడు దనకుఁ బార్వతి నిమ్మనుట 228
మేనకాహిమవంతులు నటుని శిక్షింపఁబూనుట 230

## చతుర్థాశ్వాసము

శివుఁడు వైష్ణవవేషముతో మేనా హిమవంతులకడకు వచ్చుట 232
వైష్ణవబోధచే మేనక శివునకుఁ బార్వతి నీయననుట 234
శివుఁడు సప్తర్షుల నోషధిప్రస్థమున కనుపుట 234
ఓషధిప్రస్థపురవర్ణనము 237
సప్తర్షులు పార్వతిని శివున కిమ్మని హిమవంతు నడుగుట 238
వైష్ణవబోధచే హిమవంతుఁడు శివునకుఁ గన్య నీయననుట 239
వశిష్ఠుఁడు హిమవంతునకు హితముఁ జెప్పుట 240
అనరణ్యచరిత్రము 241
పద్మను బిప్పిలాదుం డను వృద్ధఋషి మోహించుట 242
పిప్పిలాదుఁడు పద్మనిచ్చి పెండ్లి సేయుమని యనరణ్యునడుగుట 243
అనరణ్యుఁడు పిప్పిలాదమునికిఁ గూతు నిచ్చి పెండ్లిసేయుట 243
ధర్ముఁడు పద్మాదేవినిఁ బరీక్షించుట 244
పద్మాదేవి కోపించి ధర్మునకు శాపం బిచ్చుట 245

పేజీ

ధర్ముఁడు పద్మాదేవి యనుగ్రహంబుఁ గోరుట 246
ధర్ముఁడు పద్మాదేవికి వరంబు లిచ్చుట 247
హిమవంతుఁ డాలోచించి పార్వతిని శివున కిచ్చెద ననుట 248
ఋషులు పార్వతికిఁ బ్రధానంబు చేసి శివునికడ కేగుట 249
హిమవంతుఁడు శివునకుఁ గల్యాణపత్రికఁ బంపుట 250
హిమవత్పరిజనులు పెండ్లిసామాగ్రినిఁ గూర్చుట 251
సువాసినులు పార్వతిని బెండ్లికూఁతును జేయుట 252
హిమవంతునిచుట్టములు పెండ్లికి వచ్చుట 252
కల్యాణమంటపనిర్మాణము 253
పౌరు లోషధిప్రస్థంబును సింగారించుట 255
శివుఁడు నారదమునిన్ దలంప నతఁడు వచ్చుట 256
శివుఁడు నారదమునిచే దివ్యజనంబుల నెల్లఁ బిలిపించుట 256
దేవపురంధ్రులు శివునిఁ బెండ్లికొడుకునఁ జేయుట 257
శివుఁడు ప్రమథదేవబలంబులతో వివాహంబున కరుగుట 258
శివుఁడు నారదుని హిమగిరి కనుపుట 261
నారదుఁడు వివాహమంటపమును జూచి భ్రమించుట 261
నారదుఁడు హిమవత్పుత్రులతో శివునియొద్దకు వచ్చుట 262

| | పేజి |
|---|---|
| హిమవంతుఁడు శివు నెదుర్కొనుట | 265 |
| హిమవంతుఁడు శివునిఁ బ్రార్థించుట | ,, |
| శివునిఁ జూడఁగోరి మేనక నారదునిఁ బిలిపించుకొనుట | 266 |
| శివుఁడు బలంబుల వేలువేలుగా నగరునకుఁ బంపుట | ,, |
| చంద్రశాలయందు మేనకకు నారదుఁడు దివ్యుల నెల్ల నెఱింగించుట | 267 |
| నారదుఁడు మేనకకు శివునిఁ జూపుట | 269 |
| మేనక శివునిఁ జూచి భయపడి యాక్రోశించుట | 270 |
| మేనక నారదుని నిందించుట | ,, |
| మేనక పార్వతిని నిందించుట | 271 |
| బ్రహ్మేంద్రాది దేవతలు మేనకకు సమాధానము సెప్పుట | 272 |
| హిమవంతుఁడు మేనకకు సమాధానముఁ జెప్పుట | 273 |
| పార్వతి మేనకకు సమాధానముఁ జెప్పుట | ,, |
| శనకాదులు మేనకకు సమాధానము సెప్పుట | 275 |
| విష్ణుమూర్తి మేనకను మరల శివునిఁ జూడుమనుట | ,, |
| మేనక మరల శివునిఁ జూచుట కొప్పుకొనుట | 276 |


## పంచమాశ్వాసము


| | పేజి |
|---|---|
| విష్ణుప్రార్థనచే శివుఁడు దివ్యసుందర రూపంబు నొందుట | 277 |
| మేనక శివునిఁ జూచి యానందించుట | 278 |
| మేనక తనయపచారంబును సైపుమని శివునిఁ బ్రార్థించుట | 279 |
| నాగరస్త్రీలు శివునిఁ జూచుట | ,, |
| నాగరస్త్రీలు శివునిఁ బ్రశంసించుట | 281 |
| హిమవంతుఁడు వరపూజచేసి పెండ్లివారిని విడిదిలోఁ బ్రవేశపెట్టుట | 282 |
| పార్వతి కులాంబాపూజార్థమై వెడలుట | 283 |
| దేవతలు మహేశదత్తభూషణంబులఁ బార్వతి నలంకరించుట | 284 |
| శివుఁడు కల్యాణమంటపమునకు వచ్చుట | 285 |
| నారదుఁడు హిమవంతునకు శివుని యనాదిత్వంబుఁ జెప్పుట | 286 |
| శ్రీపార్వతీపరమేశ్వర కళ్యాణము | 287 |
| శివుఁడు పార్వతితో స్థాలీపాక హోమంబు సేయుట | 289 |
| వరవర్గభోజనములు | 293 |
| దివ్యస్త్రీల పరిహాసోక్తులు | 295 |
| రతీదేవి మగని బ్రతికింపుమని శంకరుని వేడుకొనుట | 297 |
| శివుఁడు మన్మథుని బ్రతికించుట | 298 |
| లోకరక్షార్థమై శివుఁడు పార్వతీదేవినిఁ గూడుట | 299 |
| ప్రభాత వర్ణనము | ,, |
| శివుఁడు దేవతలకు దరిసెనంబిచ్చుట | 300 |
| సాయంకాలవర్ణనము | 301 |
| విప్రసువాసిని పార్వతికి బతివ్రతా ధర్మంబులు చెప్పుట | 303 |
| శివుఁడు పార్వతీదేవిం దోడ్కొని కైలాసంబున కేగుట | 309 |

| | పేజీ |
|---|---|
| శివుఁడు దేవతలందరికిఁ గట్నములిచ్చి పంపుట | 310 |
| ఫలశ్రుతి | ,, |
| శివుఁడు మణిభవనంబునందుఁ బార్వతితోఁ సౌఖ్యమొందుట | 312 |
| దేవతలు కుమారోత్పత్తికై విష్ణుమూర్తికిఁ దమకష్టంబులఁ జెప్పుకొనుట | 313 |
| విష్ణ్వాదులు కైలాసంబున మణిభవనద్వారమందుండి మొఱపెట్టుకొనుట | 315 |
| శివుఁడు దేవతలమొఱవిని యోగముచే వీర్యంబుఁ జార్చుట | ,, |
| పార్వతీదేవి దేవతలను శపించుట | 316 |
| అగ్నిదేవుని క్షోభఁబరసి శివుఁడుపాయము సెప్పుట | 317 |
| అగ్ని సప్తర్షుల భార్యల జూచి మోహించుట | 318 |
| స్వాహాదేవి యార్గురు మునిభార్యల రూపంబున నగ్నిదేవునితోఁ గ్రీడించుట | 319 |
| శ్రీ కుమారస్వామిజననము | 320 |
| షట్కృత్తికలు కుమారునియొద్దఁ జేరి స్తన్యంబులిచ్చుట | 321 |
| క్రౌంచగిరిభేదనము | 322 |
| కుమారస్వామి మహేంద్రునిజయించి ప్రాణదానంబు చేయుట | 323 |
| శివుఁడు దేవతలను కుమారుజాడ లడుగుట | 324 |
| అగ్ని ప్రముఖులు శివునకుఁ గుమారు జాడలు చెప్పుట | ,, |
| శివుఁడు కుమారుని దోడ్తేర నందికేశ్వరుని బదరీవనంబునకంపుట | 328 |
| నందికేశ్వరుఁడు కుమారుని గైలాసంబునకుఁ దెచ్చుట | 325 |
| కుమారుఁడు కైలాసముఁ జేరి, తల్లిదండ్రులను సేవించుట | 330 |
| విష్ణ్వాదులు కుమారున కుపాయనంబు లిచ్చుట | 331 |
| ఇంద్రుఁడు దేవసేనను గుమారున కిచ్చి పెండ్లి సేయుట | 332 |
| శివుఁడు తారకవధార్థమై కుమారుని దేవతలతోఁ బంపుట | 334 |
| దేవతలు కుమారస్వామికి బ్రహ్మాండాధిపత్యంబుఁ గట్టుట | ,, |


## ద్వితీయాశ్వాసము


| | |
|---|---|
| శ్రీకుమారస్వామి వీరబాహుని దారకునియొద్దకు సంధికై బంపుట | 363 |
| తారకుఁడు సంధిని నిరసించుట | 338 |
| కుమారస్వామితో దేవతలు తారకాసురునిమీఁదికి యుద్ధంబునకు వెడలుట | 339 |
| తారకుఁడసుర సైన్యముతో యుద్ధమునకు వచ్చుట | ,, |
| దేవాసురయుద్ధము | 341 |
| వీరభద్రుఁడు తారకాసురునితో యుద్ధము చేయుట | 342 |
| తారకవిష్ణుదేవుల యుద్ధము | 343 |
| తారకవిష్ణు లొకరిచేనొకరు మూర్ఛితులగుట | 344 |

| | పేజీ |
|---|---|
| బ్రహ్మదేవుఁడు తారకసంహారార్థమై కుమారస్వామిని బ్రార్థించుట | 345 |
| రెండవనాఁటి యుద్ధము | ,, |
| తారకుఁడు విష్ణ్వాదుల నుపాలంభించుట | 346 |
| విష్ణువు తారకునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట | 347 |
| వీరభద్రుని వారించి కుమారుఁడు యుద్ధంబునకుఁ బూనుట | ,, |
| తారకుఁడు కుమారుని యుద్ధంబును మానుమనుట | 348 |
| కుమారతారకుల యుద్ధము | ,, |
| కుమారతారకుల శక్తియుద్ధమును వైమానికులు చూచుట | 349 |
| తారకతాడితుండైన కుమారస్వామి మూర్ఛిల్లుట | 350 |
| కుమారస్వామి తారకాసురుని జంపుట | 351 |
| బాణాసురప్రలంబాసురసంహారము | 352 |
| కుమారస్వామి శివలింగస్థాపనము సేయుట | 353 |
| దేవతలు కుమారస్వామిని స్తుతించుట | 354 |
| కుమారస్వామి దేవతలతోఁ గైలాసంబున కేగుట | ,, |
| దేవతలు శివుని స్తుతించుట | 355 |
| దేవతలకు శివుఁడు వరంబులిచ్చుట | ,, |
| నారదుఁడు కుమారస్వామికి వల్లీసౌందర్యంబుఁ జెప్పుట | 356 |
| నారదుఁడు భిల్లపురంబున కేగుట | 358 |
| నారదుఁడు వల్లికిఁ గుమారస్వామి భర్తయగునని చెప్పుట | 359 |
| కుమారస్వామి భిల్లయువకరూపముతో వల్లిఁ జేరవచ్చుట | ,, |
| భిల్లుఁడు వల్లిని గృహంబునకుఁ గొనిపోవుట | 360 |
| కుమారస్వామి విరహము | 361 |
| సౌందర్యవల్లీవిరహము | ,, |
| చెలిమికత్తె వల్లిఁ గొనిపోయి కొమరుసామి కప్పగించుట | 362 |
| కుమారస్వామి వల్లీదేవితో గ్రీడించుట | 363 |
| భిల్లులు వల్లీకుమారులఁ జూచి కుమారునితో యుద్ధము సేయుట | ,, |
| కుమారస్వామి భిల్లుల నిద్రావశులఁ జేయుట | 364 |
| భిల్లులు జ్ఞానముఁ జెంది వల్లిఁ గుమారునికిచ్చి పెండ్లిచేసి యనుపుట | ,, |
| పార్వతీశ్వరులు దేవసేనయు వల్లిన్ జూచి యానందించుట | ,, |
| శౌనకాదిమునులు సూతునిగణపతి చరిత్రంబును జెప్పుమనుట | ,, |


## తృతీయాశ్వాసము


| | |
|---|---|
| పార్వతీదేవి గణపతిని సృష్టించి ద్వారమునందుంచుట | 366 |
| గణపతి ద్వారమందు శివునడ్డగించుట | 367 |
| శివుఁడు ప్రమథులను గణపతిపైకిఁ బంపుట | 368 |

పేజీ

శివుఁడు చండీశ్వరాదులను యుద్ధము నకుఁ బంపుట 369

ద్వారమందలి యలుకుడును విజయ పార్వతి దేవికిఁ జెప్పుట 370

పార్వతీదేవియుద్ధమున కంగీక రించుట ,,

ప్రమథ గణపతుల యుద్ధము 372

కుమారస్వామి గణపతిని దార సించి సంభాషించుట 373

గణపతి ప్రమథసైన్యంబులను వధించుట ,,

విష్ణ్వాదిదేవతలు శివసహాయార్థమై యుద్ధమునకు వచ్చుట, 374

గణపతికిఁ బార్వతీదేవి యాయు ధంబులను శక్తిద్వయినంపుట ,,

శివుఁడు విష్ణ్వాదులతో యుద్ధమునకు వచ్చుట 375

శివుఁడు గణపతితో ఢీకొనుట 376

శివుఁడు త్రిశూలము చే గణపతితల నఱుకుట ,,

నారదుఁడు పార్వతికి గణపతి మరణంబుఁ జెప్పుట 377

విష్ణ్వాదులు మునులను బార్వతీ దేవియొద్ద కనుపుట 378

మునులు పార్వతీదేవిని శాంతింపు మని నుతించుట 379

పార్వతీదేవి గణపతిని జీవింపఁజేసిన శాంతిఁగావింతుననుట ,,

శివుఁడు గణపతిని జీవింపఁజేయుట ,,

పార్వతీదేవి శకులమరల్పుట 380

శివుఁడు గణపతికి బ్రహ్మదేవునితో నుపనయనము సేయించుట ,,

పేజీ

శివుఁడు గణపతి కగ్రపూజ్యత నొసంగుట 381

శివుఁడు గణపతివ్రతంబుఁ జెప్పుట ,,

గణపతివ్రతోద్యాపనవిధానము 382

శివుఁడు గణాధ్యక్షపదమునకు భూ ప్రదక్షిణంబు పణంబుగా నేర్పఱచుట 384

పార్వతీపరమేశ్వరులు గజాననునకు గణేశపట్టంబుఁ గట్టుట 385

విశ్వరూపుఁడు తనకూఁతుల నిర్వు రను గణపతికిచ్చి పెండ్లిసేయుట 386

గణపతి కిద్దఱుభార్యలం దిద్దఱు పుత్రులు జన్మించుట ,,

ఫలశ్రుతి ,,

బ్రహ్మదేవుఁడు శుంభనిశుంభవధకై శివునియొద్దకు వచ్చుట 387

శివుఁడు పార్వతీదేవినిఁ గాళి యనిన నామెగినిసి నిష్ఠురోక్తులాడుట ,,

శివుఁడు పార్వతీదేవిని బ్రతిమాలుట 388

పార్వతీదేవి తపంబుసేయుటకై శివుని సెలవడుగుట 389

పార్వతీదేవి తపస్సుఁజేయుట 390

వ్యాఘ్రము పార్వతీదేవియొద్దకు వచ్చియుండుట ,,

బ్రహ్మదేవుఁడు పార్వతీదేవియొద్దకు వచ్చియొకశక్తినిబుట్టింపుమనుట 391

పార్వతీదేవి కాలతనువునఁ గౌశికిఁ బుట్టించి తాను గౌరి యగుట 391

పార్వతీదేవి తనను సేవించుచున్న వ్యాఘ్రమును గరుణింతు ననుట 393

| | పేజీ |
|---|---|
| బ్రహ్మదేవుఁడు పార్వతీదేవినిఁ బ్రశంసించుట | 394 |
| కౌశికి శుంభనిశుంభాసురులను జంపి వింధ్యగిరియందుండుట | 394 |
| పార్వతీదేవియొద్దకు వచ్చి శివుఁడు కోపోపశమనంబు చేయుట | 395 |
| పార్వతీదేవి మలుకఁ దొలఁగిశివునకు గౌశికీవృత్తాంతంబు జెప్పుట | 396 |
| పార్వతీదేవి శివుని వ్యాఘ్రమును ద్వారపాలకునిఁ జేయుమనుట | 396 |
| వ్యాఘ్రము ఖడ్గవేత్రధరుండగు పురుషుండగుట | 397 |
| జగద్రక్షణార్థమై పార్వతీపరమేశ్వరులు మహాశివభవనంబున నిత్యసుఖంబు లొందుచుండుట | 397 |


## యుద్ధ ఖండము

### ప్రథమాశ్వాసము

త్రిపురాసుర చరితము


| | |
|---|---|
| త్రిపురాసురులు బ్రహ్మదేవుని వరంబు వడుగుట | 400 |
| త్రిపురాసురుల బాధ తెలుపుటకై బ్రహ్మకైలాసాద్రికేగుట | 402 |
| శివుఁడుత్రిపురాసులు భక్తులైనందున వధింపననుట | 403 |
| విష్ణుమూర్తి అరిహన్ముని బుట్టించుట | ,, |
| అరిహుఁడు మాయాశాస్త్రంబుల రచించుట | 404 |
| అరిహన్ముని త్రిపురాసురులకు దీక్షనిచ్చి స్వధర్మములఁ జెప్పుట | 405 |
| ధర్మచ్యుతులైన త్రిపురాసురులఁ జంపుమని సురలు శివుని బ్రార్థించుట | 408 |
| శివుఁడు త్రిపురంబుల దహించి త్రిపురాసురులఁ జంపుట | 409 |
| శివుని దేవతలు స్తుతించుట | 410 |
| జలంధాసురచరిత్రము | ,, |
| ఫాలనేత్రాగ్నిచే నింద్రునిఁగాల్చవలదని గురుఁడు శివుని సన్నుతించుట | 411 |
| గురుని ప్రార్థనచే శివుఁడు ఫాలనేత్రాగ్నిని సముద్రమందు వేయుట | 412 |
| జలంధరుని జననము | ,, |
| జలంధరుని వివాహము | 413 |
| శుక్రుఁడు జలంధరునకు రాహువును గుఱించి చెప్పుట | 414 |
| జలంధరుఁ డింద్రునియొద్దకు ఘస్మరుండను దూతను బంపుట | 415 |
| ఇంద్రుఁడు జలంధరునకుఁ బ్రత్యుత్తరంబుఁ బంపుట | 415 |
| దేవాసురయుద్ధము | 416 |
| దేవతలు పరాజయంబు నొంది పాఱిపోవుట | 417 |
| విష్ణుమూర్తి జలంధరునితోఁ బోరుట | 418 |
| విష్ణుమూర్తి లక్ష్మితో జలంధరునింటనుండుట | ,, |
| జలంధరాసురుఁడు కైలాసగిరిపై దండెత్తుట | 420 |
| శివుఁడు సుదర్శనంబున జలంధరాసురున్ జంపుట | 421 |

పేజీ

విష్ణుమూర్తి జలంధరునితనవుఁ జెంది బృందతో సుఖించుట 422

విష్ణుమూర్తిని బృందా దేవి శపించుట 423

శంఖచూడచరిత్రము 422

శంఖచూడుని జననము 424

శంఖచూడునకు బ్రహ్మ వరంబు లిచ్చుట 424

శంఖచూడుఁడు బ్రహ్మశాసనంబున దులసిన్ జేరుట 425

శంఖచూడునితోఁ దులసి సంభాషించుట 426

తులసీ శంఖచూడులు గంధర్వ విధిఁ గలియుట 428

శంఖ చూడుఁడు రాజ్యము సేయుట ,,

శంఖచూడమహేంద్రుల యుద్ధము 429

శివుడు శంఖచూడునికడకు దూతను బంపుట 430

శివుడు శంఖచూడునిపై యుద్ధమునకు వెడలుట 432

శంఖచూడుఁడు శివుని దర్శించుట 434

ప్రమథ దేవాసుర సంకులసమరము 436

శివుడు శంఖచూడుని వధించుట 437

విష్ణుమూర్తి శంఖచూడరూపంబునఁ దులసితోఁ గ్రీడించుట 438

తులసి విష్ణుని శపించుట 438

తులసీ శంఖచూడులు విష్ణులోకంబుఁ జెందుట 439

బాణాసుర చరిత్రము ఉషాపరిణయము 439

శివుఁడు బాణాసురునకు వరం బిచ్చి శోణపురికి వచ్చి యుండుట 440

ఉష పార్వతిరూపంబు నొందుట 441

పేజీ

పార్వతీదేవి ఉషారూపంబుఁ జూచి మెచ్చి వరం బిచ్చుట 442

బాణాసురుఁడు మదముచే శివుని యుద్ధంబునకుఁ బిలుచుట 442

ఉష యనిరుద్ధునితో స్వప్నమున భోగ మొందుట 443

చిత్రరేఖ చిత్రపటంబులను వ్రాసి చూపుట 444

చిత్రరేఖ మంత్రశక్తిచే ద్వారకకుఁ బోయి యనిరుద్ధుని దెచ్చుట 445

అనిరుద్ధుఁడు ఉషతోఁ గ్రీడించుట 446

బాణాసురుఁడనిరుద్ధుని నాగపాశంబుల బంధించుట 448

శ్రీకృష్ణుఁడు బాణాసురుని మీఁదికి యుద్ధమునకు వచ్చుట 449

శైవజ్వరముచే వైష్ణవజ్వర మోడి శివునిచే నభయ మొందుట 450

శ్రీకృష్ణుఁడు శివునిచే నోటుపడి నుతించుట 451

శ్రీకృష్ణుఁడు బాణునిజయించుటకై శివుని సెల వడుగుట 452

శ్రీకృష్ణుఁడు బాణుని జంపఁదలపడ శివుఁడు వారించుట 454

బాణాసురుఁడు శివుని నుతించి నృత్యంబు చేయుట ,,

శివుఁడు బాణాసురునకు వరంబు లిచ్చుట ,,

విదలోత్పలదానవసంహారము 455


## లీలాఖండము – అ ౧


శివలీలావతారపరిగణన 457

నందికేశ్వరావతారలీల 491

| | పేజీ |
|---|---|
| నందికేశ్వరజననము | 462 |
| శివుఁడు నందికేశునకుఁ బ్రత్యక్షమగుట | 464 |
| నందికేశ్వర పట్టాభిషేక వివాహములు | 465 |
| శ్రీ భైరవలీల | 467 |
| శ్రీభైరవ ప్రాదుర్భావము | 469 |
| భైరవుఁడు బ్రహ్మదేవుని పంచమ శిరంబును ద్రుంచుట | 470 |
| భైరవుఁడు వైకుంఠమున కేఁగుట | 421 |
| విష్ణుమూర్తి పనుపున లక్ష్మీదేవి భైరవున కమృతభిక్ష నిచ్చుట | 473 |
| శ్రీ శరభావతారలీల | 473 |
| దేవతలు శివునిఁ జేరి నృసింహమూర్తికి శాంతిఁ గూర్పుమని ప్రార్థించుట | 465 |
| శివుఁడు వీరభద్రునకు నృసింహావతార శాంతిని గుఱించి చెప్పుట | 476 |
| వీరభద్రుఁడు నృసింహుని సామోక్తుల శాంతింపుమనుట | 477 |
| నృసింహమూర్తి వీరభద్రుని గినిసి సంభాషించుట | ,, |
| వీరభద్రుఁడు నృసింహునిపైఁ గోపించి భాషించుట | 478 |
| శరభావిర్భావము | 480 |
| నృసింహావతారశాంతి | 482 |
| ఫలశ్రుతి | 484 |
| యక్షేశ్వరలీల | ,, |
| దేవతలు గడ్డిపరకను గదల్పలేక పోవుట | 485 |
| దేవతలు యక్షుని శివునిగ నెఱింగి వినుతించుట | ,, |
| దుర్వాసోమున్యవతారలీల | 486 |
| దుర్వాసుఁడు శ్రీకృష్ణునకు వరము లిచ్చుట | 488 |
| హనుమదవతారలీల | 489 |
| పిప్పలాదమున్యవతారలీల | ,, |
| పిప్పలాదుఁడు ప్రాణముఁ బాసి తనువు దేవతల కిచ్చుట | 490 |
| సువర్చ దేవతల శపించుట | 491 |
| పిప్పలాదజననము | ,, |
| యతినాథలీల - ఆహుకభిల్ల చరిత్రము | 429 |
| భిల్లుఁడు సింగములతోఁ బోరి చచ్చుట | 493 |
| భిల్లసతికి శివుఁడు ప్రసన్నుండై వరంబు లిచ్చుట | 495 |
| సురేశ్వరలీల ఉపమన్యుచరిత్రము | 496 |
| ఉపమన్యుడుఁ తపసుకై తల్లిని సెలవడుగుట | 498 |
| ఉపమన్యునకుఁ దల్లి శివవైభవంబు జెప్పుట | ,, |
| ఉపమన్యునకుఁ దల్లి శివుని మాయా రూపంబులను జెప్పుట | 499 |
| ఉపమన్యుఁడు హిమాద్రిఁ జేరి శివుని గూర్చి తపంబొనరించుట | 501 |
| శివుఁడు దేవేంద్రుఁడై వచ్చి యుపమన్యునకు వరమిచ్చెద ననుట | 503 |
| ఉపమన్యుడు దేవేంద్రుని నిరసించుట | ,, |
| కృతకేంద్రున కుపమన్యుఁడు శివుని గుఱించి చెప్పుట | 504 |
| ఉపమన్యుని మెచ్చి శివుఁడు ప్రత్యక్ష మగుట | 505 |

| | పేజీ |
|---|---|
| ఉపమన్యుఁడు శివుని స్తుతించుట | 508 |
| శివుఁడు ఉపమన్యునకు వరంబు లిచ్చుట | 510 |
| కిరాతేశ్వరలీల | 5 1 |
| శ్రీకృష్ణుడు పాండవులయొద్దకు వచ్చుట | ,, |
| వ్యాసమహాముని పాండవులయొద్దకు వచ్చుట | 512 |
| అర్జునుఁడు తపస్సుకైయింద్రకీలాద్రికిఁ బోవుట | 514 |
| ఇంద్రుఁడు బ్రహ్మచారి రూపంబున వచ్చి యర్జునుని బరీక్షించుట | 5 5 |
| ఇంద్రుఁ డర్జునునకు నిజరూపంబు జూపుట | ,, |
| మూకాసురుఁడు సూకరాకారముతో నర్జునునకు గీడుసేయ వచ్చుట | 5 6 |
| కృతకకిరాతార్జును లిరువురు మాయాసూకరముపై బాణంబు లేసి చంపుట | 5 8 |
| మాయాకిరాతార్జునుల యుద్ధము | 520 |
| అర్జునుఁడు మాయాకిరాతుని శివునిగాఁ దెలిసికొని స్తుతించుట | 521 |
| శివుఁ డర్జునునకు పాసుపతాస్త్ర మిచ్చుట | 5 2 |


## లింగవైభవఖండము - ఆ ౧


| | |
|---|---|
| సూతుఁడు మునులకు జ్యోతిర్లింగంబు లెఱింగించుట | 525 |
| సూతుఁడు జ్యోతిర్లింగోప లింగంబులను దెల్పుట | 526 |
| ప్రాచీన దివ్యలింగములు | 527 |
| దక్షిణదేశ దివ్యలింగములు | 528 |
| పశ్చిమదేశ దివ్యలింగములు | 5 4 |


## లింగవైభవఖండము ఆ. ౨


| | |
|---|---|
| సౌరాష్ట్రము-సోమనాథలింగము | 5 7 |
| దక్షుఁడు చంద్రుని శపించుట | 5 8 |
| చంద్రుఁడు శివుని యనుగ్రహంబున క్షయరుజను బాయుట | 539 |
| శ్రీశైలము-మల్లికార్జునలింగము | 540 |
| ఉజ్జయిని మహాకాళలింగము | 540 |
| చంద్రసేనమహారాజచరిత్రము | 542 |
| గోపబాలకచరిత్రము | 543 |
| హనుమంతుడు ప్రత్యక్షమై గోపబాలుని బుజ్జగించుట | 544 |
| ఓంకారక్షేత్రము - పారమేశ్వర లింగము | 546 |
| హిమగిరి - కేదారలింగము | 547 |
| ఢాకిని - భీమశంకరలింగము | 548 |
| భీమాసురుఁడు శివభక్తుఁ డగు సుదక్షిణునిఁదత్సతినిఁ జెరయందుంచుట | 550 |
| పార్థివలింగమునుండి శివుఁడు వెలువడి భీమాసురునిఁ జంపుట | 551 |
| శ్రీకాశి - విశ్వేశ్వరలింగము | 552 |
| శివుఁడు కాశీపంచక్రోశమును సృష్టించుట | 552 |
| విష్ణుమూర్తి చక్రంబునఁబుష్కరిణిఁ ద్రవ్వుట | 553 |
| చక్రపుష్కరిణి మణికర్ణిక యగుట | 553 |
| గౌతమీతటము-త్ర్యంబకలింగము | 555 |
| గౌతమాశ్రమమునకు మునులు వచ్చుట | 556 |

| | పేజీ |
|---|---|
| నందికేశ్వరజననము | 462 |
| శివుఁడు నందికేశునకుఁ బ్రత్యక్షమగుట | 464 |
| నందికేశ్వర పట్టాభిషేక వివాహములు | 465 |
| శ్రీ భైరవలీల | 467 |
| శ్రీభైరవ ప్రాదుర్భావము | 469 |
| భైరవుఁడు బ్రహ్మదేవుని పంచమ శిరంబును ద్రుంచుట | 470 |
| భైరవుఁడు వైకుంఠమున కేగుట | 421 |
| విష్ణుమూర్తి పనుపున లక్ష్మీదేవి భైరవున కమృతభిక్ష నిచ్చుట | 473 |
| శ్రీ శరభావతారలీల | 473 |
| దేవతలు శివునిఁజేరి నృసింహమూర్తికి శాంతిఁ గూర్పుమని ప్రార్థించుట | 465 |
| శివుఁడు వీరభద్రునకు నృసింహావతార శాంతిని గుఱించి చెప్పుట | 476 |
| వీరభద్రుఁడు నృసింహుని సామోక్తుల శాంతింపుమనుట | 477 |
| నృసింహమూర్తి వీరభద్రుని గినిసి సంభాషించుట | ,, |
| వీరభద్రుఁడు నృసింహునిపైఁ గోపించి భాషించుట | 478 |
| శరభావిర్భావము | 480 |
| నృసింహావతారశాంతి | 482 |
| ఫలశ్రుతి | 484 |
| యక్షేశ్వరలీల | ,, |
| దేవతలు గడ్డిపరకను గదల్పలేక పోవుట | 485 |
| దేవతలు యక్షుని శివునిగ నెఱింగి వినుతించుట | ,, |
| దుర్వాసోమున్యవతారలీల | 486 |
| దుర్వాసుఁడు శ్రీకృష్ణునకు వరము లిచ్చుట | 488 |
| హనుమదవతారలీల | 489 |
| పిప్పలాదమున్యవతారలీల | ,, |
| పిప్పలాదుఁడు ప్రాణముఁ బాసి తనువు దేవతల కిచ్చుట | 490 |
| సువర్చ దేవతల శపించుట | 491 |
| పిప్పలాదజననము | ,, |
| యతినాథలీల – ఆహుకభిల్ల చరిత్రము | 429 |
| భిల్లుఁడు సింగములతోఁ బోరి చచ్చుట | 493 |
| భిల్లసతికి శివుఁడు ప్రసన్నుండై వరంబు లిచ్చుట | 495 |
| సురేశ్వరలీల ఉపమన్యుచరిత్రము | 496 |
| ఉపమన్యుఁడు తపసుకై తల్లిని సెలవడుగుట | 498 |
| ఉపమన్యునకుఁ దల్లి శివవైభవంబు జెప్పుట | ,, |
| ఉపమన్యునకుఁ దల్లి శివుని మాయారూపంబులను జెప్పుట | 499 |
| ఉపమన్యుఁడు హిమాద్రిఁజేరి శివుని గూర్చి తపంబొనరించుట | 501 |
| శివుఁడు దేవేంద్రుఁడై వచ్చి యుపమన్యునకు వరమిచ్చెద ననుట | 502 |
| ఉపమన్యుఁడు దేవేంద్రుని నిరసించుట | ,, |
| కృతకేంద్రున కుపమన్యుఁడు శివుని గుఱించి చెప్పుట | 504 |
| ఉపమన్యుని మెచ్చి శివుఁడు ప్రత్యక్షమగుట | 506 |

| | పేజీ |
|---|---|
| ఉపమన్యుఁడు శివుని స్తుతించుట | 508 |
| శివుఁడు ఉపమన్యునకు వరంబు లిచ్చుట | 510 |
| కిరాతేశ్వరలీల | 5.1 |
| శ్రీకృష్ణుడు పాండవులయొద్దకు వచ్చుట | ,, |
| వ్యాసమహాముని పాండవులయొద్దకు వచ్చుట | 512 |
| అర్జునుఁడు తపస్సుకై యింద్రకీలాద్రికిఁ బోవుట | 514 |
| ఇంద్రుఁడు బ్రహ్మచారి రూపంబున వచ్చి యర్జునుని బరీక్షించుట | 5.5 |
| ఇంద్రుఁ డర్జునునకు నిజరూపంబు జూపుట | ,, |
| మూకాసురుఁడు సూకరాకారముతో నర్జునునకు గీడుసేయ వచ్చుట | 5.6 |
| కృతకకిరాతార్జును లిరువురు మాయాసూకరముపై బాణంబు లేసి చంపుట | 5 8 |
| మాయాకిరాతార్జునుల యుద్ధము | 520 |
| అర్జునుఁడు మాయాకిరాతుని శివునిగాఁ దెలిసికొని స్తుతించుట | 521 |
| శివుఁ డర్జునునకు బాసుపతాస్త్ర మిచ్చుట | 5.2 |

లింగవైభవఖండము - ఆ ౧

| | |
|---|---|
| సూతుఁడు మునులకు జ్యోతిర్లింగంబు లెఱింగించుట | 525 |
| సూతుఁడు జ్యోతిర్లింగోప లింగంబులను దెల్పుట | 526 |

| | పేజీ |
|---|---|
| ప్రాచీన దివ్యలింగములు | 527 |
| దక్షిణదేశ దివ్యలింగములు | 528 |
| పశ్చిమదేశ దివ్యలింగములు | 534 |

లింగవైభవఖండము ఆ. ౨

| | |
|---|---|
| సౌరాష్ట్రము–సోమనాథలింగము | 5.7 |
| దక్షుఁడు చంద్రుని శపించుట | 5.8 |
| చంద్రుఁడు శివుని యనుగ్రహంబున క్షయరుజను బాయుట | 539 |
| శ్రీశైలము–మల్లికార్జునలింగము | 540 |
| ఉజ్జయిని మహాకాళలింగము | 540 |
| చంద్రసేనమహారాజచరిత్రము | 542 |
| గోపబాలకచరిత్రము | 543 |
| హనుమంతుడు ప్రత్యక్షమై గోపబాలుని బుజ్జగించుట | 544 |
| ఓంకారక్షేత్రము – పారమేశ్వర లింగము | 546 |
| హిమగిరి – కేదారలింగము | 547 |
| ఢాకిని – భీమశంకరలింగము | 548 |
| భీమాసురుఁడు శివభక్తుఁ డగు సుదక్షిణునిఁదత్సతినిఁ జెరయందుంచుట | 550 |
| పార్థివలింగమునుండి శివుఁడు వెలువడి భీమాసురునిఁ జంపుట | 551 |
| శ్రీకాశి – విశ్వేశ్వరలింగము | 552 |
| శివుఁడు కాశీపంచక్రోశమును సృష్టించుట | 552 |
| విష్ణుమూర్తి చక్రంబునఁబుష్కరిణిఁ దవ్వుట | 553 |
| చక్రపుష్కరిణి మణికర్ణిక యగుట | 553 |
| గౌతమీతటము–త్ర్యంబకలింగము | 555 |
| గౌతమాశ్రమమునకు మునులు వచ్చుట | 556 |

| | పేజీ |
|---|---|
| మునుల నిర్బంధము చేగణపతి మాయా ధేనువై గౌతమునిచేఁజచ్చుట | 558 |
| గౌతమఋషి మాశ్రమమును విడచి దన్వేగుట | 559 |
| గౌతముఁడు పార్థివలింగార్చనంబొన ర్చుట - శివుఁడు ప్రత్యక్షమగుట | 560 |
| శివుఁడు గౌతమునికై గంగను భువి కవతరింపఁ జేయుట | 561 |
| గౌతమశిష్యులు మునులశపించుట | 562 |
| శ్రీవైద్యనాథలింగము | 563 |
| దారుకవనము-నాగేశ్వరలింగము | 564 |
| పార్వతీదేవి దారుకను రక్షింపు మని శివుని వేడుట | 566 |
| శ్రీరామేశ్వరలింగము | 567 |
| శివుఁడు రామునకుఁ బ్రత్యక్షమై వరంబు లిచ్చుట | 467 |
| దేవగిరిశివాలయము — ఘుశ్మేశ్వర లింగము | 569 |
| ఘుశ్మకుఁ బుత్రుఁడు జన్మించుట | 571 |
| సుదేహ ఘుశ్మకొమరునిఁ జంపుట | 571 |
| ఘుశ్మకొమరుఁడు జీవితుండై వచ్చుట | 572 |
| లింగస్వరూపకథనము | 573 |
| దారుకావనమునిచరిత్రము | 574 |
| మునులపరీక్షకై శివుఁడు దారుకా వనంబునకు వచ్చుట | ,, |
| మునిభార్యలు శివునిజూచి మోహించి వెంటఁబడుట | 575 |
| మునులు శివునిఁ గోపించి కొట్టఁ బూనుట | 576 |
| శివలింగము మునులను బాధించుట | 577 |
| సముచితార్చనచే శివలింగంబు శాంతిఁ జెందుట | 578 |
| లింగోద్భవచరితము | 579 |
| బ్రహ్మవిష్ణులకలహము | 580 |
| తేజోలింగోద్భవము | 582 |
| కేతకీ సహాయము | 583 |
| లింగశిరంబుఁ జూచితినని బ్రహ్మ బొంకుట | 584 |
| యజ్ఞాంతంబున నకుబ్రహ్మ కపూజ్యత విధించుట | ,, |
| శివుఁడు కేతకిని శపించుట | 585 |
| శివభక్తాయుకథనిక | 586 |
| అంధకేశ్వరలింగచరిత్రము | 588 |
| సుదర్శనునిచరిత్రము | 589 |
| శివుఁడు సుదర్శనుని శపించుట | ,, |
| పార్వతీదేవి సుదర్శనుని వటువు నొనర్చుట | 590 |
| అత్రీశలింగము | 591 |
| అత్రిముని తపస్సమాధి నొందుట | 592 |
| గంగాశంకరు లనసూయాభీష్టంబుఁ దీర్పఁదలఁచుట | ,, |
| గంగాదేవి స్త్రీరూపముతో ననసూయకు దర్శనమిచ్చుట | 593 |
| అత్రిముని యుదకముల గోరుట | ,, |
| అనసూయ గంగ నెల్లప్పుడట వసింపుమనుట | 594 |
| నందికేశలింగము | 595 |
| ధేనువు సాహసకృత్యము | 596 |
| ఋషికాచరిత్రము | 599 |
| శివుఁడుకన్యకుని జంపిఋషీకకు వరంబులిచ్చుట | 600 |
| హరీశ్వరలింగము | 601 |

| | పేజీ |
|---|---|
| విష్ణుమూర్తి శివలింగమునకు నేత్రకమలంబు సర్పించుట | 602 |
| శివుఁడు విష్ణుమూర్తికి సుదర్శనము నిచ్చుట | ,, |
| మహాబలేశ్వరలింగము (గోకర్ణము) | 603 |
| సోమనీచరిత్రము | 604 |
| సోమిని శూద్రునకు భార్యయగుట | 605 |
| సోమిని అంధచండాలియైపుట్టుట | 606 |
| అంధచండాలి గోకర్ణక్షేత్రమునకుబోవుట | 607 |
| అంధచండాలి శివలోకమునకేగుట | 608 |
| మిత్రసహోపాఖ్యానము | ,, |
| వసిష్ఠముని మిత్రసహుని శపించుట | 609 |
| మిత్రసహుఁడుకల్మాషపాదుండగుట | ,, |
| బ్రహ్మరాక్షసుఁడైన కల్మాషపాదుఁడు మునిపుత్రునిజంపుట | 610 |
| మదయంతి భర్తకు మునిసతీశాపంబు దెల్పుట | ,, |
| శివవ్రతములు | 6 1 |
| శ్రీశివరాత్రివ్రతవిధానము | 612 |
| వ్యాధేశ్వరలింగము | 617 |
| వ్యాధునకు శివలింగార్చన పొసగుట | 618 |
| మృగీమృగములు వ్యాధునితో శపథములుచేసిపోవుట | ,, |
| మృగీద్వయితో మృగమునుదచ్చి శువులును వ్యాధుని జేరుట | 622 |
| వ్యాధునకు శివుఁడు ప్రత్యక్షమై వరములిచ్చుట | ,, |
| భక్తిప్రాబల్య ప్రతిపాదనము | 624 |


## ఉమాఖండము—అ ౧


| | పేజీ |
|---|---|
| జాంబవతి పుత్రార్థమై శ్రీకృష్ణుని శివునిగూర్చితపింపుమనుట | 626 |
| శ్రీకృష్ణుఁడు తపస్సుకై హిమగిరికి వచ్చుట | 627 |
| హిమాద్రిలో శివునిగుఱించి తపించి సిద్ధులొందినవారలు | 628 |
| ఉపమన్యుఁడు శ్రీకృష్ణునకు శైవదీక్ష నిచ్చుట | 630 |
| కృష్ణునితపంబుమెచ్చి పార్వతీశ్వరులు సాక్షాత్కరించుట | ,, |
| శ్రీకృష్ణుఁడు శివుని స్తుతించుట | 632 |
| శ్రీకృష్ణునకు శివుఁడు వరంబులిచ్చుట | 633 |
| శ్రీకృష్ణునకుఁ బార్వతీదేవి వరంబులిచ్చుట | ,, |
| శివమాయామోహితులు | 634 |
| పాపభేదములు | 635 |
| పంచమహాపాపులు | 636 |
| బ్రహ్మఘ్నసమానులు | 638 |
| నరకములు | 639 |
| పాపహరదానధర్మములు | ,, |
| భూమిసప్తద్వీపములు | 641 |
| భగోళము | 646 |
| పాతాళములు | 647 |
| పంచచూడ స్త్రీస్వభావము నారదునకుజెప్పుట | 648 |
| కాలజ్ఞానము | 650 |
| ఛాయాపురుషదర్శనఫలభేదములు | 651 |
| మృత్యుంజయయోగములు | 652 |

| | పేజీ |
|---|---|
| ప్రతిసర్గము మన్వంతరంబులు వంశములు తదనుచరితములు | 657 |
| సావర్ణి మనుజనము | 662 |
| అశ్వనీ దేవతలజననము | 664 |
| వైవస్వతమనువంశము | 665 |
| పురూరవశ్చక్రవర్తి జననము | 666 |
| సగరచక్రవర్తి చరిత్రము | 670 |
| సగరసుతులు కపిలకోపాగ్నిచే బూదియగుట | 672 |
| భగీరథుఁడు పుడమికి గంగను దెచ్చుట | 673 |
| గంగావతరణము | 674 |
| శ్రీరామచరిత్రము | 675 |
| చంద్రవంశము | ,, |
| వ్యాసజన్మము | 677 |
| సురథుఁడు సుమేధఋష్యాశ్రమంబు జేరుట | 682 |
| సుమేధుఁడు సురథునకు మహామాయావైభవంబుఁ జెప్పుట | ,, |
| మధుకైటభసంహారము | 683 |
| మహిషాసురచరితము | 684 |
| దుర్గావతారము | 685 |
| దుర్గాదేవికి దివ్యులాయుధాదుల నిచ్చుట | 686 |
| మహిషాసురుఁడు దుర్గాదేవికడకు యుద్ధమునకు వచ్చుట | ,, |
| మహిషాసురసంహారము | 688 |
| దుర్గాసురభంజనము | 689 |
| శతాక్షీప్రాదుర్భావము | 690 |
| శతాక్షీదుర్గాసురుల యుద్ధము | 691 |
| దుర్గాసురసంహారము | ,, |
| దేవిస్తుతి | ,, |

| | పేజీ |
|---|---|
| శతాక్షిదివ్యుల ననుగ్రహించుట | 692 |
| దేవీపూజనము | 693 |
| నవరాత్రిపూజ | ,, |

## కైలాసఖండము — అ ౧

| | |
|---|---|
| వామదేవముని కుమారాద్రిఁ జేరి కుమారుని సేవించుట | 695 |
| వామదేవుఁడు కుమారస్వామిని ప్రణవార్థముఁ జెప్పుమనుట | 697 |
| వామదేవునకుఁ గుమారస్వామి ప్రణవార్థముఁ జెప్పుట | ,, |
| మంత్రిమయమూర్తి | 697 |
| ప్రణవస్వరూపము | 700 |
| కుమారుఁడు వామదేవునకు జగత్కారకుని గుఱించి చెప్పుట | 706 |
| వామదేవునకుఁ గుమారుఁడు శక్తివిశిష్టశివాద్వైతముఁ జెప్పుట | 708 |
| కుమారుఁడు వామదేవుని శివతత్త్వప్రచారకుఁడ వౌదువనుట | 710 |

## వాయవీయఖండము - అ ౧

| | |
|---|---|
| మునులు బ్రహ్మజిజ్ఞాసులై చతుర్ముఖునియొద్దకుఁ బోవుట | 713 |
| మునులు బ్రహ్మను నుతించుట | 714 |
| బ్రహ్మదేవుఁడు మునులకు బరతత్వంబుఁ జెప్పుట | ,, |
| నేమిపతనంబున వనంబు నైమిశారణ్యసంజ్ఞఁ దాల్చుట | 718 |
| బ్రహ్మజ్ఞచే మునులయొద్దకు వాయుదేవుఁడు వచ్చుట | ,, |

| | పేజీ |
|---|---|
| మునివాయుదేవసంభాషణ | 719 |
| వాయుదేవుఁడు మునులకుఁ బశుపాశ పతిస్వరూపంబు జెప్పుట | 720 |
| వాయుదేవుఁడు మునులకు మాయా స్వరూపంబు జెప్పుట | 721 |
| వాయుదేవుఁడు మునులకుఁ గలాది పంచకంబు నెఱింగించుట | 922 |
| వాయుదేవుఁడు మునులకు గుణత్రయ స్వరూపంబు జెప్పుట | 723 |
| వాయుదేవుఁడు మునుల కాత్మ స్వరూపంబుఁ జెప్పుట | 724 |
| వాయుదేవుఁడు మునుల కీశ్వర విషయంబుఁ జెప్పుట | 725 |
| మునులు వాయుదేవుని గాలస్వరూపంబు జెప్పు మని యడుగుట | 727 |
| కాలపరిమాణములు | 728 |
| వాయుదేవుఁడు మునులకు సృష్టి ప్రకారంబుఁ జెప్పుట | 730 |
| వాయుదేవుఁడు మునులకు లయంబు తీ రెఱింగించుట | 731 |
| మార్కండేయచరిత్రము | 731 |
| మృకండుముని బ్రహ్మసభాద్వారంబున నవమానపడుట | 733 |
| మరుద్వతి మునుల భార్యలచే నవమానపడుట | 734 |
| మృకండుముని తప స్సొనరించుట | 725 |
| పార్వతీపరమేశులు మునిదంపతులకు సాక్షాత్కరించుట | 735 |
| శివుఁడు మృకండునకు వరమిచ్చుట | 736 |
| మృకండువుతో ్రిదయము | 737 |
| మార్కండేయుని బాల్యవర్తనము | 738 |
| తలిదండ్రులకు మార్కండేయుఁడు ధైర్యముఁ జెప్పుట | 739 |
| మార్కండేయుఁడు తలిదండ్రుల సెల వొంది తపంబున కేగుట | 740 |
| యముఁడు మార్కండేయుని యొద్దకు దూతలఁ బంపుట | 741 |
| యముఁడు మార్కండేయుని ధర్షించుట | 742 |
| మార్కండేయుఁడు యముని నిరసించి పలుకుట | 743 |
| మార్కండేయకృతశివస్తోత్రము | 743 |
| నారదుఁడు మార్కండేయుని రక్షింపుమని పార్వతీపరమేశ్వరుల నర్థించుట | 745 |
| శివుఁడు త్రిశూలధారచే యముని గూల్చి మార్కండేయున కభయ మిచ్చుట | 746 |
| శివుఁడు మార్కండేయప్రార్థనచే యముని జీవింపఁజేయుట | 746 |
| పార్వతీపరమేశ్వరులు మార్కండేయునకు బ్రహ్మాయువు నిచ్చుట | 747 |
| ఉపమన్యుముని శ్రీకృష్ణునకుఁ దెల్పిన ఆత్మజ్ఞానము | 748 |
| శివుఁడు దేవతలకు సూర్యాత్మక నిజతనువుఁ జూపుట | 749 |
| తిరోహితశాస్త్రప్రతిష్ఠ | ,, |
| ఉపమన్యుఁడు కృష్ణునకు జగత్కారకునిగూర్చి చెప్పుట | 750 |
| ఉపమన్యుఁడు కృష్ణునకు ముఖ్యాంశంబులఁ జెప్పుట | 751 |
| ఉపమన్యుఁడు శ్రీకృష్ణునకు శివపూజాక్రమంబును జెప్పుట | 752 |

| | పేజీ |
|---|---|
| నారదుఁడు తుంబురునితో సామ్యంబు బడయుట | 754 |
| బ్రహ్మ సనత్కుమారుఁ డొంటెయై శాపమోక్ష మొందిన తెఱఁగుఁ జెప్పుట | 755 |
| నైమిశమునులు స్కందసరోవరముఁ జేరుట | 756 |
| నందికేశుఁడు సనత్కుమారునితో మునులకుఁ జెప్పిన ముఖ్యసారము లింగధారణము | 757 |

విద్యేశ్వరఖండము

| | |
|---|---|
| హస్తపీఠంబులందు లింగమును బూజించినఫలములు | 759 |
| లింగభేదములు | 760 |
| పార్థివలింగపూజోత్కృష్టత | 761 |
| శివనిర్మాల్యము శైవదీక్షితులకు గ్రాహ్యము | 765 |
| బిల్వమాహాత్మ్యము | 767 |
| భస్మవిషయము | ,, |
| రుద్రాక్షధారణము - తన్మాహాత్మ్యము | 770 |
| మంత్రపూర్వకరుద్రాక్షధారణము తత్ఫలము | 772 |
| శివనామపుణ్యము | 774 |
| పురాణఫలశ్రుతి | 775 |


శ్రీ శ్రీ శ్రీ





కవి గురులు:

బ్ర॥శ్రీ॥ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిలవారు

శతావధానులు.

# విద్వదభిప్రాయములు.

శ్రీ కింకవీంద్రఘటాపంచాననేత్యాద్యనేక బిరుదాంచితులును గవిచక్రవర్తులును గలాప్రపూర్ణులునగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిలవారు. శతావధానులు-

శ్రీమత్పర దేవతాయైనమః

శివపురాణము.

దీనిని శ్రీ ముదిగొండ నాగవీరేశ్వరశాస్త్రిగారు తెలిఁగించిరి. వీరి తెలుఁగు మక్కికిమక్కిగాఁగాక స్వతంత్రరచనకున్న ధారాశుద్ధిగలిగి నిర్దుష్టమై ప్రసాదగుణము గలిగి రసవంతముగ నలరుచున్నది. ఈకవికి సంస్కృతాంధ్రములయం దసాధారణమైన సాహిత్యమున్నదని యిందలిరచనయే తెలుపుచున్నది. మూలములోనున్న విషయములుకొన్ని నేఁటికాలమునకు రుచింపవనితోఁచి, సంగ్రహించి యనువదించుట గమనింపఁదగినయంశము. ఈయన జన్మముచేతనే మిక్కిలి శివభక్తుడు; శాక్రప్రవర్తనచేతఁగూడ నసిధారావ్రతమగు శివభక్తిగల నిమథయోగ్యుడు. నాకీయన శిష్యకోటిలోనివాఁడగుటచే నింతకన్న నధికముగావ్రాయక యుపాస్యుండగు సదాశివుఁడీయనకు నిరామయాయురారోగ్యాదులొసంగి కాపాడుఁగాకయని యాశీర్వదించుచు నింతటితో ముగించుచున్నాఁడను—

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి - శతావధాని
క్షీరసాగరము బిల్డింగ్సు.
గవర్నరుపేట — బెజవాడ.

బ్రహ్మశ్రీ కాశీకృష్ణాచార్యులుగారు. అవధాని శిరోమణులు. గుంటూరు.

శ్రీలక్ష్మీహయగ్రీవో విజయతే.

శ్రీరస్తు చి॥ ముదిగొండ నాగవీరయ్య మహాకవి నాశీర్వదించి వ్రాయునభిప్రాయము. ఆశీరుభయకుశలోపరి.

సహజకవితాలంకృతా! మీశివపురాణము నాకందిన మొదటిదినమువనే గ్రంథమును జదివితిని. అప్రయత్నముగ 393 వపుటలో నట్టడుగుననున్న కందము "బిడ్డపెరుగూరుగాయలు" అను పద్యము నాకంటఁబడి "యింత పెద్దపుస్తకమును బుల్యేతర పరిశీలనాపద్ధతిలోఁద్వరగాఁ జూడఁగల శక్తి లేనివృద్ధుఁడనై తిఁగదా!"

అనినామనంబునకు విచారమును గల్గించెను. మీ గ్రంథమునందలి పీఠికోపోద్ఘాతము
లను మున్నుడిని సాంగోపాంగముఁ జదివి గ్రంథమునందుఁ గూడఁ గొంతవఱకు నాయా
భాగములఁ జదివి పరమానందమును బొందితిని. సహజకవితా ప్రియుఁడనగుటచే నట్టి
కైతదొరికినప్పుడు దాని నామూలాగ్రమనుభవింపకపోతినని విచారమేగాని అభి
ప్రాయమొసంగుటకు నాయీ అనుభవము చాలు. మీ పుట్టుకైతను మీ జిడ్డుపెరుగు
పద్యము చూచినతోడ నేపడ్డించుచున్నది. కావున మీది పెట్టుకైత కాదు. అవకాశము
న్నచో చూచుకొలఁది మీ గ్రంథములో నాల్గవపాలంతసదభిప్రాయము వ్రాయవచ్చును.
సుప్రసిద్ధులగు బ్ర॥ శ్రీ॥ విశ్వనాథసత్యనారాయణశాస్త్రి తూములూరి శివరామ
కృష్ణశాస్త్రి మహోదయులు వ్రాసిన పీఠికోపోద్ఘాతములనే నేనుగూడ నాదిలో నీగ్రం
థమును జూచియున్నయెడల వ్రాసియుందును. కావున వారు వ్రాసినవిషయము
లన్నియు మీ శివపురాణమునందుగలవని నాకుదోచినది. అందుచే నారెంటిని నేను
యథార్థములని హృదయపూర్వకముగ విశ్వసించుచున్నాఁడను. ఐనను నాసొంత
ముగగూడ రెండుపద్యముల నీదిగువ వ్రాయుదును.

ఉ॥ బమ్మెరపోతరాడ్రచిత । భాగవతమ్ము భవత్పురాణర
త్నమ్మునకీడుజోడని మ । నమ్మున నమ్ముచు విష్ణుశంభుశ
బ్దమ్ములఁ దీయ నీదుకృతి । భాగవతమ్మయి యద్దినీపురా
ణమ్మయి గాలుచుండెను న । నారత మీధరనంచు నెంచెదన్.

ఉ॥ తియ్యదనంబునందుఁ గవి । తిక్కనఁ జిక్కదనంబునందు న
న్నయ్యకవీంద్రుఁ గమ్మదన । మందల యెఱ్ఱనగారి కేరిదో
యయ్యా! శ్రీమూర్తులీవొకఁడ । వైతివహో! ముదిగొండనాగవీ
రయ్యా! మహాకవీ! శివపు । రాణమహాకృతిసిద్ధవాగ్ఘరిన్.

నేనువయోవృద్ధుఁడనగుటచే నీయభిప్రాయము నాశీఃపూర్వకముగ వ్రాసితిని.

ఇతిశం—

కాశీకృష్ణాచార్యః

27-3-47 గుంటూరు.

శ్రీశైవమహాపీఠాధ్యక్షులు, శతాధికగ్రంథకర్తలు, శివయోగి, మహోపా
ధ్యాయ బ్ర॥ శ్రీ॥ ముదిగొండ నాగలింగశాస్త్రులవారు—

సీ॥ అనఘ! నీకృతిరత్నంబు । నాంధ్రశివమహాపురాణంబుఁ గనుఁగొంటి । నాదరమున
జూడ్కు నేర్పున నెలకొన్న । కోమలతను, హాయిదికిఁ గూర్చెవిద్ది యానందగరిమ

గీ॥ గ్రంథబహుళ నమేయార్థ, గౌరవమున, గొప్పదై దుస్తరంబగు ♦ నిప్పురాణ
జలధిలంఘింప నలఁతులఁ ♦ గలవియెయిది, భవవనధితోఁ డదాఁటితి ♦ భవునికృపను. ౨

ఉ॥ శైవుడ నాత్మవంశవర ♦ జాతుఁడవున్ విబుధాంధ్రభారతీ
కోవిదమాళివిఁగవివి ♦ గోపతివాహపురాణరూపసం
భావితకీర్తిమైదగు భ ♦ వత్కృతి యీగతి నస్మదీయమో
దావహ మాట వింతయెటు ♦ లన్యులనే తనియించుచుండగన్. ౩

క॥ అగజాపతిమహిమోన్నతి, నగణితఘనసుగుణమణిగ ♦ ణాభరణంబై
నెగడుచునుండిన నీకృతిఁ, దగుగతిఁబొగడంగ నవ్వి ♦ ధాతకు వశమే? ౪

సీ॥ మనుజభావము విప్ర ♦ జనువున రాజిల్లె, నద్ది శైవాన్వవా ♦ యజత నెగడ
శైవవంశ్యతయును ♦ సాహితిచే నొప్పె, సాహితి కవితచే ♦ సఫలమయ్యె
కవితయు సన్నుతిఁ ♦ గాంచె సర్వోత్తర, మహానాంధ్రశివపురా ♦ ణాఖ్యకృతిని
నౌర! సద్గుణరాజి ♦ యన్యోన్యభూషణ, భూష్యతనొక్కెడ ♦ బొసఁగఁగలవె?

గీ॥ నీలగళుకృప నీయుంద ♦ నిలిచెగాక, నిట్టిశుభగుణపంక్తికి ♦ హేతువైన
పూర్వపుణ్యంబునీయది ♦ పొగడదరమె. యీధ్యగుణపూర్తి! నాగవీ ♦ రేశశాస్త్రి! ౫

క॥ భవవిలయకారి హరవై, భవనిలయంబై సమస్త ♦ భవికాలయమౌ
భవజిలుచుండిననీకృతి, భువివెలయున్ గాతమెల్ల ♦ పుడు గాశివరేశా. ౬

గీ॥ ససులదారుఁడవగునీకు ♦ శంకరుండు. సంపద చిరాయువు సుఖం బొ ♦ సంగుగాత!
ధరణినీకృతి యాచంద్ర ♦ తారకముగ, నిర్మలభవద్యశంబులో ♦ నిలుచుగాక! ౭

గీ॥ జనచయంబుభవత్కృతి ♦ జదువుచుండి. సమధికంబైతనర్చెడు ♦ శంభునికృప
నాయురారోగ్యయుక్తమై ♦ యనవరతమునున్నతానందమునుబొందు ♦ చుండుఁగాత!

గీ॥ అనుచుముదిగొండనాగలిం ♦ గాహ్వయుండు, రసికజనతాతిహృద్యమై ♦ యెసఁగు
నాంధ్రశివపురాణంబుగూర్చి వి ♦ శేషమైన, తనదునామోదముందెల్పె ♦ దద్జ్ఞులలర ౮

ముదిగొండ నాగలింగశాస్త్రి

4—8—1947 తెనాలి.

ఉపాధ్యాయపండిత పరిషదధ్యక్షులు — బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిలవారు — ధవళేశ్వరము—

బ్రహ్మశ్రీముదిగొండ నాగవీరేశ్వరకవిగారు సాదరముగా నాకంపిన నిజవిరచిత శివపురాణమను మహాకృతిలోని పెక్కుభాగములు చదివి యెంతయుసంతోషించితిని. వ్యాసమహర్షి పేరబరగిన యీపురాణమును వీరనువదించిరన్నమాటయే.

కాని యిది స్వతంత్రరచనగా సుబోధ్యము సుపాఠ్యమునై యీకవివైదుష్యకవిత్వ వైదగ్ధ్యమును వెల్లడించుచున్నది. వీరియిట్టిరచనకు ముఖ్యముగా హరవిలాసాదు లాంధ్రీకరించిన కవిసార్వభౌముఁడు శ్రీనాథుని యథేచ్ఛానువాదము మార్గదర్శక మనుట తథ్యము. ఇది పురాణమేయైనను యిందలి ఖండములు ప్రబంధశైలిని నడచినవని పాఠకులు భావింపక పోరు. సంస్కృతవాఙ్మయమున శైవగ్రంథసంతతి యింతేనికలదు. అందలి ప్రధానాంశములన్నియు నిందు కనవచ్చుట జేసి శివభక్తులకు భక్తిసర్వస్వమును, ఆంధ్రకవితాభిలాషుల కుత్తమప్రబంధమునై యాచంద్రార్క మీపురాణ మాంధ్రావని విలసిల్లునని యాసించుచున్నాను. ఈకవి యిట్టి మహా కావ్యము నిర్మించి తాము తరించి భక్తులను తరింపజేసిన వారైరి యనుట నిజము. ఆంధ్రవాణి కిది మఱియొకమణిహారము—

18-3-47 మల్లాదిసూర్యనారాయణశాస్త్రి.

శ్రీతిరుపతి వెంకటేశ్వర ప్రాచ్యవిద్యాపీఠ ప్రధానోపాధ్యాయులు, సంస్కృతాంధ్రవాఙ్మయపరిశోధకాగ్రణులునగు బ్ర॥ శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు.

ఆర్య! మీచే రచితప్రకటితమైన శివపురాణమునందందు హాయిహాయిగాఁజదివి యానందించినాను. మీరు మీప్రజ్ఞను జిరకాలముడాచియుంచుకొని పరితృప్తిపరచు కొని యీగ్రంథమునురచియించితిరి. శ్రీగురుపాదులు వెంకటశాస్త్రిగారును,మిత్రులు గుణగ్రహణపరాయణులు సత్యనారాయణకవిగారును మెచ్చుకొన్న మీగ్రంథమును నాబోటివాఁడు మెచ్చుట సిద్ధసాధనము. తథాపీదమస్తు. మీగ్రంథము మహాగ్రంథము. మీరుమహాకవులు. గ్రంథయోగ్యతకుదగినరచనాయోగ్యతగలవారు మీరు. మీరచనారీతి మంచిపురాణఫక్కినిసాగినది. కుమారసంభవాది సంస్కృతాంధ్ర ప్రాచీనకృతులలోని శివకథలు మీపురాణములోనున్నవి. ప్రాచీనకవులీ శివపురాణమును జాలసంగ్రహించి తమకృతులందు వినియోగించుకొనిరి. మీగ్రంథ మేతత్పురాణ ప్రయోజనమును సర్వవిధముల నాంధ్రులకు సమకూర్ప గలిగియున్నది. నిర్దుష్టము, గుణబహుళమునగు మీరచన శ్రీవెంకటశాస్త్రిగారిరచనపుబోలికలు గలదై నాకు వేడ్కఁగొల్పినది. తీరికలేమిచేఁబర్యాప్తముగా జదువుటకును బరితృప్తి తీరసవిమర్శముగాఁబ్రశంసించుటకును జాలకున్నాను. క్షమింపుడు.

మిత్రుఁడు
వేటూరి ప్రభాకరశాస్త్రి

1-3-47 తిరుపతి

శతావధానులు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిలవారు-

అయ్యా! తాము వయస్సుచేఁగనిష్ఠులయ్యు గుణములచే జ్యేష్ఠులు. తామీ శివపురాణము రచించి గురి ఋణము తీర్చితిరి ఆ కీర్తి గురుపుత్రులను భ్రాతృమంతులుగను జేసినందులకు మిమ్మభినందించుచున్నాను. ఇదియటుండె. శ్రుతులవిదపఁ బురాణములు జ్ఞానభాండారములు- తాము వానిలో నొకటి చక్కఁగా తెరచితిరి. చిత్తగింపవలయును.

వేలూరి శివరామశాస్త్రి

18-8-47 సూరవరము - ఆత్కూరుటపా

కృష్ణాజిల్లా.

శ్రీభోగేశ్వరసత్యవత్యుపాఖ్యానాది మహాకావ్య నిర్మాతలు బ్రహ్మశ్రీ తుల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిలవారు-

శివాయగురవే నమః

ఆశీస్సు

ఆర్యా॥ ముదిగొండనాగవీరే । శ్వరకవికృతశివపురాణకావ్యమిదం
జీయాదారవిచంద్రం । శివజన పరితోషలాలనానాంద్రం. ౧

మ॥ కవితాచార్యుఁడు వెంకటేశ్వరు పరిష్కారమ్మునుంగాంచి; పైఁ
గవిసమ్రాట్టు సువర్ణ పీఠమును సింగారించు, మీ మాతృభ
క్తి విశేషమ్మరుదారఁగిట్లు పొడసై దీపించు నీకావ్య మాం
ధ్రనధూటీశుభకర్ణ పాళిసుమసౌందర్యమ్ములం దిద్దుతన్. ౨

శా॥ శైవుండై జనియించినందుకు నీ జన్మమ్ము సార్థమ్ముగా
దేవుండిచ్చు కవిత్వశక్తి, జననీ దివ్యాంఘ్రి సంసేవనన్
దావుల్గూర్చె వెలార్చితీ శివపురాణమ్మాం గవుల్మెచ్చ, మే
ధావి గామణి! నాగవీరయకవీ! ధన్యుండ వీవెంతయున్. 3

మ॥ పిసియుంటేన్ విసిపింప సచ్చటచటన్ విన్నాడ నేడెంతయున్
గనుగొంటిన్ భవదీయ సత్కృతిని శ్లాఘ్యమ్మయ్యె నీపూన్కి, స
జ్జనతామాన్యము భక్తిబంధురము నీ సౌజన్యభావప్రకా
శనమీ కావ్యము, సత్కవీంద్రసుమనస్సంతోషపోషమ్మగున్. ౪

ఉ॥ లేఁక చాలకున్న, నిజదేహమునన్ సరిలేకయున్న. నీ
వారిమిత్రోడ నింతటి మహోన్నతి కావ్యము చేయ జేసె, గౌ
రీరమణుండు దాఁ దన చరిత్ర ప్రసిద్ధివహించు పొంటె, నా
కారుణికోత్తముం డొసఁగుఁగావుత నీకుఁ జిరాయువున్నతుల్. ౫

మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి.

23—2—47 చిట్టిగూడూరు.

ఈ శ్రీమల్లికార్జున శాస్త్రిలవారి తృతీయపుత్రులును, శ్రీకాంచీమాహాత్మ్యాది గ్రంథరచయితలును, ఉభయభాషాప్రవీణులునునగు బ్ర॥ శ్రీ॥ మల్లంపల్లి వీరేశ్వర శాస్త్రిగారు.

## అభినందనము.

శా॥ మా మాతామహవంశ్యుఁడే యనినసమ్మానమ్ము, నారాధ్యభూ
సామాన్యమ్మభిమాన, మద్యతనతాసంకోచభావమ్మునున్
బ్రేమమ్మున్ విడనాడి మీకృతి నెడన్ వీక్షింపఁగా, నాంధ్రభా
షామంజీరరవానుకారియగుచున్ సంతోషము ల్వార్చెడిన్. ౧

మ॥ కలఁడా శైవులయందు నేఁడును మహాకావ్యక్రియాదక్షుఁ, డో
మలభవ్యప్రతిభాభిరాముఁ డని వేగాబున్ విచారింప నీ
విలసద్భావగభీర, మారసగుణాన్వితమ్ము, నానాజనుః
ఫల మీకబ్బము దెల్పె నీప్రమథభావమ్మున్ గవిగ్రామణీ! ౨

ఉ॥ కవులఋణమ్ము దీర్చికొనఁగల్గిన, యిన్నొక పాటివానిఁగాఁ
గవియనరాదుగాక, శివకావ్యకథాకథనాధురీణునిన్
గవియనఁజెల్లదే? బిరుదు కైకొన నొల్లని నీవినీతికిం
దవునిది నాగవీరయబుధప్రవరా! సుకవీ! మహాకవీ! ౩

23-2-47 మల్లంపల్లి వీరేశ్వరశాస్త్రి

Pandit N. S. College
Parnasala P. O.
Kistna (Dt)
(Via) Masulipatam.

సర్వతంత్ర కళాశాలాప్రధానాచార్యుఁడు బ్రహ్మశ్రీ తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రిగారు – బెజవాడ.

అయ్యా! నాయభిప్రాయమును శబ్దసంక్షేపమున దెలుపుకొనుచున్నాను.

గీ॥ తేనె లొలుకుఁడి పలుకులతీపిఁ బలుకు
వెలఁదికులుకులతళుకులు వెలయఁ బూర్వ
సత్కవీశ్వరపద్ధతిఁ జాటినట్టి
శివపురాణమ్ము నీసాంబశివుఁడు మెచ్చె.

తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రి
22-2-47 బెజవాడ

ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రధానాచార్యులు, సౌందరనందాదికావ్యనిర్మాతలు బ్ర॥ శ్రీ॥ పింగళిలక్ష్మీకాంతకవి ఎం. యే. గారు—

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారికి నమస్కారములు. మీరు దయతోఁబంపిన శివపురాణమందినది. చాలకృతజ్ఞుడ. మీగ్రంధము నామమాత్రమున పురాణమేకాని రచనలో కావ్యమువలెనున్నది. అనగా పురాణోచితమైన ప్రసన్నధారాళతయు కావ్యోచితమైన రసదీప్తియుకలవన్నమాట. గ్రంధముచదివి నేను చాల ఆనందించితినని వ్రాయుట పునరుక్తి. చిత్తగించవలెను.

పింగళి లక్ష్మీకాంతము.
26-2-47 వాల్తేరు.

హైదరాబాదు నిజాం కళాశాల రిటైర్డు ప్రొఫెసరు బ్రహ్మశ్రీ మసుగంటి సీతారామయ్యగారు. ఎం. ఏ.

కవివరా! తాము దయతో నాకిచ్చిన శివపురాణమును స్థాలీపులాకన్యాయముగా చదివితిని. మిక్కిలి యానందించితిని. పూర్వకవుల కెంతమాత్రమును తీసిపోని తమవంటి విద్వత్కవులీ కాలమున కూడ నచ్చటచ్చట మిగిలియుండుట మిక్కిలి ముదావహము. రసవంతమై, నిర్దుష్టమై ధారావాహికగా ప్రవహించు శైలిలో శివపురాణమును రచియించుట తమకు దక్కినది. తాము శైవులై యుండుట కూడ మరియొక విశేషము. కాకపోయిన శివపురాణహృదయమును మఱియొక వ్యక్తి గ్రహించియుండునా?

వృద్ధులయ్యు దీర్ఘకాలసాధ్యమగునిట్టి యపూర్వకార్యమును నిర్వర్తించి భాషామ తల్లికి నూతనాలంకారమును సమకూర్చినారు. పోతన్నగారు "పల్కించెడివాడురామ భద్రుండట" యన్నట్లు మిమ్ము నా పరశివుడు పల్కించినాడనుటలో నెట్టి యాశ్చ ర్యమును లేదు. భగవత్కటాక్షము లేకయున్న నిట్టి యుద్గ్రంధరచనము సుసాధ్య మగునా?

గ్రంధమునందలి గుణజాలమును పీఠికారచయిత లుగ్గడించిరి గాన నేనా పనికి బూనుట చర్వితచర్వణ మగుటయేగాక గ్రంధవిస్తృతియు నగును. ఈ శతాబ్ద పూర్వార్థమున వెలువడిన యుత్తమ గ్రంధములలో తమ శివపురాణ మొకటియని చెప్పుటతో తృప్తి నొందుచున్నాను. మీరు ధన్యజీవులు.

విధేయుడు
కురుగంటి సీతారామయ్య.

14—8—47. 89. బి. నాంపల్లి.
హైదాబాదు—దక్కన్.

విద్వత్కవిరాజ, కవికులశేఖర, ప్రాచ్యసాహిత్యవిద్యాప్రవీణ బ్రః శ్రీ శిరిపెల్లవిశ్వనాధశాస్త్రిగారు. ఎం. ఏ. ప్రొఫెసర్ నిజాంకళాశాల. హైదాబాద్-దం.
అభినవపోతన శ్రీముదిగొండ నాగవీరేశ్వర కవీంద్రుని శివపురాణకృతి:

మ॥ శివపారమ్యము భక్తినుత్కలిక లక్షీణంబుగానిండఁగాఁ
గవితావాహిని కావ్యకల్పకముగాఁ గల్యాణనిత్యోత్సవ
మ్మవలీలన్ ప్రవదింప పోతన మహోద్యానప్రసూనమ్ములన్
శివభావమ్మతిమాధురీరుచుల వాసింగన్న సత్కావ్యమీ.

తే॥ శివపురాణ ముదారము నవ మతులము, నాగవీరేశ్వరకవీశ్వరుఁ గనంగ నుర్వి
గుణసముంచితము హితమ్ము సురుతరమ్ము, పోతనార్యుడెఁ నాగేశుఁ డీతఁడరయ.

ఉ॥ భక్తి విరక్తి లోకహితవర్తన నిర్మలశైవదక్షవాక్
శక్తి రసైకదక్షతయు సారవిశాలనహార్దభావముల్
యుక్తియు నచ్ఛశిల్పము మహోదయమై తగు మీదుకావ్యమా
ముక్తికి భుక్తికిన్ దగిన మూర్తి రచించితివో కవీశ్వరా!

చ॥ వయసున( బెద్ద(యయ్యు కృతివల్లభతతి( నవయౌవనుండుగా
నియమము ధార శిల్పమును నిగ్గగు శబ్దము భావనమ్మలో
నయమును బింకముల్ సరసనర్మకథార్థవిధానకల్పముల్
మెయిని దెనుంగు సంస్కృతులు మేల్ రతనంబులు మీదు కైతలన్

ఉ॥ పోకడ కూర్పు శబ్దములు పూర్వకవీంద్రులకావ్యగర్భమం
దేకడ నెట్టిశక్తి గని యేప్రవహించినతీరు దిద్దుటల్
రాకల పండువెన్నెల చరాచరమోహనపూర్ణమూర్తిగా
మీకవితానభూటి దగు మేలిరుచుల్ దలంతు( గవీశ్వరా!

8–8–47

"ఆనంద"
— సరిపెల్లి విశ్వనాథశాస్త్రి
58 శిరా శికిందాబాదు.

హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధానాంధ్రోపాధ్యాయులు
బ్ర॥ శ్రీ॥ రాయప్రోలు సుబ్బారావుగారు.
శ్రీ నాగవీరేశ్వరశాస్త్రిగారికి నమస్కృతులు—

క॥ శ్రీశివపురాణరుచులు ప్ర, కాశించెను యుష్మదుభయకావ్యవిరచనా
కౌశలమున శివకథనా, వేశము పాండిత్యబలము వీరేశకవీ!

క॥ శివ మనగ మంగళము త, చ్ఛివస్వరూపంబె యుల్లసిలు నానామా
నవసంతాన శ్రీయో, వివర్ధనకలాపమందు వీరేశకవీ!

క॥ త్రొడిమెలలో మొగ్గలవలె, నుడువులు కుదురైనయెడల నూల్కొనగనం
బడు శివునికంఠస్వరము, బెడగారుచు నీదు కవిత వీరేశకవీ!

21–3–47

రాయప్రోలు సుబ్బారావు.

శతావధానులు బ్ర॥ శ్రీ॥ నల్లాన్ చక్రవర్తి శ్రీనివాస వేంకటాచార్యులుగారు—

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిల వారి సన్నిధికి —

తామనుగ్రహించిన శివపురాణమును స్థాలీపులాకన్యాయమునఁ బఠించితిని. కవితాకల్పశాఖికి కుక్కమూతిపిందెలు వేయుచున్న యీకాలమునందు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసపాకముల్లసితముగ పురాణగ్రంథనిబంధన మొనర్పగల సత్కవులుగలరని యమందానందమునందితిని. ఎడనెడ నన్నయతిక్కన శ్రీనాథపోతనలను సాక్షాత్కరింపఁ జేసితిరి. రసస్యందజనకమగు శ్రీపార్వతీపరమేశ్వర సాహిత్యము నారాధించి యీ వార్ధకమును సార్థకముగావించుకొంటిరి. నేటిసాహిత్యమున మీరొక విశిష్టస్థానమలంకరింపదగినదని నాయభిప్రాయము. చిత్తగించవలెను.

వెంకటాచార్య

20-3-47 సికింద్రాబాదు.

సికింద్రాబాదు మహబూబు కాలేజీ ప్రధానాంధ్రపండితులు శిరోమణి బ్ర॥ శ్రీ॥ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు.

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరేశ్వరకవిగారు రచించిన శివపురాణమును నాదరముతోఁ జదివితిని. దీనికిటీకను విరచించిన శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారే వీరికవిత్వమునందుగల విశిష్టతనంతయును సముద్రమునుండి పీయూషమునువలె మథించి తీసి యాస్వాదింపఁ బాఠకులకొసంగిరి. మరియు బ్రహ్మశ్రీ తూములూరి శివరామకృష్ణశాస్త్రిగారును వీరిగ్రంథము నామూలాగ్రముగా శోధించి వీరిప్రతిభావిశేషములను లెస్సగాఁజూపించియుండిరి. ఈ యిరువురి పీఠికలచే సర్వమును గతార్థమగుచున్నది. ఇతరులయభిప్రాయములు చర్వితచర్వణములే యగుచున్నవి. కావున నేను వారియిరువురి యభిప్రాయముతో నేకీభవించుచున్నాననిమాత్రము తెలుపుచున్నాను.

శ్రీశాస్త్రిగారు కవిత్వమున సిద్ధహస్తులు. పెక్కుగ్రంథములను విరచించిరి. పరమేశ్వరుఁడు వీరికి దీర్ఘాయురారోగ్యములొసంగి వీరిచే నితోధికమగు సారస్వతసేవను జేయించుగాతమని నాయాశంసనము—

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

25-3-47 44 జీరాకంపౌండు

సికింద్రాబాదు.

శ్రీజటప్రోలుసంస్థానవిద్వత్కవులు బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బా-
రాయుడుగారు, బి. యే., స్నేహలతాకవితాసంఘము—కొల్లాపురము.

శ్రీమత్పరదేవతాయైనమః

## అభినందనము.

ఉ॥ శశ్వదనంతకీర్తికరసాధనమా ముదిగొండనాగవీ
రేశ్వరశాస్త్రిగారురచియించిన యీశివకావ్యమెన్నగన్
విశ్వమునందు వ్యాప్తమయి పేరును బెంపును దెచ్చునట్టిదీ
శాశ్వతమైనసత్కృతి రసజ్ఞులమై తనరారుచుండుటన్

ఉ॥ రాజులు మెచ్చునట్లు కవిరాజులు మిక్కిలిమెచ్చునట్లు వి
భ్రాజితలీల నీశివపురాణమువ్రాసి తెలుంగుభూమికిన్
దేజముదెచ్చినట్టి కవిధీరుడితండు బహూక్తులేటికే
యోజ ఁబఠించినన్ జయబలోన్నతి గల్గును బాఠకాళికిన్

గీ॥ కంస్లకగుపడు దేవులెక్కాలమందు, గనిసతల్లిదండ్రులకిది కావ్యమంచు
వినయమిగురొత్తఁ గాన సర్పించునట్టి, నాగవీరేశ్వరుండు గుణజ్ఞుఁడన్న

గీ॥ శివుని పేరెంచుమాత్రానసిద్ధికలద, లన్నశివపురాణంబెల్ల మిన్నగాఁగ,
వ్రాయువారికిఁగల్గునపారసుఖము, చదువువారికి గలుగుసంపదల వెల్ల.

ఉ॥ వ్రాసినకావ్య మెంత మధురంబని పల్కఁగనేర్తు? మేటియు
ల్లాసముగల్గు తెల్గుకళలన్ దనరారుప్రయోక్తలుండె నే
వీసమునైనలోటు గనుపింపదు చూత మటన్నగానఁగై
కైలాసనివాసుఁ డీకవి కలంకృతిగాఁ జిరకీర్తి నిచ్చుతన్.

వాజపేయయాజుల రామసుబ్బారాయుడు.
బి. యే.

కొల్లాపురము



# ద్రవ్యదాతలు

| రు- | మ॥ రా॥ శ్రీ |
|---|---|
| 51 | రుమాళ్ళకొండయ్య |
| 50 | వంగపల్లి వీరయ్య |
| 25 | ఉప్పలంచుబాలరాజయ్య |
| 25 | నోములపానయ్య |
| 25 | మనసానిలక్ష్మయ్య |
| 25 | బిజ్జాలలక్ష్మయ్య పద్మా రామయ్య |
| 25 | తడుకశంకరయ్య జక్కానిచంద్రయ్య |
| 25 | సాల్వేరు రామయ్య |
| 25 | తేలుకుంట వెంకయ్య |
| 15 | వారణాసిమల్లయ్య |
| 15 | నంబూరినాగభూషణంకృష్ణమూర్తి |
| 15 | మాలి రామలింగము రాములు |

| రు- | మ॥ రా॥ శ్రీ |
|---|---|
| 15 | కోటగిరి తేజోలింగము |
| 15 | కోటిపల్లి గంగయ్య |
| 15 | ముచ్చెర్ల ఈశ్వరయ్య |
| 15 | పొట్టిపల్లి చంద్రయ్య |
| 15 | బచ్చు లింగయ్య |
| 15 | వంకమామిడిలింగయ్య బూచశంకరయ్య |
| 15 | కైలాస శంకరయ్య |
| 15 | పెద్ది రాజలింగయ్య |
| 15 | ఇరుకుళ్ళ శంకరయ్య |
| 15 | వంగపల్లి లింగన్నగారి లక్ష్మయ్య |

## తప్పొప్పులు

— పీఠికలో —

| పేజి | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 11 | నన్నయ్య | పెద్దన్న |
| 24 | 20 | సూక్ష్మ | సూక్ష్మ |
| 25 | 9 | పంచూడ | పంచచూడా |
| | | —మున్నుడిలో— | |
| 9 | 5 | అర్సఆదిభ్యోచ్ నుండి | ప్రజ్ఞాదిభ్యశ్చాణ్ నుండి- |
| | | —గ్రంథములో— | |
| 16 | 13 | హాస్యమిద్ధంక | హాస్యతత్ధరక |
| 38 | 18 | భూసురులతోడ | భూసురులచేత |
| 156 | 23 | నరుదొప్పంగా | జనవొప్పంగా |
| 217 | 1 | ఎవ్వనికూతు | ఎవనివుత్రి |
| 482 | 20 | మదాంధ కారము | మహాంధకారము |
| 524 | 10 | హిమరుణ్మ్సగ్ధార్థ కాంతంబు | హిమరుకో కాభిగానుంబు |
| 729 | 17 | నాల్గువంద లేండ్లు సంధ్యం | నెన్మిదివంద లేండ్లుసంధ్యాం |

# దివ్యదాతలు

| రూ॥ | మ॥ రా॥ శ్రీ |
|---|---|
| 50 | తోట అప్పయ్య |
| 35 | అన్నం రత్నయ్య అండ్ సన్స్ గార్లు |
| 20 | ఆమేటి పాపయ్య |
| 15 | మూసెట్టి రంగనాయకమ్మ |
| 15 | చందా రాజన్న |
| 15 | గోపిసెట్టి శంకరయ్య |
| 15 | క్యాస చంద్రయ్య |
| 15 | బెజుగం చన్నయ్య వెంకయ్య గార్లు |
| 15 | బి. నరసిములు కంట్రాక్టరు |
| 15 | కొమిరిసెట్టి శంకరయ్య |

శ్రీ మహామహోపాధ్యాయాద్యనేక బిరుదాంచితులు, ఆంధ్రభారతీకవులు
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలవారు — కవిసార్వభౌములు —

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారికి,

అయ్యా! మీరచించిన గ్రంథ మంతయుఁ జదువఁజాల నైతిని. అక్కడక్కడఁ గొంచెముకొంచెముగాఁ జదివితిని. కవిత్వము మిక్కిలి చక్కగా నున్న దని మనవి చేయుచున్నాను. మీరు కవితావిషయములో గొప్ప శుశ్రూష చేసియున్నారు. తత్ఫలితముగా నిట్లు సుకవిత్వ మలవడిన దని పండితులు తలంచుచున్నారు.

1–3–'47 చిత్తగించవలెను,

రాజమహేంద్రవరము శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

—

# కృష్ణాపత్రికాభిప్రాయము

## శ్రీ శివపురాణము

శ్రీ ముదిగొండ నాగవీరేశ్వరకవి విరచితము. వ్యాసకృతములైన అష్టాదశ పురాణాలలోనిదగు నీయుద్గ్రంథము పురాణముల నాంధ్రీకరించిన పోతనాది మహాకవుల మార్గము ననుసరించి రచింపబడినది. సృష్టి, సతీ, పార్వతీ, కుమార, యుద్ధ, లీలా, లింగవైభవ, ఉమా, కైలాస, వాయవీయ, విద్యేశ్వరములను ఏకాదశఖండములచే నొప్పిన యీయుద్గ్రంథమును రచించిన నాగవీరేశ్వరకవి గారు పండితకవులు. శివభక్తి పారమ్యమును బోధించు నీపురాణము వీరిచేతులలో బడి ఆంధ్రసరస్వతీహస్తభూషణమైన దని చెప్పవచ్చును, ఆరువేలపద్యముల యీగ్రంథము ఎచట చూచినను కుంటుపోని రచనాపటిష్ఠత చేత, కదళీపాకముచే, కండగల పలుకుబడిచే నొప్పారి రసము చిప్పిలుచున్నది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణకవిసమ్రాట్టు రచించిన విపులమైనపీఠిక ఈగ్రంథముఖము నలంకరించుచున్నది.

19–4–1947 "శ్రీవత్స"



శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ శివపురాణము

## సృష్టిఖండము

### ప్రథమాశ్వాసము



విభుఁ డాత్మనేత్రసర ♦ సీరుహపూజ నొనర్చ యేమహా
దేవుని సుప్రసాదనియ ♦ తిన్ గొనె సర్వసుపర్వచక్రిర
క్షావహమైనచక్రము సు ♦ ధాంశుఁడిఁ కెవ్వనిఁ జెంది దక్షశా
పావధినొంఁచె నట్టి సద ♦ యాత్ము శివున్ బరమాత్ముఁ గొల్చెదన్

చ. పెనిమిటి పెందొడన్ జనవు ♦ పెంపునఁ జక్కఁగ నెక్కి యక్కునన్
దనయు గణేశు నత్తిగొని ♦ తావలచేతఁ గుమారు నెమ్మొగం
బును దయమీఱఁ బుణ్కుచున ♦ మోనమయంచు వచించు మాధవా
ద్యనిమిషనాథశేఖరుల ♦ నాదటఁ బ్రోచు నుమన్ భజించెదన్. 2

క॥ సకలామరసముదయమునఁ, బ్రకటితముగఁ దొల్తపూజఁ బడసి ప్రమథనా
యకుఁడై కడు మాతాపిత, లకు మురుపిడు దంతిముఖుఁ గొలచెదన్ మదిలోన్ 3

ఉ॥ రుద్రమహోగ్రరోషమయ ♦ రూపముఁ జేకొని దక్షుమార్ధమున్
రౌద్రతరార్భటిన్ దునిమి ♦ రాక్షసమర్దనముఖ్యులన్ భయో
న్నిద్రులఁ జేసి భక్తులను ♦ నిత్యము సాఁకెడు భద్రకాళికా
భద్రుఁడు వీరభద్రుఁడు శు ♦ భంబిడుఁ గావుత మాకు నిచ్చలున్. 4

సీ॥ మధురసారభచారు ♦ మకరందబంధుర, శోణాబ్జ మొకకేల ♦ సొంపుచిలుక
లలితరాగాయతా ♦ లాపశోభితహేమ, వల్లకి యొకచేత ♦ వన్నెదొలుక
రసవత్స్వాలంకార ♦ రమ్యభావవిశాల, పుస్తక మొకకేలఁ ♦ బొంకమొలుక
భక్త్రపావననామ ♦ పరమజపోజ్జ్వల, మణిమాల యొకచేత ♦ మానుగులుక

గీ॥ సురభిసౌవర్ణపుష్కరాంతరమనోజ్ఞ, కర్ణికాసీనధాతృముఖమునవమరు
వాణి నిర్జితశుకపికవాణి వాణి, గరిమనొసఁగ భజింతుఁ జొక్కముగుభక్తి.

సీ. షట్కాలశివలింగసమయసమర్చాభి, రాము శ్రీవేమనారాధ్యగురుని
నిగమాగమార్ణవనిష్ణాతుఁ బావన, భావుని వీరమల్లావధాని
శబ్దవిద్యాపారచతురుఁ జిజ్జావ్వూరి, వంశ్య సీతారామపండితేందుని
శతవధానమనీషి చంద్రులఁగిజ్కవి, గజకేసరుల శతగ్రంథకవుల

గీ. మఱియు నేమానిరాజయన్ మంత్రశాస్త్ర, వక్త మున్నగునాచార్యవరుల నాదు
చిత్తమున మేలిభక్తినర్చించి యుంచి, తోక్తులనొకండఁ గృతిసేయ నూహచేసి.

ఉ. శైవపురాణమెందును బ్రశస్తము శర్వకథాసుధాభిధా
రావహసర్వభాగవిభవాస్పదధామము భూరివిస్ఫుర
ద్భావరసాభిరంజకము పాతకకోటికి బూరుపార్థల
క్ష్మీవిలసన్నివాసమని చిత్తమునందిగురొత్తువేడ్కతోన్, 7

చ. తెనుఁగొనరింపఁ బూనితి సుధీప్రవరుల్ మదిఁబొంగ భారతీ
కనదురురత్నసంకలితకాంచనకాంచికలాపకింకిణీ
ఘనతరనిస్వనంబెసఁగఁగా వికసల్లలితారవిందసం
జనితనితాంతసౌరభలసన్మధురోక్తుల రక్తులేర్పడన్, 8

—* కవి స్తుతి *—

గీ॥ ఘనుల వల్మీకభూ వ్యాసకాళిదాస, భాస భారవి భవభూతి బాణ భట్టి
మాఘ శ్రీహర్ష బిల్హణ మల్హణాది, సంస్కృతకవీంద్రపదసారసముల కెఱఁగి.

వ॥ ఆంధ్రకవులందు

ఉ. అంచితభక్తిఁగొల్తు విబుధావళి కున్నతవైభవంబునన్
బ్రాంచదమేయహర్షజనకాతురచారుపదప్రదాతలా
కాంచనగర్భ విష్ణు శశిఖండకిరీటులఁ బోటిసేయుచున్
మించిననన్నయాదికవి నేతల భారతధాతలన్ మదిన్. 10

క॥ సోముని భీముని నాచన, సోముని శ్రీనాథబుధుని సూరన్నను బ్ర
జ్ఞామహితుఁ బెద్దనార్యునిఁ, బ్రేమమ్మునఁగొలుతు వారి పెంపుఁబొగడుచున్. 11

శా॥ ఎందెందేనియు భ్రాంతిహేతుకముగా నేదేన్ దోసంగుండుటో
ప్పుందదక్షేంద్రుల కేని యంతనెమెటుల్ పోనోవు సర్వంకషా
స్పందప్రోద్ధతభారతీరుచిరశుంభద్దుంభసంరంభముల్
మందుల్ దీని నెఱుంగఁజాల రదిక్షేమంబౌను మాకెంతయున్. 12

చ. తిరుపతి వేంకటేశకవిసింధురులు కావ్యములందు భారత
స్ఫురితపథానురోధగతి సొంపులునింపిరి నేనునట్లె యా
దరమెసఁగంగ వారిసువిధానవుభంగి నెఱింగి కబ్బమున్
బరఁగరచింతు దీనిపరిపాకము లోకమెఱుంగఁగావుతన్. 13

క॥ మక్కికిమక్కిన్గూర్చుట, చక్కనిమార్కంబుగాని చందముగుట నా
చక్కి విడనాడి నాయీ, ఫక్కిన్ బొనరింతులలితపద్ధతిమెఱయన్. 14

క॥ శివలింగము రుద్రాకలు, శివలింగధరుండు గురుఁడు శ్రీఫలదళముల్
శివమంత్రము బూదియు నా, కవిరళభద్రంబులొసఁగు నశ్రాంతమ్ముల్. 15

—* శైవాచార్యాది సత్కృతి *—

క॥ *పన్నిద్దఱు సూర్యులు నాఁ, బన్నిద్దఱు రేవణాది పాశుపతనుసం
పన్నిధులు బుధులు వారల, కున్నతులఁ బొనర్తునే నకుంఠితభక్తిన్ 16

వ॥ అందును

క॥ శ్రీకంఠుడనంగను వి, ద్యాకంఠుఁడు నీలకంఠుఁ డనునామములన్
లోకోత్తరఘనపుణ్యు, శ్లోకుఁడగు భాష్యకార సోమునిఁగొలుతున్. 17

ఉ॥ కొండఱు వ్యాససూత్రములకున్ గనుగప్పి యపార్థకల్పనల్
బొందువడంగఁ బొత్తములఁ బూన్చిన వందురుచున్న వ్యాసమా
నిం దనుపంగ సూత్రగత నిశ్చితతత్త్వముఁదెల్పి శైవరా
జిం దనరించినట్టి గురుశేఖరుఁ గొల్చెద నీలకంఠునిన్. 18

సీ॥ హరువొప్పఁగాంచి నేకామేశువరమున, నెవఁడబ్రముగ జనియించి మించె
శ్రీనీలకంఠదేశికపదపద్మసే, వనమున నెవ్వఁడు వాసిఁజెందె
మద్దర్శనంబుల సారపారముఁగాంచి, యెవఁడు సిద్ధాంతంబు లెసఁగఁజేసె
సర్వవేదార్థ విజ్ఞానంబుఁగొనితత్త్వ, మిదియంచు నెవఁడు దాఁనెఱుకపఱచె
గీ॥ అతఁడు శ్రీహరదత్తుఁడాఖ్యాతసర్వ, దేశరాజన్యగోష్ఠిని వేశకోవి
దాతిశయగేయసుయశోమహామహుండు, శర్వనిభుఁడొందుఁగాతనాసన్నుతులను

* 16 పన్నిద్దఱు రేవణాది పాశుపత సుసంపన్నిధులు —
సిద్ధత్రయము : 1 రేవణసిద్ధుఁడు 2 మరుళసిద్ధుఁడు 3 ఏకోరామసిద్ధుఁడు.
ఆరాధ్యత్రయము : 1 ఉద్భటారాధ్యుఁడు 2 వేమారాధ్యుఁడు 3 విశ్వారాధ్యుఁడు
పండితత్రయము : 1 మల్లికార్జునపండితుఁడు 2 శ్రీపతిపండితుఁడు 3 మంచనపండితుఁడు
ఆచార్యత్రయము : 1 నీలకంఠశివాచార్యుఁడు 2 హరదత్తాచార్యుఁడు 3 భట్టభాస్కరాచార్యుఁడు
వీరలు శైవమత మూలాచార్యులు. వీరిలో 3 వ ఆచార్యుఁడు మొదలుకొని 9 వ ఆచార్యునివఱకు దద్వంశ్యు లిప్పటివఱకు శైవమతాచార్య పురుషులై పేర్కొనఁబడుచున్నారు.

చ. *అలికమునన్ గృశానుఁ గృశ♦నందని శంకరుఁ డాఱుమోములన్
వెలయనిశక్తిహస్తుఁడు ప♦విత్రతపంబును గోలుపోని క్రా
ల్గలుఁడల గాధినందనుఁడు ♦ శాంభవభాష్యవిరాజి నాదుజో
తలఁగొను శైవపండితవి♦ధాతృఁడు శ్రీపతిపండితుం డిటన్. 20

గీ॥ ఘనభవక రాళపంకలం♦ఘనపటిష్ఠు, బ్రహ్మవిద్యా ప్రబోధన♦ప్రౌఢుఁ బావ
నమతిఁ గల్యాణపూర్వా♦నందయతిని, వేమఱు నుతింతు నాదుహృ♦ ద్వేశ్మమందు.

క॥ ఆయుర్వేదకళానిధి,యై యనురాగమున నన్ను ♦ నావిద్యను బ్ర
జ్ఞాయుతుఁ జేసిన నవరా, త్రేయు ములుగు రామలింగ♦ దేశికుఁ గొలుతున్. 22

చ. శివపురవంశసింధుభవ♦శీతలరశ్మి శిరీషపుష్పపే
లవహృదయుం డలంకృతిక♦లాలలితుండును నాకు నెయ్యుఁడున్
శివునిఁ భజింపఁ దత్పదముఁ♦జెందినయట్టిఁడు నైనమల్లయా
ఖ్యవిబుధవర్యు నెంచెద మ♦దాత్మమునందుఁ దదాత్మ మెచ్చుచున్. 23

గీ॥ మఱియు నామామ ధైర్యర♦మామహితుఁడు, శివపురాన్వయ పాథోధి♦శీతభానుఁ
డాఢ్యుఁడు శివార్చనాపర♦మాంతరంగుఁ, డట్టి దుర్గాహ్వయుని మది♦యందుఁ గొలుతు.

గీ॥ ఘనుఁడు భోగేశ్వరాదిస♦త్కావ్యసవిత, మల్లమపలికులాబ్ధిహి♦మకరమూర్తి
మల్లికార్జునశాస్త్రి మా♦మకకవిత్వ, మండనావహుఁ డాత్మస♦మర్చ్యుఁ డెపుడు. 25

వ॥ మఱియును

గీ॥ తూములూర్యన్వయసుధాబ్ధి♦సోముఁ డిభ్య, సభ్యచరితుండు శాబ్దిక♦చంద్రుఁ డస్మ
దీయకృతిరత్నమున్ సానఁ♦దీర్చె నట్టి, దిట్ట శివరామకృష్ణశా♦స్త్రిని నుతింతు.

క. ఇఁక నెందఱో మనీషులు, ప్రకటితకవితాకళావి♦రాజితు లీమా
మకకృతికి వన్నెఁ గూర్చిరి, యకలంకమతిన్ దలంతు ♦ నవ్వారిసిరిన్. 27

వ॥ ప్రాచీనాచారంబుకతన నస్మదీయవంశచరిత్రంబు నొక్కించుక ముచ్చటించెద.

—* వంశానుక్రమణిక *—

క॥ ధరణిన్ బ్రాహ్మణశాఖల, హరువగు నారాధ్యశాఖ ♦ యలరు నొకండం
దిరమగు మావంశము భా, సురభారద్వాజగోత్ర ♦ శోభితమగుచున్. 29

క॥ యాజుషశాఖాధ్యాయున, భ్రాజితమై యిష్టలింగ ♦ భాస్వత్తరపూ
జాజాగరూకమై కడు, రాజిలు ననవరతమార్య ♦ రాజస్తుతమై. 30

* 20 శ్రీపతి పండితారాధ్యులు : పూజ్యపాదులగు వీరు గూడ వైయాసిక సూత్రములకు శ్రీకర భాష్యంబను పేరితో సవిశేష శివాద్వైతభాష్యంబును రచించిరి.

వ. అందు

శా. శ్రీకాశీశ్వరలింగదివ్యకరుణా ♦ శ్రీభాగ్యజాతుండు లో
కైకఖ్యాతమహాతపోనియతదీ♦వ్యద్భవ్యతేజుండు వీ
తాకాశల్యనిరస్తకల్యధికవ♦ర్గస్తోముఁ డొప్పొందెఁ జం
ద్రాకల్పోపముఁ డుద్భటార్యగురుమా♦ర్తాండుం డిలామండలిన్. 31

సీ. ఏ గురుండుండె ఖం♦డేందుమౌళీష్టని, వాసమౌ ముదిగొండ ♦ పట్టణమున
ఏ సుధీశ్వరుఁడొందె ♦ హిమగిరిజాభయా, సౌభాగ్యసుందరీ ♦ సాధ్విపాణి
ఏ దేశికాగ్రణి ♦ యిచ్చె భోజాదిరా, జాధిరాజుల కిల ♦ నభవదీక్ష
ఏ మహాత్ముఁడు వాపె ♦ నీశశాపంబు భూ, తంబులై యున్న గం♦ధర్వతతికి

గీ. అట్టి నిరపాయగేయు వి♦ఖ్యాతపూత, వికచకమలవనామోద ♦ నికరసార
కీర్తిపూర్తివిరాజితా♦ఖిలదిగంత, రాళమండలుఁ డారాధ్య ♦ రాజమౌళి. 32

సీ. భంజించె బౌద్ధాది పాషండమతములఁ, బ్రతివాదు లెల్లన♦బ్బింబుఁ జెంద
రంజించె పార్వతీ ♦ రమణమతంబు శాం, భవులెల్ల మేటిసం♦బరముఁ జెంద
విరచించె హారలీల ♦ వెలయుసలంకార, సంగ్రహకావ్యంబుఁ ♦ జతురులలర
నార్జించె నిష్టలిం♦గార్చనాఘనయోగ, లబ్ధనిర్వాణక♦ల్యాణలక్ష్మి

గీ. భక్తు లుప్పొంగఁ గరతల♦భ్రాజమాన, శాంభవప్రాణలింగాను ♦ సంగతాత్ముఁ
డై యనశ్వరగౌరీశ్వ♦రాధివాస, భాసురంబగు కైలాస ♦ పదముఁ జెందె. 33

గీ. అట్టియారాధ్యమకుటుని♦యన్వయమునఁ, బుట్టి చెలువొందిరనఘులు♦భూరియశులు
చంద్రశేఖరదేశిక ♦ చంద్రముఖ్యు. లవనిఁబలువురు కలిదోష ♦ వారణచణులు.

వ. ఉద్భటగురుండు మొదలుచేసి వీరందఱు పెక్కుతరంబులవఱకు ముదిగొండ యందుఁ గాపురముండుట ముదిగొండవారనంబరంగిరి. 35

క. మును రామలింగసత్కవి, జనమాన్యుం డుద్భటార్య ♦ చరితవిరచనం
బొనరించి వీరివంగడ, మన నిట్టిదొ యెఱుఁగఁ జేసె ♦ నందఱు మెచ్చన్. 36

వ. పదంపడి వీరివంశ్యు లతిశయాభివృద్ధిం జెంది వేఱువేఱుగ్రామంబులందు వసించి పెక్కుతరంబులు గడచుట నన్యోన్యజ్ఞాతిధర్మంబుఁ బాసి పెక్కు తెగలవారైరి. అవ్వానిలో సుప్రసిద్ధు లనేకులు పొడమి పేరుపెంపున్ గాంచినవారలందుఁ గొందఱి నిందుఁ జేర్కొందు. 37

సీ. చిన్మయదీక్షాది ♦ శివమతగ్రంథక, ల్పకశాఖి శ్రీవీర♦భద్రగురుఁడు
షడ్దర్శనాగమ ♦ శౌండుండు కేదార, లింగపండితరాజ ♦ పుంగవుండు

నందిగామాగ్రజ ♦ న్మెందుండు వేదాగ, మాంభోధి వీరభ ♦ ద్రావధాని
కొండవీడున నున్న ♦ కుసుమకోమలకావ్య, కమనీయవీరభా ♦ గవతధాత

గీ. పాణినీయాగమాంత వి ♦ భాసితోరు, బాదరాయణఘనకలా ♦ భరితమహిత
పాండితీస్ఫూర్తి రచితశై ♦ వప్రబంధ, రంగదురుకీర్తి శ్రీనాగ ♦ లింగశాస్త్రి. ౩౮

సీ. ఎవ్వానిశుభనామ ♦ మేప్రొద్దు నుడివిన, జనులకుఁబాపసం ♦ చయము దొలఁగు
ఎవ్వానిచారిత్ర ♦ మే శైవమండలి, కెల్లయాదర్శమై ♦ యెసకమెసఁగు
ఎవ్వానిదాతృత్వ ♦ మెల్లదేశములందు, విఖ్యాతిఁగాంచి కా ♦ వించెఁదనివి
ఎవ్వానిసద్బోధ ♦ లెంతకాలంబేని, వినుగుఁగాంచకయె కాం ♦ వించు భక్తి

గీ. ఎవఁడు చేసిన షట్కాలి ♦ కేష్టలింగ, పూజఁగావించెఁ బరులకుఁ ♦ బులకతతుల
నట్టిశ్రీశంకరారాధ్యుఁ ♦ డార్యబోధ్యుఁ, డనుపమానయశస్కుఁడై ♦ యవనివెల

వ. ఇఁక నిజాము దేశమందు నల్లగొండజిల్లాలోని నారాయణపురంబందుఁ గాపురం
బున్న మా తెగయందు

సీ. సహజాంధ్రపాండితీ ♦ శాలి శివార్చనా, మానితాత్ముఁడు తాత ♦ మంత్రమూర్తి
* నిరతాన్నదానాభి ♦ నిరతుండు వీరభ, ద్రగురుండు తండ్రి స ♦ త్యవ్రతుండు
అమలగుణాఢ్యలై ♦ యలరినయట్టి శ్రీ, శరభమ్మనాగమల్ ♦ సవతితల్లు
లకలంకచారిత్ర ♦ హారితగోత్రోద్భవ, యైనలక్ష్మమ్మ మామ ♦ కీనజనని

గీ. సవతితల్లికుమారుఁడు ♦ శరభమూర్తి, యన్న శరభమ్మలాతని ♦ యనుజలిరు
రక్కలై నాకు వెలసిరి ♦ యమలమతులు, నాగవీరేశ్వరుండని ♦ నాదు పేరు. ౪౦

చ. సిరులరహించు సైన్యపుర ♦ సీమ వసించెడ నద్రిజామహే
శ్వరకరుణాప్రసాదిత వి ♦ భాసిత సత్కవితాయుతుండ భా
స్వరవిభ వేష్టలింగగత ♦ భక్త్యతిమాత్ర పవిత్రగాత్రుఁడన్
గురుజనపూజనోత్సుకుఁడఁ ♦ గుత్సితలోకపరాఙ్ముఖాత్ముఁడన్. ౪౧

గీ. తగరచించితి మును సుభ ♦ ద్రావివాహ, నాటకంబును శ్రీశైలనాథ ♦ దేవి
భ్రామరీశక్తి పేరిటఁ ♦ బద్యశతక, మును సువర్ణోక్తి శివతత్త్వ ♦ బోధినియును.

ఉ. బమ్మెరపోతనాఖ్యకవి ♦ భానుఁడు భాగవతప్రబంధమున్
గమ్మని పూవుతేనియలఁ ♦ గ్రాలెడు మేలిమిశైలిఁదీర్చి ని
త్యమ్మగు తేజముఁ బడయఁ ♦ దామరసాక్షునికిచ్చె నార్యవ
ర్గమ్ము శరమ్ముకౌతుకభ ♦ రమ్మున గీతరవమ్ము సేయఁగన్. ౪౨

---

* మాతండ్రిగారగు ఈ శ్రీ వీరభద్రయ్యగారిప్పటికి 70 సంవత్సరముల క్రితము నివాసస్థలిని వదలి శిష్యుల యాహ్వానముచేత ఈ శికిందారాబాదుకుఁ గాపురము వచ్చినారు.

ఉ. పింగళిసూరనార్యకవి ♦ విజ్ఞవరుండు ప్రభావతీచరి
త్రం గమనీయకల్పనల ♦ రమ్యతరోక్తులఁదీర్చి భక్తియు
క్తిం గృతినిచ్చెఁదండ్రికి సు♦ధీమణు లంచితహర్షమొంద నా
రంగదుదారకీర్తికవి ♦ రాజకిరీటుఁదలంప నింపగున్. 45

వ. కావున నట్లే

—* కృతి సమర్పణము *—

గీ. తల్లిదండ్రులకన్న నిఁతరముపరము, లేదనివచించు శాస్త్రని♦నాదసరణి
తల్లిదండ్రుల కీప్రబం♦ధంబొసంగి, ధన్యతను గాంతు నెల్లవి♦ధముల నేను. 46

ఉ. నాజనకుండు చాలఁగవ♦నంబునఁ బ్రేమము జెంది కావ్యమో
జోజ గ్రహింప నెంచియును ♦ యోగములేక గతించె నిప్పుడా
యోజఁదలంచి తల్లికిని ♦ నొప్పఁగ నాడగుతండ్రి కీకృతిన్
భ్రాజితభక్తి నిచ్చెదను ♦ భర్గుఁడు దీని ననుగ్రహించుతన్. 47

క. ఒకయాశ్వాసముఁదల్లికిఁ, నొకయాశ్వాసంబుఁదండ్రి ♦ కొసగెద నాయీ
సుకృతకృతి నిద్దివారల, కకలంకయశంబు నొసఁగు ♦ నాకల్పముగాన్. 48

క. కృతిపతులఁట తలిదండ్రులు, కృతిశైవమహాపురాణ ♦ గీతంబట యీ
కృతిరచయితనగు నేనిటఁ, గృతకృత్యుఁడనగుట కొండు ♦ కృషిగావలెనే. 49

*క. ఉద్బోధకుఁ డీశ్వరుఁడఁట, సద్భావములోడ నిద్ది ♦ సల్పుటయఁట యీ
మద్భంగము లేకయె కృతి, యద్భుతగతిఁ బూర్తినొంది ♦ యలరుటయరుదే. 50

ఉ. మొక్కులు మొక్కి వేల్పులకు ♦ మోదములో ననుఁగన్నయంత నే
మిక్కుటమైన రోగములు ♦ మేకొని నన్నలయింపఁ జింతతోఁ
బొక్కుచుఁ బెక్కుపాట్లుపడి ♦ పొంకముఁగూరిచి పెంచి పెండిలిన్
జక్కఁగఁజేసి పెండ్లమును ♦ సంతతినిన్నను సాఁకుతల్లికిన్. 51

గీ. నన్నుఁగని పదమాడేండ్లు ♦ నాకునిండు, దాఁక నాకిష్టవస్తుప్ర♦దానమున ము
దంబుఁగూర్చుచు విద్దెల ♦ దార్పఁగడఁగి, యంతఁదాశివుఁజేరిన♦యట్టిపితకు. 62

వ. సమర్పితంబుగా, నేనాంధ్రీకరింపఁబోవు శివపురాణంబునకుఁ గథాక్రమంబు.

---

* పాఠాంతరము : ఉద్భవకరుఁ డీశ్వరుఁడఁట.

నందిగామాగ్రజుం డన్నె మేందుండు వేదాగ, మాంభోధి వీరభద్రావధాని
కొండవీడున నున్న కుసుమకోమలకావ్య, కమనీయవీరభాగవతధాత

గీ. పాణినీయాగమాంత విభాసితోరు, బాదరాయణఘనకలాభరితమహిత
పాండితీస్ఫూర్తి రచితశైవప్రబంధ, రంగదురుకీర్తి శ్రీనాగలింగశాస్త్రి. ౩౮

సీ. ఎవ్వానిశుభనామ మేప్రొద్దు నుడివిన, జనులకుఁ బాపసంచయము దొలఁగు
ఎవ్వానిచారిత్ర మే శైవమండలి, కెల్లయాదర్శమై యెసకమెసఁగు
ఎవ్వానిదాతృత్వ మెల్లదేశములందు, విఖ్యాతిఁగాంచి కావించెఁదనివి
ఎవ్వానిసద్బోధ మెంతకాలంబేని, వినుగుఁగాంచక యె కావించు భక్తి

గీ. ఎవఁడు చేసిన వట్కాలి కేష్టలింగ, పూజఁగావించెఁ బరులకుఁ బులకతతుల
నట్టిశ్రీశంకరారాధ్యుఁ డార్యబోధ్యుఁ, డనుపమానయశస్కుఁడై యనని వెలసె

వ. ఇఁక నిజాము దేశమందు నల్లగొండజిల్లాలోని నారాయణపురంబందుఁ గాపురం
బున్న మా తెగయందు

సీ. సహజాంధ్రపాండితీశాలి శివార్చనా, మానితాత్ముఁడు తాతమంత్రమూర్తి
* నిరతాన్నదానాభినిరతుండు వీరభ, ద్రగురుండు తండ్రి సత్యవ్రతుండు
అమలగుణాఢ్యలై యలరినయట్టి శ్రీ, శరభమ్మ నాగమల్ సవతితల్లు
లకలంకచారిత్ర హారితగోత్రోద్భవ, మైనలక్ష్మమ్మ మామ కీనజనని

గీ. సవతితల్లికుమారుఁడు శరభమూర్తి, యన్న శరభమ్మలాతని యనుజలిర్వు
రక్కలై నాకు వెలసిరి యమలమతులు, నాగవీరేశ్వరుండని నాదుపేరు. ౪౧

చ. సిరులరహించు సైన్యపురసీమ వసించెద నద్రిజామహే
శ్వరకరుణాప్రసాదిత విభాసిత సత్కవితాయుతుండ భా
స్వరవిభ వేష్టలింగగత భక్త్యతిమాత్ర పవిత్రగాత్రుఁడన్
గురుజనపూజనోత్సుకుఁడఁ గుత్సితలోకపరాఙ్ముఖాత్ముఁడన్. ౪౨

గీ. తగరచించితి మును సుభద్రావివాహ, నాటకంబును శ్రీశైలనాథదేవి
భ్రామరీశక్తిపేరిటఁ బద్యశతక, మును సువర్ణోక్తిశివతత్త్వబోధినియును.

ఉ. బమ్మెరపోతనాఖ్యకవి భానుఁడు భాగవతప్రబంధమున్
గమ్మని పూవుతేనియలఁ గ్రాలెడు మేలిమిశైలిఁదీర్చి ని
త్యమ్మగు తేజమున్ బడయఁ దామరసాక్షునికిచ్చె నార్యవ
ర్గమ్ము శరమ్ముకౌతుకభరమ్మున గీతరవమ్ము సేయఁగన్. ౪౪

* మాతండ్రిగారగు ఈ శ్రీ వీరభద్రయ్యగారిప్పటికి 70 సంవత్సరముల క్రితము నివాసస్థలిని వదిలి
శిష్యుల యాహ్వానముచేత ఈ శికిందాబాదునఁ గాపురము వచ్చినారు.

ఉ. పింగళిసూరనార్యకవి ♦ విజ్ఞవరుండు ప్రభావతీచరి
త్రంబు గమనీయకల్పనల ♦ రమ్యతరోక్తులఁదీర్చి భక్తియు
క్తిం గృతినిచ్చెఁజంద్రికి సుధీమణు లంచితహర్షమొంద నా
రంగదుదారకీర్తికవి ♦ రాజకిరీటుఁడలంప నింపగున్. 45

వ. కావున నట్లే

—* కృతి సమర్పణము *—

గీ. తల్లిదండ్రులకన్న నితరము పరము, లేదనివచించు శాస్త్రని♦నాదసరణి
తల్లిదండ్రుల కీప్రబం♦ధంబొసంగి, ధన్యతను గాంతు నెల్లవి♦ధముల నేను. 46

ఉ. నాజనకుండు చాలఁగవ♦నంబునఁ బ్రేమము జెంది కావ్యమొ
డోజ గ్రహింప నెంచియును ♦ యోగములేక గతించె నిప్పుడా
రోజఁదలంచి తల్లికిని ♦ నొప్పగ నాదగుతండ్రి కీకృతిన్
భ్రాజితభక్తి నిచ్చెదను ♦ భర్గుఁడు దీని ననుగ్రహించుతన్. 47

క. ఒకయాశ్వాసముఁదల్లికిఁ, నొకయాశ్వాసంబుఁదండ్రి ♦ కొసగెద నాయీ
సుకృతకృతి నిద్దివారల, కకలంకయశంబు నొసఁగు ♦ నాకల్పముగాన్. 48

క. కృతిపతులఁట తలిదండ్రులు, కృతిశైవమహాపురాణ ♦ గీతంబఁట యీ
కృతిరచయితనగు నేనిటఁ, గృతకృత్యుఁడనగుట కొంకు ♦ కృషిగావలెనే. 49

*క. ఉద్బోధకుఁ డీశ్వరుఁడఁట, సద్భావములోడ నిద్ది ♦ సల్పుటయఁట యీ
మద్భంగము లేకయె కృతి, యద్భుతగతిఁ బూర్తినొంది ♦ యలరుటయరుదే. 50

ఉ. మొక్కులు మొక్కి వేల్పులకు ♦ మోదములో ననుఁగన్నయంతనే
మిక్కుటమైన రోగములు ♦ మేకొని నన్నలయింపఁ జింతతోఁ
బొక్కుచుఁ బెక్కుపాట్లుపడి ♦ పొంకముఁగూరిచి పెంచి పెండిలిన్
జక్కగఁజేసి పెండ్లమును ♦ సంతతినిన్నను సాఁకుతల్లికిన్. 51

గీ. నన్నుఁగని పదమూడేండ్లు ♦ నాకునిండు, దాఁక నాకిష్టవస్తుప్ర♦దానమున ము
దంబుఁగూర్చుచు విద్దెల ♦ ఁదార్పఁగడఁగి, యుంతఁదాశివుఁజేరిన♦యట్టిపితకు. 52

వ. సమర్పితంబుగా నేనాంధ్రీకరింపఁబోవు శివపురాణంబునకుఁ గథాక్రమంబు.

---

* పాఠాంతరము : ఉద్భవకరుఁ డీశ్వరుఁడఁట.

## —* గ్రంథారంభము *—

ఉ. ఎల్లజగంబులన్ సలుప ♦ నెంచి విరించినిఁగాంచి ప్రజ్ఞతో
ఖిల్లఁగఁజేయు వేదములఁ ♦ జేర్మినొసంగినవాని దీప్తిసం
ధిల్లసమస్త దేవులకు ♦ ధీస్ఫురణంబుఁ బొనర్చువాని నా
యుల్లమునందుఁగొల్తు నుమ♦నొప్పినడాతొడవాస నాదటన్. 53

క. శ్రీశైలసన్నికృష్టను, దేశోజ్జ్వలశివపురాఖ్య ♦ దివ్యపురభవా!
ఈశార్చనాభిరతకో, టీశారాధ్యేంద్రవరదు ♦ హితి! లక్ష్మ్యంబా! 54

వ. అవధరింపుము.

క. నైమిశవనమున లోక, క్షేమార్థము శౌనకాద్య♦ఖిలమానులు చే
తోమోదమొదవ సూతుని, తో మను రాలాపచయు♦చతురతరఫణితిన్. 55

ఉ. పావనమూర్తి! నీవలన ♦ ఁబల్మఱు వింటిమి విస్ఫురత్స్ఫురా
ణావగతప్రమోదభరి♦తాద్భుత దివ్యకథాప్రబోధలన్
భావమునందు సంతసము ♦ పర్వెదునైనను తృప్తిగా ఁదే
మో! విన వేడ్కయేపొడము ♦ ముక్తులరక్తుల శక్తియెట్టిదో! 56

కం. నీవలె విద్యావిభవము, నీవలె చాతుర్యధుర్య ♦ నిపుణత మఱియున్
నీవలె నవరసరుచిర వ. చోవిలసితధార లెవ్వఁడు ♦ చూపఁగొనుధరన్. 57

గీ. పారమేశ్వరవిజ్ఞాన ♦ భరితమూర్తి, వఖిలకల్యాణజనక నా♦నాగమార్థ
వేదివి పరాశరాత్మజు ♦ విమలచిత్త, మునకునచ్చిన శిష్యుఁడ ♦ వనఘ! నీవు.

గీ. ఎల్లవిద్యలసారంబు ♦ నెఱిఁగినట్టి, దిట్టమైనను బరులకుఁ ♦ దెలివిగలుగ
బోధసేయుకయున్నదాఁ ♦ బొందునఘము, కలిమిగలిగియు నీయని కఠినుఁబోలె.

క. విద్యయు బోధనమును నన, వద్యాచారప్రచార ♦ వైభవముగడున్
హృద్యగతి మఱియు నీకడఁ, జోద్యముగాదొక్కొ! యిన్ని♦సొంపులు గుదురన్.

—* శౌనకాదిమునులు సూతుని శివపురాణమును వినుచుమని యడుగుట *—

ఉ. ఏది వినన్ మనంబునకు ♦ హెచ్చగుసంతసమావహిల్లి వే
ఱేది వినంగ వేడ్కజని ♦ యింపదు ముక్తిసతీ కరగ్రహం
బేదివినన్ లభించుఁ ♦ బరమేశ్వరుఁ డేదివినన్ బ్రసాదమా
పాదన సేయునట్టిది కృ♦పన్ సెలవిమ్ము మహాత్మ! మాకిఁకన్. 61

ఉ. ఎందునుగానిచూడ జగ♦దీశ్వరబోధకమౌ చరిత్రమే
డెందమునందుఁ గుందడపి ♦ శ్రీవిగ మోక్షవధూటిసంగమం

బందిక నీయఁగాఁదగెదు • నన్యమిఁకట్టిదిగాదు గాన మా
కిందున వేందుభృచ్చరిత • మే విన నింపగుసొంపగుర్జుమీ! 62

క. కావునను శివపురాణము, వేవేగ మాకు నిపుడు • వినిపింపుము సూ
తా! విద్వజ్జనగీతా! నీవైదుషి దీప్తమెంతో • నేరిమిదనరన్.

వ. అనుడు నంత సూతుం డాహ్లాదంబుతో

—* సూతుఁడు హర్షించి ప్రారంభము సేయుట *—

ఉ. ధన్యుఁడనైతి వంగడము • తథ్యమబాధ్యయశంబునొందె సౌ
జన్యనిధానులుర్బుధులు • సారతపోనిధులైన మీరు సా
మాన్యుఁడనైన నానుడుల • మచ్చికతోవిని మెచ్చి క్రమ్మఱన్
మాన్యతతో వినన్ గడఁగి • మంజుతరోక్తుల నిట్లుగోరుటన్ 64

ఉ. అందును నెల్లలోకముల • కాదిమకారణుఁడై దనర్చు న
య్యిందుధరున్ భజించు నల•యింపగు శైవపురాణరాజమున్
విందొనరింపుమంచు సర•విన్ ననుఁగోరుట కింతయంతయం
చుందలపెట్టరానిసిరిఁ • జొక్కితి నిక్కితి సాటివారిలోన్ 65

సీ. శివపురాణముభువిఁ • జేకుఱుదనుక నే, బ్రహ్మహత్యాదిపా • పములు పొదలు
శివపురాణముభువిఁ • జేకుఱుదనుక నే, కలిమహోత్పాతము • లొప్పులుచుచుండు
శివపురాణముభువిఁ • జేకుఱుదనుక నే, కాలకింకరులసం • కటములొదవు
శివపురాణముభువిఁ • జేకుఱుదనుక నే, శాస్త్రంబులు వివాద • సరణిమించు

గీ. శివపురాణంబిఁకనుభువిఁ • జేరుదనుక, బరమశివతత్త్వమెఱుఁగఁగాఁ • బడదుపుడమి
శివపురాణమిఁకనుభువిఁ • జేరుదనుక, దివ్యవిజ్ఞానమెంతయుఁ • దేజరిలదు. 66

గీ. అట్టి శైవపురాణము • నవనివినిన, జదివినను దత్ఫలంబునేఁ • జాటఁగలనె?
పద్యమేనర్థపద్యమేన్ • బఠనసేయ, వినిన సర్వాఘవితతులు • విడుపునొందు 67

వ. కావున నింతకన్న మేలు తెలుంగు వేఱొక్కండు లేదిఁకసత్వరం బుపక్రమించె
ద వినుండన్ననవ్వారలు హర్షంబుతో. 68

—* శౌనకాదిమునులు సూతునితో శివతత్త్వంబు తెరెలింగింపుమనుట *—

గీ. ఎంతయేనియు శుశ్రూష • హెచ్చుచుండెఁ, జెప్పుమిప్పుడు కృపతోడ • శివునితత్త్వ
మేమెఱుంగమగుఁణుఁడైన • యీశ్వరుండు, గుణము నెట్టులఁజెందెనో • గోవిదేంద్ర

ఉ. సర్గముకన్న మున్నుఁ బుర శాసనుఁ డెట్టులనుండునింకనా
సర్గపుమధ్య నెక్కరణి జక్కఁగఁగ్రీడ యొనర్చుదానియు
త్సర్గమునం దెటుల్ మరలఁ దావసియించుఁ గృపాళు! సెప్పుమా
భర్గుఁడు లోకశంకరుఁడు పన్నుగ నెట్లు ప్రసన్నుఁడయ్యెడున్. 70

చ. అతఁడు ప్రసన్నుఁడై జనుల కర్మిలి నెట్టి ఫలంబొసంగు? నా
వితతదయాకరుండుగడు వేగిర మొంది ప్రసన్నుఁ డౌనటం
చతులితమౌ ననుగ్రహము నారయునంచును భక్తకోటులన్
వెతవడనీయఁడం చెపుడు విందుము విందుగఁ దెల్పుతత్కథన్ 71

గీ. బ్రహ్మ విష్ణువు రుద్రుండు పరమశివుని, యంశజులటంచు నందుఁబూ ర్ణాంశుఁడల్ల
రుద్రుఁడని వినుచుందుమా రుచిరమూర్తి, విస్ఫురితలీలలను విని పింపుమనఘ!

క. రుద్రావిర్భావంబును, రుద్రాణీజన్మకథని రూపింపు విప
శ్చిద్రాజులు మెచ్చఁగవి, ద్వద్రమణా! నీదుకీర్తి వర్ధిలుభువిలోన్

వ. అనిన విని సూతుండిట్లనియె.

క. ధన్యులు గృతకృత్యులుమీ, రన్యులవలెఁగాదు నిర్మ లాంతఃకరణుల్
మాన్యులు మురియుచు వినుతన, నన్యాదృశమైన ప్రమథ నాథకథనొగిన్ 74

గీ. శివకథానైష్ఠికమనీష చెలువుమీఱ, వెలసెనేనియు జాహ్నవీ సలిలమట్లు
పూతులనొనర్చు నాండ్రను బూరుషులను, బృచ్ఛకుని విను వారిని వినుచువాని

క. భవరోగౌషధ మిదివినుఁ, డవిరళమోదమున నీప్సి తార్థప్రదమీ
శివచరితము నారదమౌ, నివరేణ్యుఁడుఁ దండ్రినడుగ నీరజభవుఁడున్ 76

గీ. సంతసంబలరఁగ నాత్మ జన్మనకు వ, చించె నట్టుల మదికి రు చించునటుల
తపసులార! భవత్సన్ని ధానమందు, శాంకరయశంబు గానంబు సల్పువాఁడ 77

## .... కథాప్రారంభము ....

### —* నారదముని తపస్సొనరించుట *—

క. అని వేగమె సూతుఁడు దన, మనమునఁ బరశివచరణ సమర్చాణమును న
ప్డానరించి యిట్లు పలికెను, ఘనమధురమరందసూక్తి కౌశల్యమునన్. 78

ఉ. నారదమౌనివర్యుఁ డొక నాఁడు మహేశ్వరభక్తియోగ దీ
పారతుఁడై తుషారగిరి కందరరాజము నొంది స్వర్ణ సీ

చారుతరంగశీకరర • సప్రసరత్ప్రకరాలవాలమా
లూరరసాలసాలతరు • లుంగలవంగ వనంబు నొక్కెడన్. 79

ఉ. కాంచి మనంబునచ్చియటఁ • గాపురమొంది వియన్నదిన్గడున్
మించినవేడ్కఁ గ్రుంకులిడి • మేలుగ లోన 'శివోహ'మంచు యో
జించుచు నుండెనంతఁ గడఁ • చెన్ జిరమాపయి వృత్రభేది వీ
క్షించి మునీశ్వరవ్రతముఁ • జేవఁదొలంగి కలంగె నెంతయున్. 80

గీ. సంయమిదివంబుదనకై వశ • సఁబుఁజేసి, కొనఁగమదిఁబూనితపసుఁగై • కొనియెనిట్లు
లేకయుండిన నిట్టు ల • లోకదీప్తిఁ, బెద్దకాలంబొనర్చునే • బిట్టుతపసు. 81

క. నేనూరకున్న నిటులే, మానకస్వారాజ్యమూడి • మహితాత్మకుఁడీ
మౌనీంద్రు నొందు నిందను, మానములేదెంతయేని • మదిఁ బరికింపన్. 82

ఉ. కావున నిప్డె తాపసుని • గర్వమణంగఁగ నత్తపంబునేఁ
బూవిలుకాని సాయమున • బూదియొనర్చెదనంచు వేగన
బ్భావజు నాత్మలోఁ దలఁప • బంచశిలీముఖుఁ డేగుదెంచి తా
దేవర! యేమిసెల్వనుడు • దేవవిభుండనె నివ్విధంబుగాన్ 83

చ. మునివరుడైన నారదుఁడు • మూర్ఖత, నాకధరాధిపత్యమున్
మనమునఁగోరి ఘోరముగ • మంచుమలన్ దపియించుచుండె నీ
యనుచరరాజిఁ దోడ్కొనిర • యమ్మునినమ్మునిఁ జేరికామవే
దనకు వశున్బొనర్చి బలి • తంపు తపమ్మును వమ్మొనర్పుమా! 84

మ. అని పంపన్ మరుఁడంతమాధవుఁ ప్రియా • మాధీశు గంధానిలున్
దనవెంటన్ గొనిపోయి మౌనివరుచి • త్తంబుత్తలంబొందిస్త్రీ
జనతాసక్తముగాఁగఁజేయఁగడఁగన్ • సర్వేశ్వరానుగ్రహం
బున నమ్మౌని రవంతయేనిఁ జలనం • బున్ జెందకందుండుటన్ 85

చ. కని మదనుండు భీతిఁగొని • క్రన్ననినింద్రునిఁజేరి తద్విధం
బును నవబోధచేసిచనెఁ • బొల్పగు నారదశక్తి కెంతయున్
మనమున మెచ్చెదేవపతి • మౌని చిరంబు తపించి యంతసి
ద్ధిని గడియించి నానని మ • దిన్ గరువంబువహించి మించుచున్ 86

—* నారదముని, తపస్సిద్ధి యైనదనుకొని త్రిమూర్తులయొద్ద కేగుట *—

క. కాముని జయించితిని యిఁకఁ, గామాదినిఁ బోటిసేయఁ • గంటినిజతపం
బీమాద్రి సిద్ధిఁజెందె నిఁ, కేమని యత్తపసుమౌని • హెచ్చుగుకలిమిన్. 87

శా. కైలాసంబున కేగి యాత్మసుతపో ♦ గంభీరభాగ్యంబు స
ర్వాలంకారుఁ నితోడఁ జెప్పఁటకునై ♦ యచ్చోటికింబోయి య
న్నీలగ్రీవునిఁ జేరి మ్రొక్కి మిగులన్ ♦ నీటొప్ప నాత్మోన్నతిన్
వాలాయంబుగఁ దెల్పెశంకరుఁడు "వా ♦ హ్వా" యంచు హర్షించఁగా. 88

చ. శివుఁడు మునీంద్రుగర్వమును ♦ జిత్తమునందు నెఱింగియున్ గడున్
బ్రవిమలమైనభక్తజన ♦ వత్సలతన్ విడనాడకమ్మని
ప్రవరునితోడ నిట్లనెఁ జి ♦ రంబు తపంబొనరించి సిద్ధివై
భవమును జెందితీవు ముని ♦ వర్య! కడున్ గడు సంతసించితిన్. 89

క. ఐన నొకమాట సెప్పెద, మానసమున నుంపుదీని ♦ మఱవకు మెపుడున్
మౌనీంద్రా! వైకుంఠుని, తో నుడువకు నీతపంబు ♦ తోరపుసిద్ధిన్. 90

క. అనిబోధించిన విని ముని, మనమున నదిలెక్కగొనక ♦ మఱియుఁ గమలజ
న్మని యొద్దకేగి యట్టులె, తన కామజయంబుఁ దెలుపఁ ♦ దద్జ్ఞుఁ డతండున్.91

క. శంకరు ననుగ్రహంబునఁ, బంకజసాయకజయంబు ♦ వాటిలెమునికా
వొంక మెఱుంగకయితఁడిటు, మంకుతన మ్మొందె వదరు ♦ మాన్పెద నిట్టుల్.92

క. అనికొని నారదమునితోఁ, ననియెఁ గుమారా! మహేశ్వ ♦ రానుగ్రహమ
ట్లనువుగ మన్మథ జయమ్ముల్, బొనరించిన దండుఁగులుకఁ ♦ బోకుమెడందన్ 93

ఉ. మున్నట శంకరుండు తప ♦ మున్ బొనరించుచునున్న మన్మథుం
డన్నిటలాక్షు గెల్వఁజని ♦ యంతముఁ జెందెఁ దదీయదేవియా
పన్నగభూషణుల్ గొలిచి ♦ భర్తననంగునిగాఁగ నొందెనా
పున్నెపుభూమి శాంకరవి ♦ భూతిజయించితి వీవు కామునిన్ 94

క. చను మదరిపాటుఁ జెందకు, తనుజ! యనుడు నారదుఁడు హి ♦ తవునరయక య
వ్వనజాక్షుని చెంగటకే, గిన నాతండరసి వేడ్కఁ ♦ గీల్కొను మదితో. 95

ఉ. ఏమి మునీంద్ర! లెస్సె? యిపు ♦ డెచ్చటనుండి మదీయధామమున్
బ్రేమమునిూఱఁ జేరితివి ♦ పెద్దయుఁ బ్రొద్దులు మంచుఁగొండలో
నేమమునిూఱఁగాఁ దపసు ♦ నెగ్గఁగఁ జేసితివయ్య!నీవు దీ
టేమహిఁవచ్చునే పెఱ ఋ ♦ షీంద్రులలో నొకఁడేనిఁ జూడఁగన్ 96

—* నారదుఁ డహంకరించుట *—

ఆ. అని బహూకరింప ♦ నమ్మౌని పొగరునఁ, దనదుతపసు పెంపుఁ ♦ దమ్మివిల్తు
గెలుపు హెచ్చుమిూఱఁ ♦ గేరుచుఁ జెప్పెను, హరియు వినియె మంద ♦ హాసమలర.

వ. అంతఁ బుండరీకాక్షుండు,

క. విని యెందజయ్యమైన శి, వుని మాయాసరణిఁదపసి ♦ పోలుపజేయిట్టుల్
మనసిజుని నిల్వరించితి, నని సారకోఁతలను♦గోయు నజ్ఞతబలిమిన్. 98

గీ.అనిమనంబునఁదలఁచిది♦వ్యబుషియుల్ల,మలరఁగాఁబల్కె మునియనుహారుస హెంది
కంజనయనునితోఁ నవె ♦ గాముఁడేమి. సేయగలఁడు మహాత్మక! ♦ చేవమీాజె.

క. అని గర్వపడి మునీంద్రుఁడు, చనియెను దనయిచ్ఛకలిమిఁ♦జక్రాయుధుఁడ
మ్మునిపైఁగినిసి శివేచ్ఛన్, దనమాయనుద్రోవలోనఁ♦దనరఁగఁజేయన్. 100

మ. హరినిన్ బాసి మునీంద్రుఁడెందొచనఁబో ♦ నధ్వంబునందొక్కచోఁ
బుర మొక్కండగుపట్టెఁ గర్బురమయ ♦ ప్రోత్తుంగహర్మ్యంబు సుం
దరనారీనరవర్గసేవితము నా ♦ నావస్తువిస్తారబం
ధుర మత్యద్భుతమై భవంబుమునియు ♦ ద్భూతాభిలాషాత్ముఁడై . 101

—* నారదుఁడు శ్రీమతినిఁజూచి మోహించుట *—

మ. నగరున్జొచ్చి నరేంద్రమందిరము నొం ♦ దన్ బోవఁగానందు భ
వ్యగుణుం డప్పురినేలు శీలనిధియన్ ♦ బ్రఖ్యాతభూనేత రూ
పగుణాలంకృతమైన శ్రీమతియనా ♦ బాలన్స్వకీ యాత్మజన్
దగురాజన్యున కీయఁగోరి పురమ ♦ త్యంతంబు గై సేసియున్ 102

ఆ. రాజవరులనెల్ల ♦ నోజమైఁ బిలిపించి, తగస్వయంవరముఁ♦బొ సఁగఘటించి
పుత్రిహస్తమందుఁ ♦ బూదండనిడిమది, కిష్టమైనవాని ♦ కేయుమనియె. 103

ఉ. అత్తఱిమానియున్ జెదరి♦నట్టిమనంబున నందుఁజేర రా
జోత్తముఁ డాతఁడమ్మునికి ♦ నొప్పగ బాద్యము నర్ఘ్యమిచ్చి మేల్
మ త్తెపుగద్దె యెక్కనిడి♦పుత్రినిఁ దోడ్కొనివచ్చి మానిరాట్
సత్తము పాదపద్మములఁ ♦ జక్కఁగ మ్రొక్కఁగజేయ నాతఁడున్ 104

ఉ. కన్నెనుజూచి యచ్చెరువుఁ ♦ గాంచి మునీంద్రుఁడు మన్మథాస్త్రసం
పన్న మనంబుతో నృపతి♦వర్యునికిట్లనెఁ బార్థివేంద్ర! యీ
సన్నుతగాత్రి దివ్యతను♦జాతవలెన్ గనుపట్టుచున్న దీ
చిన్నది యెవ్వతోచెపుమ ♦ చెచ్చెర ముచ్చటమీఱనాకుఁకన్.

వ. అనిన నజ్జననాథుం డిట్లనియె.

క. అని యగ్నికగ్గమగు న,మ్మునిజనులన్ గాంచి యజుఁడు భూరితరకృపన్
గొనకొని జతనము నారసి, యనె నిట్టుల జడుపు నుడిపి యతివేగమునన్.

మ. శివ నర్థింపుఁడు వేగ యీశ్వరి కృపాశీలాత్మ గుహ్యాకృతిన్
శివలింగంబును దాల్చి ప్రోఁచు నితరస్త్రీల్జాల రాలింగమున్
శివగుహ్యాకృతిఁ జెంద నందు నిలుపన్ జేట్పాటు దప్పున్ వడిన్
భువనంబుల్ సుఖమొందు లాఁతి తెఱఁగేన్ బోదార్తి యెందేగినన్. 310

వ. అంతదనుక

గీ. అష్టదళమేసి యొక కుంభ మచట నునిచి
పంచపల్లవములను దూర్వాయవాంకు
రములఁ జేరిచి గంగోదకముల నింపి
వేదసూక్తుల మంత్రించి వినయమెసఁగ. 311

క. నతిఁ జేసి లింగమునకున్, శతరుద్రియమున నీట స్నాతమొనర్పన్
హితమతితో లింగంబీ, గతినిఁ దొరఁగి శాంతి నించుకన్ గాంచు వెసన్.

—* సముచితార్చనచే శివలింగంబు శాంతిఁ జెందుట *—

వ. అటుమీఁద నేఁ జెప్పినయట్లు పరమేశ్వరీ పరమేశ్వరుల సేవించి తత్కృపాను
భావంబున లింగంబునకు శాంతిఁ గూర్పుండనిన మునులు పరమేష్ఠిన్ బురస్క
రించుకొని తదుక్తప్రకారంబున జగన్నిదానులగు మహేశ్వరీ మహేశ్వరుల
నర్చించిన నవ్వార లిర్వురు దయామయులై పొడసూపి యందు పరమేశ్వరి
యోన్యాకృతిన్ శివలింగంబు నాకర్షింప నయ్యది యందుఁ జేరి సుప్రతిష్ఠితంబై
శాంతిఁ జెందె నంత మును లా యుమామహేశ్వరాత్మికంబగు లింగంబుఁ
బూజించి మ్రొక్కి యిట్లనిరి. 313

చ. ఎఱుఁగక తప్పుఁ జేసినను నెంతయుఁ గూరిమి పేర్మిఁ బిట్టు లా
దరమునఁ బ్రోచు నెంతటి యుదారమనంబొ? ప్రశంస చేయఁగా
దరమొకొ! మాదృశాజ్ఞులకు దర్పకశాసక! దేవదేవ! నిన్
శరణము నొందినార మపచారసహస్రములన్ క్షమింపుమా! 314

క. తలిదండ్రులు లోకమునకుఁ, దలిదండ్రులు సర్వదేవతాతతి కీరల్
తలిదండ్రుఁ లౌట మాకటు, గలుషాత్ముల మమ్ము నెమ్మిఁ గాచితిరి ప్రభుల్!

గీ. అని నుతులు చేయుచున్న మ•హర్షివరుల, కీశ్వరేశ్వరు లభయంబు•నిచ్చి వేగ
నంత నంతర్థినొందిరి • యఖిలసురలు, చేరి లింగంబు నర్చన•చేసి రపుడు.

ఆ. ఆ యుమామహేశ్వ•రాత్మకంబైన యా,లింగ మద్ది శివుల • లీలమెఱయ
హాటకేశలింగ • మని పేరు చెంది లో,కముల నోముచుండెఁ • గరుణతోడ.

వ. మునులుఁ బరమేష్ఠియు నిజనివాసంబులఁ జేరి సుఖంబుండి రీయదియే లింగోత్పత్తి
కారణంబనియు నీ లింగరూపంబును నెల్లలోకంబులవా రర్చించుచుండిరనియుఁ
జెప్పుదురు. మఱికొందఱు విజ్ఞమూర్ధన్యు లిట్లు వేఱుతీరు చెప్పుదు రారయుఁడు.

క. హరుఁ డాద్యంతంబులఁ దాఁ, బొరయక చెలువొందు నట్లె • పొంకపు సిరి సే
కుఱులింగముతుద మొదలులఁ, దొరయక యున్నందునఁ గొలు•తురు ప్రతికృతిగాన్

క. తొల్లి విధి విష్ణులకు నని, పెల్లగుడు నఖండదివ్య•పృథులింగంబై
డిల్లఁబడఁ జేసి వారల, జల్లార్చెఁ దదాజి శివుఁడు • జగములు మెచ్చన్. ౩౨౦

వ. ఇట్లు లింగోద్భవంబు మొదలెల్లలోకంబులవా రఖండంబగునట్టి లింగంబు నర్చిం
చుచుండి రిది లింగస్వరూపచరిత్రం బిఁకేమడుగుదు రన శౌనకాదులు సూతుని
కిట్లనిరి. ౩౨౧

## —* లింగోద్భవచరితము *—

క. అవ్వనజాతుని కజునకుఁ, జివ్వాపోసఁగ శివుఁడు గడిఁది•సిరిలింగంబై
యవ్వారి పోరు వాపిన, యవ్వాసి నెఱుంగఁ జెప్పు•మయ్యా! యఖిలమున్. ౩౨౨

మ. అనుడున్ సూతుఁడు హర్షమొంది మునులా•రా! చెప్పెదన్ విశ్వభా
వనుఁడౌ శర్వుని మేలిలీల వినుఁడీ • పద్మోద్భవుం డొక్కవే
ళను రాయంచను నెక్కి యుక్కున సురల్ • శంసాధ్వనుల్ సేయ లో
కనికాయంబును జూచు వేడ్కఁ దరలెన్ •గాంతాసమేతంబుగాన్. ౩౨౩

చ. చనిచని దివ్యలోకముల • సప్తఋషీశ్వరమండలంబులన్
దినకరముఖ్యగోళముల • దేవధునీతటవాటికావళిన్
గని మురిపంబుమీఱ సుర•కాండసమర్పితభూరిసత్కృతుల్
గొనుచు నితాంతకౌతుకము • గుబ్బటిలంగఁ జరింపుచుండఁగాన్. ౩౨౪

ఉ. అంతకుమున్న సారసద•ళాక్షుఁడు చక్రి రమాసహాయుఁడై
యెంతయు వేడ్కఁ బక్కిపయి • నెక్కి యిటుల్ భువనంబు లన్నియున్

బంతులగఁ జూచిచూచి నిజ • వాసముఁ జేరఁగఁ బోవుచుండఁగా
నంతట దైవయోగమున • నంబుజసంభవుఁ గాంచె నొక్కచోఁ. 325

—* బ్రహ్మ విష్ణుల కలహము *—

చ. కని ముదమొంది పుత్రకుని • గారవమున్ బొనరంగ డాసి నం
దన! సుఖమే? యటన్నఁ గడు • దర్పముతోఁ దుత సర్పమట్లు చి
వ్వునఁ గినుకన్ వచించె నిటు • పోటుతనం బిది యేటికోయి? నీ
తను విది కూల్తునా హరియుఁ • దద్దయు నాగ్రహపూరితాత్ముఁడై. 326

చ. కొమరుఁడవంచు నాకుఁ గడుఁ • గూర్చెదు చుట్టమవంచు మించుకూ
రిమి నినుఁ బల్కరించఁగ మఱిన్ మఱి • మీఱి దురుక్తులాడెదే?
రమ యలుగంగనీ భువన • రాజి గలంగఁగనీ దురాత్మ! మ
స్తము నిదె తుంచివేసెదను • జక్కఁగఁ గన్మది చక్రిధారచే. 327

వ. అనిన సురజ్యేష్ఠుం డిట్లనియె.

చ. తనుజుఁడ నెట్లు నీ కనుచి • తంబనియెంచక మాటిమాటి కి
ట్లనెదవు కశ్యపాత్మజుఁడ • వర్భక! యేను బితామహుండ నీ
కనిశము పూజనార్హుఁడ సమ • స్తము విస్మరణం బొనర్చి డీ
కొన గమకించెదే! యయినఁ • గొంకక నిల్వుము చెల్వ సూచెదన్. 328

క. మఱియును సర్గాదిని నే, గఱువతనం బమర వికచ • కమలదళాక్షా!
యుఱవుగ సృష్టియొనర్చితి, నెఱుఁగవె యలనాఁటి విధము • నెల్ల మనమునన్.

క. అనుడు హరి యదితిపుత్రుల, ననటను బోనడవఁ దలఁచి • వాస్తవముగ నం
తను నొక్కఁడు గైకొనినం, దనధర్మము నట్లు చెంది • నాఁడ నదితికిన్. 330

వ. ఇంకను

క. నను సర్గాదిని బుట్టిం, చినవాఁడవె? దుడుకుఁదనముఁ • జెంది యిటుల వె
న్కనుముందుఁ గనక వాగెదు, వనునొకొ! మన్నాభిపద్మమందుఁ • బొడమియున్

వ. అనిన నతండును

క. నేనును నట్లే చెందితి, నీనలినోదరమునందు • నీరజనేత్రా!
కానక పరపరిమాణము, నూనుఁడ నూనుఁడ యటన్నఁ • జొప్పదు నెట్టుల్

క. నీకొక్కనికే గాక న్నృ,లోకమునకు సర్వదివ్యలోకమున కహీ
డ్లోకమునకు సర్వమునకు, శ్రీకాంతా! కర్త నేను సిద్ధము వినుమా! 333

చ. అన నవు డేను నేనలఁతి వల్లుఁడ నిల్వుము నిల్వు త్రుళ్ళడం
తును నదియేనొనర్తు నని దోర్బలగర్వవిఘూర్ణితాస్యులై
యనికిఁ గడంగి యంపఁగమి నార్చుచుఁ బేర్చుచుఁ గ్రుమ్మరింపుచున్
వెనుగనకే యహర్నిశలు వేలకువేల్ వెడలించి రబ్దముల్. 334

క. వైరించులు వైష్ణవులును, సారెకు బలదర్పవేగ శౌర్యోన్నతులన్
మీఱుచుఁ బోరుచునుండిరి, భూరితరగదాసికుంత పుంజంబులచే. 335

క. వారల సమరముఁ గనదై, వాఱెడు వేడుక సుపర్వవర్యులు చదలన్
జేరి విమానంబుల న, వ్వారల వారలను గనుచు వర్తిలి రెలమిన్. 336

ఉ. దానవసూదనుం డపుడు తద్దయుఁ గ్రుద్ధతమీఱి ధాతపైఁ
గానఁగరానియట్లు శరకాండములన్ బరఁగింప నాతఁడున్
మానక విష్ణువక్షమున నాటఁగ నింపెను మేటిభల్లముల్
మానసమందు వేల్పు లసమానమహాద్భుత మొంది రోలిమై. 337

మ. అఁతనీ దైత్యకులాంతకుండును మహాశాస్త్రంబు యోజించి దు
ర్దాంతుండై పరమేష్ఠిపై విసర నుగ్రస్ఫూర్తిఁ బద్మోద్భవుం
డంతే నల్క వహించి పాశుపతమస్త్రీశంబు బిట్టేయఁగా
గంతుల్ వేయుచు వేయితీర్లఖియునుం గాటంబుగాఁ బోరుఁడున్. 338

క. పదివేల వివస్వంతుల, నొదవెడు తేజంబు పొదల నువ్వెత్తుగ న
ప్పదనున నస్త్రద్వయమది, కదనము సేయంగ బెదరుఁ గాంచి నిలింపుల్,

ఉ. అక్కట! బ్రహ్మ విష్ణు లిటు లంతముగానని యాజినొంది యి
ట్లెక్కువమైన నస్త్రముల నేసిరి వాసిదొలంగి లోకముల్
నిక్కము వీని మంటకు నెట్టనరూపఱు నిప్డె మేము నీ
యుక్కకుఁ జత్తుమంచుఁ గడు నుక్కిరిబిక్కిరియౌచు నార్తతన్. 340

చ. కలఁడు గదా మహేశ్వరుఁడు కాలహరుండు హరుండు సర్వమా
యలఘునిచేతనే పొడము నట్టలె పెంపగు నాశమొందుఁ గ
న్నుల కగుపట్టకే చను ననుగ్రహమొందును సర్వకార్యకౌ
శలుఁడు దయామయుం డతని సన్నిధి కేగి వచింత మీస్థితిన్. 341

....* దేవతలు శివునితో బ్రహ్మ విష్ణువుల పోరు మాన్పుమని యర్థించుట *....

చ. అని మది నిశ్చయించుకొని • యా నిముసంబున రాజతాద్రికిన్
జని వడి నందిసెల్వుఁగొని • శంకరు నానతశంకరున్ దయా
ఘనుఁ గని జోతచేసి యజ•కంజదళాక్షుల ఘోరజన్యమున్
జనముల యార్తినిన్ దెలిపి • సత్వర శాంతినిఁ గోర భర్తయున్. ౫౪౨

ఉ. ఇంతకుమున్నె యారయుదు • నీ సమరంబును లోకదుఃఖమున్
జింతిలుచుంటి దీనికయి • చెన్నుఁటులై యల వార లిర్వురి
న్లెంతయు వంతఁగూర్చిరిఁక • నే నడగించెద వీరిగర్వమున్
బొంతమువీఁడ లోకసుఖ•మున్ బొనరించెద దేవపుంగవుల్! ౫౪౩

సీ. డమరుక భేరీప•టహ కాహళమృదంగ, వేణువీణాధ్వనుల్ • వెలసిమ్రోయ
చిత్రధ్వజంబులు • సింగారపుంజామ, రములు వీవసలొంది • ప్రమథులమర
నలుదిక్కులందును • నాల్గుప్రామినుకులు • నొడికార మొప్ప సన్నుతులుసేయు
కై దండఁజేకొని • కాదంబవనరాజ్ఞి, జగదంబ దాపల • సందడింప

గీ. పలువిధములగు వాహన•ప్రతతులొంది, పొందుగా గణపాలురు•ముందునడువఁ
బంచమండలయుతమును•బ్రణవరూప, మైన తేరెక్కి శివుఁడు ప•యనమొనర్చె.

ఉ. కత్తియుఁ గత్తళంబు సురి•కల్ ధరియించి శిలాదసూతి బల్
హత్తిన వేడ్కఁ • బారిమదు•లన్ గణపాలురఁ జక్కఁజేయుచున్
మిత్తికిమిత్తి కాఁ శివుని • మేలిమిసన్నలతోఁ బ్రయాణము
దృత్తరభంగిఁగూర్చెఁ దృటి•యందు రణోర్విని జేరి రందఱున్, ౫౪౫

వ. తత్కాలంబునందు శివుండు తన జనంబుల నెల్ల నించుక దవ్వులనే నిలిపి.

....* తేజోలింగోద్భవము *....

గీ. అమ్మహేశాస్త్ర పాశుప•తాస్త్రజనిత, ఘనతర జ్వాలలను హరి•కమలభవులఁ
గాంచి వాద్యధ్వనులను జా•లించిమించి, యగ్నిలింగమై యచ్చట•నవతరించె.

క. అగ్నిస్తంభాకృతి ను,ద్విగ్నులవగ నడఁప విష్ణు•విధుల యహమికల్
భగ్నముసేయఁగ గరుణా,మగ్నమతిన్ లింగమై య•మరె శివుఁడంతన్. ౫౪౭

గీ. ఆ మహేశాస్త్ర పాశుప•తాస్త్రములు జ
వంబుతో నష్టె యగ్నిలిం•గంబుఁ జెంది

యందె యంతర్హితుం డెందెఁ బద్మాక్షు పద్మ
భవులు లింగంబు నాకృతిఁ బాఱఁజూచి. 349

చ. తుద మొదలుం గనన్‌బడవు దొడ్డగ నాకస మంటియుండె ని
య్యది హరియించె నస్త్రముల నారయఁగాఁదగు నాది యెచ్చటో
యెదియొకొ యంత్యభాగమని యిర్వురు చాల దిదృక్షఁ జేసి య
య్యదనున నే ప్రయాణము రయమ్మునఁ జేసిరి వాసిమీఱఁగన్,

—* లింగాద్యంతంబులఁ జూచుటకై బ్రహ్మ విష్ణువులు ప్రయత్నించుట *—

ఉ. అంచ యొకండుగాన మఱి యంతుఁగనన్ జదలొందుచుం బ్రయ
త్నించెను నల్వ యల్ల కిటిదేహముఁ జెంది మొదల్ గనంగ గోనన్
గాంచనచేలుఁ డెంతయును గాశ్యపిఁ ద్రవ్వుచుఁ బోవుచుండె న
ట్లెంచఁగరాక వత్సరము లెన్నియొ దాటుచునుండెఁ బర్వునన్. 351

శా. పెక్కుల్ వర్షము లిట్లు విష్ణుఁడు ధరన్ భేదింపుచున్‌బోయి తా
నక్కాలాంతకలింగమూర్తి యడుగానానున్ గనఁ దక్క తా
నుక్కున్ గోల్పడి చిక్కి వేసరలి యా యుద్ధోర్విసిన్ జేరి స
మ్యక్కౌశల్యమతిన్ వసించె మది విశ్వాత్మున్ శివున్ మెచ్చుచున్. 352

క. ఎగిరి యెగిరి బమ్మయుఁ దా, నగణితమగు నంబరమున నరిగి యరిగి యెం
దగుపట్టక లింగాంతము, మిగిలిరె యలరుటను గాంచి మిడుకుచునుండన్. 353

....* కేతకీ సమావేశము *....

గీ. కేతకీపుష్ప మొక్కండు ధాతకప్డు
గానుపట్టుడుఁ బరికించి కరము మురిసి
దఱిసి పుష్పేశ! యెటనుండి తరలితీ వ
నుడు నదియు లింగమధ్యంబు నుంచి యనియె. 354

క. మొదలెక్కడ? యన నాతని, కదియనె నేనెఱుఁగ నీవు నారయలేవీ
వెదకుమదిఁ గట్టిపెట్టుము, పదిలంబుగ నిల్లుఁ జేరు పద్మజ! యనినన్. 355

ఉ. సాప్తపదీన మంత్రుడు వినుము సఖ్యము నెచ్చెలివైతి వీవిఁకన్
గోప్తవుగమ్ము రమ్మ ధరకున్ శివమస్తముగంటి నందు నీ
వాప్తతమీఱ సాక్షివయి యద్దినిజంబనిపల్కి నాకు సం
తృప్తియొనర్పుమన్నఁ దలఁ ద్రిప్పెను ద్రోయఁగలేక యద్దియున్. 356

—* లింగశిరంబుఁ జూచితినని బ్రహ్మ బొంకుట *—

ఉ. అంతఁ బితామహుండును బ్రియమ్మునఁ బృథ్వినిఁ జేరి మీఁటి యం
దంతకము న్నెయున్న కమలాక్షునిఁ గన్గొనివల్కెఁ గంటి లిం
గాంతము కేతకీసుమము నారయఁ డీయదిసాక్షిఁ యన్న నా
వంతయుఁ గొంకకట్టులది వల్కుటకుల్కి సరోజనాభుఁడున్. 357

ఉ. ఓడిలి ధాత! నీవ కడు నుత్తమమూర్తివి పూజసేతు నేఁ
జూడఁగలేదు మూలమున శూలధరుం డట దోఁచి మెక్కడౌ
వేడుకతోఁ బ్రసాదమును వెన్నునిపై వెలయించి ధాత య
క్కూడని చెల్వుపైఁ గినిసి క్రుద్ధతరాద్ధమహాజవంబునన్. 358

శా. భ్రూమధ్యంబుననుండి భైరవు మహాప్రోచ్చండహుంకారలీ
లామాద్యద్రవు వెల్వరింపఁ నతఁ డుల్లాసంబునన్ ఫాలమున్
భూమిన్ సోఁకఁగ మ్రొక్కి యొక్కపని కేవున్ మీఁట శాసింపు దే
వా! మోదంబునఁ గూర్తు నొక్కనిముసంబం దిద్దె వేగోన్నతిన్. 359

*గీ. అనుడు శివుఁ డిట్టులనె వత్స! యరయు విధిని
జగములకుఁ దొలివేల్పును జంక కితని
వాఁడియసిధారఁ గొలువు జీవంబుమీఁఱ
ననుడు విధికేశ్యమున్ బట్టి యతఁడు వేగ. 360

క. ఏ శిరమున బొంకాడెనొ, నా శిరమున్ జదిపి తక్కినశిరంబులనున్
నాశముసేయఁగఁ గడు నా, వేశముతోఁ గత్తిసెత్త విధి యార్తుండై. 361

చ. మదమును బాసి "భో వరద! మాంకరుణాకర పాహి" యంచుఁ ద
త్పదములఁ వ్రాలె వెన్నుఁడును భర్గునిఁ జేరి నమస్కరించి పెం
పొదవఁగఁ గావు మింక నజు నూడఁగఁ జేసితి పాపము స్తముఁ
సదయుఁడ! నీవుగా కెవరు సాఁకఁగలా రిటు లార్తపాలనా! 362

గీ. అని నుతించినయంత దేవాధినాథుఁ, డపుడు భైరవు వారించి యజునకనిమె
గొప్పరోసరమై యిట్లు తప్పుదారి, తొక్కితివిగాన నిప్పుడీ పొక్కసూపె.

---

* శివపురాణే – విద్యేశ్వరసంహితాయా మష్టమాధ్యాయే – శివః.
శ్లో॥ వత్స సోయంవిధిసాక్షా! జ్జగతా మాద్యదైవతం । నూనమర్చయ ఖడ్గేన ।తిగ్మేన జవసాపరః।

....* యజ్ఞాంతంబులఁదక్క బ్రహ్మ కపూజ్యత విధించుట *....

ఉ. ఇంతియకాదు నీకు గుడి • యెవ్వరు గట్టరు పూజసేయఁబో
రెంతయుఁ దావకోత్సవము • లెవ్వరునున్ బొనరింప రింక య
జ్ఞాంతములందుఁ గర్మనిచయాంతములందును నీకుఁ బూజఁ గా
వింతురు లేకయున్నఁ జెడు • విశ్వమునన్ సకలక్రియాతతుల్. ౩౬౪

వ. అని యిట్లఖిలేశ్వరుండు బ్రహ్మయెడ నిగ్రహానుగ్రహంబులు బఱపి కూట
సాక్షియగు కేతకిం గాంచి యిట్లనియె. ౩౬౫

—* శివుఁడు కేతకిని శపించుట *—

క. కేతకి! యంహోభీతిని, ఖ్యాతినిఁ బోవిడిచి కల్లలాడితి విట్టుల్
పాతకి! నిను నేఁ దాఁకను, నీతముగా నాదుపూజ • నీకు వెలియగున్. ౩౬౬

క. అని శపియించినఁ గేతకి, మనమున నారటము నొంది • మన్మథహరుఁ గ
న్గొని దేవర! క్షమియింపుం డనదపయిన్ గినుకదగు నె • యధిపున కెందుకా.

గీ. కలుషమోమాటమునఁ జెట్ట • నాకుఁ బొడమెఁ
బాపలంబునఁ దలిలి యసత్యవచన
మాడితిని నేను మన్నించి • యభవ! కరుణఁ
బఱపు శాపంబుఁ ద్రిప్పము • గరిమ దనర. ౩౬౮

చ. అని యిటు నేల్బ్రవాలి శరణాగతయై బ్రతిమాలు కేతకిన్
గని హరుఁ డిట్లనెన్ దృఢముగా నినుఁ దాఁకను నేను మత్కుటుం
బినియుఁ దనూజులున్ బ్రమథ • వీరులు దాల్తురు పొమ్మనెన్ ముదం
బునుగని యంత నయ్యెడియుఁ • బోయెను శంకరులీలఁ బాడుచున్.

....* బ్రహ్మవిష్ణ్వాదులు తేజోలింగంబుఁ బూజించి వరము లొందుట *....

గీ. అపుడు హరియు విరించియు నఖిలదేవ, గణము లర్చనవస్తువర్గంబుఁ గూర్చి
యభవలింగంబుఁ బూజింప నాదరమున, హరుఁ డువరమిత్తుఁ జెపుఁ డన్న నలరి వారు

క. ఈలీల దేవవల్లభ!, యీలింగాకృతిని నలరుమిట నిశ్చలనన్
బాలింపుమది శివుఁడు తేజోలింగమునంగ నుండు. • సూక్ష్మాకృతినై. ౩౭౧

వ. అనాద్యంతంబగు నీయాకారంబును మాటుపఱచి సూక్ష్మలింగంబునై యఖిల
జనార్చనంబులఁ గొనుచు నెల్లలోకంబులవారికి భోగమోక్షంబు లిచ్చు

చుందును. అగ్నిపర్వతసదృశంబైన లింగంబునై యిందు మార్గశీర్షార్ద్రానక్షత్రంబున నుద్భవించుటంజేసి యాక్షేత్రం బరుణాచలంబున ఖ్యాతిజెందు నిట తీర్థంబు మహత్తరంబై భుక్తిముక్తిజనకంబై తనరారు నిందు మార్గశీర్షార్ద్ర యందు నన్ను దరిసించినవారు నాకుఁ గుమారతుల్యులై యొప్పుదురా దినంబున నన్నుఁ బూజించినవారలు వాగగోచరంబగు ఫలంబు నొందుదురు. మఱియిందలి దానహోమానుజపంబులు కోటి గుణితంబులై ఫలంబు లొసంగు మామకీనంబులగు క్షేత్రంబులందెల్ల నిది శ్రేష్ఠతరంబై విరాజిల్లుచు జనంబుల కెల్ల స్మరణమాత్రంబున మోక్షసాధకంబై వెలయునని నొడివి పరమశివుం డంతర్ధానంబు నొందె నంత హరివిరించులు నఖిలసురలును మురియుచుఁ దమ ధామంబులఁ జేరి రీలింగోద్భవచరిత్రం బెవ్వరేనిఁ జదివిన వినిన నవ్వారికిఁ బరమేశ్వరుండు సకలశ్రేయంబు లొసంగుననుడు మునులు సూతునకు మహాత్మా! మున్ను శివలింగంబు నర్చించి శ్రేయోబలంబులఁ గొన్నవారెవ్వరో యట్టి వారిని వరుసగా వినఁదలతు మెఱిఁగింపుమనుటయు సూతుండవ్వారికిట్లనియె.

— * శివభక్తానుక్రమణిక * —

క. రమతో హరియును వాణీ, రమణీమణితోడ నజుఁడు రహిని వశిష్ఠా
దిమునులు సధర్మిణులతోఁ, గమలహితాహితులు మున్ను గాఁగలగ్రహముల్.

క. కుంభభవుఁ డాత్మసతితో, జంభారిప్రముఖులైన సర్వదిశుల్
కుంభిని కుదకము దెచ్చిన, యంభోజజనిభుఁడు గౌతమార్యుఁడు సతితోన్.

సీ. దూర్వాసుఁడును నలయార్వుండు నారద,ముని బృహస్పతి శక్తిముని పరాశ
రమునియు నల్ల పారాశరి శుకుఁడును, భార్గవుండు దధీచి గర్గఋషియు
వామదేవుఁడుయాజ్ఞవల్క్యుఁడు జైమిని, యుపమన్యుఁడునుశిలాదోగ్రమూర్తి
నందికేశ్వరుఁడుసానందుఁడత్రిమృకండ,మునియు మార్కండేయమునియు గాధి

గీ. జుఁడును జమదగ్ని పరశురాముఁడును శ్వేత
కేతుఁడును శౌనకాది విఖ్యాతఋషులు
లింగపూజను సల్పి సిద్ధిం గనిరి మ
హామహులు వారిఁ దలఁచిన నఘము దొలఁగు. ౬౯౬

క. మఱి యష్టవసువులును దుం,బురుఁడును గంధర్వసాధ్యముఖులెల్లరు గి
న్నరులును జారణులును గిం,పురుషులు శివలింగమూర్తిఁ బూజించి రోగిన్.

క. నరనారాయణఋషులు బదరికావనమందుఁ దనరి దారుణనిష్ఠన్
పరమేశ్వరలింగంబును, నిరతమునున్ గొలుచుదురు మునివరేణ్యమణుల్!

గీ. శేషవాసుకి తక్షకుల్ శ్రీపవాహ
నంబయి యొసంగు నల సుపర్ణప్రభుండు
ఘనుఁడు స్వాయంభవుండునౌ మనువునుం బ్రి
యవ్రతుండును నాతని యనుజుఁడెలమి. 378

వ. మఱియు నౌత్తానపాది యగు ధ్రువుండును వృషభుండును భరతుండును శివ
లింగంబులఁ బూజించి సిద్ధులం గాంచి రిఁకను. 379

చ. మునుకొని యా హిరణ్యకశిపుండు తదాత్మజుఁడున్ విరోచనుం
డనఘచరిత్రుఁడైన బలి యాతని పుత్త్రుఁడు బాణదైత్యుఁడున్
ఘనుఁడగు రావణాసురుఁ డకల్మషుఁడైన విభీషణుండు నిం
పున శివలింగపూజనముఁ బూని యొనర్చి రనారతంబునున్. 380

సీ. వైవస్వతమను విక్ష్వాకు కకుత్స్థ మాంధాతలు ముచికుంద ధరణినాథుఁ
డా హరిశ్చంద్రమహారాజు కల్మషపాదుండు సగరభూపాలకుండు
అల భగీరథుఁడు ఖట్వాంగుండును దిలీపనృపుఁడు రఘుండజనృపతి దశర
థనృపాలకుండును దాశరథియు ననుజులును దత్పుత్రులు సూర్యవంశ

ఆ. రాజవర్యులెల్ల రాజవంశాగ్రణి
యగు పురూరవుండు నసముఁడైన
నహుషుఁడును యయాతి నలుఁడుఁ జంద్రాంగదుం
డల్ల పాండునృపతి యతనిసుతులు, 381

క. శ్రీకృష్ణుఁడు ప్రద్యుమ్నుం, డా కృష్ణునిఁ జెనయు సాంబుఁ డల్లజనకను
శ్లోకనృపాలుండు పర, శ్రీకజరాసంధనృపతిశేఖరుఁడెలమిన్. 382

వ. వీరు నా రన నేల? సుప్రసిద్ధమహాపురుషు లందఱును దత్సతీమణులును 383

క. శివలింగపూజనంబును, నవధానముతోడఁ జేసి యా యా సిద్ధుల్
వివిధసుఖంబుల ముక్తివి, భవమును నార్జించి రట్లు పావనచరితుల్. 384

వ. ఇఁక నేమి విన గోరుదు రనిన సూతునకు దయాళూ! తనివిచాలదింకను గొన్ని
లింగవిశేషంబుల నెఱింగింపు మనుటయు సూతుండు మునుల కిట్లనియె. 385

## —* అంధకేశ్వరలింగచరిత్రము *—

ఉ. సాగరతీరమందు నొక • చండబిలంబున నంధకుం డనా
గ్రవేఁగగు రక్కసుం డొకఁడు • వీరుఁడు సర్వసురాళిఁ గొట్టి త
ద్భాగతసర్వసంపదలఁ • బూర్తిగఁ గైకొని యెల్లవారలన్
గ్రాఁగఁగఁజేసి తద్ధనముఁ • గావలుఁడై కొనుచుండె నుద్ధతిన్. 386

క. పవలున్ రాతిరి గర్తము, న వసించుఁ దదీయ హితజనంబులతోడన్
వివిధజను లులుకుదురు దా, నవుఁ జేతెంచునొకో యని మనంబుల నెపుడున్

వ. అంతఁ గొంతకాలంబు చనినంత

ఉ. దేవతలంతఁగూడి కడుఁ • దెంపు మెయిన్ శివుఁ జేరి మ్రొక్కి య
క్కావలుఁడైన యంధకుని • ఘాతుకరీతినిఁ దెల్పి యబ్బలున్
జావఁగఁజేసి లోకముల • సాఁకుమనంగ ననంగశాసనుం
డావగఁ బావఁగోరి దను • జాగ్రణి ధామముఁ జేరి ధీరతన్. 388

క. సురల ననికిఁ బురికొల్పిన, హరునాసర వాఁడు దురమునం దంధకునిన్
దఱుముడు దనుజుఁడు గర్తముఁ, దఱియఁగఁజన హరుఁడు వాని దర్పంబడఁగన్.

గీ. లాఁగి శూలం బెదఁ గ్రుచ్చ • లావు సెడి ద
నుజుఁడు గూలుటఁగని సురప్రజము వాని
యంత్యదశ నీదు దరిసెనం • బసురేఁ గాన
వాని ధన్యునొనర్పు కృపానిధి! యన. 390

వ. దయార్ద్రహృదయుండగుచు మహేశ్వరుం డద్దైత్యుంగాంచి నీవేమి వాంఛింతు
విచ్చెదఁ దెలుపుమనిన నవ్వాఁ డిట్లనియె. 392

క. నాపేరట లింగమువై, యీ పారావారవరసమీపస్థలియం
దో పరమేశ్వర! వెలయుము, నీ పరమకృపావిభూతి • సెగసి వెలుఁగఁగాన్.

వ. అనిన శంకరుం డామోదించి వానిదేహము నాగర్తమందుఁ ద్రోచి తా నందు
నంధకేశలింగం బను పేరితో వెలసె నంధకుండు శివసాయుజ్యంబునొందె నిఁక
నా యంధకేశలింగంబు త్రిభువనపూజ్యంబై యెసంగె నా లింగంబు భక్తితో
నాఱునెల లర్చించువారలకు సర్వసిద్ధు లొనగూడు. వ్రతార్థ మర్చించినవారు
దేవలకశ్రేష్ఠులగుదురు. 394

—* సుదర్శనుని చరిత్రము *—

చ. పరగ దధీచి నాఁగనొక ♦ బాఁపఁడు సంతత మంధకేశభా
స్వరతరలింగ మర్చనము • సల్పుచు జీవనవృత్తికై యతం
డరిగె మఱొండు గ్రామమున ♦ కాత్మజు నచ్చొట నుంచి, వాఁడును
సరవిగ లింగపూజనము ♦ సల్పుచునుండె యథాక్రమంబుగన్. ౯౨4

ఉ. పేరు సుదర్శనుం డనుచుఁ ♦ బిల్తురువాని, దుకూలనాఁగఁద
న్నారి నికృష్టవంశ్యయగు • నాతుక పెన్మిటి నాత్మవశ్యనిన్
గారచియించె నాతఁడును • గాంతకులోఁగి మెలంగుచుండు న
వ్వారికి నల్వురాత్మజులు • వర్ధిలుచుండిరి యంతమీఁదటన్. 395

వ. కొంతకాలంబునకు సర్వజనసేవ్యంబును మహాపర్వంబును నగు శివరాత్రి యరుదెంచిన. 396

గీ. ప్రొద్దుప్రొద్దున లేచియాభూమిసురుఁడు, శివునికొలువ కేగుచోఁ • జెలువయొద్దు
కూలపెన్మిటి నొడిసి నన్ •గూడి సురత, సౌఖ్యమొనరించిపోవు మెచ్చటికినేని,

క. అని వేగ బలాత్కారం, బొనరించిన నాతఁడల్లె • పొందుగ సౌఖ్యం
బొనరించి యంతగుడికిన్, జని యర్చనచేసె శివుని • జనములు నూడన్. 3౯8

వ. అంత శివుండు క్రుద్ధుండై.

—* శివుడు సుదర్శనుని శపించుట *—

ఉ. ఓరిదురాత్మ! కల్మషమదోద్ధత! హేయచరిత్ర! నేఁడిటుల్
నారినిఁగూడి స్నానము నొనర్పక యే ననుఁబూజఁ జేసితే?
ధీరత యెల్లఁ గోలుపడి • తేజముమాలి జడత్వమొందుమా!
నారియునున్ మదంబఱి మనంబునఁ గుళ్ళునుగాక జెచ్చెరన్. ౯99

వ. అని శపియించిన నాతఁ డల్లే యున్మత్తుండయ్యెఁ దత్పత్నియునుఁ బరితపించుచుండె నంత గ్రామాంతరముననున్న దధీచి యెఱింగి యాతురుండై వచ్చి కొడుకున్గాంచి కోడలి యవివేకకృత్యంబున కనుతాపంబొంది విషాదంబుతో

గీ. శివుఁ డొనర్చిన శిక్షకు • శివ వినాగఁ
బెఱులు దప్పింపలేరని ♦ ప్రియముమెఱయ

నంబికను భక్తిఁ గొలువఁగ • నార్య యపుడు
వచ్చి వరమిత్తు ననుడు న•బ్బాడబుండు. 401

చ, తనయునివృత్తమంతయును • దాఁచకఁదెల్పి యెటేని వాని వ్యా
ధినిఁ దొలఁగించి ప్రోవుమనఁ • దేఁకువతో శివురాణి యట్లుసే
యను శివుసాయ మర్థిఁ బడ•యన్ వలె శంకరు నిష్ఠఁ గొల్వుఁడీ
యనఁగనె వార లీశ్వరుని • నాదరమొప్ప భజింప నాతఁడున్. 402

—* పార్వతీదేవి సుదర్శనుని వటువు నొనర్చుట *—

గీ. వేగవచ్చిన శివయు న•వ్విప్రసూను,దారకునొనర్చి శివుని యు•త్సంగమందుఁ
జేర్చి ఘృతధారస్నాతునిఁ•జేసి యొక్క,జన్నిదంబును మెడవైచి•సత్వరమున.

క. శివగాయత్రీమంత్రము, నవిరళకృపఁజెప్పి విభుని • శార్యా! స్వతనూ
భవు వీనిఁగావునునుడు న,భవుఁ డామోదమున ననియె • బాలకుతోడన్.

గీ. భక్తులిల నాకొసంగిన • వస్తురాజి, నెల్లఁ గొనుచుండు మఘము నీ•కేమిగాదు
నాసమర్చనమున భవా•నీసమర్చ,నమున మఖ్యుండవగుచునుం•డుమజగమున

క. ప్రాజాపత్యంబున నీ, భోజనమే సిద్ధిఁగూర్చుఁ • బొసఁగకయున్నన్
రాజిల దానతము సెడున్, రోజింతురుగాక యటుల • నుర్విజనంబుల్.

క. స్నానము మఱువక వర్తుల, మానటులనఁ దిలకముంచు • మాస్యతలమునన్
మానకు మిఁక శివసంధ్య న,నూనమతిన్ నా సమర్చ • నొనరింపు పొరిన్.

వ. ఇట్లయిన నీ యఘమంతయుఁ దొలంగి భద్రంబగునని సర్వేశ్వరుం డనుగ్రహించినంతఁ బరమేశ్వరియు నానందంబున వాని నంధకేశార్చనంబున నుంచి తత్పుత్రికుల నల్వురు వటువుల నాల్గుదిక్కులకు శివార్చనయందు నియుక్తులన్ జేసి వారల కభీష్టవరంబులిచ్చి యంతర్ధానంబునొందిరి. శివానుగ్రహంబున నవ్వారు విస్తరించి రిఁకఁ దపోవ్రతంబుల వెడఁబాసి జేవలకులనఁ బేరుంగాంచిరైన నీశ్వరశాసనంబునఁజేసి వార లీశ్వరపూజయుం దగ్రిణులైరి. ఆదియం దవ్వారిపూజ గానియప్పు డెవ్వారును బూజింపఁదగ దట్లు పూజించిరేని యప్పూజ నిరర్థకంబగు. మంచియేనియుఁ జెడ్డయేనియు వటువును బరిత్యజింపరాదిఁక ప్రాజాపత్యవ్రతంబున నీ వటుభోజనంబు వ్రతసంపూర్తిన్ బొనరించు నద్దాని వినుం డంధకేశలింగ పరిసరపురంబందు భద్రుండను నొక్క నృపుండు

క. ప్రాజాపత్యవ్రతమును, నోజన్సలుపంగ శర్వు(డొక ధ్వజమిడి యీ
భ్రాజద్ధ్వజము నుమన్నుల, రాజేంద్రా! యెత్తుమరల • రాత్రులనొరగున్.

ఆ. వ్రతముజరుగకున్న ధ్వజమిది యొరగదు, చూడుమనుచు(జెప్పి శూలపాణి
చనియె(బార్థివుండు సల్పుచుండెనువ్రతం, బహరహంబు నీశ్వరార్చనమున.

క. తేలన్ బాపలు సాపడ, లీలన్ ధ్వజ మొరగునట్టులే వడుగొకడే
నోలిమొదల్ గుడిచిచనన్, వైళంబుగ(బుడమినొరగె ధ్వజ మభ్రముగాన్.

చ. అదిగని రాజవర్యు(డెద • నబ్బుర మొంది మనీషులున్ గడున్
విదులగు బ్రాహ్మణోత్తములు(• బిల్చియ నెన్ భవదీయ జగ్ధియా(
బిదపధ్వజంబు వ్రాలు నిది • వింతగనే(డెటో ముందువ్రాలె మీ
ర్మది(బరికించి చెప్పు(డన • మంచిగయోజనచేసి వారలున్. 　　　　 412

క. వటు(డొక(డు ముందుభోజన, మిట జేసిదనెన్ శివాజ్ఞ • హెచ్చగువా(డీ
చటులవ్రతమున దానన్, స్ఫుటముగ నాధ్వజము వ్రాలె(బుణ్యచరిత్రా! 413

క. చండీపుత్రులు వారలు, నిండించు(దదర్చపేర్మి • నీలగళునకున్
జండీదేవికి నవిరి ప్రభుండలరె(బ్రజల్ యశంబు • భోరుకొననాగిన్. 　　 414

వ. ఇట్లంధకేశలింగచరిత్రంబును వటుకోత్పత్తియు మీకెఱింగించితి నింక నత్రీశలింగచరిత్రంబును వినుండని సూతుండు మునులకిట్లనియె. 　　　 415

—* అత్రీశలింగము *—

ఉ. కామదమంచు(బేర్పడిన • కాననమొక్క(డు దక్షిణావనిన్
రామగిరీట్సమీపమున • రాణ(దనర్పుచునుండె నచ్చటన్
దామరసోద్భవోద్భవు(డు దారతపోనిధి యత్రియుండె(ద
ద్భామ పతివ్రతావ్రతనిధానము నౌ ననసూయతోడుతన్. 　　　　　 416

ఉ. ధాత్రిలు పల్వు రెవ్వడుట • జమ్మన వేదములన్ బఠింపుచున్
శ్రోత్రసుఖంబు సేయుచు విశుద్ధమతిన్ దను(గొల్చుచుండ(గా
నత్రిమహామునీంద్రు(డు నిజాంగనయా ననసూయతోడ నీ
ధాత్రిని నేరెఱుంగని యుదాత్తతపం బొనరించుచుండ(గాన్. 　　　　 417

గీ. దైవవశమున నూ తేండ్లు • దారుణంబు
గా ననావృష్టి యగుడు వృక్షంబులెల్ల

నెండ నెచ్చోటఁ దడిలేకయుండెఁ బుడమి
నెల్లజంతువు లెచటికో యేగ వగలొ. 418

గీ. నిత్యవృత్తికి లేదయ్యె నీరమెందు, వేఁడిగాడ్పులు చెలరేఁగి వీచుచుండె
నెందు హాహారవంబులే యెసఁగుచుండె, నంత ననసూయ మగనితో ననియెనిట్లు 419

క. వినఁజాల నార్తనాదము, గనఁజాలఁ బ్రజాతిదాహ కష్టంబుల నిం
కను నే సహింపజాల న,నిన శివుని దలంచి యట మునివరుం డంతన్. 420

—* అత్రిముని తపస్సమాధి నొందుట *—

క. భీమంబగు దుర్భిక్షము, నామెయిఁ బరికించి త్రీప్రవీణుప్పుడె ప్రాణా
యామము చేసి సమాధిన్, నేమమునఁ జెందియుండె నేటగుతపమున్. 421

వ. అంతేవాసు లందఱుఁ గలిదప్పుల వందుర యెద్దడి నెదురలేక యెందేనిఁ జని
రంతమీఁద. 422

మ. అనసూయాసతి జీవితేశ్వరుని నత్యంతంబు సేవింపుచున్
గొనబౌ మృన్మయలింగ మొక్కఁడు గడున్ బొంకంబుగాఁ గూర్చి పా
వనమంత్రింబులఁ గొల్చుచుండె సతమున్ భావోపచారంబులన్
దనుజుల్ గొందఱు తత్తనూజ్జ్వలత కాత్మన్ బొక్కి కామార్తులై, 423

ఉ. ఆమెను దారసించి చటులాగ్నివిధమ్మునఁ జిమ్మ తచ్ఛవి
స్తోమముచేత నోరసిలి సోలి యడల్గొని పాఱి రప్డు స
ర్వామరబృంద మద్దిగని హర్షము నొంది తదీయమౌ వనిన్
బ్రేముడిఁ జేరి చూచిరి వరేణ్యుల నమ్ముని నమ్మ నీట్సతిన్. 424

—* గంగా శంకరు లనసూయాభీష్టంబుఁ దీర్పఁ దలఁచుట *—

చ. కని మునిసేయు నత్తపసు కన్న మునీంద్రునిరాణి సేయు పూ
జనము ఘనమ్ముగా నరసి చాలఁగ వారల సన్నుతించి ద
య్యాన దివికేగి రందొఱు వియద్ధునియున్ హరుఁడున్ మనంబులన్
మునిమిథునేప్సితంబులను బొందుగఁ గూర్పఁ దలంచియుండఁగాన్. 425

క. మునియుగ తపములు మొదలా,దినమున కేఁబదియునాల్గు దీరెను సమలం
తను నేని వృష్టియొనరదు, ముని యుగ్మ మొనర్చుచుండెఁ బూనికఁ దపములన్.

ఉ. అంతన యత్రిమౌని తన ధ్యానము దించి పురంధ్రితోడ న
త్యంతము దప్పి పుట్టెను రయమ్మునఁదె మ్మదకమ్మనాన్ మునీ
ట్కాంత కమండలంబుఁ గొని కాన జలంబును గాన కాత్మలోఁ
జింతిలె నేమిసేతు? నెటఁ జేరుదుఁ? గాంతుని దప్పిఁ దీర్పఁగాన్. 427

—* గంగాదేవి స్త్రీరూపముతో ననసూయకు దర్శనమిచ్చుట *—

ఉ. లేదుదకం బొకంట నని లేమమనం బురియాడుచుండఁ గా
లూదక యందు నందుఁ గనుచుండఁగ స్వర్ణది యొక్క నాతియై
యాదృతి నమ్మునీశ్వరుని యంగన వెన్కని పల్కె సాధ్వి! నీ
కేది ప్రియంబు సెప్పు మది యిచ్చెద వచ్చితి మెచ్చి నిన్నిటుల్. 428

క. నీ సెలవున్ గడుఁగూరిమిఁ, జేసెదఁ జెపుమమ్మ! యిట్లు శివసేవనమున్
నీ సామి సేవనంబును, వాసిగ నొనరించినట్టి పావన వెలమిన్. 429

క. అనుడు మునిసతియు వెనుకకుఁ, గని యాపెన్ జూచి పల్కెఁ గమలనయన! యెం
దుననుండి వచ్చితివి? నీ, ఘనత నొకింతయును దెల్పఁ గాఁదగు ననినన్. 430

ఉ. గంగను నేను గోర్కు లడుగన్ దగు నన్న మునీంద్రపత్ని సా
ష్టాంగముగాఁగ మ్రొక్కి జలమడ్గఁగఁ గర్తముఁ జేయు నీరమున్
బొంగుగఁ గూర్తునాఁ దపసిబోటి యటుల్ పొనరించె గంగ యు
ప్పొంగుచు నింపెఁ దత్క్షణమె పుణ్యజలంబును గర్తగర్భమున్. 431

గీ. అపుడు జలము గమండలమందు నింపి, కొనియు నభ్రధునికి మ్రొక్కి యనియెనిట్లు
తల్లి! నా పతి వచ్చు నీదండ కిప్పు, డంతవఱ కీవు గృపనిట నాగవలయు.

—* అత్రిముని యుదకములఁ గ్రోలుట *—

క. అన వల్లే యన నాపెయుఁ, జని సలిలము మౌనికీయ సత్వరమున న
య్యనఘుఁ డుదకమునుఁ ద్రావి మ,దిని నలరి జలంబు లెందుఁ దెచ్చితి వబలా!

చ. ఎపుడెపు డీవొసంగు జలమిట్టిది కా దమృతోపమానమై
తపనము సేయు నాహృదయదారుణపీడ హరించె నిద్ది యీ
విపినమునందు దుర్లభము వేయినుడుల్ పనియేమి నీవిఁకన్
జెపుమెటనుండి తెచ్చితివొ చెల్వరొ! యిమ్మధురోదకంబులన్. 434

చ. అనియడుగంగ నాపె హృదయంబునఁ దర్కము చేసె వాస్తవం
బును దెలుపంగ నాకడిమి పొల్పును దెల్పిన యట్టులౌను గ

ల్లను నుడువంగ నయ్యది దలంపఁగరాని యఘంబగున్ గటా!
యొనరఁగ జీవితేశ్వరున • కొప్పుగ నెట్లు వచింతునీయెడన్. 435

క. అని యనసూయాసతి నెమ్మనమున యోచించి తమదు•మహిమమువలనన్
ఘనమగు శివకృపవలనన్, మనవనమునఁజేరె గంగ•మధురోదకముల్. 436

గీ. అనిన నత్రియు నేఁ గాంతు • ననుచు మురిసి
రాఁ దదీయప్రియయుఁ గర్త•రాజనికట
మునకు నేతేరఁ గనుపట్టెఁ • బూర్ణసలిల
రుచిరమై చెలువొందు సరోవరంబు. 437

వ. కనుంగొని బిరాన యం దత్రిముని ప్రీతుండై స్నాతుండై నిత్యకర్మంబు లొన ర్చికొనియె ననసూయయు నవగాహనంబుచేసె నంతఁ బరమేశ్వరుండును స్వర్ధునియు దర్శనంబిచ్చి యత్రిమునిని ననసూయను బ్రశంసించి వరంబులిచ్చెద మడుగుఁ డనిన ననసూయ గంగ కిట్లనియె. 438

— * అనసూయ గంగ నెల్లప్పుడట వసింపు మనుట * —

క. తల్లీ! యీ తాపసవని, నెల్లప్పుడు మఱచిపాయ • కీవుండవలెన్
జల్లఁగ నాయెడఁగల కృప, ఫుల్లాంబుజనయన! భువనములు•పొలుపొందన్.

క. లోకోపకారమును నగు, నీఁకర్జ గరుణాతిశయము • వెల్లివిరియఁగా
నీ కమనీయోదకముల, నీకానన్ సతము నిలిపి•తేని మహాత్మా! 440

చ. మునిసతి యిట్లుగోర నల • ముగ్ధశశాంకధరేష్టపత్ని స్వ
ర్ధుని యిటువల్కె నద్దము హరున్ భజియించిన పుణ్యమిమ్మ నీ
వనినయటుల్ పొనర్చెద మహాత్మ! పతివ్రత! యీపతివ్రతం
బున కెనరావు యోగములుఁ • బుణ్యములున్ దపముల్ జగంబునన్. 441

క. నీబోఁటి పతివ్రతచే, నాబోటులు శుద్ధిఁగాంత్రి•నా మునిసతి గా
రాబొప్ప నొక్కయేఁటను, దాఁబడయు శివార్చఫలముఁ•దడయక యిచ్చెన్.

వ. దేవధునియు ననసూయ గోరినయ ట్లాపుష్కరిణియందుఁ బుష్కరరూపంబున సాన్నిధ్యంబు చేసియుండె నంత ననసూయాత్రులు మహేశ్వరు నిట్లు ప్రార్థించిరి

క. మందాకిని యెట్టుల మా, యం దాదర మెసఁగ నిందు • నమృతమయంబై
పొందికఁజేరి వసించెనొ, యిందుధరా! యట్టులరసి • యీవుండు మిటన్. 444

క. అని యడుగ శివుఁ డటులె యని, యనసూయారచితలింగ • మందుఁ బ్రవేశం
బొనరించి జగము లేలెను, జను లత్రీశుఁడని పుడమిఁ • జాటి యలరఁగా. 445

వ. అంత యథాపూర్వంబుగ వనంబంతయు బహుపల్లవపుష్పఫలాఢ్యంబై చెలు
వొంది యెద్దడిఁ బాసిన వలసఁబోయిన ఋషులందఱు మరలఁ దఱలివచ్చి శాంతి
హోమంబులు నెరపి రపుడు ఘనాఘనంబులు సువృష్టి నాపాదించె ముని
లంద ఱానందంబునఁ బొదలి రిది యత్రీశ్వరలింగచరిత్రం బిఁక నందికేశలింగో
దంతంబును వినుండని సూతుండు మునులకిట్లనియె. 446

— * నందికేశలింగము—బ్రాహ్మణీచరిత్రము * —

క. రేవానదికిన్ బడమర,గా వర్తిలుతీరమందు • ఘనతరశోభా
సేవితమగు కర్ణికనా, శ్రీవెలయుపురిన్ ద్విజుఁడు వ•సించు నొకఁడిలన్. 447

చ. అతఁడు తనూజయుగ్మమున • కర్థముఁ బంచి యొసంగి యంగనన్
సుతులకు నప్పగించి శివు•చోటగు కాశికి నేగి యం దనా
రతము హరున్ భజించి సుక•రంబుగ నీశ్వరుఁ జెందె నారిలో
నతనిపురంధ్రి యాత్మజుల • నారయుచుండెను గొంతకాలమున్. 448

గీ. అంతఁ గొన్నేఁడులకు బావ•నమ్మ రుజను
జెంది రోజుచు మృతివేళ • సిద్ధమైన
నుసురు లుత్క్రమణంబు గా • కుంటఁ జూచి
యగ్రపుత్రుఁడు దరిసి యి•ట్లనియె వేగ. 449

ఉ. అమ్మరో! నీదు చిత్త మిపు • డక్కట! యేదొ కొఱంతఁ జెంది యి
ట్లుమ్మలికమ్ముఁ జెందు నెద•నున్న తెఱంగును దెల్పు నీ యభీ
ష్టమ్మును దీర్తు సత్యమనఁ • జయ్యన నాపె దదస్థిరాసిఁ దూ
ర్ణమ్ముగ గంగఁ జేర్పుమని • నందనుఁ డట్టులె చేతు నంచనెన్. 450

గీ. అంత బ్రాహ్మణి "హరహరా" • యంచు నుసురు
విడిచెఁ గొడుకులునున్ విధి•విహితముగను
శవమును దహించి యస్థిసం•చయన మొనరఁ
జేసి కర్మల నన్నియుఁ • జేసి రపుడు. 451

గీ. మాసికశ్రాద్ధ మొనరించి • యా సువాదుఁ
డనెడు విప్రాగ్రసుతుఁడు సు•దినమునందుఁ

తల్లిఋణమును దీర్పఁగాఁ • దలఁచి యుచిత
దానధర్మము లొనరించి • తగినయట్లు. 452

క. తన భార్యాపుత్రులతో, ననుమతిఁగొని శివుని మనము•నందుఁ దలఁచి యొ
క్కనిఁగూడఁ దోడుకొని గం, గనుగూరిచి తలిలె నస్థి•కాండములోడన్. 453

క. నడిచి యొకయోజనము భా,నుఁడు గ్రుంకుచునుండ బ్రాహ్మ•ణుం డొకపల్లెన్
బొడఁగాంచి చేరి యచ్చోటు, విడిసి యొకఁడుపాలు నింటి• వేదికయందున్.

వ. సంధ్యావందనాదికర్మలను సలిపి సేవకునితోడఁ బవళించుచు నప్పుడం దొక
వింత జరిగె నద్దానిఁ జెప్పెద వినుండు. 455

—* ధేనువు సాహసకృత్యము *—

ఉ. ఆ యెడలన్ వసించెడి ధ•రామరుఁ డొండొకయూరి కేగి యా
సాయమునందె వేగ నిజ•సద్మముఁ జేరఁగవచ్చి యావుపా
లా యెడఁ బిండఁగోరి తన•యాలినిఁ బిల్చి ఘటంబుఁ దెమ్మనా
నా యెలనాగ యిచ్చుడు ర•యంబునఁ గ్రేవును బాపి లాఁగఁగాన్

చ. అదియునుఁ బొక బ్రాహ్మణుని • యంఘ్రినిఁ ద్రొక్కఁగ నొప్పిఁ జెంది య
ప్పుడనున నాతఁ డాగ్రహముఁ • బట్టి కడున్ వడి దానిఁ గొట్టె న
మ్మొదవది గాంచి యశ్రుకణ•మోచనముల్ బొనరించె దుగ్ధముల్
బిదికి ద్విజుండు లోనికిఁ జ•నెన్ వృషపోతము మాత కిట్లనెన్. 457

ఉ. ఏటికి తల్లి! యశ్రువుల • నెంతయు రాల్చితి వింతవంత నీ
కేటికి దాపరించె నన నింతి•కు నెక్కఁడి కేమి గావలెన్
గాటులు సెందఁగా నొడలు • గాదిలిబిడ్డని బాఁదుచుండ నా
రాటము చెంది కుందదె క•రంబు భరంబుగఁ జిత్త మాత్మజా! 458

వ. అనినఁ దేఁగ యిట్లనియె.

క. తొలిజన్మంబున మదమున, సలిపినదోసంబు లురక • చనునే? వానిన్
సొలయకఁ గుడువఁగ వలదే?, తొలఁగునె దోసంబు లెందు•దూతినజననీ! 459

క. సుఖమును దుఃఖంబును నొం,డొకఁడొసఁగఁగ లేఁడు కర్మ•మొసఁగును స్వీయం
బిఁక వగవనేల? సర్వము, స్వకృతఫలంబులని యెఱుఁగ•జను దేహులకున్.

ఆ. అనిన సురభి యిట్టు • లనియెం గుమార! నీ, వచనచందమంత • యును నెఱింగి
యున్నదాననైన • నుడుగక మోహవ,శంబుఁజేసి యిట్లు • జాలివడితి. 461

ఆ. అనుచు మరలఁ గనుల • నశ్రులు వెలిపుచ్చు, తల్లికనియె లేఁగ • తగునె మరల
ఎఱిఁగియెఱిఁగి యిట్టు • లేడ్వఁగా నమ్మరో!, యేమిసేయ దాన • వేడ్చె యిపుడు.

వ. అనిన ధేనువిట్లనియె.

ఉ. నావలె నీ ద్విజన్ముఁడు ఘ • నంబుగ దుఃఖముఁజెంది యేడ్వఁగా
నావగ పాయ నంతకుఁ బొ • నర్చుచుటుల్ పరితాప మిద్ది నే
నేవగనైన పీఁనుతు • నెల్లి వధించెద చూఁడునాఁగఁ దా
భావమునందు రోసి వెస • వత్సము ధేనువుతోడ నిట్లనెన్. 463

చ. మునుపటి జాములో దురిత • మున్ బొనరించి పశుత్వమొంది యి
వ్వనటను జెందినార మిఁక • బ్రహ్మవధం బొనరించి యిప్డు నూ
తనముగ భూరిపాతకముఁ • దక్కక చేకొనఁగాఁ దలంప నీ
మన సెటులొప్పెనో? యెఱుఁగ • మాతరో! యాతరుణంబు నందిటుల్. 464

క. ఈ నెవరో? సుతులెవ్వరో?, నానాబాంధవ సుహృజ్జ • నంబు లెవరొకో?
లోనరయ నెవ్వ రెవరిన్, గానరు సర్వులును గాంత్రు • కర్మఫలములన్. 465

గీ. కర్మమున జన్మమొదవు న • క్కర్మనాశ,మైనఁ గాని లభింప దా • యమృతపదము
అందు దుష్కర్మ మొనరించు • నట్టివారి, కంతులేక దుర్జన్మము • లమరుచుండు.

చ. అన విని యావు తా ననియె • నద్దురితంబును బాపునట్టి చో
టును మదిగుర్తెఱింగియె యి • టులే పొనరింపఁగఁ బూనినానన్
విని యురకుండె దూడయును • వేదికపైఁ బవళించియున్న బ్రా
హ్మణుఁడు నువాదుఁ డద్ది విని • యక్కజమొందె మదిన్ గడున్ గడున్. 467

వ. అంత

చ. తెలతెలవాఱఁగా బుడమి • దేవర యగ్గృహనాథుఁ డాత్మజున్
బిలిచి కుమార! పాల్మొదవుఁ • బిండుము నేనొక యూరికేగఁగా
వలె నని చెప్పి పాంథుఁడగు • బాపనికిన్ దెలవాఱె యాత్రికై
కలువు ప్రయాణమన్న విని • చక్కఁగ నాతఁడు వింతఁ జూడఁగాన్. 468

గీ. తలఁచి "పోయెద నించుక • దడసి యిపుడె
నొకరించుక నాగిలియు • న్నాఁ" డనంగఁ

బోయె బ్రాహ్మణుఁ డంతఁ ద♦త్పుత్త్రకుండు
దూడఁగొని లాగి పిదుకఁబో ♦ దుగ్ధములను. 469

ఉ. గొడ్డు దటాలునన్ వటుని ♦ గొమ్ములతో నుదరంబుఁ గ్రుచ్చి పై
కొడ్డుగ నెత్తి కూల్ప ధర♦కున్ ద్విజబాలుఁడు వాసెఁ బ్రాణముల్
బిడ్డనిపాటుఁ జూచి పృథి♦విన్‌బడి కూయిడెఁ దల్లి యెల్లరా
పడ్డను బాఁది బాఁది విడు♦వన్ జనె నయ్యది పేరెమొందుచున్, 470

ఆ. బ్రహ్మహత్యచేతఁ♦ బాండురవర్ణంబు, తొలఁగి నలువుఁ జెంది ♦ తోఁచెఁ బసర
మంత యాత్రికుఁడగు♦నాసువ్రతుండును, భృత్యుతోడ దాని♦వెంటనరిగె. 471

ఉ. ఆపది తోకయెత్తికొని ♦ యర్మిలి నర్మదఁ జేరి యందునున్
రేవలఘట్టముల్ విడిచి♦ కేరుచు డగ్గఱి నందికేశలిం
గావసథోజ్జ్వలత్తటము♦నం దవగాహమునొందె బ్రహ్మహ
త్యావిలపంకమున్ దొరఁగి ♦ యంతనె వింతగనొందె శౌక్ల్యమున్. 472

చ. కనుఁగొని బ్రాహ్మణుండు మదిఁ ♦ గౌతుకమొంది కడిందిభక్తిఁ బా
వనతరతత్తటాంబువుల ♦ వాసిగ మజ్జనమొంది పోవుచుం
టను గని యొక్క దివ్యకుల♦నారి ద్విజన్మునితోడ బ్రాహ్మణా!
చనె దెట కీవు? సెప్పు మిఁక ♦ సత్యము దప్పక యన్న నాతఁడున్. 473

వ. తన యుదంతంబు నెఱింగించిన నద్దివ్యభామిని నీతల్లియస్థుల నీతీర్థమునందే యుంపు మద్దాన నీజనని దివ్యదేహంబునొంది శివలోకంబు సేరఁగల దిది వైశాఖశుద్ధసప్తమీదినం బీవాసరంబందు భాగీరథి యీతీర్థంబందుఁ సాన్నిధ్యంబు సేయు నని చెప్పి యంతర్ధానంబు సేయుటయు ధరామరుం డా పెను గంగాదేవిగా నెఱింగి మరలి తనతల్లియస్థులలోఁ జక్కసగం బత్తీర్థంబందు వేయ నంతలో నతనితల్లి దివ్యదేహంబునొంది గగనపథంబందుండియే కొడుకును గాంచియిట్లనియె. 474

చ. కొడుక! కృతార్థతన్ బొరసి♦కొంటివి ధన్యుఁడవైతి వేను ని
ప్పుడె సురలోకవాసమును ♦ బొందెద నీ కెడలేక సౌఖ్యముల్
దొడరెడు పాడిపంటలును ♦ దొడ్డగ భాగ్యము సేకుఱున్ గడుఁ
గడు భవదీయవంశ మిలఁ ♦ గాంచును వృద్ధి నఖండరీతిగాన్. 475

గీ. ఇట్లు వలుమఱుదీవించి•యింద్రలోక, మరిగి చిరకాల మట సౌఖ్య•మంది పిదప
బరమశివకృపఁ జెందె ని•ర్వాణలక్ష్మి, బావఁడదిగాంచివిస్మయం•పడిముదమునఁ

వ. తక్కిన సగమస్థులనుగూడ నాతీర్థంబదే వేసి సేవకునితోఁ దనపురంబుఁ జేరె ననుడు మునులు మహాత్మా! నందికేశలింగ చరిత్రంబును వైశాఖ శుద్ధసప్తమీ తిథియందు మందాకిని యత్తీర్థంబుఁ జేరుటకుఁగల కారణంబును జెప్పుమనుడు నూతుం డిట్లనియె. 477

—* ఋషీకాచరిత్రము *—

చ. ఋషికయనాఁగ నొప్పెడు మ•హీసురవర్యకుమారియొర్తి బల్
సుషమతనూజ్జ్వలాంగి విధి•చోదన బాల్యవితంతువై కడున్
ఋషికులమెల్ల మెచ్చఁగ స•మిద్ధతపం బొనరించుచుండెఁ గ
ల్మషహృదయుండు మూఢుఁడను • మాంసభుగగ్రణియొక్కఁ డాపెపై 478

చ. వలపును జెంది పంచశర•భల్లవిదారితచిత్తుఁడై వడిన్
జెలువను డారసించి తన•చిత్తముఁ దెల్పి బలాత్కరింప స
త్కులజ శివార్చనాపరయుఁ • గోవిదయై యలరారు నాపె య
క్కలుషు ననాదరింప వెసఁ•గన్నును మిన్నును గాన కాతఁడున్, 479

ఉ. పైకొన నుద్యమింప ద్విజ•బాలవితంతువు దిక్కుమాలి య
వ్వైకిరికిన్ హితోక్తులను • బోధనొనర్చియు లబ్ధిలేమికిన్
లోకశరణ్యు శంకరుని • లోనఁదలంచి తదీయనామగా
నైకమనంబుతో నిటులు • నాయమ నాయమ యంచు భీతియై. 480

—* మధురగతిరగడ *—

శివ శివ శివ శివ • శివ శివ శంకర!
శివ శివ శివ శివ! • శివమునికింకర!
కవిజననుతపద • కంజసముజ్జ్వల
రవిశశినయన! హి•రణ్యతనూజ్జ్వల!
శ్రీకర! దయ నిటు • చిమ్ముమ నావయి
వీఁక నసురఁ దెగ•వేయుము ప్రావయి
తేఁకువఁ గొనుమీ • దివ్యచిత్తమున
నీకెవ రెదురు త్రి•నేత్ర! మొత్తమున

నీ పదంబులకు • నెక్కొని మ్రొక్కెద
నాపదఁ బాపిన • నభవా! దక్కెద
వాదమేల? పెఱ • వానికిఁ జిక్కదు
మీఁదటఁ గనుఁగొన • మిత్తికి డక్కదు
తలకొనఁజాల న • ధర్మము దేవర!
యలవునఁ జేరి కృ • పాకర! ప్రోవర
శంకర శంభో! • శరణుఁ జేసెదను
పంకజారిధర! • పదము డాసెదను
సంకటహర! నిను • సారెకుఁ దలఁచెద
హంకృతివిడి నీ • యడుగులఁ గొలిచెద
కావఁగ రావే • కరుణామూర్తీ!
ప్రోవఁగ నీవే • పూరితకీర్తీ!
నా నేరమిని గ • నందగ దిత్తఱి
నీ నెఱిఁ దప్పిన • నీల్గును బిత్తరి
నీవే త్రాతవు • నీవే నేతవు
నీవే దాతవు • నీవె విధాతవు
భక్తురాల నీ • పాలఁబడితి నిఁక
శక్తిపతీ! వే • సాఁకుము గొంకక
యొప్పరికించిన • నొప్పునె నీకది
తప్పదు నీకిఁకఁ • దారసింప కిది
రమ్మిఁక రమ్మిఁక • రాజభూషణుఁడ!
నమ్మితి ని న్నా • మ్నాయభాషణుఁడ!
గౌరీకాంతుఁడ! • కలుషవిదారుఁడ!
శ్రీరమణాదిక! • చిత్తవిహారుఁడ!

—* శివుఁడు రక్కసునిఁ జంపి ఋషీకకు వరంబు లిచ్చుట *—

గీ. ఆర్తితో నిట్లు వేడఁగ • హరుఁడు వేగ, భక్తరక్షణదాక్షిణ్య • భంగు లలర
వచ్చియసురను వీక్షింప • భస్మరాశి, యయ్యెఁ బలలాశి దత్క్షణం • బందెయచట.

వ. అంత శివుండు ఋషీకన్ గాంచి

క. కోరినవరముల నిచ్చెద, నీరజదళనేత్ర! సుకృతనిశితచరిత్రా!
ధీరమతి! యడుగుమన నెద, దేఱి ప్రణుతి నిరతమతినిఁ దెఱప యిటులనెన్.

క. బ్రదికించినాఁడ వీశ్వర!, సదయహృదయ! దేవదేవ! శరణావనసం
పదుదార! దీనబంధూ!, మదమెత్తిన యసురఁ గడపి మాన్పితి వార్తిన్.

చ. ఇఁకను వరంబు లేటికి మహేశ్వర! వైనను నీదు పాదసే
వకమతి నీయు మెప్పు డనపాయముగాఁగ జగంబులేల ను
త్సుకత వసింపు మిందనుడుఁ దోడనె యీశ్వరుఁడున్ దయామయా
త్మకుఁడయి లింగరూపమునఁ దా వసియించె వనస్థలంబునన్. 485

వ. అఖిలజనానందకరంబగుట నాలింగంబు నందికేశలింగంబని పేరొందె నంత
గంగాదేవియునున్ దారసించి యమ్మానిని కిట్లనియె

క. అమ్మరో! తావకనుచరి, తమ్మున కే నెంతయున్ ముదంబువడితి వ
ర్షమ్మున నొకతడవ త్వదీ,యమ్మగు మజ్జనమునొప్పు నప్పులనుందుఁగా. 487

వ. ఈనాఁడు వైశాఖశుక్లసప్తమి యగుట నేఁటేట నీదినంబందీ తీర్థంబునందుఁ
బ్రవేశించి యమ్మఱునాఁడు చనుదునని యంతర్ధానంబుఁజెందె నిట్లు నందికేశ
లింగోత్పత్తియును నర్మదా తీర్థంబునందు గంగాప్రాప్తియును మీకెఱిఁగించి
తి నిఁక హరీశ్వరలింగచరిత్రంబు నెఱింగింతు వినుండని సూతుండు మునుల
కిట్లనియె. 488

— * హరీశ్వర లింగము * —

ఉ. సర్వజగంబులేలు నలశౌరి నిశాచరమండలిన్ నిజా
ఖర్వపరాక్రమోగ్రతనిశామలయుం బొనరించుచుండినన్
గర్వములోడ వారు సురకాండముఁబట్టి పలార్చుచుండఁగా
నోర్వఁగలేక లేఖలు రమోన్నతి వెన్నునిఁజేరి యార్తులై. 489

క. తమగోడు విన్నవించి ర,యమునన్ రక్కసులపీఁచమడఁచి జగములన్
మముసాఁకుమనుచు వేడుడుఁ, గమలాకాంతుండు వెరవుగాంచకకించన్, 490

ఉ. ఎందఱిఁబట్టి చంపిన రణోద్ధ్యులు రాక్షసవర్యు లేచి యీ
చందము వేల్పులఁగలఁచి సర్వజగంబుల కార్తిసేయుచున్
ముందుకు వచ్చుచుండిరి యమోఘతరంబగు నాయుధంబు లే
కిందఱి నెట్టు లాజి సమయింతు గడింతు జయాతతోన్నతుల్. 491

క. అని మదిఁదలపోసి వెసన్, జని కైలాసాద్రిఁ జేరి • శంకరు నెదలోఁ
గొని పార్థివలింగమునకుఁ, గనకాబ్జసహస్రపూజఁ • గావింప నొగిన్. 492

మ. ఒకనాఁ డీశ్వరుమాయఁ జేసి హరి దా • నుగార్చయందున్న వే
ళకు నంభోజ మొకండు దక్కువగుడున్ • లక్ష్మీశ్వరుం డీ జగ
న్నికరంబంతయుఁ దివ్యదృష్టిఁ గని యా • న్నీరేజరాజంబుఁ గా
నక యాశ్చర్యభయంబులొంది పెలుచన్ • ధైర్యంబుతో నంతనే. 493

—* విష్ణుమూర్తి శివలింగమునకు నేత్రకమలంబు నర్పించుట *—

క. సునిశితములైన గోళులఁ, దన నయనాబ్జంబు వ్రచ్చి • దండధర హరా
ర్చనసల్పుడు హరుఁడు ముదంబున వచ్చి యభీష్టమడుగు • ము హరి! యనంగన్.

మ. జలజాక్షుండు శివున్ గనుంగొని కడున్ • సంతోసమున్ జెంది వే
ల్పులదుఃఖంబులు కర్వ్యభుక్కుల యఘంబుల్ దెల్పి యల్పాయుధం
బుల నద్దైత్యులఁ దీర్పరామికిఁ గృపాంభోధీ! జగద్రక్షకై
బలవంతంబగు నాయుధంబు నిడుమా! • ప్రార్థింతు నెంతేనియున్, 495

—* శివుఁడు విష్ణుమూర్తికి సుదర్శనము నిచ్చుట *—

*క. అన దేవదేవుఁ డెంతయుఁ, దనమనమున నలరి సర్వ • దానవపటలీ
హననచణంబైన సుదర్శనమను దివ్యాయుధము నొసంగి యిటులనెన్. 496

ఉ. ఎందఱి మీఁద వేసిన రమేశ్వర! మీఱి క్షణంబులోన నా
యందఱిఁ ద్రుంచి తా వకకరాగ్రమునందుఁ బ్రవేశ మొందు ము
హ్పొందఁగనీక నీకు ముదమొందఁగఁ జేయు ధరింపు మింక నీ
కుం దెడబాయు లోకములకున్ సుఖమున్ బొనరింపు దీనిచే. 497

క. మఱియును వరంబు లిచ్చెద, సరసీరుహనయన! యడుగు • శంకర యన నా
హరి మురిసి మ్రొక్కి యడిగెను, బరమేశ్వర! నీదు పాదభక్తి నిడు మొగిన్.

వ. వెండియు మత్సమర్పితంబగు నీ పార్థివలింగంబందు నిచ్చలు సాన్నిధ్యంబు నెరపు
మని యర్థించిన శంకరుఁడు తథాస్తని యట్లొనర్చి యంతర్ధానంబునొందె నంత

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం షట్త్రింశదధ్యాయే—

శ్లో॥ ఏవముక్త్వా దదౌ చక్రం। సూర్యాయుత సమప్రభం। సుదర్శనం స్వపాదోత్థం। సర్వశత్రు
వినాశనం॥ విష్ణుశ్చాపి సుసంకృత్య। జగ్రాహోదఙ్ముఖస్తదా। నమస్కృత్య మహాదేవ।
మిత్థం వచన మబ్రవీత్॥

మాధవుండలరి చని దుష్టదైత్యసంహారం బొనరించి లోకరక్షణంబొనర్చుచుండె
నిది హరీశ్వరలింగచరిత్రం బిఁక గోకర్ణేశ్వరచరిత్రంబుఁ జెప్పెద నాకర్ణింపుఁ
డని సూతుండు మునుల కిట్లనియె. 499

## —* మహాబలేశ్వరలింగము - గోకర్ణము *—

క. గోకర్ణస్థలమహిమము, గోకర్ణేశ్వరమహిమము • గొనకొని నుకువన్
గోకర్ణాగ్రి వేయుఁడు, గాక యొరులు వలఁతు లవనిఁ • గలరె మునీంద్రులా!

క. శివలింగకోటు లచ్చట, భవభంజకతీర్థకోటి • పాతకకోటిన్
దవుదవ్వున నవియించును, శివసాక్షాత్కారసిద్ధి • సేకుఱఁజేయున్. 501

వ. అందు

చ. కమలజవిష్ణుముఖ్యసుర • కాండహితార్థముగాఁగ రాక్షసో
త్తముఁడగు వ ర్జ్కకంఠుని యు • ద్దాత్తతపఃఫలమై గణేశదోః
కమలయుగప్రతిష్ఠ నొగిఁ • గాంచినయట్టి మహాబలేశలిం
గము సకలాఘపుంజములఁ • గ్రచ్చఱఁ బాయఁగఁజేయు రూఢిగా. 502

క. ఆ పాతాళభువనముల, నేపొప్పఁగ నాక్రమించి • యెలరుటచేఁ దా
నొప్పె మహాబలుఁడను ప్రథ, కాపరమేశానలింగ • మచ్చోట సిరిన్. 503

గీ. కృతయుగంబున సితము లో • హితము త్రేత
ద్వాపరంబునఁ బీతమం • త్యయుగమందు
శ్యామలంబయి రాజిలు • నా మహాబ
లేశలింగము వినుఁడు ము • నీశులార! 504

శా. శ్రీనాథుండు విరించి వాసవుఁడు వి • శ్వేదేవులున్ దస్రులున్
భానుద్వాదశకంబునున్ వసువులున్ • బంకేరుహారాతినా
నానక్షత్రములున్ మరుత్తులు విమా • నస్థాయులై నిచ్చల
న్యానప్రీతినిఁ బూర్వగోపురమునన్ • యోజింతు ధ్యానంబులన్. 505

గీ. అసురి రుద్రగణంబులు • జముఁడు మిత్తి, చిత్రగుప్తుఁడు పితరులు • చిత్రభానుఁ
డట్లె దక్షిణగోపుర • మాశ్రయించి, భజన మొనరించుచుందురు • భక్తిమీఱ

క. వరుణుండు సరిత్పతియును, సరిదగ్రణులల్ల జహ్ను • జాష్టధృతులు శం
కరు నిచ్చలుఁ గొలుచుచు నుం,దురు పశ్చిమగోపురమునఁ • దొరవునిష్ఠన్

గీ. వాయుదేవుఁడు ధనపతి భద్రకాలి, చండికయు మున్నుగల్గుప్రశస్తమాతృ
కలు నుదగ్ద్వారమందొప్పి కడిఁదిభక్తిఁ, గొల్తురు మహాబలేశ్వరుఁ గూర్మిఁ బేర్మి.

క. గరుడులు గంధర్వులు కిన్నరులును గుహ్యకులు చారణప్రముఖులు కిం
పురుషులు సిద్ధులు విద్యాధరులు మహాబలునిఁ గొల్చెదరు సతమర్థిన్. 509

క. బేతాళులు ప్రేతంబులు, భూతంబులు భీతిజనకభూరిబలలస
ద్దైతేయులు శేషప్రిము, ఖాతతఫణివరులు గొలుతురా హరునెపుడున్. 510

చ. కొలిచినవారి కెల్లరకుఁ గొంగున బంగరు తా మహేశ్వరుం
డలఘుత రేప్సితార్థముల నారసి నైహికపారమార్థికం
బుల నిడుచుండు నందుఁ దవముల్ బొనరింతురు పల్వు రమ్మహా
బలశివలింగమున్ గుఱించిపల్కుదు రార్యులు మోక్షదాతఁగాఁ. 511

గీ. మాఘకృష్ణ చతుర్దశీ మహితపర్వ,మున మహాబలపూజనమున సమస్త
పాపులెల్లరు మోక్షంబుఁబడయుదురు ది,దృక్షనే తెంతు రఖిలదిగ్దేశజనులు.

క. స్త్రీలుం బురుషులు వృద్ధులు, బాలురును వితంతువులును బణ్యాస్త్రీలున్
నాలుగు వర్ణంబులవా, ర్జాలఁగ శివరాత్రి కటకు సాఁగెద రెలమిన్. 513

గీ. వచ్చి దేవేశు వీక్షించి వైభవమునఁ
గొలిచి కృతకృత్యతన్ గాంతు రెలమి కలిమి
నొక్క చండాలి శివలోక మొందె శర్వ
రాత్రి శివపూజ యొనరించి రాణగదుర. 514

వ. అనిన సూతునకు మహాత్మా! చండాలి యెట్లు శివపూజనొనర్చి శివలోకం
బున కేగెనో అయ్యితిహాసం బానుపూర్విగ నెఱింగింపుమని మును లనుటయు
సూతుం డిట్లనియె. 515

## —* సోమినీ చరిత్రము *—

క. చండాలి పూర్వమం దొక, దండిద్విజన్మాగ్రణికి సుతయయి పొడమె నా
తండును సోమిని యని మేల్, నిండారఁగఁ బేరుపెట్టి నేటుఁగఁ బెంచెన్.

గీ. యుక్తవయసొందియున్న నయ్యువిద కర్హుఁ
డైన వరుఁదెచ్చి తగ వివాహంబు నెరపి

విభుని యింటికిఁ బంప న•వ్వేలఁది మగని
తోడ నిష్టసుఖంబు లొం•దఁచు వసించె. 517

గీ. అంతఁ గొన్నిదినంబుల • కాపె పూర్వ,కర్మవశమునఁజేసి మ•గండు రుజను
దనరిమృతిఁజెందెనాపె వై•ధవ్యమొందె,బహుచుఁదనమున నెల్లరుఁ•బాపమనఁగ.

క. కొన్నాళ్ళవజకు సోమిని, యున్న తెఱఁగు గానరాక • యున్నతమతితో
పున్నెపుఁద్రోవనెమెలఁగెను, మిన్నగ బంధుగులుఁబెజలు•మెచ్చఁగఁదన్నున్.

వ. అంతఁ గొన్నిదినంబులకు

క. నిగనిగలాడెడు మేనును, నగులేమొగమును బ్రబలతు•ణము పెరుఁగుపసం
దగుగుబ్బదోయి పిఱుఁదును, దగుసోమిసిఁగని మరునకుఁ • దలికిరియువకుల్.

వ. అంతనాపెయు,

గీ. చక్కఁదనమొప్ప నొడలు సొం•పెక్క లేఁత
ప్రాయమునుజెంది మన్మథ • భల్లములకు
మదినిఁ గాపాడఁజాలక • బెదరి సరసఁ
జేరు యువకులతోఁ, బొందు • చేసెనంత. 521

క. చాటుగఁ గొన్నాళ్ళిటు విట,కూటములో సురతగోష్ఠిఁ•గూడుచుఁదమిమై
బోటి చరింపుచునుండగఁ, గోటపడియె నందఱకును • దెఱవతెఱఁగొగిన్. 522

వ. అంత.

చ. కులజనులెల్లఁ గూడుకొని • కూడనితెర్వునఁజేరి యిట్లు ని
ర్మలమగు నన్వయంబునకు • మచ్చ పొసంగఁగఁజేసి తోసి! పుం
శ్చలి! మదమెక్కి యుంటివిఁక • మాకును మీకును బొత్తుగాదు నీ
వలసిన చోటికేఁగుము జ•వంబుననంచు మహాగ్రహంబునన్ 523

ఆ. కొప్పుఁబట్టి యీడ్చి•కొనిపోయి యూరికి, దవ్వుగాఁగ విపిన•తలముఁజేర్చి
యందవిడిచివచ్చి•రా బ్రహ్మకులజులు,పొలఁతి యచటదెసలఁ •గలియఁజూడ.

— * సోమిని శూద్రునకు భార్యయగుట * —

చ. ధనికుఁడు శూద్రుఁడొక్కరుఁ డు•దారుఁడు దత్సమయంబునందు న
వ్యసనపదమందునుండి తన•వాసముఁ జేరఁగఁ బోవుచుండి రో

దన మొనరించుచున్న నల • తన్విని బ్రాహ్మణమత్తకాశినిన్
గని మరులొంది తారసిలి • కాంతకు నిట్లని పల్కె నింపుగన్. 525

ఉ. ఎవ్వరి దాన? వొంటరిగ • నెంతయు ఘోరవనప్రదేశమం
దెవ్వరు నిన్నుఁద్రోసిచని • రిట్టులఁ గట్టడి పూన్కితోడ వా
రెవ్వరుగాని యేమివని • యేనుపుఁబోవిడి వేగిరంబు నీ
విద్వనిఁబాసి నామనికి • కిప్పుడు రమ్మిఁక నాకు భార్యవై. 526

గీ. అనిన విని సోమినియుఁ జేయు • నదియులేక
యనుమతిన్జూప నాతఁడు • హరుసమొంది
వేగఁ దోడ్కొనిపోయి య • వ్వేలఁది నాలుఁ
జేసికొని యిష్టసుఖములఁ • జెందుచుండె. 527

క. ఆ సోమిని యా వృషలుని, చే సుతులను సుతలఁ బడసి • చెలఁగి పిశితమున్
వాసిగ మెక్కుచుఁ బలుతీ, ర్లాసవములఁ ద్రావుచుండె • నహముల రేలన్.

వ. ఇట్లు గొంతకాలంబు జరిగినమీఁద నొకనాఁడు

చ. పనివడి యొక్కయూరికి స్వ • వల్లభుఁ డేగుడు రేయి సోమినీ
వనిత గడున్ యథేచ్ఛముగ • వారుణిఁ బానముచేసి యామిషా
ర్థినియయి వత్సముల్ గొఱెలు • ధేనువులుండెడు గోష్ఠమొంది లేఁ
గను దలఁదున్మె ఖడ్గమునఁ • గైపునఁ గానక యద్ది కూయిడన్, 529

సీ. చంపి నెలవునకున్ గొని • చని యటన్ బ్ర,దీపకాంతికి లేఁగగాఁ • దెలిసి యులిసి
'శివశివా' యని యించుక • సేపు చింత, చేసి యామీఁద వంటచే • సికొని మెసవె.

—* సోమిని అంధచాండాలియై పుట్టుట *—

గీ. అంతఁ జిరకాలమునకు రో • గార్తయగుచు
సోమిని లయించెఁ గాలుఁడ • భ్యాభ దురిత
ములకుఁ దగినట్లు నిరయబా • ధలను గుడిపి
కడకుఁ బుల్కసయోనిలోఁ • బొడమఁజేసె. 531

సీ. అందు జన్మాంధమై నిక్కృ • ష్టాతికుష్ఠ, మూర్తియై బొగ్గు వన్నియఁ • బొలిచెనద్ది
తల్లి గర్భంబులోనున్న • తఱినిఁదండ్రి, సమసెఁ బుట్టుకతోడనే • సమసెఁదల్లి. 532

ఆ. ఇసుగుపోరుగువార • లింతయెంగిలిగంజి, కూడు వేయ గతికి • గొనుచు బ్రతికె
నంతఁ గుష్ఠరుజ్మ • హార్త నాయంధను, బెండ్లియాడఁడయ్యె • బేర్మి నవఁడు. 533

ఉ. ఆకటమాడుచుండి యొక • యష్టినిఁ జేకొని మాలవాడలో
జీకుది యెంగిలన్నమున • జీవనమొందుచుఁ జాలకాల మ
ట్లే కడపెన్ వయస్సుడిగ • నెంతయు వార్ధక మేగుదెంచె జీ
కాకును జెందుచున్ గడువ • గన్ విలపించుచునుండె నార్తయై. 534

—* అంధచాండాలి గోకర్ణక్షేత్రమునకుఁ బోవుట *—

గీ. అంత శివరాత్రి యే తేర • నద్ది యందు, భక్తి గోకర్ణమున కేగు • వారినరసి
వారితోఁ బయనము చేసి • చేరెనటకు, నశనవసనంబులందలి • యాసఁ జేసి. 535

క. శివరాత్రి సంత్యజాతి, స్థవిరాంధ గడున్ క్షుధార్తిఁ • దహతహపడి యు
త్సవమున కేతెంచిన మానవబృందమునరసి యాచ • నను సల్పెనిటుల్. 536

సీ. కమికెడన్నముఁ బెట్టి • కావఁగాఁ బూనుఁడు, మ్రొక్కు లడ్గులకివే • పుణ్యులార!
అడుగుచే యాలస్య • మట్లు దీనుల మొఱ, లాలించి సాఁకు ధ • ర్మాత్ములార!
చేతికడ్డము లేక • చెలఁగి దానము చేసి, పేదసాదల నేలు • పెద్దలార!
ఆకలిగొన్న దీ • నాత్ముల మొకములఁ, గానక ప్రోచెడు • గణ్యులార!

ఆ. కనులు రెండు లేని • కడిఁది ముసలిదాన, దిక్కులేని చెడ్డ • తెవులుదాన
నన్ను వట్టె సురుఁగు • చున్నవి ప్రాణంబు, లన్న మొసఁగి ప్రోవుఁ • డన్నలార!

మ. అని యిబ్భంగిగ నద్ది యాత్రికసమూ • హంబున్న చోట్లందు య
ష్టిని నూతంగొని సోలుచున్ బడుచు గిం • చిత్తేని నెందన్నముఁ
గనదయ్యెన్ శివరాత్రి నెల్లరును గో • కర్ణేశు నర్చించి ప
స్తుననుంటన్ శివరాత్రిఁ బస్తమరె న • చ్చో నాశ్వపాకాంధకున్. 533

వ. అంత

గీ. అనఘుఁ డొక్కఁడు చండాలి • యార్తరవము
విని తనదు హస్తమున నున్న • బిల్వదళము
దాని చే వేయ భోజ్యంబు • గాని దగుట
నది విసరి వేయ శివలింగ • మందుఁ బడియె. 539

క. దాన శివరాత్రివ్రత మ,ద్దానికి లభియించె నంతఁ దమి ముగియఁగ న
బ్భానుఁడు పొడుచుడు నది య,చ్చో నశనము దొరకదనుచు శోకములోఁ డన్.

— * అంధచాండాలి మృతిఁజెంది శివలోకమున కేగుట * —

క. తనయూరికిఁ జనఁబో దెరు,వున నడుగడుగునకుఁ బడుచు రొప్పుచు నొకచో
టనుబడి యసువుల విడిచెను, పినాకి గొనితేర దాని భృత్యులఁ బనిచెన్.

వ. వారును జంద్రభాస్వరంబగు విమానంబుఁ దెచ్చి యచ్చండాలికి దివ్యరూపం
బును దివ్యవస్త్రాభరణగంధమాల్యాదులొసంగి సత్వరంబు శివలోకంబుఁ జేర్చిరి
పూర్వభవంబున వితంతుబంధకియై కులంబుఁ బాసి జఘన్యుఁ జేపట్టి మధు
మాంసాహారయై గోహత్యనొనర్చినపుడు ప్రమాదంబున "శివ శివా" యని
రెండుతడవ లుచ్చరించుటఁ జేసి యాసుకృతంబున నీజన్మంబున గోకర్ణంబుఁ జేరె
నందు శివరాత్రియం దుపవాస జాగరణంబులును శివపూజయు యాదృచ్ఛికం
బుగ లభించుటచే శివలోకంబుఁ జేరి తత్పుణ్యఫలం బిప్పటివఱ కనుభవించు
చుండె నిదియెల్ల నజ్ఞానకృతంబై యిట్లైసంగె నిఁక జ్ఞానంబున మహాబలేశ్వరా
ర్చనం బొనర్చిన వారి కెట్టిసిరి వట్టునో యారయుం డిట్లు మహాబలేశ్వరలింగ
మహాత్మ్యంబు దెల్పితి నింకను నద్భుతంబగు తద్విభూతి నే వక్కాణించెద
నని సూతుం డిట్లనియె. 542

— * మిత్రసహోపాఖ్యానము * —

క. శ్రీకాంతావాసంబగు, సాకేతపురంబు మిత్రసహుఁడను నృపుఁ డి
క్ష్వాకుకులోద్భవుఁ డేలు న, లోకపరాక్రముఁడు శూర లోకస్తుతుఁడై. 543

క. నలునకు దమయంతి యటుల్, వెలసెను మదయంతి నృపతి వీరుని సతియై
లలితగుణరత్ననిధియై, విలసితధర్మిష్ఠయై వివేకవతియునై. 544

గీ. ఆనృపుం డొక్కపరి మృగయార్థ మటవిఁ, జేరి విహరించుచుండి దుశ్శీలు సాధు
దుఃఖకరు నొక్కరక్కసు దొడరి చంపె, నంత నవ్వానిసోదరుం డలుకఁ బెంచి.

క. మోసంబును బన్ని యనా,యాసంబున నఱికి దుఃఖ మర్పించుటయే
వాసి యని యెఱిఁగి వినతుం,డై సేరఁడు తేఁడు సూచి యాదర మొప్పన్.

గీ. తనకు వాని మహానసాధ్యక్షునిగ నొ,నర్చి యవ్వానిఁ గొన్నిదినంబు లుండి
తిరిగి దనరాజధాని కేతెంచుటయును, బైతృకము దారసించినఁ బరమభక్తి.

చ. అసఘుని నవ్వసిష్ఠముని • నన్వయదేశికునిన్ నిమంత్రితున్
బొనరిచి శ్రాద్ధమున్ సలుపఁ • బూన నరామిష మొక్క శాకమం
దనువుగఁ గూర్చి వండి మనుజాదుఁడు వడ్డనచేసి తాఁ దొలం
గెను ముని దాని చొప్పరసి • కిన్క సహింపక తేని కిట్లనెన్. 548

—* వశిష్ఠముని మిత్రసహుని సెపించుట *—

క. మనుజాశనుఁ బలె నీవే, మనుజక్రవ్యంబుఁ దెచ్చి • మాకర్పింపన్
జనునే నీవిటు వేగమె, మనుజాశనుఁడ వగుమింక • మదము దిగంగన్. 549

చ. అని శపియించి యద్ది మనుజాధిపకృత్యముగాక లాఁతియౌ
దనుజునికృత్యమం చెఱిఁగి • దారుణశాపము ద్వాదశాబ్దముల్
దనుక సహింపజెల్లు నవలన్ మరలన్ నరపాలమూర్తివౌ
దనె నృపుఁ డెల్ల నారసి జలాంజలిఁ బూని గురున్ శపింపఁగా. 550

చ. నిలిచిన నంతఁ దద్రమణి • నీరజనేత్రి కడున్ భయంబుతో
వలదు మహాత్మ! నీగురుని • వంచనసేయఁగ నోర్వమంచు నం
ఘ్రులఁ బడి వేడ నా మెనుడిఁ • గూర్చిన ప్రేముడి నల్కఁ బాసి త
జ్జలముల నాత్మపాదములఁ • జల్లికొనెన్ గడు ధీరచిత్తుఁడై. 551

—* మిత్రసహుఁడు కల్మషపాదుం డగుట *—

క. పదములు గల్మష మొందిన, సదయుఁడు గల్మాషపాద • సంజ్ఞన్ బడసెన్
బదపడి గురుశాపంబున, నదరిపడుచు ఘోరదనుజుఁడై పురిఁ బాసెన్. 552

చ. అడవికిఁ జేరఁబోయి గవయంబుల నేన్గుల లొట్టిపిట్టలన్
గడిఁదివృకంబులన్ బులుల • ఖడ్గమృగంబులఁ జెండి మెక్కుచున్
గడువడి ప్రాకులెక్కుచు వికారముగాఁ బకుగెత్తుచున్ వడిన్
మిడిమిడిచూపులన్ గనుచు • మిత్త్రివలెన్ జరియించుచుండఁగా. 553

వ. ఒక్కనాఁడు

క. ఒకచో లేఁబ్రాయపుఁ దమి, మకరాంకక్రీడఁ బెనఁగు • మానికులకుమా
రకమిథునముఁ బొడగని యం, తకసన్నిభుఁ డావలాశనప్రముఖుఁ డొగిన్.

సీ. మృగకిశోరంబుఁ బులి వట్టి • మెసవుపోల్కి
సతికవుంగిట నొదిగిన • సన్మునిసుతు

నొడిసి తినఁబూన నసురకు • నడలి మౌని
సతి యిటులు ప్రార్థన నొనర్చె • సత్వరముగ. 555

—* బ్రహ్మరాక్షసుఁడైన కల్మషపాదుఁడు మునిపుత్రుఁ జంపుట *—

చ. వలదు మహాత్మ! నావిభుని • బాల్యవయస్కుని సాధువృత్తునిన్
బాలియఁగఁ జేయ కిప్డు తినఁ • బూను నెడన్ ననుఁ జంపి మెక్కు మం
జలి యొనరించెదన్ విడుము • చక్కఁగ నావిభు నన్న నాతఁడున్
దలఁకక చంపి మెక్కె చనెఁ • దన్వి గడున్ విలపింప నార్తయై. 556

ఆ. అంత మౌనికాంత • యప్పలాదునిఁ జూచి, నీవు నారిఁ జేరి • భావజన్మ
కేళిఁ దేలు నెడలఁ • గాలంబుఁ జెందుదు, వనుచు శాపమిచ్చి • యతిరయమున.

గీ. మగనియస్థుల నెత్తి యమ్మగువ చితినిఁ
గూర్చి యగ్నిఁ బ్రవేశించెఁ • గుందుమాని
అంత నసురకు శాపాంత • మగుడు మగుడ
నాత్మరూపంబు ప్రాపింప • నరిగెఁ బురికి. 558

ఉ. అందు సమస్తనాగరమ • హాజను లా నృపచంద్రుఁ జూచి యా
నందముఁ జెంది యుత్సవ మొ • నర్చిరి రాజవరుండుఁ బేర్మిమై
నఁ దతి గారవించె నిశి • యందు రతిప్రియుఁడై నిజాంగనా
మందిర మొంద నాపె ముని • మానిని శాపముఁ దెల్పి కుందుచున్. 559

—* మదయంతి భర్తకు మునిసతీశాపంబుఁ దెల్పుట *—

క. తా వైధవ్యభయంబున, భూవిభు వారించె సతఁడు • పొగిలి కడువగన్
దా వైరాగ్యముఁ జెంది మ, హావిపినస్థలినిఁ జేరి • యుండే యుండెన్. 560

త. మునిసుతుఁ జంపిన యందలి, ఘనదురితబ్రహ్మహత్య • గడలికొని నృపుఁ
వెనుకొని వేధింపఁగఁ జొ, చ్చిన నృపవరుఁ డెంతయేనిఁ • జింతిలె మదిలోన్,

మ. పలుతీర్థంబులఁ గ్రుంకె నెంతయును దీ • వ్యన్మంత్రయోగంబులన్
సలిపెన్ బెక్కువ్రతంబులన్ మఖములన్ • సమ్యగ్విధానంబు శో
భిల గూర్చెఁ మునిహత్య యించుకయునున్ • బీర్కొక బాధింపఁగాఁ
దలఁకున్ జెంది యయోధ్యఁ జేరె మరలన్ • ధాత్రీశ్వరుం డార్తుఁడై. 562

క. అందును బాహ్యార్ఘ్యాద్యానము, నందుఁ బసన్ జేసియుండ • నచ్చోటికి మా
నీందుఁడు గౌతముఁ డతులా, నందుఁడు చనుదేర మనుజ•నాథుఁడు పేర్మిన్.

క. కని యర్ఘ్యాది సపర్యను, బొనరిచి నతిచేసియున్న • భూభుజుఁగని య
మ్ముని కుశలమడుగుటయు వేఁ, డిని నరపతి నిశ్వసించి • డిల్లవడి కడున్. 564

గీ. తనయవస్థను మాని కం•తయును దెలిపి
నిష్కృతినిఁగోరి వేఁడ మా•నికులచంద్రుఁ
డరసి కరుణాంతరంగుఁడై • యనియెనిట్లు
బ్రహ్మహత్యాభిభూతుఁడౌ • పార్థివునకు. 565

శా. గోకర్ణంబునకేగు వేగ మచట• • గోరాజవాహున్ హరున్
శ్రీకల్యాణకరున్ మహాబలశివున్ • సేవింపు మీ బ్రహ్మహ
త్యాకాలుష్యము నాశమొందు సుఖముల్ • దైవాఱు సర్వేశ్వరుం
డేకాకారముతో నటని దనరు భూ•మీశానచూడామణీ! 566

క. అన విని సంతుష్టుండై, ముని సెలవున్ గొని ప్రయాణ•ము సలిపి యటకున్
జని కొల్చి మహాబలుఁ ద, ద్ఘనకృప ద్విజహత్యఁ బాసి•కనియెన్ ముదమున్.

వ. అంత నచ్చటఁ గొంతకాలంబు వసించి మరల సాకేతపురంబుఁజేరి వశిష్ఠప్రసా
దంబున మదయంతియందు వంశకరుండగు నొక్క పుత్త్రిన్ బడసి రాజ్యంబుఁ
దద్వశంబుఁజేసి శివానుగ్రహంబున మోక్షంబుఁ జెందె నిట్లు మహాబలేశ్వర
లింగమాహాత్మ్యంబుఁ జెప్పితి నిఁక నేమి వినఁగోరుదు రన మునులు మహాత్మా!
శివరాత్రివ్రతవిధానంబును దద్వ్రతోపాసకభక్తచరిత్రంబు నిఁక నొందు సెల
వీయుమన సూతుం డలరి యిట్లనియె. 568

....* శివవ్రతములు *....

క. మును విష్ణునకు మహేశ్వరుఁ, డనురాగముతోడ నీ వ్ర•తానుక్రమ మం
తను జెప్పె హరియు నారద, మునికి నుడువ నతఁడు లోక•మున కెఱిఁగించెన్.

వ. నేనును మద్దేశికుని యుపదేశంబు నొందినయట్లు మీకుఁ జెప్పెద,

చ. వినుఁడు శివార్చనం బఖిల • వేళలయందును సల్పఁజెల్లు నై
నను రజనీముఖంబుల నొ•నర్చుట యెంతయు శ్రైష్ఠ్యభాజకం
బనియును సోమవారమున • నష్టమి నాశివరాత్రియందు నిం
కను బరమోత్తమం బనియు • గాటముగా వచియింతు రిన్మునుల్! 570

క. పది శైవవ్రతములు సె, ప్పెదు రుత్తమమునులు భుక్తి • ముక్తిప్రదముల్
ముదమున నవ్వాని నొన, ర్పెఁదగున్ హితకాములైన • వారలు పుడమిన్. 571

క, అష్టమిరాత్రి భోజన, మిష్టంబుగ సేయవలయు • నెల్లరునున్ గా
లాష్టమి మానఁగవలె వి, స్పష్టముగా భోజనమును • బావనమూర్తుల్! 572

క, శితపక్షైకాదశి నుపి, హితముగ నన్నంబును భుజి • యింపఁ దగదిఁకన్
శివపక్షౌన్యైకాదశి, హితవుగఁ గుడుచుఁడు భజించి • యీశ్వరు నిశలన్.

గీ, రహిని శుద్ధత్రయోదశీ • రాత్రి శివునిఁ
గొలిచి కుడువఁగఁదగు ధర్మ • గోప్తలార!
అసితపక్షంబునందైన • నభవభక్త
వరులు మానఁగవలె జగ్ధి • భరమునాక. 574

గీ. సోమవారంబునందెల్ల • యామినుల నె, శివునిఁబూజించి భజియింపఁ • జెల్లు నీవ్ర
తంబులందెందు శైవులఁ • దనదుశక్తి, కొలఁది సాపడఁ జేయఁగఁ • గూడు నెపుడు.

వ. ఐహికపారమార్థికశ్రేయంబుఁ గోరువార లీవ్రతంబుల నాచరింపవలయు నట్లు వ్రతంబు లొనర్పనివారలు దస్కరులై జనియింతు రిఁకను ముక్తికి నాలుగు తెరువు లుపదేశింపఁబడియె నవ్వి వినుండు. 576

క. శివపూజ రుద్రజపమును, శివతిథి నుపవాసమును బ్ర • సిద్ధంబగు నా
యవిముక్తనగరి మరణము, నివి నాలుగు మోక్షధనము • నిచ్చుఁ బ్రజకిలన్

గీ. అష్టమియు సోమవారంబు • నసితపక్ష, మందలి చతుర్దశియు శివ • హర్షకరము
లందు శివరాత్రి యున్నతం • బై యలరుట, నావ్రతం బెల్లరకు ముఖ్య • మై తనర్చు

— * శ్రీ శివరాత్రివ్రతవిధానము * —

వ. అందును

గీ. మాఘకృష్ణచతుర్దశి • మాన్యతను ద
నరు మహాశివరాత్రి సం • జ్ఞను ధరించి
అర్ధరాత్రిని వ్యాపించు • నదియె గ్రాహ్య
మితర మగ్రాహ్యమని యెల్ల • రెఱుఁగవలయు. 579

గీ ఆ మహాశివరాత్రియం • దఖిలజనులు, శివసమర్చావ్రతంబును • జేయవలయు
నద్ది క్రమ మెప్పఁ జెప్పెద • నవధరింపుఁ, డీరు తత్పరమతులై ము • నీంద్రులార!

వ. ఆయువు శ్రుతాయువు సత్యాయువు జయంతుఁడు విజయుండు ననువారు. అందాయువునకు నహుషుండును, క్షత్రవృద్ధుండును రజియును రంభుండును ననువారు పుట్టిరి. అందు నహుషునకు యతియు యయాతియు సంయాతియు నాయాతియు వియాతియు గుంతియు ననునార్గురు కొడుకులు జన్మించిరి. వారిలో యయాతి పట్టాభిషిక్తుండై శుక్రతనూజయగు దేవయానను వృషపర్వసుత యగుశర్మిష్ఠను వివాహంబై వారియందు యదుదుర్వసుద్రుహ్యానుపూరు లనువారిఁ బుత్త్రులఁబడసె. 869

క. వారలలోనన్ బూరుఁడు, ధీరుండై తండ్రియనుమతిని భూవిభుఁడై
శూరుండై దిగ్విజయముఁ, గూరిచి భూవలయమేలెఁ గుశలత యలరన్. 870

వ. అట్టిపూరుని సంతానపరంపరయందు దుష్యంతుండు పుట్టె. ఆ దుష్యంతునకు శకుంతలయందు భరతుండు జన్మించె. ఆ భరతునకుఁ గైకేయియందు హుతమన్యుఁడు పుట్టె నవ్వానికి జామీఢుండును వానికి సంవరణుండు జన్మించి సూర్యతనూజయగు తపతిన్ బెండ్లాడి యాపెయందుఁ గురుండను సుతున్ బడసె. వాఁడు కురుక్షేత్రంబు నిర్మించె నాకురుని వంశంబునఁ గ్రమంబుగ దేవాపిశంతనబాహ్లికులు జన్మింప నందు శంతనుండు రాజయ్యె. ఆశంతనునకు గంగాదేవియందు భీష్ముండును సత్యవతియందు విచిత్రవీర్యచిత్రాంగదులను వారును జన్మించిరి. భీష్ముండు బ్రహ్మచారివ్రతమును ధరించుటను సాత్యవతేయు లనపత్యులై నశించుటను జేసి వ్యాసుండు వారి క్షేత్రంబులందు ధృతరాష్ట్రపాండులన్ గనియె. ధార్తరాష్ట్రులు నూర్వురుపై శున్యంబు నొంది చెడుఁగులగుటఁ బాండుకుమారు లవ్వారిఁ గురుక్షేత్రంబున యుద్ధము చేసి సమయించి రం దర్జునున కభిమన్యుండును నాతనికిఁ బరిక్షిత్తయ్యఘునకు జనమేజయుండును నవ్వానికి శతానీకశంఖులును, శతానీకునకు నశ్వమేధదత్తుండను పుత్త్రుండు జన్మించి నవ్వానివంశంబున ననేకులు పొడమి రిందుఁ బురూరవుపుత్త్రులగు శ్రుతాయువు మున్నగువారల వంశపరంపరయందు దివోదాసుండు మున్నగువారలు పొడమి రందుఁ గొందఱు బ్రాహ్మణజాతిఁ జెందిరిఁక యయాతిపుత్త్రుండగు యదుఁడనువాని వంగడంబున శ్రీమన్నారాయణుండు కృష్ణుండై యనంతుండు బలరాముఁడై యవతరించి దుష్టజనమారణంబొనర్చి ధర్మరక్షణం బొనరించి రీయది చంద్రవంశచరిత్రం బిఁకేమి వినఁదలంతు రన నవ్వారలు మహాత్మా! వేదవిభాగంబుఁ జేసి యష్టాదశపురాణంబులను భార

శేతిహాసంబును రచించిన శ్రీకృష్ణద్వైపాయనుజన్మంబులీ రెఱింగింపుమనుడు
నూతుండిట్లనియె.

## — వ్యాసజన్మము —

చ. ఘనుఁడు వశిష్ఠపౌత్రుఁడు జ • గద్వినుతుం డల శక్తిమానినం
దనుఁ డనవద్యతాపసధ • నప్రచయుండు పరాశరుండనా
మునిపతి తీర్థసేవనముఁ • బూని రహిం యమునాతటిన్ నిషా
దునిఁగని యోడఁ గూర్చి ననుఁ • దొందర నావలిరేవుఁ జేర్పునాన్. 372

క. వాఁడును బోసేయుచుఁ బూఁ, బోఁడినిఁ దనకూఁతుఁ జూచి • పుత్రిక! నీవీ
యాడెనయని మేటిమునిని, నోడను దాటింపు మవలి • యొడ్డుకు ననుడున్. 373

క. అదియును నట్టులనే యని, ముదమునఁ దరినెక్కఁ జేసి • ముని నవ్వలిగ
ట్టుదరికిఁ జేరుచుచుండఁగ, ముదితను బరికించి దివ్య • ముని పరవశుఁడై. 374

చ. ముసిముసి నవ్వులొల్కు మొగ • మున్ జెవులందెడు కన్నుదోయి పెం
పెసఁగు మెఱుంగురంగుల వ • హించిన యందపుగుబ్బజంట నీ
రసమయి లోఁచు నెన్నడుము • రాణదలిర్పఁగ లేఁతప్రాయపుం
బసలఁ బసందులన్ దొలుకు • భామనుజూచి స్మరాశుగార్తుఁడై. 375

గీ. నావ దరిఁ జేరినంత నానాతిఁ జేరి, చేయిఁ బట్టిన నయ్యది • సిగ్గుఁ జెంది
ఏమియిది దేవరా! యన • నెలుక చేసెఁ, దనదు హృదయంబుఁ బొలతికిఁ • దాపసుండు.

వ. అంత నయ్యది యింకను సిగ్గుతోఁ దలవంచుకొని యమ్మునివరేణ్యునకిట్లనియె.

ఉ. బోయకులంబుదాన, విను • భూసుర! చేపలకంపు నాయొడల్
హేయముగాదె? నీకిది ము • నీంద్రుఁడవెంతయుఁ బావనుండవున్
నాయమె? యిట్టి నీచకుల • నారులతో మరుకేళి సేయఁగా
నీమదకెట్లు దోఁచెనొకో? • నేర్పునఁ గాంచుము ముందువెన్కలన్ 378

ఉ. అందును నేను గన్నెను మ • హాత్మక! తల్లియుఁ దండ్రియుం గలా
రందదె గాంచుచుండి రిట • నంగజకేళిని నిన్నుఁ జెందఁగా
ముందఱ నన్నుఁ గైకొనెడు • పూరుషుఁ డుండునె? తల్లిదండ్రులున్
దొందర సేమరే? యొరులు • తుందుడుకంచుఁ దలంపరే? గురూ! 379

తరల. అనినఁ దాపసుఁ డిట్లు పల్కె లతాంగి! విన్మిఁక నీయొడల్
ఘనసుగంధపరంపరావృతిఁ • గాంచు నీవిఁక రాజనం

దనవు నిక్కము బోయదన్ నుడి • తప్పు చూడుము కన్నె చో
వ్వను నడంగదు చూచరెవ్వరు • పొంకమా హిమ మొప్పెడున్. 380

చ. సురతముసేయు వేగముగ • సుందరిరో! యిఁక నన్నుఁగూడి న
చ్చరలను లేఁత జవ్వనపుఁ • జానలఁ బల్వురఁ జూచియుంటి నె
వ్వరుసునసేని నామది నిబద్ధిఁ గరంగకయుండె నేఁడు తొం
దరపడుచుండె నీయెడలఁ • దప్పునె దైవగతుల్ మరల్పఁగాన్. 381

గీ. నీవు యోజనగంధివై • నెగడఁగలవు
తనయుఁడు జనించు సత్తపోధనుఁడు ఘనుఁడు
రాణి వగుదువు రాజాధిరాజు నిన్నుఁ
బడయుఁ దడవేల చేసెదు ? పద్మగంధి! 382

గీ. అనిన నది దేహసౌగంధ్య • మమరుటయును
మంచు గదుఁ గ్రమ్మి తనవారు • మఱుగగుటయు
నరసి మునినిఁ దపోధను • నెఱిఁగి మాఱు
పలుకుటకు నోడి రతికిష్ట • పడియె మునికి. 383

ఉ. అంతనె మాని చెల్వఁగొని • యయ్యమునాతటమందునున్ గడున్
సంతస మొప్పఁ బుష్పశర • సంగరభంగులఁ దృప్తిదీరఁగా
నెంతయుఁ గ్రీడసల్పి చనె • నీద్ధ్యుఁడు వ్యాసమహామునీంద్రుఁ డ
శాంతతపోధనుం డొదవె • సారసనేత్రిసమానుఁ డున్నతిన్. 384

క. కుడిచేతఁ గమండలువును, నెడమదియగు చేత దండ • మెసఁగంగ జడ
ల్గడుఁదనరఁ గృష్ణతనుఁడై, పొడమి జననిపాదములకు • మొ్రక్కియిటులనెన్.

క. ఎప్పుడు పనిగలిగిన నీ, వప్పుడె నను దలఁపవలయు • నాక్షణముననే
నొప్పుగ వచ్చియు నాపని, తప్పక నెఱవేర్చువాఁడ • తల్లిరో! విన్నా!

క. అనియనుమతిఁగొని వేగమె, చనియెను వ్యాసుండు తపసు • సాధింపఁగ నం
తనె యోజనగంధియుఁ బుత్రుని విడువఁగలేకవగను • బొగిలియుమదిలోన్.

వ. సుతుని యాకారంబును సద్గుణసౌష్ఠవంబును దలంచుచు మరల నోడయెక్కి
యవ్వలిగట్టునందున్న తల్లిదండ్రులయెడ కరిగె నంత వ్యాసుండు యమునా

ద్వీపంబందుఁ బుట్టుట ద్వైపాయనుం డనియు నల్లనివాఁ డౌట కృష్ణద్వైపాయనుం డనియును వేదవిభాగంబు నొనర్చువాఁ డౌట వేదవ్యాసుం డనియుఁ బేరులఁ జెంది ముందుగఁ దీర్థరాజంబగు ప్రయాగంబు నొంది యందునుండి నైమిశంబుఁ గురుక్షేత్రంబు హరిద్వారంబు నుజ్జయిని నయోధ్యను మధురను ద్వారకాపురి నమరావతి సరస్వతిని సింధుసంగమమును గంగాసాగరసంగమమును త్ర్యంబకంబును సప్తగోదావరీతటంబును గాలంజరంబును బ్రభాసంబును గేదారంబును బదరీవనంబును ఓంకార క్షేత్రంబును బురుషోత్తమంబును గోకర్ణంబును భృగుకచ్ఛంబును భృగుతుంగంబునుబుష్కరంబును శ్రీశైలంబును ధారాతీర్థంబును గుమారగిరిని సేవించి వారణాసిన్ జేరి

గీ. అందు మణికర్ణికాస్నాన • మమరఁ జేసి, విశ్వనాథునిఁ బూజించి • విఘ్నపతుల
నెల్ల సేవించి గౌరుల • నెల్లఁ గాంచి, కాలభైరవు నర్చించి • గణము తోడ. 389

క. కేశవుల నఖిలదేవా. ధీశుల లోలార్కముఖుల • నినవర్యుల య
క్షేశుని భజించి తగ వ్యా, సేశుఁ బ్రతిష్ఠించి కొలిచి • యింపు లమరఁగా. 390

గీ. శ్రుతులను విభాగ మొనరించి • యతులితముగఁ
బదు నెనిమిది పురాణముల్ • వరఁగ రచన
చేయఁగా నెంచి తద్దృశ • సిద్ధి యిందు
నే మహాలింగమును భజి • యింప నొదవు. 391

క. సంకటహరుఁడై శ్రితులకుఁ, బంకిలచిత్తులకుఁ గలుష • భంజకుఁ డనునా
యోంకారేశ్వరుఁడును నత, శంకరుఁడగు విశ్వనాథ • సద్మాట్టుండన్ 392

సీ. కాలేశ్వరుఁడు వృద్ధ • కాలేశ్వరుండును, కర్ణేశ్వరుండు గో • కర్ణవిభుఁడు
జ్యేష్ఠేశ్వరుఁడు సుర • జ్యేష్ఠేశ్వరుండను, చంద్రేశ్వరుఁడు హరి • శ్చంద్రవిభుఁడు
హ్లాదేశ్వరుం డను • హ్లాదేశ్వరుండును, భాండేశ్వరుఁడు తిల • భాండవిభుఁడు
చండీశ్వరుఁడు ద్యుమ • చండీశ్వరుండును, భూతేశ్వరుఁడు భార • భూతివిభుఁడు.

గీ. మఱియుఁ గలశేశ రత్నేశ • మధ్యమేశ, వీరభద్రేశ వీశేశ • భైరవేశ
పార్వతీశ్వర ధర్మేశ • బాష్కలీశ, కందుకేశ్వర గంగేశ • కపిలవిభులు. 393

వ. ఇంకను గృత్తివాసేశ్వరుండును గామేశ్వరుండును దారకేశ్వరుండును దశాశ్వమేధేశ్వరుండును నందికేశ్వరుండును భవానీశ్వరుండును బర్వతేశ్వరుండును వ్యాఘ్రేశ్వరుండును గోటిరుద్రేశ్వరుండును హాటకేశ్వరుండును భువనేశ్వరుం

డును జైగీషవ్యేశ్వరుండును గోకర్ణేశ్వరుండును బృహస్పతీశ్వరుండును బ్రసన్న
వదనేశ్వరుండును మహాలక్ష్మీశ్వరుండును మదాలసేశ్వరుండును నవిముక్తేశ్వ
రుండును విశాలాక్షీశ్వరుండును వరాహేశ్వరుండును లాంగలీశ్వరుండు మఱం
గేశ్వరుండు గపర్దీశ్వరుండు యమునేశ్వరుండును నర్మదేశ్వరుండును హరికేశ
శ్వరుండును మోక్షేశ్వరుండు ప్రమోదేశ్వరుండు మున్నుగాఁగల దివ్యలిం
గంబులనేకంబులుగల విందు నాయభిమతంబుఁ దీర్చెడు లింగం బెద్దియో యని
కొండొకతడవు యోజించి యంతనె యవగతంబైనట్లు సంతసించి యవును
మఱచితి 394

సీ. తుంబురుండును నారదుఁడును నెవ్వనిఁగొల్చి, సంగీతవిద్యలోఁ జతురులైరి
అంగిరసుఁడును నల శుక్రుఁడెవ్వసి, భజియించి పాండితీప్రౌఢిఁగనిరి
పౌలస్త్యుఁడెవ్వని పరఁగ నర్చించి ధ, నేశుఁడై విద్యాధరేశుఁడయ్యె
ఖట్వాంగుఁడనపత్యకలుషుఁడై యెవ్వనిఁ, బూజించి కాంచెను బుత్రిలబ్ధి
గీ. శ్రీకరుఁడు గోపకుం డేని సేవఁజేసి, శాంభవగణాధిపత్యంబు సంతరించె
నట్టి శ్రీమధ్యమేశ్వరుండభవుఁడుండ, గాణగనేటికి సిద్ధుల కొఱకు నేను,

ఉ. నేనును మధ్యమేశ్వరుని నిష్ఠభజించి పురాణకర్తృతా
న్యూనవిభూతిఁ గాంతునని యొప్పుగ జాహ్నవిఁ గ్రుంకి యెక్కడో
వూనికి మధ్యమేశ్వరుని బూజ యొనర్చుచునుండెఁ బెక్కునా
ళ్ళు నియతిన్ గనుంగొని మహాత్మకుఁ డిందుధరుండు పేర్మిమై. 396

గీ. లింగమధ్యను బాలకలీలఁ దోఁచి, వరము లిచ్చెద నడుగునా వ్యాసమౌని
సంబరంబున వందనశతముచేసి, యిట్లు వినుతించె నెంతయుఁ నింపుగదుర. 398

క. వాకున మనసునఁ దనువునఁ, జేకొనరాదీశ! నిన్నుఁ జెలఁగెడు శ్రుతులున్
నీకలిమి దెలియవిఁక నీ, వే కర్తవు భర్తవును మహిన్ హర్తవునున్

క. నీవే యమరులకాద్యుఁడ, వీవే భవపాశహరుఁడ వీవే బ్రహ్మం
బీవే యానందమయుఁడ, వీవే యీశ్వరుఁడ వగుచు నెసఁగెదవనఘా! 399

క. లేదీశ! నీకుజన్మము, లేదాహ్వాయమొందుఁగులము లేదిఁకగోత్రం
బేదియు లేదైనను నాఁపాదింతువు త్రిజగములకు భద్రములరహిన్. 400

చ. ఎఱుఁగఁగలేరు నిక్కముగ నెంతయు ధాతయు నిందిరావిభుం
డెఱుఁగఁగలేఁడు శక్రుఁడును నెంచనెలేరు సుపర్వవల్లభుల్

వరమము యోగిదుర్లభము ♦ భక్తజనప్రియమైన తావకా
పరమగు తత్త్వమట్టి నిను ♦ స్వాంతమునందు నుతింతు నీశ్వరా! 401

క. నీవలన సర్వమేర్పడు ♦ నీవె సర్వ, మీశ! పసిబాలుఁడవు యువ♦వెంతయేని
వృద్ధమూర్తివి నీకివె♦వినుతిఁ జేతు, శర్వునకుఁ బరమాత్మకు ♦ శంకరునకు 402

వ. అని యిట్లు వినుతించిన వ్యాసమునికిఁ బ్రీతుండై పరమేశ్వరుండు నీవభిలషించి నట్లు నీకఖిలవిద్యల నావహింపఁ జేసితి. నీక నీవాక్కునుండి పురాణేతిహాసంబుల రచింపఁజేయుదుఁ గీర్తికరుండవగుము. నీవు నుతించిన యీ స్తవంబును నెవ్వరేనిఁ జదివిన వినిన నవ్వారు శ్రేయంబులొందెదరని యంతర్థిగాంచె నంత వ్యాసమునీంద్రుండు సంతసంబున బ్రాహ్మంబు, పాద్మంబు, వైష్ణవంబును శైవంబును భాగవతంబును నారదీయంబు మార్కండేయం బాగ్నేయంబును బ్రహ్మవైవర్తంబు, లైంగంబు, వరాహంబు, వామనంబు, కౌర్మంబు, మాత్స్యంబు, గారుడంబు, స్కాండంబు, బ్రహ్మాండంబను పదునెనిమిదిపురాంబులను భారతేతిహాసంబును రచించి శిష్యులగు మాకండఱకుఁ జెప్పె నీ పురాణంబులను లోకంబందు వినునట్టి శ్రోతలు పురాణావసానంబందుఁ బురాణవక్తను బూజించి నువస్త్రంబుల సువర్ణహస్తకర్ణాభరణంబుల సవత్సయగు పాడియావు నేనుంగును నగ్రహారంబును సనుస్తవస్తువుల శక్తి శాఠ్యంబుసేయక యొసంగి పురాణగ్రంథమును బూజించి సమర్పించి బ్రాహ్మణభోజనం బొనరింపఁజేసి దక్షిణలీయవలయు నట్లైనఁ బురాణశ్రవణఫలంబు నొందెద రిట్లు మీరడిగిన శ్రీకృష్ణద్వైపాయనజన్మచరిత్రంబుఁ జెప్పితి నిఁకేమి వినుదురనిన మునులు సూతున కిట్లనిరి. మహాత్మా! 403

గీ. శివుచరిత్రల విని ప్రీతిఁ♦జెందినాము, శివుసనాతనశక్తియా ♦ శివచరితలఁ
దనరు నద్దేవి దివ్యావ♦తారములను, బోధసేయుము మాకిప్డు ♦ పుణ్యమూర్తి!

వ. అనిన సూతుండు మునుల కిట్లనియె.

చ. సురథుఁ డనంగ నొక్క నృప♦సోముఁడు భూరిబలుండు కోలయన్
బురమును నేలుచుండఁగ రి♦పుల్ చతురంగచమూసమేతులై
పోరిఁబోరి ముట్టడించిరి నృ♦పుండును సేనలనెల్లఁ గూర్చి సం
గరమున కేగి పోరితము ♦ గాటముగా నొనరించె ధీరుఁడై. 406

మ. వగవాం డ్రిక్కడు మూఁకలై సురథునిన్ • బాహాబలం బెక్కడొ
వ్వఁగ నోడించి వరూథినిన్ జదువఁ దత్పౌరుల్ ప్రధానుల్ హితుల్
దగురీతిన్ రిపురాజితోఁ గలసి నే • స్తంబొంది రంతర్గ గడున్
వగలొందన్ బురిఁ బాసి యా సురథభూ • పాలుండు చేరెన్ వనిన్

—* సురథుఁడు సుమేధఋష్యాశ్రమంబుఁ జేరుట *—

ఆ. అంత నొక శాంతమైన ఋ • ష్యాశ్రమంబుఁ
జేర నమ్ముని నవ్వాని • గారవించి
యందు నుండు మనియె నతం • డట్టు లుండెఁ
బిదప నొక కొన్నినాళ్ళకు • బేరుఁ డొకఁడు. 408

క. తనవారలతో లోభం, బున వెడలింపఁబడి వచ్చె • భూపుఁడు వైశ్యుం
డును నన్యోన్యం బరసి జ, తనునొప్పి వసించి రంధుఁ • దగులముకోడగ. 409

సీ. అరిజితుండయి నిజజనా • నాదరమున, మరగుచుండెను భూజాని • మమతదక్క
వంచితుండయి తనవారి • వలన వెడలఁ, బడియుఁ గోమటి వారికై • పలవరించు.

వ. ఇట్లిద్ద ఱొకనాఁ డమ్మునివరుండు తీరి కూర్చున్న సమయంబునఁ దారసించి
మ్రొక్కి యందు భూపాలుం డిట్లనియె. 411

గీ. శాత్రవతిరస్కృతుఁడ నాట • శత్రుజనులఁ
బారిఁ గొనఁగ నెంచు నామది • పుణ్యమూర్తి!
అదయులై నాదు సచివాదు • లరులఁ జేరి
రుల్లము తపించుచుండెడు • నుడుకుమీఱి. 412

క. ఈ బేరుఁడు తనవారల, చే బిట్టుగఁ దరుమఁబడియుఁ • జెన్నఁటిమదితో
నా బందుగులను జేరఁగఁ, దాఁ బరితాపంబుఁ జెందుఁ • దహతహాయమరన్.

వ. ఈ రెండు దుఃఖంబులును మోహజాతంబు లగుట నవ్వానిఁ బాపి మమ్మను
గ్రహింపు మనిన రాజునకు మునీంద్రుం డిట్లనియె. 414

—* సుమేధముని సురథునకు మహామాయావైభవంబుఁ జెప్పుట *—

సీ. విను మహామాయ శివసనా • తని నరేంద్ర!, సర్వజనమనములకు • సజ్ఞానరూప
మైనరూపంబుఁ గూర్చ న • ద్దాని నజము, భామ కులు పాయు లేకుస • త్యంబు వినుము.

క. సురలే యమ్మాయను బడి, పరతత్త్వము నెఱుఁగలేరు • పార్థివ! యిఁక నీ
నరు లెల్లెఱుంగ నేర్తురు, పరఁగ జగన్మాతృరచిత•బంధాన్వితులై. 416

-వ. మఱియు నాయంబ త్రిగుణయై వరదయై విరాజిల్లు.

క. ఆపెయె విశ్వముఁ గూర్చెడు, నాపెయె పాలించుచుండు • నాదరమతితో
నాపెయె హరించు నిఁక జనుఁ, డాపె కృపన్ గనినఁబాయు•నమ్మోహంబున్

గీ. అనిన నానృపుఁడగిగె మ•హానుభావ!, యామహా•మాయ యెవరియో•యట్టిదేవి
యెట్లుజనియించెనో మాకు•నెఱుఁగఁజెప్పు, మనినవారల కిట్టుల•ననియెముని.

## —* మధుకైటభ సంహారము *—

ఉ. మున్నొకమాఱు సంద్రము స•మున్నతమై ఖరి నేకమై తగన్
బన్నగరాజతల్పమునఁ • బద్మదళాక్షుఁడు నిద్రిఁదూఁగఁగాఁ
బన్నుగ విష్ణుకర్ణయుగ•పంకభవుల్ మధుకైటభాఖ్యులౌ
నెన్నికమీఱు రక్కసులు • హెచ్చుమెయిన్ బరికించి నల్గడన్. 419

ఆ. కమలనయను నాభి•కమలమునందున్న, విధినిఁజూచి వేగ•వధయొనర్పఁ
గడఁగుచున్న నంత•నడలి నల్వ శయానుఁ, డైన హరినిఁజూచి•యాత్మమందు

గీ. జగదధీశ్వరిఁగూరిచి • చక్కనిట్లు, వందనముఁ బొనరించి క•డిందిభక్తి
మెఱయసంస్తవమొనరించి•దురితహంత్రి!, కాలరాత్రి!మహారాత్రి!•గాఢరాత్రి!

క. రక్షింపు మహామాయా!, రక్షింపుము నన్ను మోహ•రాత్రి! దయాఢ్యా!
రక్షింపు యోగనిద్రా!, రక్షింపుము మెఱియులైన • రాక్షసులచే. 422

ఉ. తల్లిరో! నీకృపాగతి ని•తాంతము నేనును బద్మనేత్రుఁడున్
హల్లకబంధుమౌళియగు • నాహరుఁడున్ జగముల్ రచించియుం
జల్లఁగసాఁకుచున్ లయముఁ • జక్కనొనర్చుచు నుండు మమ్మ! నీ
వెల్లజగంబులన్ గరిమ • నేలెడు రాణివి, లోకపావనీ! 423

సీ. నీవె స్వాహవు మఱి•నీవె యాస్వధవును, నీవె యాలజ్జవు • నీవె ధృతివి
నీవె సద్బుద్ధివి • నీవె యాసిద్ధివి, నీవె యాప్రీతివి • నీవె మతివి
నీవె యాశాంతివి • నీవె యాక్షాంతివి, నీవె యాదాంతివి•నీవె స్మృతివి
నీవె యాభ్రాంతివి • నీవె యాకాంతివి, నీవె యాశక్తివి • నీవె రక్తి

గీ. నీవె తుష్టివి, పుష్టివి • నీవె క్షుత్తు, నీవె తృష్ణవు జాతివి•నీవె వృత్తి
నీవె చిత్తివు మాయవు•నీవె మోహ, పరవు మసురుల మేలొల్లు•పద్మనయను.

సీ. వేధ యిట్టులు ప్రార్థింప • వేదమాత, సిద్ధరూపిణి ఫాల్గున • శుద్ధమందు
ద్వాదశీ తిథియందు ని • శాంతకరుణ, నమ్మహాకాళియై భువి • నవతరించె. 426

క. నలువను జూచి భయంపడ, వలదిఁక సత్వరము దైత్య • వర్యులమాయన్
బొలియింపఁజేతునిపుడే, జలజాక్షునికిన్ మెలఁకువ • సమకూర్తు విధీ! 427

క. అనివేగ జలజనయను నయనములు విప్పంగఁజేయ • నచ్యుతుఁడును న
ద్దనుజులఁగని వారలతో, ననియొనరిచె నైదు వేల • హాయనములొగిన్. 428

గీ. అంత జగదంబమాయచే • నసురవరులు
హరినిఁ గని వరమిచ్చెద • మడుగు కొనుమ
నాఁగ హరియును హరుసంబు • ననువచించె
నాకు వధ్యులు గండని • నయము మీఱ 429

గీ. వారలాపైనఁ గొంకియు • వాకుమీఱ, కబ్ధియెల్లెడ నేకమై • యమరుటయును
జూచి నీళులు లేనట్టి • సుస్థలమునఁ, జంపుమన నలినాక్షుఁడు • సంతసించి. 430

క. తనయూరులఁగొని దైత్యుల, ఘనతర చక్రహతిఁ జంపెఁ • గమలజుఁడంతన్
మనమున నలరి పరాంబను, ననువుగఁగొనియాడి హరికి • నభినుతి చేసెన్. 431

గీ. ఇది మహాకాళికోద్భవం • బిఁకను జెపుదు
శ్రీ మహాలక్ష్మ్యవతరణ • శ్రీకచరిత
మింపుమై వినఁ డెద్దాన • నీతులవిసి
సంతసము సమకూర్చు న • శాంతముగను. 432

— * మహిషాసుర చరితము * —

క. రంభాసురతనయుండు వి,జృంభితవిక్రముఁడు దైత్య • సింహము మహిషుం
డంభోజోద్భవువరమున, దంభోళిధరున్ జయించి • తాఁగొనె దివమున్. 433

గీ. ఇంద్రసింహాసనం బెక్కి • హెచ్చుమీఱఁ, బదియునాలుగుజగములఁ • బ్రాధిదనర
వందయేండ్లేలె మహిషుఁడ • వంధ్యవివిధ, భోగభాగ్యసుఖంబులు • పొదలుకొనగ.

ఉ. దేవతలంతఁ జింతిలి మదిన్ గడు వేసటి గుంపుగూడి వా
ణీవిభుఁ జేరఁబోయి కడు • నిష్టనుతుల్ పొనరించి యెట్టులేన్
గావలెఁ గాసరాసురుని • గండడఁగించి వధించి మమ్మిఁకన్
గావకయున్నఁ జత్తుమని • క్రచ్చఱ వేడ విధాత యత్తఱిన్. 435

గీ. హరిహరులు వేడ్క నొక్కచో • నపుడు చేరి
యుండు పెటెఁగి విరించి దివ్యోత్కరముల
నెల్ల గొనిపోయి యవ్వారి • కెఱుఁగఁ జేసె
మహిషుదౌష్ట్యంబు వేల్పులు • మఱుగఁటయును. 436

చ. సురలు రమేశ్వరేశులకు • జోతలొసంగి లులాయదైత్యుదు
ర్భరపరిబాధలన్ దెలిపి • వాని వధింపఁగఁగోరనంత న
వ్వరదులు దేవదుఃఖములఁ • బాపఁగఁగోరి రయంబుమీఱ నం
బరముఁగనన్ మహాంబాకఁడు • భాసిలె వారల నేత్రజాతమై. 437

—* దుర్గావతారము *—

గీ. అట్టి తేజంబునం దమరాధిపతుల, తేజు లెల్ల ను జేరి దేదీప్యమాన
కాంతిపుంజంబగుచు నొక్క • కన్నె వెడలెఁ, గనియు వినియు నెఱుంగని • కాంతమూర్తి

వ. అట్టియాయమ్మకు.

సీ. శంభు తేజంబున • సంభవించెను మోము, విష్ణు తేజంబున • వెలసె బాహు
లాబ్రహ్మ తేజున • నలరెఁ బదంబులు, యామ్య తేజంబుచే • నమరెఁ గురులు
చందురు తేజున • జానొందెఁ జనుదోయి, శచి తేజమున నడుమ్ • చక్కనమరె
వరుణు తేజంబునఁ • బరఁగెఁ బిక్కలు దొడల్, క్షమ తేజమున నితం • బము దనర్చె

గీ. గోత్రరిపు తేజమునఁ గరాం • గుళులు పొదలె
గుముదరిపుమహమునఁ బదాం • గుళులు దనరె
శ్రీదు తేజున నాస సు • శ్రీపరంగెఁ
దనరెఁ జిత్రాగ్ని మహము నే • త్రత్రయముగ 439

క. రదములు ప్రాజాపత్యా, స్పదములగుచుఁ దనరె గాడ్పు • భాసిలు చెవులై
యొదవెను సాంధ్యమహంబునఁ, గుదురగు కనుబొప్పలమరెఁ • గోమలికట్టుల్.

క. అరుణుని మహమున నధరము, శరజన్ముని తేజమున నొసఁగె నూర్ధ్వోష్ఠం
బరుదొప్ప నిట్లు తక్కన, మరమహమున నొదవె లాఁతి • మహితాంగములున్.

గీ. ఇట్లు పొడమిన యిందిర • నీక్షఁ జేసి, సురలు మురిసి రయంబున • సుందరాంబ
రములభూషణములనాయు • ధములనొసఁగి, సంతసింపఁగఁ జేయ ని • చ్ఛను బొనర్చె

## — * దుర్గాదేవికి దివ్యులాయుధాదుల నిచ్చుట * —

సీ. దేవి కిచ్చెను మహాదేవుండు శూలంబు, హరియిచ్చెఁ జక్రంబు నంబికకును
పాశి యిచ్చెను శంఖపాశంబులార్యకు, శక్తి గొసంగెను శక్తి నగ్ని
అమ్మఁ బొసఁగె ఘంట నశని నిచ్చెను వృష, ఘనమగు విల్లిచ్చె గంధవహుఁడు
యముఁ డిచ్చెఁ గాలదండమును బ్రజాపతి, యక్షమాలను దెచ్చి యంబ కిచ్చె

గీ. బ్రహ్మ యిచ్చెఁ గమండలుఁ బాలసంద్ర, మొసఁగెఁ బట్టుపుట్టంబుల నురువు దీఱు
రవల కడియాల వేళ్ళకు రవలయుంగ, రముల ముత్యాలపేరులు రవలనత్తు

క. బంగరు పాంజేవులనున్, బంగరుసందిటికడెములఁ బరువపు వేడ్కన్
బంగరుతమ్మలమాలను, బొంగుచు నీరధి యొసంగె భువనేశ్వరికిన్ 444

గీ. గండ్రగొడ్డలి నల విశ్వకర్మ యొసఁగె, డాలుకత్తుల నిచ్చెను గాలమూర్తి
కామధేను వొసఁగె వజ్రకవచమును మహాస్త్రముల నెల్లఁ బేర్మిమై నంబికకును

క. నగరాజు సింగమును నెన్నఁగఁదగు రత్నములనిచ్చె నళినాక్షికి నిం
పుగ మధుపూరితకలశ మొసఁగె జక్కులఱేఁడు భువనజననికి వేడ్కన్

వ. మఱియు శేషుండు మణికుండలంబులను విచిత్రరచనాయుక్తంబగు నాగహారంబును సమర్పించె నిట్లు తక్కిన వేల్పులును ననేక రత్నభూషణంబుల నాయుధంబుల నొసంగి రంత జగదంబ దివ్యాంబరభూషణాయుధాలంకృతయై యట్టహాసంబుతోఁ గర్జనం బొనర్చె నంత యున్నాదం బాకసంబు నిండి ప్రతిధ్వని యొదవె. త్రిలోకంబులు గలంగె సింధుచతుష్టయంబుతోఁ బృథ్వి చలించె.

ఆ. దానవార్ద్యమాన దైవతగణములు, భువనజననిఁ జూచి పొంగి మహిష
రాక్షసేంద్రుఁ డింక రహిఁ బాసి పోలసెకు, నంచు మదిని సంతసించి యంత

వ. జయజయ ధ్వానంబులొనర్చి యనేకవిధంబుల మాతను వినుతించి యెలర్చి రంత నీయలుకుడు విని మహిషానుచరులగు నసురవరులేచి యాకసంబుఁ జుట్టి సేనలన్ గూర్చికొని యాయుధంబులు ధరియించి యంబికను దారసించిరి.

## — * మహిషాసురుఁడు దుర్గాదేవికడకు యుద్ధమునకు వచ్చుట * —

మ. మహిషుండున్ భువనత్రయంబు నిజధామగ్రామసంఛన్నమున్
రహిమైఁ జేయు మహేశ్వరిన్ గనియు గర్జాఘోషమాలించి య
మ్మహితాకారను నాజినొంపుటకునై మాద్యద్భటశ్రేణితో

విహితోద్యత్సకలాయుధప్రతతితో । విచ్చేసె నుద్రేకియై. 450

గీ. కాసరానుచరులగు బాష్కలుఁడు చిక్షు
రుండు జామరుఁడును నుదగ్రుండు నంధ
కుండు నసిలోముఁడును బిడాలుండు దామ్రుఁ
డును మహాహను దుర్ముఖులును రయమున. 451

క. నానాశస్త్రాస్త్రంబుల,తో నంబను బొదువ నార్య । దోర్బలమెసఁగన్
దానవవీరుల శరసం,తానములన్ గరఁగఁజేసె । దర్పాన్వితయై. 452

గీ. మేటినిట్టూర్పు వలన బల్ । మేలిబలము
గలుగు నవకోటిశక్తులఁ । గ్రిమ్మఁజేయు
శక్తులకు రక్కసులకును । సమరమొనరె
ఘనగదాశక్తిముద్గర । ఖడ్గములను. 453

ఉ. చండియు నంత వేగముగఁ । జండతరాహవలోలయై మహో
ద్దండబలంబునన్ జెలఁగు । దానవవర్యులఁ జిక్కఁబట్టి భే
రుండతరాసిధారలను । ద్రుంచె శిరంబుల నేడ్తెఱన్ గరా
లుండగు సైరిభాసురుఁడు । లోలత నంబను డాసిచెచ్చెరన్. 454

శా. లాంగూలంబున గొట్టెలన్ మఱియు వల్గత్తుండచండాహతిన్
శృంగద్వంద్వమునన్ పరాంబికచమూశ్రేణిన్ విదారించి చం
పం గాత్యాయని యంత వానిపయి రా । మత్తాత్ముఁ డద్దైత్యుఁడున్
సింగంబున్ బొలియింప వాల్విడ నసిన్ । ఛేదించె నద్దేవియున్. 455

గీ. కాసరుండంతనాగ్రహకలితుఁడగుచుఁ, గొమ్ములన్ బెల్లగించి పెన్గొండఁదెచ్చి
చండిపై వేసి గర్జించె । శౌర్యమెసఁగ, నంబ శరతతి గిరినిఁజూర్ణంబొనర్చె 456

క. మరల మహిషుండు నట్టులె, యురవగు శైలముల శిలల । నూడబెరికి యే
ర్తెఱ నంబపైని విసరఁగ, శరధారల వానియును రజము చేసెవడిన్ 457

గీ. ఇట్లు మహిషునకును దుర్గ । కేపుమీఱ
జరిగెఁ జిరకాలము దురంబు । సర్వదేవ
తాంబ యంతఁ గినుకమీఱి । యడరిమహిషుఁ
బొల్లుసేయఁగ నిక్కచ్చిఁ । బూనిమదిని. 458

చ. కరమునను న్న పాశమునఁ • గాసరుకాళ్ళను గట్టినంతనే
హరియయి వాఁడు బిట్టెగయ • నంబ తదీయశిరంబుఁ ద్రుంచె స
త్వర మతఁడొక్క యోధునివి•ధమ్మునఁ జర్మకృపాణపాణియై
తఱుముచు నంబపైనడరఁ • దా విశిఖమ్ములఁ గప్పె నంబయున్ 459

## — * మహిషాసురసంహారము * —

చ. సరగున దైత్యుఁ డంత మద•సామజమై యుమయెక్కినట్టికే
సరితలఁ దుండ దండమునఁ • జక్కఁగ మోఁదఁగఁ జూచి యంతనే
సరసిజనేత్ర వేగనొక • సాయకధారఁ దదీయతుండమున్
విఱుగఁగఁ ద్రుంచె నప్డసుర • వీరుఁడు మేకొని సైరిభాకృతిన్ 460

గీ. రుష్టుఁడై తీవ్రశరముల • రోదసీకు, హరము గంపింపఁగా నప్పు•రాంబమీఁదఁ
గుఱిసి దిక్కులుభేదిల్ల•గొప్పగర్జ, నం బొనర్చెనఁగని జగ•దంబ కనలి. 461

గీ. మొనసి పలుమాఱు మధుపాన•మును బొనర్చి
రక్తలోచనయును మద•రాగరుచిర
వదనయును నయి యసురను • బారఁజూచి
యిట్టులనియెను నిగ్రహం • బుట్టిపడఁగ. 462

క. ఓరీ! చలమొనరించెదె, సారెకు నాయెదురఁ బెక్కు • చందంబుల బృం
దారకులెవరేనియు నను, మీఱుదురె? దురంబునందు • మేలరయవిటుల్.

చ. నిలుమిఁక నంచు బిట్టెగసి • నెట్టన దైత్యునికంఠ మంఘ్రితో
బలమునఁ ద్రొక్కిపట్టి నిజ•భాస్వరశూలముచేత వ్రచ్చినన్
బొలుపఱి యుత్తరార్ధతను•పున్ వెకలించియు నెట్టులేని న
బ్బలియుఁడు వేగిరంబెగసి • భల్లములన్ గురియించె నంబపై. 464

వ. అంత

చ. కలకల నవ్వి పూన్కిమెయిఁ • గాళిక ఘోటకవైరిమస్తమున్
విలసదసిన్ దెగన్నఱకె • వేగ హరీంద్రము దక్కదైత్యులన్
బొలియఁగఁజేసెఁ గొందఱికఁ • బొల్పరి జీవితరక్షణేచ్ఛులై
యలభుజగేంద్రలోకమున • కాతురతన్ బరుగెత్తిరత్తఱిన్. 465

క. కురిసిరి పువ్వుఁ వానలు, సురలెల్లరు నంబపైని • సురుచిరగతులన్
మురియుచు నాడిరి యచ్చర,లురువుగ గంధర్వగణము • లుబ్బుచు బాడన్. 466

క. ఇది చండీచరితంబి,ట్లిది మీకెఱిఁగించినాఁడ • నింకను నేఁజె
ప్పెదను శతాక్షీమహిమం, బుదగ్రయశు లాలకింపుఁ • డురుమోదమునన్. 467

—* దుర్గాసురభంజనము *—

క. దుర్గమతపోబలుండు ని,రర్గళ విక్రముఁడు రురుమ • హాసురసుతుఁడౌ
దుర్గాసురుండు దివిష, ద్వర్గంబులఁ దఱిమి స్వర్గ • భాగ్యములొందెన్ 468

ఉ. అంతట నా కరాళ దైత్యుఁడు మ • హాకలుషాత్మకుఁడై జగంబునన్
బంతముతోడ వేల్పులను • బాపల నాల సతీవ్రజంబు న
త్యంతము నేఁపుచుండ నిఁక • హాయని కూయుచునుండి రెల్లడన్
నంతఁ దపంబు జన్నమును • జొప్పడకుండెను ధర్మమెద్దియున్. 469

గీ. మఱియుఁ బ్రామిను కులనెల్లఁ • గరము సంగ్ర
హించి మింంచి జగంబుల • నేచుచుండ
బాపలెల్ల దురాచార • భరితులైరి
భువి ననావృష్టి పొడలె న • ప్పులు నునింకె.. 470

గీ. ఇఁకను మేదిని నెచ్చోట • నేని నదులు
నదము లంబుధు లుదకశూ • న్యతను జెందె
వనతలములెల్ల బయలులై • వనరెఁ జెట్టు
చేమలెవ్వియు లేక న • శించె నందు.

క. జనములు హాహాయనుచును, దినుటకుఁ ద్రావుటకులేక • దీనసమతి రో
దన మొనరించుచు నుండిరి, యనిమేషులు యోగమాయ • నర్చించికడున్.

మత్తకోకిల. ఏలు మేలుముమా! మహేశ్వరి! • యీజగంబులఁ బ్రేమమైఁ
జాలుఁ గోపము సంహరింపుము • సారభూరి కృపానిధీ!
శాలిశాత్మ్మలఁ జండముండులఁ • బాపు శుంభ నిశుంభునిన్
గూలఁజేసినయట్లు దుర్గముఁ • గూల్పు మమ్మ! రయంబునన్. 473

ఆ. నిదుర మేలుకొలిపి • నీరజాక్షునిచేతఁ, గంధిలోన మధునిఁ • గైటభుని వ
ధింపఁజేసి యల్ల • దుహిణుని బోచితి, వమ్మ యోగనిద్ర! • యరసి దయను

క. ఇఁక నింత తడవు నీదు మ, దికిఁ గృపరాకున్నఁ ద్రిజగతీజనములు చా
వక మిగులరు తల్లీ! ర, క్షింపఁగ లెమ్మ నురన్ హరింపు మిడుములన్.

చ. అడుగడుగందు బాలురకు నక్కట! నేరము లొప్పుచుండు న
య్యెడఁ దమతల్లిగాక యిఁక నేరు సహింతు రి భవాని! మాకు నె
వ్వడు కడగండ్లు వాటిలినఁ బొంకముగా నవతార మవ్వడే
కడిఁది దయన్ బొనర్చి మముఁ గాచు మమింటిని తల్లి! చక్కనన్. 476

—* శతాక్షీ ప్రాదుర్భావము *—

క. అని యిటు దుఃఖితులై దను, వినుతించుచునున్నయట్టి వేల్పులఁ గని ద
య్యన ననఘ కృపామయి తా, ననంతనేత్రమయి తనువు నవ్వుడు నూపెన్.

గీ. విల్లునమ్ములుఁ దామర విరియు వివిధ
మూలఫలములు నాలుగు కేలులందుఁ
దాల్చి దయనొప్పు మోముతోఁ దప్తులైన
ప్రజలఁ గనుఁగొని కరుణాశ్రు భరిత యగుచు. 478

క. తొమ్మిది దివసమ్ములు గను, దమ్ముల నశ్రువులు రాల్ప ధర నల్లడ నీ
రమ్మేర్పడుడు నదులు సం, ద్రమ్ములు బావులు చెఱువులు రయమున నిండెన్

గీ. దాన ధాత్రియు నంతనే తరులతాస
మృద్ధమై సస్యపూర్ణమై హృద్యశాక
మూలఫలభరితంబునై మురువు మిగిలెఁ
బచ్చికలు హెచ్చ నాలకుఁ బరువమిడుచు. 480

వ. అంత

ఉ. వేలుపులున్ మునుల్ మఱియు విశ్వమునన్ గలవార లెల్లరున్
జాలఁగ సంతసించి యల శక్తిని సన్నుతిఁ జేసిరంత ది
వ్యాలినిఁ జూచి యార్య యిఁక నన్యమభీష్టముఁ దెల్పుఁడన్న వే
దాలనొసంగు వేగముగఁ దల్లి! యనన్ జగదంబ యిట్లనెన్ 481

గీ. సైపుఁడించుక దడవు ప్రాఁజదువు లెత్తు
నన నలరి యంబ కెఱఁగి వారరిగి రిండ్ల
కాక్షణం బందె భయద నిర్హ్రాద మొదవి
భూనభంబులు నిండె నద్భుతము గదుర. 482

## —* శతాక్షీ దుర్గాసురుల యుద్ధము *—

క. కౌరవబలములు వడిఁబా, కారిపురిన్ ముట్టడించె • నదిగని యుమ య
వ్వారలఁగావఁగఁ జక్రము, ధీరతనందుంచి యసుర•దెసఁగన్గొనఁగాన్. 483

క. సురరిపుఁడు కఱకుటమ్ములు, సురువుగ జగదేకమాత • యురమున వేయన్
సరకుఁగొనక యమ్మహేశ్వరి, దురుసగువారసము లేసె • దుర్గాసురుపై. 484

గీ. మఱియు నాయమ్మ మేనుండి • మంజుమూర్తు
లెక్కుడుగ మాతలొదవిరి • చక్కనైన
వాను చంద్రార్ధశేఖర•భాసమాన
లతులవిద్యుత్సమప్రభా • యతలు హితలు. 485

గీ. కాళి తారయు ధూమ్రి బగలయు ఛిన్న
మస్త శ్రీవిద్య భువనేశి • మఱియు భైర
వియుఁ ద్రిపురసుందరియు మహా • విద్య యనెడు
వారధిష్ఠాత్రులై యొప్పఁ • బడసిరందు. 486

క. ఆయసురులకును మాతల, కాయోధన మొనరఁగా శ•తాక్షీహితులా
నాయతదైత్యవరూధిని, కూయిడి తెగటార్చె శక్తి • కోటులచేతన్. 487

## —* దుర్గాసుర సంహారము *—

ఉ. దేవియు నంత దుర్గముని • దివ్యతరాయతశూలధారతోఁ
జేవయడంగ మోఁదెనొక • చెట్టువలెన్ దనుజుండు నేలపైఁ
గావరమెల్లఁ దీఱిపడె • గౌరియిటుల్ దనుజున్ వధించి య
ద్దైవతరాజికిచ్చె శ్రుతి•తండములన్ మరలన్ బ్రియంబుగన్ 488

వ. అంత నిలింపులందఱు అత్యంత సంతుష్టులై యమ్మహాదేవికి జోహారు లర్పించి
యిట్లు వినుతించిరి. 489

## —* దేవీస్తుతి *—

క. జననిరో! మాకొఱకై నీ, వనంత నేత్రమయరూప • మర్థిఁగొనుట ని
న్ననుదురు శతాక్షియని యను,దినము జనంబులు జగమున•దేవువనీటన్. 490

క. నీకాయములోఁ బొడమిన, శాకంబులవలన మేలు • సమకూరుటచే
శాకంభరియను పేరును, లోకంబునఁజెందు దీవ•లోలమనీషా! 491

క. దుర్గమదైత్యుని విప్లవ, వర్గము లలరంగఁ జంపి • వైచుట చేతన్
దుర్గాహ్వాయమునఁ బరఁగెదు, భర్గాత్మామోదదాత్రి! • పావనగాత్రీ! 493

సీ. విశ్వజననికిని • విజ్ఞానదాత్రికి, యోగనిద్రకు జోత • లొనఁగుదుమి వె
తత్త్వమస్యాదివా • క్తతి బోధిత యనంత, కోట్యజాండేశ్వరి! • గొనునుతు లివె
వాఙ్మనఃకాయదు • ష్ప్రాప! యినేందు పా, వకనేత్ర! నిను నుతిం • పఁగఁ దరంబె
తల్లి! శతాక్షి! నిన్ • దక్కమాబోటి జే, జేలపై దయసేట్లు • చేతురెవరు.

గీ. ఇట్టి యిడుముల నీక నెవ్వ • డెసఁగఁ గుండుఁ
గావుత! జగంబులకు నీకఁ • గన్న తల్లి!
అరసి శత్రునిబర్హణం • బమరఁ జేసి
సాఁకుమిట్టుల యత్నంబుఁ • జక్కఁ జేసి. 494

—* శతాక్షి దివ్యుల ననుగ్రహించుట *—

వ. అనినంత మహాదేవి యిట్లనియె.

క. క్షేపులు పరుగిడ నొండొక, వైపు చనక యాలు వాని • పజ్జనె యురుకున్
దేవకునటు మీ వెంబడి, కావుగనే వచ్చుచుందుఁ • గ్రచ్ఛ లేఖుల్! 495

సీ. ఎడపకనాభక్తి • నెసఁగుమీ ఆలు మది, నే చింత సేయుకుఁ • డింక మీఁద
మున్ను నంజుడు దిను • మాఁకలఁ జంపితి, నెల్లెప్పుడును సమ • యింతు వారి
భ్రామర రూపంబుఁ • బడసి యరుణు గిట్టి, భ్రామరి యను పేరు • బరఁగఁ దాల్తు
భీమరూపముఁ జెంది • భీమ్మదైత్యుల ద్రుందఁ, జేసి భీమాఖ్యను • జెందుదాన

గీ. నంద నందన నైయల • మందలోన
శుంభుని నిశుంభునిని బట్టి • చూఱఁబుచ్చి
నందసుత యనుపేరఁ జె • న్నొందు దానఁ
గాఁచుదాన మిమున్ గల • కాలమిఁకను. 496

వ. అని చెప్పి యమ్మహేశ్వరి యంతర్ధానంబుఁ జెంద నవ్వేల్పులలరి నిజవాసంబుల కరిగిరనిన సురథుండు మునివరున కుమాసేవాప్రకారం బెఱింగింపుమనిన ముని యిట్లనియె. 497

గీ. సిద్ధకల్యాణి శ్రీదేవి • సేవయందుఁ, గర్మయోగంబు భక్తియో • గంబుమఱియు
జ్ఞానయోగంబు గలవిఁక • వానియందు, మొదటఁ గర్మయోగంబునే • పూనవలయు

గీ. కర్మయోగంబునన్ భక్తి గ్రందుకొనెడు, దాన జ్ఞానంబు సమకూరు జ్ఞానసిద్ధి
వలన మోక్షంబు చేకూరు వసుధ నెందు, గర్మయోగంబె శ్రేష్ఠమై గానుపించు

క. మాయయనంగ బ్రకృతియె, మాయి మహేశ్వరుడు శివుడు మహనీయుండా
ధ్యేయుని భేదం బొందని, కాయంబెఱుగుటయె ముక్తిగా దెలియదగున్.

— * దేవీపూజనము * —

గీ. దినదినం బర్థిమై మహాదేవిపూజ, సేయు పుణ్యఫలంబును శివకు దేవ
ళంబు నిర్మించి తద్విగ్రహంబునం బ్రతిష్ఠ జేసినవాడొందు దేజరిలుచు.

వ. ఇంకను.

క. దేవీమూర్తిని నడుమను, శ్రీ వెలయగ సిల్పి తక్క జేజేలను నా
యావిధి జుట్టు ప్రతిష్ఠం, గావింపగ నెగడు సకల కల్యాణంబుల్. ౬౦౩

గీ. అట్లు చేయగ జేసివా డగ్నివడు, భగవతీకృప గల్గిన బట్టుబట్టి
కట్టెదను దివ్యహర్మ్యంబు గౌరికే నటంచు దలచిన సిరులొందు నఘము బాయు

ఉ. ఎవ్వడు భక్తితోడ బరమేశ్వరి నిచ్చలు గొల్చుచుండు నిం
కెవ్వడు తన్మహామనువు సిద్ధమతిన్ జపియించుచుండు దా
నెవ్వడు చక్రరాజమున నింపుగ జందనకుంకుమాగరుల్
మవ్వపు వేడ్కనుంచు ననుమానమె? వాడిల ధన్యుడౌటకున్. ౬౦౪

తే. దుర్గ నెపుడు గాని దులసీవిష్ణుక్రాంతలను సమర్చనంబు నొనరుపకుడు
పద్మములను బిల్వపత్రంబులను జాతికుసుమములను బూజ గూర్పు డెపుడు.

వ. మఱియు గేతకీ మల్లికా చంపకాది సుగంధ కుసుమంబులన్నియు బూజా
యోగ్యంబులే యింకను.

గీ. దేవి బ్రతిమాస శుద్ధ తృతీయయందు, భక్తిమై బూజ జేసిన బడయు జనుడు
సంపదల నాయురారోగ్య సంతతులను, భోగమోక్షంబులను నిందు బొంకు లేదు

— * నవరాత్రపూజ * —

వ. వెండియు నిక నాశ్వయుజశుద్ధ ప్రతిపత్తు మొదలుగ దొమ్మిదిరోజులందును
శ్రీశివపూజనంబు గల్పోక్త ప్రకారంబొనర్చినట్టివానికి ద్రిలోకంబులందు
దుర్లభంబగు శ్రేయంబు లేదని సురధుండును వైశ్యుండును మిగుల నలరి యవ్వ

నంబున శరన్నవరాత్ర వ్రతంబుకొనర్చి సురథుండు నిజరాజ్యంబును, సమాధి యను వైశ్యుండు దుఃఖోపశమనంబునొందిరిఁక నీశ్రీదేవీమహాత్మ్యంబును విని విన వినినవారల కిష్టార్థంబులు చేకూరుననిన సూతునకు శౌనకాదిమునులు మహాత్మా! శివవాచకంబై యొప్పు ప్రణవార్థంబు తీఱెఱింగింపు మనుటయు

క. కాలీశశిశేఖరపద,నాళీకారాధ్య హృదయ । నళినవిరాజ
త్కాళేశారాధ్యానుజ!, వ్యాళేశ్వరహారతత్త్వావశ! లక్ష్మ్యంబా! 502

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి ఉమాఖండంబు
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

# శ్రీ కైలాసఖండము

## ప్రథమాశ్వాసము



ముదిగొండకులార్ణవ
సోమా! సోమేష్టలింగ • శోభితపూజా
కామా! కామాదిరిపు
స్తోమ జయోద్దామ! దామ • సురుచిరకీర్తీ! 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

చ. ఎవఁడు జనించుచుండఁగనె • యీశ్వరభావముఁ జెందెనో ముని
ప్రవరులలోన నెవ్వఁడు వి•భాసితమోక్షపథోపదేష్టయా
నెవఁడు మహామహుం డతులుఁ • డెవ్వఁడు ధ్వస్తగుణత్రయుండు బ్ర
హ్మవిదుఁడు వామదేవుఁడను • నాతఁడు దివ్యమునీంద్రుఁ డున్నతిన్. 3

గీ. జ్ఞానియు మహేశనిభుఁడయి•ఘనతమీఱు, నమ్మహాముని శిష్య వ•ర్గమ్ముతోడ
ధరను శుద్ధిఁ బొనర్పుచు•దక్షిణాశఁ, దనరిన కుమారగిరినొక్క•దినమునందు.

—* వామదేవముని కుమారాద్రిఁజేరి కుమారుని సేవించుట *—

గీ. చేరి స్కంద సరోవర•నీరమందు, మజ్జనముఁ బొనరించి కు•మార దేవ
సముఖమున కేగి మునినిక•రములు గొలువ, వఱలుగీర్వాణగేయు శ్రీ•పార్వతేయు.

క. దరిసించి మ్రొక్కి మనమునఁ, గరముమురిసి యంజలిన్ దగఁగన్ బూనియిటుల్
వరమధురాక్షరములతో, నరుమగ సంస్తవముచేసె • నతిశయభక్తిన్.

సీ. ప్రణవరూపునకును • బ్రణవార్థవేదికిఁ, బ్రణవార్థమునకును • బ్రణవమునకు
నుపనిషదర్థమై • యొప్పినసామికి, నుపనిషద్రూపున • కున్నతునకు
నణువునకు నణీయుఁ • డై తగు వానికి, గొప్పకు గొప్పయై • యొప్పువాని
కాత్మగుహారూపుఁ • డగువాని కాత్మకు, హానిహీతునకు గు • హ్యార్థవేది

గీ. కిని గుహునకు కర్కతేజున • కును మహేశ, సుతునకు మహేశశిష్యున • కతులితునకు
శివకరునకు శివాస్యరా • జీవమిత్రు, నకును స్కందునకివె వంద • నములు సేతు

క. శరకాననశాయికినిన్, గిరిజాపుత్త్రునకుఁ గార్తి • కేయునకును దు
ర్ధరశక్తిధరున కాశ్రిత, వరదున కసురసముదాయ • భంజకునకొగిన్. 8

క. అల్లషడక్షరమూర్తికి, నల్లషడక్షరమహాప • దార్థజ్ఞున కు
త్ఫుల్లారవిందనయనున, కుల్లాసము మెఱయఁ జేతు • నొగి వందనముల్. 9

గీ. అభ్రగంగాసుతునకు ష • డధ్వబాహి, రునకు షణ్ముఖునకును శాం • తునకు సింధు
కానన సుబుద్ధి వైభవ • హర్షితునకు, దివ్యవర్గసమాశ్లిష్ట • దేహునకును. 10

క. సకలామరమణిమకుట, ప్రకటస్రక్పూజితాంఘ్రి • పంకజునకు మా
మకహృదయాధిష్ఠితగురు, నకుఁ జేసెద వందనముల • నమ్రుఁడనగుచున్. 11

గీ. తవిలి యిట్లు నుతించి ప్ర • దక్షిణత్ర
యంబును నొనర్చి సాష్టాంగ • మలర మ్రొక్కి
చేతులను మోడ్చి నిలిచిన • శిష్టమునిని
వామదేవుని గన్గొని • భర్గసుతుఁడు. 12

ఉ. సంతసమయ్యె నీనుతికి • సన్మునినాయక! యేమొనర్తు నీ
వెంతయు నిస్పృహుండవును • నీద్యతరుండవు యోగి పెద్దయేన్
నెంతయు నీకు గాంక్షితము • చొప్పడదెప్డు పరోపకారముం
జింతయొనర్చి యిప్పుడమిఁ • జేరి చరించుచునుందు విమ్మగన్. 13

క. వినఁదగినది యెదియేనియు, మనమున నున్న యెడఁ దెల్పు • మానీశ్వర! నే
ననువుగ లోకానుగ్రహ, మునుగోరుచుఁ దెల్పువాఁడఁ • బూనికి మెఱయన్ 14

గీ. అనిన స్కందుని వచనము • లాలకించి, వామదేవుఁడు ప్రశ్రయా • వనతుఁడగుచు
మేఘగంభీరనాదముల్ • మెఱయ నిట్లు, పల్కె షాణ్మాతురుని తోడఁ • బ్రౌఢిమీఱ.

ఉ. దేవర! నీసదేశమునఁ • దేఁకువ నేమని విన్నవించెదనే
జీవుల మయ్య! మేము కృపఁ • జేకొని యిట్టుల మమ్ము సాఁకుటన్

భావమునందుఁ జన్వమరి • పల్కెడ జంతును గొంకులేకిటుల్
తావకవాక్ప్రసారము న•దారముఁ గోరుచు నల్పమేధతో. 16

క. ప్రణవము శివవాచకమగుఁ, బ్రణవమునకు వాచ్యమరయఁ•బశుపతి శివుఁడా
ప్రణవములోడ నమరి పశు, గణముల బంధములఁబాపుఁ•గద లోకమునన్. 17

క. ఓ మనునది బ్రహ్మంబగు, నోమనునది యీసమస్త • మూహింపంగా
నోమనిపాడెడు సామము,లోమని బ్రాహ్మణుఁడు బ్రహ్మ•మొందుజగమునన్.

గీ. ఇట్లు శివతత్త్వమునకన్న • నితరమొకఁడు
నుంటయునులేదు జగమునఁ • జూడనభవుఁ
డొక్కఁడె మహేశ్వరుఁడు శివుఁ • డొప్పమీఱు
సర్వరూపధరుఁడు శా•శ్వతుఁడు హరుఁడు. 19

— * వామదేవముని కుమారస్వామిని బ్రణవార్థము నుపదేశింపుమనుట * —

క. ఇఁకను సమష్టివ్యష్టి, ప్రకారముల తీరులొప్పఁ • బ్రణవార్థము నా
కొకఁడును జెప్పఁడు నేఁటి ద,నుక దొరకం డొజ్జ యెందు•ను భవాదృశుఁడై

క. తెలుపుము దేవ! తదర్థము, మలపుము నా సందియముల • మానసమలరన్
నిలుపుము నీభక్తులలో, సలుపుము తావకకృపాప్ర•సారాస్పదుఁగాన్, 21

గీ. ఇట్లు ముని యడ్గఁగాఁ బర•మేశ్వరాత్మ
భవుఁడు సంతోసమున మనః•పథమునందు
సాష్టత్రింశత్కలాంచితు • సాంబశివునిఁ
బ్రణవగాత్రునిఁ గొలిచి తా•పససహితుని. 22

వ. ఇట్లు వక్కాణింప నుపక్రమించె.

క. బాగుగ బాగుగ నడిగితి,వో గుణనిధి! వామదేవ! • యున్నతభావా!
యీగరిమనొప్పు భావము,లే గుణశాలియును నడుగఁ•డెందుమునివరా! 23

— * వామదేవమునికిఁ గుమారస్వామి ప్రణవార్థము చెప్పుట * —

క. శివభక్తవతంసుండవు, వివేకనిధివౌట నిట్లు•పృచ్ఛించితి వీ
వవగతము కాకకాదై, నవచింతును విను మఖలజ•నశ్రేయముగాన్. 24

ఉ. లోకములో జనుల్విషయ•లోలుపు లెంతయు భిన్నభిన్న మా
ర్గాకులు లైకమోహాజితు • లారయలేరు మహేశతత్త్వముల్

నీకు వచించెదన్ విను ము•నిప్రవరా! ప్రణవార్థ మల్లసు
శ్రీకరుఁడౌ శివుండు శశి•శేఖరుఁడారయుమీ యథార్థమున్. 25

గీ. ఇదియె సత్యము వినుము చే•యెత్తి చెప్ప
వాఁడ శ్రుతిసుతమీయదే • బ్రహ్మవేత్త
లైన మునులు పురాణంబు • లందు ధర్మ
శాస్త్రముల యందుఁ జెప్పిరి • సత్య మిదియె. 26

గీ ఎవనిదెస నల్ల వాక్కులు•హృదయమునను, నరయఁగా లేకమరలెను•నక్కజముగ
నెవనియానందమెఱిఁగిన•యిభ్యజనుఁడు, భయపడం డెందు నేనియు•భవ్యమూర్తి!

గీ. ఎవనివెలుఁగున నినచంద్ర•బుక్షవహ్ను, లాతటిత్తులు వెలుఁగక•యుల్లియుండు
నెవనివెలుఁగుకులోఁగి దా•మెల్ల వెలుఁగు, నెవనివెలుఁగున నీసర్వ•మిట్లువెలుఁగు

క. సర్వైశ్వర్యయుతుండును, శర్వుం డాకాశమధ్య • సంచారియునున్
సర్వవ్యాపియునగు నా, సర్వేశుఁడు చిన్మయుండు • సంసేవ్యుఁడిలన్. 29

గీ. ఆపరాశక్తి నిర్గుణ•మై మనోవ
రయునునై భావగమ్యమై • రాణమీఱి
యేపురుషునందు గూఢమై•యెసకమెసఁగ
నిష్కలయునయి శివయయి • నెగడు నెపుడు. 30

గీ. వెలయు శివరూపమిలను ద్వై•విధ్య మొంది, స్థూలసూక్ష్మపరంబులన్•లీలలొప్ప
మోక్షకాముకులగు యోగ•పురుషులరసి, వాసిఁబూజింతు రెందు ద్వై•వాతునిష్ఠ

క. సకలము నిష్కలమనియును, నిఁక నొకభేదంబు పొసఁగు • నెంతయుజ్ఞానా
త్మకుఁడై పరమాత్మయనన్, రకముగ నిష్కలవు వ్యక్తి•రాజిలు మానీ! 32

వ. ఇఁక సకలంబగు సదాశివమూర్తి.

గీ. పంచమంత్రతనుఁడు కలా•పంచవిగ్ర, హుఁడును శుద్ధస్ఫటికసన్ని•భుఁడును పంచ
వక్త్రుఁడు శతభుజుండు త్రి•పంచలోచ, నుఁడును శీతలరశ్మిప్ర•భుఁడునయి తగు

## —* మంత్రమయమూర్తి *—

సీ. ఈశానమస్తకో•పేతుండును బురాత, నుఁడును దత్పురుషాన•నుఁడు నఘోర
హృదయుండు వామదే•వధృతగుహ్యుండును స, ద్యోజాతపాదుండు•యోగధరుఁడు

సర్వజ్ఞతాది షాట్చక్తి షడంగకృతతనుండు శబ్దాది వితతశక్తి
విస్ఫురితహృదజ్జ విలసితుండును మనో, మయుస్వేయయునగు వామశక్తి
సీ. తో సతమ్మును మిగుల విభాసితుండయు, సకలనిష్కలమూర్తి ప్రశస్తిమీఱ
దనరునారయుదు రిది తత్త్వజ్ఞజనులు, వామదేవమునీంద్ర! సద్భావసాంద్ర!
వ. మంత్రాది షడ్విధార్థంబుల యర్థోపన్యాస మార్గంబున సమిష్టివ్యష్టి భావార్థ
పురస్సరంబుగఁ బ్రణవస్వరూపంబు నెఱిఁగింతు నం దుపదేశక్రమంబు ముందు
గాఁ జెప్పెదను వినుము. 35

గీ. ఇలమనుష్యులు నాల్గు జాతులుగ నుందు
రందుఁ ద్వైవర్ణికులకె వేదాధికార
మొప్పియుండుటచే స్వాశ్రమోచితమగు
ధర్మమును వారనుష్ఠింపఁ దగు జగమున. 36

గీ. వినుశ్రుతిస్మృత్యుదితమగు విమలధర్మ, మరసిచేయుజనుఁడుసిద్ధి నందఁగలఁడు
ఇట్లు వేదపథమును దానెఱుకఁజేసి,నట్టి శివుఁడే వచించె దివ్యమునిచంద్ర!
వ. ఇట్లు ప్రసిద్ధులగు సర్వమునీంద్రులు వర్ణాశ్రమాచార పుణ్యంబులఁ బరమేశ్వరు
నర్చించి తత్సాయుజ్యంబుఁ బడసిరి. 38

గీ. మూఁడు ఋణములతోడఁ దాఁబొడము ద్విజుఁడు
బ్రహ్మచర్యంబునన్ ముని ప్రకరఋణము
యజ్ఞమున దేవఋణముఁ బుత్రాప్తిఁ బితల
ఋణముఁ దీర్పంగ వలయు మునీంద్రవంద్య! 39

క. మానుగ ఋణములఁదీరిచి, వానప్రస్థాశ్రమంబుఁ బడసి సమమతిన్
బూని విజితేంద్రియుండై, తా నభ్యాసంబు సేయఁదగు యోగంబున్. 40

గీ. ఎపుడు బుద్ధి దృఢంబయియుంచు కేని, చలన మొందకయుండు నాచెండమెఱిఁగి
సర్వకర్మంబులను వేగ సన్యసించి, జ్ఞానపూజాపరుండయి కాంలవలయు.
వ. మఱియు సన్న్యాసాశ్రమదశ యనన్యాదృశమని యెఱుంగుదువుకదా! 42
క. ఏవికృతుల నొందకయే, తా విలసిలు నిద్ధియతహృదయులకుఁ బేర్మిన్
శ్రీవెలయ శివైక్యమునఁగా, జీవన్ముక్తి ఫలమిదును సిద్ధము మాసీ. 43

వ. అని యంత సన్న్యాసాశ్రమస్వీకార ప్రకారం బంతయు విధ్యుక్త ప్రకారం బుగ సాంగోపాంగంబుగఁ దెలిపి నంత వామదేవుండు కుమారున కిట్లనియె.

గీ. షడ్విధార్థ పరిజ్ఞాన • సరణి యెట్లు
షడ్విధార్థంబుఁ దెలిపెడు • జ్ఞానమెద్ది
ఇంతకును బ్రతిపాద్య • మిఁకెవ్వఁ డిట్టి
యెఱుక కెయ్యది ఫలమునా • కెఱుఁగఁ జెప్పు. 46

క. ఇవి తెలియక నేఁబహుకా,లవి మోహితుఁడనగుచును భ్రాశము శివమాయన్
మివుల భ్రమించుచునుంటిని, శివనందన! మోహమణ వశించుము కరుణన్.

గీ. అనిన గుహు డిట్టులనియె సంయమివతంస, నీవడిగినట్టి యర్థంబు నే వచింతు
తనరు వ్యష్టిసమిష్టి భేదములనొప్పు, ప్రణవశివరూప షడ్విధార్థముల నివుడు.

వ. ప్రథమంబు మంత్రరూపంబు; ద్వితీయంబు మంత్రభావితంబు; తృతీయంబు దేవతార్థంబు; చతుర్థంబు ప్రపంచార్థంబు; పంచమంబు గురురూపదర్శకంబు; షష్ఠంబు శిష్యాత్మరూపదర్శకంబునా నివి షడ్విధార్థంబులు. మంత్రస్వరూపంబు నెఱింగింతు విను మద్దాని విజ్ఞానమాత్రంబున నరుండు జ్ఞానియగు. 48

—* ప్రణవస్వరూపము *—

గీ. ఆద్యమై యొప్పు స్వరమును నై దవదియు, నైన స్వరమును బంచవర్గాంతవర్ణ
మును బిదపబిందునాదంబులును సమష్టి,రూపమగుమంత్రరూపంబు జూపినాఁడ

వ. ఇట్లు వేదంబులచేఁ జెప్పఁబడె నందు నాదము సర్వసమష్టియగు బింద్వాద్యం బగు వర్ణ చతుష్టయంబున శివవాచకంబగు ప్రణవంబు వ్యష్టిరూపంబీక యంత్ర రూపంబగు శివలింగంబును గుఱించి విను మన్నిటికన్న క్రిందుగ లింగపీఠం బును నద్దానికిఁబైనఁబ్రథమ స్వరంబును దానిపై 'ఉ' వర్ణంబును, అందుపై "మ్" వర్ణంబును దచ్ఛిరంబుపై బిందువును దానిపైన బ్రణవ రూపమైన నాదమును లిఖింపవలయును. ఈ యంత్రము సంపూర్ణంబు జెందిన సర్వ కామంబులు సిద్ధించును. 50

గీ. ఇట్లు యంత్రమ్మును లిఖించి • యింపుమెఱయఁ
బ్రణవవేష్టన మొనరింప • వలయుదాన
నుత్థమగు నాదమునను దానూహసేయ
వలయు నాదావసానంబుఁ • బరమమౌని!

వ. ఇట్టి పరమ గూఢంబును శంకరప్రోక్తంబునగు దేవతార్థంబుఁ జెప్పెద వినుము "సద్యోజాతంప్రపద్యామి" యను నుపక్రమంబు మొదలుచేసి 'సదాశివోం' మనువఱకు బ్రహ్మపంచక వాచకంబులగు నైదుమంత్రంబులు సూక్ష్మంబులైన బ్రహ్మరూపంబు లివియె పంచదేవతలు. ౬౨

క. ఆయీ దేవతలే విను, మా యాదిమదేవుఁడైన • యభవుని మూర్తుల్ శ్రీయలరఁగ నీమంత్రము, లాయభవుని వాచకంబు•లరయుము మౌనీ! ౬౪

వ. మూర్తిమూర్తిమంత్రంబులకు నెక్కుడుభేదంబులేదు. ఈశానముఖోపేతుం డని శివుని విగ్రహము మున్ను జెప్పితినిగాదె! సద్యోజాతాద్యనుక్రమముగా నీశానాంతమువఱకు శివుపంచముఖపంచకము చెప్పఁబడినది, మఱియు నీశాన దేవునకుఁ జతుర్వ్యూహపదమందుఁ దత్పురుషాద్యంబును సద్యోజాతాంతంబునగు బ్రహ్మరూపంబు చతుష్టయంబు గలదు. ఈయది పంచబ్రహ్మ సమష్టియగు నీశానబ్రహ్మరూపంబుగ విశ్రుతంబైనది. పురుషాద్యంబు సద్యోజాతాంతబగునది వ్యష్టిరూపంబు. అనుగ్రహమయంబగు నీ చక్రము పంచార్థ కారణంబు. పంచబ్రహ్మాత్మకంబు సూక్ష్మం బనామయంబు నిర్వికారంబు

సీ. తగ ననుగ్రహమును ద్వివిధంబుగాఁగఁ బరఁగుఁ బ్రభువగు • నాతిరోభావముఖ్య గోచరంబును మఱి జీవ•కోటికిం బ రావరవిముక్తిదంబును • శ్రీవహిల్ల. ౬౫

వ. సదాశివున కీయది కృత్యద్వయముగా నుదాహరింపఁ బడినది అనుగ్రహము సృష్ట్యాది కృత్యములలో నైదవది. పరబ్రహ్మ స్వరూపులును గల్యాణదాయకులును నగునీ సద్యోజాతాద్యులగువారిఁదు దేవతలుగఁ జెప్పఁబడుచున్నారు అనుగ్రహ మయంబగు నీచక్రము శాంత్యతీతకలామయంబై చెప్పఁబడినది భావితాత్ములును సదాశివోపాసకులును బ్రణవాసక్తచేతస్కులును నగు యతులకీపదము గమ్యస్థానము. వారీపదమునుబొంది విపులంబులగు భోగంబులను బ్రహ్మరూపియగు దేవునితోడ ననుభవించి మహాప్రలయసంభవమందు శివసామ్యంబును బొందుచున్నారు. అట్టివారు మరల సంసారాబ్ధి యందుఁ గూలరు. 'తేబ్రహ్మలోకే' యనెడు సనాతనియగు శ్రుతియిట్లు చెప్పుచున్నది. ఈయదియె శివునియొక్క సమష్టియగు నైశ్వర్యము. 'సర్వైశ్వర్యేణసంపన్న'

యనెడు నథర్వశిఖ యిట్లుచెప్పుచున్నది. ఈశివునకే సర్వైశ్వర్యప్రదాతృత్వమును జెప్పుచున్నారు. ఈ సదాశివునియొక్క పదముకన్న నధికమగు పదములేదు. అందు బ్రహ్మపంచకవిస్తార ప్రపంచ మగుపట్టుచున్నది. ఈపంచబ్రహ్మములనుండి నివృత్తిమున్నగు కలలుపొడముచున్నవి. అవ్వి సూక్ష్మభూతస్వరూపంబులు గలవియై యీస్థూలరూపస్వరూపంబగు నీప్రపంచకమునకు గారణములై విశ్రుతంబులైనవి. ఐదువిధములుగా నున్న యీబ్రహ్మప్రపంచకంబిట్లు వేఱువేఱుగ విభక్తంబైనది. పురుషుండు వీనులు వాక్కు శబ్దం బాకసం బీపంచక మీశానరూపబ్రహ్మముచే వ్యాప్తంబైనది. ప్రకృతియుఁ ద్వక్కు చేయి స్పర్శము గాడ్పు, అను నీపంచకము తత్పురుషబ్రహ్మముచే వ్యాప్తమైనది, బుద్ధి నాలుక పాయువు రస ముదకము వామదేవబ్రహ్మముచే వ్యాప్తమైనది. మనస్సు నాసిక ఉపస్థేంద్రియము పరిమళము భూమి సద్యోజాతబ్రహ్మముచే వ్యాప్తములైనవి. బిందునాదాత్మకంబగు నేచతుష్టయముగలదో అట్టిపంచవర్ణములకు సమష్టియును శివవాచకంబగు ప్రణవము యంత్రరూపముగా నిట్లుపదేశింపఁ బడినది, శివోపదిష్టమార్గముచేఁ బరమంబును మంత్రాధిరాజంబును శివరూపంబుననగు ప్రణవంబునిట్లు యంత్రరూపంబుగ భావింపవలయును. ౫౬

తే. ఇఁకను జెప్పెద నాలింపుఁ ◆ డింపుమీఱు
సృష్టిపద్ధతి శ్రీసదా◆శివునివలన
నమ్మహేశాదికచతుష్క ◆ మమరువిధము
మును శివుం డుమ కానతిచ్చిన తెఱంగు

వ. ఆకాశాధిపతియును, ప్రభుండును నగు సదాశివుండు సమష్టియగు, ఈయనయొక్క వ్యష్టిధర్మంబుఁ జెందినది మహేశాదిచతుష్టయంబు. సదాశివుని యొక్క సహస్రాంశంబున మహేశ్వరుఁ డుద్భవిల్లె నాతండు పురుషుల కనురూపుండగుట వాయుతత్త్వమున కధిపతియై వెలసె. వామభాగంబున మాయాశక్తియుతుండై సకలుఁడై క్రియాయుతుండై యుండు; ఈయనయొక్క వ్యష్టిరూపం బీశ్వరచతుష్టయంబు; ఈశుఁడు విశ్వేశ్వరుఁడు పరమేశుఁడు సర్వేశ్వరుఁడు; ఇది యుత్తమంబగు తిరోధానచక్రము; తిరోభావము ద్వివిధంబు; అందొకఁడు రుద్రాదిగోచరము, మఱొండు పశువర్గసంతతియొక్క దేహభావముచేతఁ గర్మసామ్యక్షణమువఱకు భోగానురంజనపరము, కర్మసామ్యంబందు

ననుగ్రహమయుండగు ప్రభుం డొకండుండును. అందు దేవతలందఱు సర్వై శ్వర్యులై పరబ్రహ్మాత్మకులై నిర్వికల్పులై నిరామయులై కీర్తింపఁబడుదురు.

గీ. కను తిరోభావరూపచక్రమిది తావ,సేంద్ర! శాంతికలామయంబిద్ధతరము
అమ్మహేశ్వరాధిష్ఠితంబలమహేశ, పాదసేవుల కీయది పాప్యమరయ. 59

వ. మఱియు నమ్మహేశ్వరుల కీయది సాలోక్యక్రమంబుగ విముక్తిదాయకంబు. మహేశ్వరుని సహస్రాంశంబున రుద్రమూర్తి జనించె. అతం డఘోరవదనాకారుండు. తేజస్తత్త్వాధిపతి. వామమందు గౌరీశక్తియుతుండు. సర్వసంహారకారుండగు ప్రభుండు. ఈతని వ్యష్టిరూపము శివాదిచతుష్టయము:- శివుఁడు హరుఁడు, మృడుఁడు, భవుఁడు - ఇది మహాదివ్యంబును బరమంబు నద్భుతంబు నగు సంహారచక్రము. ఆసంహారము బుధులచే నిత్యాదిభేదంబులతోఁద్రివిధమైనదిగాఁ జెప్పఁబడినది. నిత్యము జీవసుషుప్తినామకము, నైమిత్తికము విధిచోధితము. మహత్తు విలయము. ఇట్లు వేదనిదర్శితము. జన్మదుఃఖాది శ్రాంతులును ముషితాత్ములునునగు జీవులకు విశ్రాంతినిమిత్తమై కర్మపరిపాకమునకై మహాతేజస్వియగు రుద్రునిచే నీత్రివిధసంహారము కల్పితంబైనది ఇది రుద్రునికిఁ గృత్యత్రయంబు ఈసంహారము-సృష్ట్యాది పంచకృత్యములలో నొక్కఁడగును. అందుఁ బరబ్రహ్మస్వరూపులును లోకానుగ్రహకారకులునునగు భవాదులు దేవతలుగాఁ జెప్పఁబడుచున్నారు ఇది విద్యారూపకలామయంబగు సంహారాఖ్యచక్రంబు రుద్రునిచే నధిష్ఠింపఁబడిన నిరామయంబైన పదంబు.

గీ. రుద్రపూజానిరతుల కీభద్రపదము, ప్రాప్య మిదిరుద్రసాలోక్య పదవినుండి
క్రమముగారుద్రసాయుజ్యగరిమనొసఁగు,సందియములేదరయమిాశచరణభక్త

వ. రుద్రమూర్తియొక్క వేయవయంశంబుచేత విష్ణువుజన్మించె. ఆతండు వామదేవచక్రాత్మకుఁడై యుదకతత్త్వమునకు నాయకుండయ్యె. మఱియు వామభాగంబున రమాశక్తియుతుండును సర్వరక్షాకరుండును జతుర్భుజుండు నరవిందాక్షుండు శ్యామవర్ణుండు శంఖచక్రాదిధరుండునై యమరు, ఈయనకు వాసుదేవాది చతుష్టయము వ్యష్టిరూపము. వాసుదేవుం డనిరుద్ధుండు సంకర్షణుండు ప్రద్యుమ్నుండు ననువార లీయదియుత్తమంబగు స్థితిచక్రము, స్థితి యనఁగా ఫలభోగులగు జీవుల కారబ్ధకర్మభోగాంతము సృష్టింపఁబడిన జగ

త్తును గర్తతోఁగూడఁ బాలించుట. ఈస్థితిగూడ పంచకృత్యములలో నొకటి నిర్వికల్పులును నిరాతంకులును ముక్తులకానందకరులును నగు ప్రద్యుమ్న ముఖ్యు లిందు దేవతలుగఁ జెప్పఁబడిరి. ప్రతిష్ఠారూపంబును ననుత్తమంబును జనార్దనాధిష్ఠితంబును బరమపదంబును నగు స్థితిచక్రంబిదియె.

గీ. విష్ణుపాదాబ్జసేవులై • వెలయు వైష్ణవులకుఁ బ్రాప్యపదంబయి • చెలువుమీఱు చక్రమిద్ది సాలోక్యాది • శర్మపదము, లోనఁగఁగలదిది ఋషికుల • బిసరహాభవ!

వ. ఇంక విష్ణువుయొక్క వేయవయంశంబుచేఁ బితామహుండు పొడమె. అతఁడు సద్యోజాతముఖాత్మకుఁడై పృథివీతత్త్వనాయకుఁడయ్యె మఱియు వామాధిష్ఠితవాగ్దేవీసహితుండును సృష్టికర్తయు జగత్ప్రభుండును జతుర్ముఖుండును రక్తవర్ణుండును రజోరూపస్వరూపవంతుండునునై విలసిల్లు. ఈయనకు హిరణ్యగర్భాది చతుష్టయంబు వ్యష్టిరూపంబు, హిరణ్యగర్భుండు, విరాట్టు పురుషుండు, కాలుండుననువారు. బ్రహ్మపుత్రాదిసేవితంబును సర్వకామార్థంబును బ్రహ్మోపాసక సుఖప్రదంబును నగు సృష్టిచక్రమిది. సృష్టియన సంహరింపఁబడిన జీవలోకమునకుఁ బ్రకృతియందు వెలుపలికిఁ దీసి సాధనాంగఫలములతోఁ గూడఁ గ్రమభోగార్థము సంయోజనముసేయుట. ఇది పైతామహకృత్యము వ్యూహానుభావహంబుగ నీజగత్సృష్టి క్రియావైశద్యముతోఁ బరంగు జగత్సృష్టియుఁగూడఁ గృత్యపంచకమందలిదే. ఇందుఁగాలాదులు దేవతలుగాఁ బరికీర్తితులైరి.

ఆ. ఇది నివృత్తిరూప • మింపగు సృష్టిచక్రంబు శోభితంబు • కాంచనోదరాదికృతము పద్మ • జారాధకులకిది, ప్రాప్యపదము ముక్తి • భాగ్యకరము. ౬౬

వ. ఈనాల్గు చక్రములందు మహేశాది క్రమముగఁ బ్రణవము గౌణవృత్తిచే వాచకంబగును. ఇది వేదవిశ్రుత వైభవంబగు జగచ్చక్రము. శ్రుతియు 'పంచారంచక్రం' అని స్తవము చేయుచున్నది. అలాతచక్రభ్రమివలె నవిచ్ఛిన్నలయోదయంబును సృష్ట్యాది పంచావయవంబును బంచారంబును నగు జగచ్చక్రమిది యొక్కటే. అంతట వర్తించునది గనుకఁ జక్రమని చెప్పబడుచున్నది. అమితతేజస్కుండును హిరణ్మయుండునునగు శివదేవుని యొక్క శక్తికార్యమగు నీచక్రము హిరణ్యజ్యోతిస్సేవితము. ఇఁకనీచక్ర ముదకముచే నావరింపఁబడినది. ఆయుదక మగ్నిచేతను నాయగ్ని వాయువుచేతను, వాయు-

వాకాశము చేతను నా యాకాశము భూతాదిచేతను నాభూతాది మహత్తు చేతను నామహత్తు వ్యక్తముచేతను నావరింపఁబడినది. సప్తావరణంబు లిట్లు విశ్వముయొక్క రక్షణమునకై యేర్పఱుపఁబడినవి. ఇఁకఁ జక్రముకన్నఁ బదిగుణము లుదకంబెక్కుడుండును. సలిలముకన్నఁ బదిగుణము లెక్కుడుగా నగ్నియును నటుమీఁదఁ దక్కినవికూడ నుత్తరోత్తరము దశగుణాధికంబులై యుండును. ఇదియే బ్రహ్మాండము. ఈయర్థమునే ప్రకటముగాఁ జక్రసామీప్యమందు జలంబుండుటవలన 'సలిలస్యమధ్యే' యని యుపక్రమించి శ్రుతిచెప్పినది. శక్తివిశిష్టుఁడగు నొక్క శివుఁడే యీయనుగ్రహతిరోభావసంహారస్థితి సృష్టులచే సంతతంబు లీలఁ గావించుచుండును ఇఁక బహూక్తులేల? మునీంద్రా! సారము చెప్పుచున్నాను. శక్తివిశిష్టుఁడగు శివుఁడే యీయఖలమని నిశ్చితతాత్పర్యము. అంతగురూపదిష్టముగు వేదార్థము విని వామదేవముని పరమాత్మయందు సందిగ్ధార్థంబు లిట్లు సాదరంబుగ నడిగెను. 66

గీ. జ్ఞానశక్తిధర! పరమానందమూర్తి! స్వామి! నీముఖకమల నిష్యందసుధను
ద్రావి చెందితి శేముషీదార్ఢ్యము సుమనమున సందియమంతభిన్నమయిసురిఁగె.

క. మఱియు నొకఁడడిగెదను గని, కరమున నద్దానిఁ దెల్పు కారుణికాత్మా!
సిరిమీఱ నిన్నుఁ బోలెడు, గురుఁడెచట నాకుదొరకు గుహ! పరమగురూ?

గీ. వినుము బ్రహ్మాదికీటాంత విశ్వమునకు, స్త్రీపురుషరూపముః స్థితి చెలఁగుచుండు
నిట్టిజగమున కాదియైనట్టి మేటి, కారణంబేదొ మదిఁబోడఁ గానకుంటి. 69

గీ. స్త్రీయొ పూరుషుఁడొ క్లీబ మఱియు నపుంసకంబొ మిశ్రకంబొ యన్యమో కారణంబు
పలువురిద్దానిఁ గూర్చి బహువివాదములనుసల్పుచునుందురు బుధులు భువిని 70

క. జగదుత్పత్తినిఁ గూరిచి, తగఁ దెల్పెడునట్టి వేదతతులు బహువిధం
బుగఁ బల్కుచుండు నిక్కమొ, ఱుఁగఁజాలరు హరియు నేనిద్రుహిణుండేనిన్ 71

గీ. కారణోక్తులు సర్వమేకత్వమొందఁ
దెలియఁజెప్పు! మఱొక్కటి దివ్యమూర్తి!
తెలియుచున్నాఁడఁ జేసెద దీక్ష నేఁడు
వాఁడెవం డాత్మయొక్క తత్పరుఁడొ. యరయ.? 72

వ. సర్వదేహేంద్రియమనోబుద్ధ్యహంకారసంభవంబగు నీవ్యవహారం బాత్మరూపంబనుటయందు సందియ మెక్కుడుగల దీసందేహంబులు రెండువిమ్రదుమం

బులచందంబున మనోభూమి నావరించియున్న యజ్ఞానసంభూతంబు లగు నవ్వానిఁ బెకలించివేసి శివాద్వైతకల్పవృక్షావని నొనర్చుమనుడు సుబ్రహ్మణ్యుండు వేదాంతగర్భితంబగు తత్ప్రశ్నద్వయంబునాలించి స్మేరాననుండై మునికిట్లనియె.

—* కుమారుఁడు వామదేవునకు జగత్కారకునిగుఱించి చెప్పుట *—

గీ. ఇదియె మునునాజనకుఁడౌ మ • హేశ్వరుండు, నాదుమాతకుస్నీహార • నగదుహితకు
నే వినుచునుండఁగాఁ దెల్పె • నీకు దానిఁ, దెలియఁజెప్పెద వినుము సు • ధీవతంస!

క. చాలరహస్యంబైనను, మేలిమిశిష్యుండ వౌట • మిగులగ నీకున్
లోలతఁ జెప్పెద దీనిన్, బాలసులకు నుడువవలదు • పాషండులకున్. 75

క. కొందఱు కాపిల దర్శన, మందును దాదృశములందు • నాసక్తమతిన్
బొం దెలుగక వర్తిల్లుదు, రందున వారలకుఁ జెప్పఁ • కనఘా! దీనిన్. 76

వ. విను మనుమానప్రయోగంబున కిం దవకాశంబులేదు. అయ్యది ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయననిగమంబులను పంచావయవంబులతోఁ గూడుకొనిన ధూమంబుయొక్క దర్శనంబునఁ బర్వతంబున కగ్నిసద్భావంబుఁ జెప్పు. ప్రత్యక్షంబగు ప్రపంచంబు దర్శనాలంబం బందుచేఁ బరమాత్మయగు పరమేశ్వరుండు జ్ఞాతవ్యుండు. స్త్రీ పుంరూపమయం బగు ప్రపంచంబు ప్రత్యక్షంబుగఁ గన్పట్టుచున్నది.గదా! 77

గీ. వినుము షట్కోశరూపమా • పిండమందు
ఆద్యమైనట్టి త్రియము మా • తృంశజము త
దన్యమైనట్టి త్రియము పి • త్రంశజముగ
శ్రుతి వచించెడు వినవా సు • శ్లోక! నీవు. 78

వ. ఇట్లు సర్వశరీరంబులందును బరమాత్మయందును జనములు స్త్రీ పుంభావంబు నెఱుంగుచున్నారు. శ్రుతి బ్రహ్మమునకు సచ్చిదానందరూపంబు గలుగుటను జెప్పుచున్నది. అందు సచ్ఛబ్దం బసన్నివర్తకంబై పరమాత్మను జెప్పుచున్నది. చిచ్ఛబ్దము జగత్త్వమునకు నివర్తకంబై విధింపఁబడినది. సచ్ఛబ్దము త్రిలింగములం దొప్పినను నిచ్చటఁ బురుషుండె విధింపఁబడును. మఱియు నది ప్రకాశంబుఁ జెప్పెడిచోట నప్పురుషుండు ప్రకాశవిశిష్టుం డగును. జ్ఞానశబ్దమునకుఁ బర్యాయమగు చిచ్ఛబ్దము స్త్రీత్వంబు నొందినది. ప్రకాశంబును,

చిత్తును మిధునమై జగత్కారణత్వము నొందినది. ఇట్లు సచ్చిదాత్మకము జగత్కారణత్వము నొందఁగా శివభక్తిభావం బొక్కయెడనే విధింపఁబడినది. తైలవర్త్యాది మాలిన్యము వల్లనుంచి ప్రకాశమునకుఁగూడ మాలిన్యము గనుపట్టును. అట్లు మాలిన్య మశివత్వము చిత్ప్రకాశములయం దగుపట్టుచున్నది. అందుచేశివత్వము వివర్తకంబైనట్లు శ్రుతిచోదితము. ఇఁక జీవాశ్రితంబగు చిచ్ఛక్తికెప్పుడును దౌర్బల్యమొప్పుచుండు. తన్నివృత్త్యర్థమై శక్తిత్వము సార్వకాలికంబుగ నీశ్వరునియందొప్పు. బలవంతుఁడు శక్తివంతుఁడని వ్యవహారము లోకవేదములందుస్ఫుటము. ఈప్రకారము పరమాత్మయందు శివత్వమును శక్తిత్వమును జూపఁబడినది. శివభక్తిసంయోగంబున నానంద ముద్భవిల్లు. అందుచేఁ బరమాత్మను యోజించి మునులు క్షీణకల్మషు లగుచుందురు మఱియు శివరూపంబగు నా పరమాత్మయందు మనంబును బదిలపఱిచి యనామయంబగు శివతత్త్వమును జెందుచున్నారు. సర్వాత్మత్వము శివశక్తులకేయనియు శివతత్త్వమె బ్రహ్మమనియు నుపనిషత్తులందు గానముసేయఁబడుచున్నది. బృహిధాత్వర్థ మగు బృంహణత్వము బృహత్త్వము బ్రహ్మశబ్దము పంచబ్రహ్మమయుండగు సదాశివునియందు విశ్వప్రతీతితో వెలయుచున్నది. స్వాంగరూపభావంబుల యందు మాయాతత్త్వవిభేదబుద్ధియగు శివుఁడెవుడు పరమైశ్వర్య పూర్వకంబగు స్వకీయరూపంబుదాచి మాయచేసమస్త పదార్థగ్రాహకుండగుచున్నాఁడో యపుడు పురుషుండను నాహ్వాయంబుఁ బొందుచున్నాఁడు. “తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్” అనెడు శ్రుతి యీయర్థంబును జెప్పుచున్నది.

గీ. ఇట్టిపురుషుండెసంసారి యెంతయేని, మాయచే మోహితుండయి మఱుఁగుపశువు
ఈశ్వరజ్ఞానలేశవిహీనుఁడగుచు, బొదలు నానాదురితకర్మ మూఢబుద్ధి 80

[illegible]. విశ్వమెల్లశివుని కన్నభిన్నమెపుడు, గాకయున్నను దన్ను జగంబు శివుని
కన్నభిన్నఁబుగా నెంచి కాంచుచుండు, పశువుకీమోహమది లేదు ప్రభునకెపుడు

[illegible]. కనుమైంద్రజాలకుని భ్రమ, ఘనుఁడగు శివయోగి యెపుడు గనసియటులఁబావనుఁడైన సద్గురుని బోధను నాత్మైశ్వర్య మెఱుఁగ దాశివుఁడేయగున్ 82

[illegible]. శివునియందు సర్వకర్తృత్వరూపయును సర్వజ్ఞత్వ స్వరూపిణియుఁ బూర్ణత్వరూపయును నిత్యత్వవ్యాపకత్వస్వరూపిణులగు నైదుశక్తులు సంకుచద్రూపభాస్వరంబులై సంకోచరూపంబున నెప్పుడును బ్రకాశించుచుండునిఁకఁబశువునకు

గీ. కలయు విద్యయు రాగంబు • కాలమును ని
యతియునను బంచతత్త్వంబు • లమరియుండు
నందుఁగర్తృత్వ హేతువై • యలరెడుఁగల
విద్య తత్త్వ సాధకమయి • వెలయునలఁతి

క. ఇఁక రాగము విషయనురం, జకమై తగుఁగాలమదియె • సంగు నవచ్ఛే
దకమెల్ల భావములకును, సకలము లాభాసములకు • సంధాయకమై. ౮౬

వ. ఈయదియె భూతాదియని చెప్పఁబడుచున్నది.

గీ. అదియుఁగర్తవ్యమిద్దికా•దనెడునట్టి,నియమమేనియతియగుము•నీ! యివియు మ
హేశశక్తులువీనియ•హీనకలన, మునఁబశువుపదుౖభమమందు•మూఢుఁడగుచు

వ. ఈ పంచకంబే స్వరూప వారకంబగుటచేఁ బంచకంచుకంబని పేరొందినది
అంతరంగంబు సాధనంబనిన వాసుదేవమునీంద్రుండు షణ్ముఖున కిట్లనియె. 87

—*వామదేవమునికిఁ గుమారస్వామి శక్తివి శిష్టశివాద్వైతంబును జెప్పుట*—

గీ. దేవర! యధస్థలిన్ బ్రకృతి యలరారు
పురుషుఁడు పరిస్ఫుటిదినేమ • మరయుఁడనుచు
మున్ను చెప్పితి రివుడట్టు • లన్నమగును
బ్రకృతిచే సంకుచితుఁడయి • ప్రభుఁడెసఁగునె? 88

వ. ఈ సందియంబును విచ్ఛేదించి తత్త్వం బెఱింగింపు మనిన వామదేవ ముని
సుబ్రహ్మణ్యుం డట్లనియె 89

క. అద్వైతము శివవాదం, బాద్వైతంబును సహింప•దరయుమది మునీం
ద్రా! ద్వైతం బశ్వరము శివాద్వైత మనశ్వరంబు • హరువొప్పనిలన్. 90

గీ. శివుఁడు సర్వేశ్వరుండును • సర్వకర్త
సర్వసంవేదియుఁ దిరిదైవ • జనకుఁ డగుచుఁ
డరయు సచ్చిదానంద రూ•పాత్మ యైన
సంకుచితుఁడగు స్వేచ్ఛచే • స్వప్రకృతికి. 91

వ. అట్టిమాయాసంకుచితరూపుం డేపురుషుండన బరఁగు నాతఁడే కలాపంచకంబు
చేత భోక్తముగాఁ గల్పితుండగు. 92

గీ. ప్రకృతిలోఁగూడి పురుషుండు • ప్రకృతిజాత
గుణము లనుభవించుచు నుండుఁ • గుతుకమునను

అట్లు స్థానద్వయాంతస్థుఁడగు పురుషుఁడు
సంకుచన్నిజరూపుండు • శంకలేదు. 93

వ. చిత్తము ప్రకృతితత్త్వమయ్యది సత్త్వాదిగుణంబులకుఁ గారణంబు. ఈగుణంబులచేతబుద్ధ్యాది త్రితయంబు సాధితంబు. సత్త్వరజస్తమోగుణంబులనుండి వస్తునిశ్చయకారిణియగు బుద్ధి యుత్పన్నంబయ్యె దానివలన మహత్తునద్దాని వలన నహంకారంబును, ఆయహంకారంబున సూక్ష్మంబులగు శబ్దస్పర్శరూపరసగంధములతో శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వానాసికలను బంచజ్ఞానేంద్రియంబులును సంకల్ప వికల్ప కారణంబగు మనంబును బుట్టఁబడియె. వానితోడను స్వకార్యసహితంబులగు వాక్పాణిపాదపాయూపస్థ లనెడు పంచకర్మేంద్రియంబులును బొడమె ఈ కర్మేంద్రియ పంచకంబునకు వచనదానాగమనవిసర్గానందంబులను కార్యంబులైదు మఱియు శబ్దాదిపంచతన్మాత్రంబులనుండి ఆకాశవాయ్వగ్నిజలభూములను పంచభూతంబు లుత్పన్నంబులయ్యె వీని కవకాశంబునిచ్చుట, వీచుట, కాల్చుట, తడుపుట, మోచుట యనునవి కార్యంబులనిన గుహునకు వామదేవముని యిట్లనియె.

గీ. మునుగలాదులనుండియుఁబ్భూతసృష్టి, తెలుపఁబడెనిప్డు వేఱొండు • తెఱఁగుగాను దెలుపుచుంటివి యెట్లిది • దేవ మేటి! సందియం బుదయించెను•జక్కఁబాపు. 96

వ. మఱియును, ఆత్మతత్త్వ మకారంబనియును విద్యాతత్త్వం బుకారంబనియును శివతత్త్వము మకారంబనియు బిందునాదంబు సర్వతత్త్వార్థకంబులనియు నీపంచకంబునకు బ్రహ్మవిష్ణురుద్రమహేశ్వర సదాశివులు దేవతలనియుఁ జెప్పియుంటి విపుడు తన్మాత్రలనుండి భూతపంచకం బుదయించెనని చెప్పితి వెట్టు లనిన సుబ్రహ్మణ్యుండిట్లనియె 'తస్మాద్వా'యనెడు శ్రుతిప్రకారము భూతసృష్టి క్రమమందుఁ బంచభూతంబులు గలలచేఁ బుట్టబడిన విద్ది నిశ్చిత మీయవి స్థూలప్రపంచరూపములై పరమేశ్వరుని తనువులై యొప్పు. శివతత్త్వము మొదలుకొని పృథివ్యంత తత్త్వంబు లుదయక్రమమందుఁ దన్మాత్రలనుండి పుట్టఁబడిన వనుటలోఁ గల్లలేదు, కలలకును దన్మాత్రలకును భూతకారణంబందవిరుద్ధంబగు నైక్యంబొప్పు—స్థూలసూక్ష్మాత్మకంబగు నీవిశ్వంబందు సనక్షత్రంబులగు సూర్యచంద్రాది గ్రహంబులును లాంతిజ్యోతిర్గణంబులును బ్రహ్మవిష్ణు రుద్రాదిదేవజాతులును నింద్రాది దిక్పాలురును దేవరక్షోభూత మానుషకోటులును

బశువులుఁ బక్షులును గీటములుఁ బన్నగంబులు మున్నగు సకల జంగమంబు లును స్థావరంబులగు తరుగుల్మలతౌషధులును సప్తకులపర్వతంబులును గంగాది పుణ్యనదులును సప్తసముద్రంబులు మొదలగునవియన్నియు జగంబున సర్వవస్తు జాతంబును స్త్రీపుంసరూపంబగు విశ్వంబంతయు శివశక్త్యాత్మకంబు గ నంతరంగంబున నెఱుంగు మిందు సందియంబు లేదు. ఇట్టి తత్త్వంబే శివ జ్ఞాన విశారదులగు నేకోటి విబుధుల కుపాస్యంబు "సర్వం బ్రహ్మేత్యుపాసీత సర్వోవై రుద్రః" అనెడు శ్రుతులీ యర్థంబునే చెప్పుచున్నవి. అందువలన సదాశివుండే ప్రపంచాత్మకంబు అట్టి సదాశివుండను నేనని యెడు నా యష్ట త్రింశత్కలాన్యాససామర్థ్యసిద్ధశివాద్వైతభావనచే భావితాత్ముండగువాఁడే గురుండును శివుండును నగు.

గీ. సద్గురుమహాప్రబోధన॥క్షపితసకల, బంధనుండయి శంకర॥ పాదపద్మ
సక్తుఁడైనట్టి శిశువేని॥సత్యముగను, సద్గురుండగు విను తాప॥సకులతిలక !97

క. ఎందు గుణోన్నతి నొప్పుచు. విందగు నేవస్తువేని ॥ వెలసిన చోఁ దా
నిం దలపు ప్రణవవాచ్యము. నుం దలి తాఘుంబుగాగ॥నున్ మునివర్యా! 98

* కుమారుఁడు వామదేవమునిని శివతత్త్వప్రచారకుఁడవౌదు వని చెప్పుట *

గీ. ఇట్టులు శివప్రియంబును ॥ నీడ్యమైన
నీ శివాద్వైతతత్త్వంబు ॥ నెలమి తోడ
నీకుఁ జెప్పితి భక్తిచే ॥ నీవు దీనిఁ
బదిలముగ హృదయంబునఁ ॥ గుదురు పఱచి. 99

క. పొదువుము సకలాఘంబులఁ, దుదుపుము పాషండతండ॥దుర్వాదములన్
విడువుము పెఱదర్శనముల, నడువుము శివభక్తపదవి॥నయుమెసలారక. 100

వ. ఎవ్వండేని మదగర్వితుండై యీయర్థంబున కన్యథాత్వంబును జెప్పెనేని య వ్వాని మస్తకంబు శత్రుకాలాగ్ని కల్పంబగుశక్తిచే ఛేదించెదను. నీవు శివా ద్వైతవిదులలో నెల్ల నెక్కుడై శివజ్ఞానోపదేష్టవై శివాచారంబునకుఁ బ్రవర్త కుండ వుగాఁగలవు. 101

ఆ. ఎవని దేహ భస్మ॥మింత సోఁకిన సక, లాఘ పుంజమెల్ల ॥ నంతరించి
బ్రహ్మరాక్షసుండు ॥ వడసె సద్గతినట్టి, నిన్ను నెఱుఁగ నౌకొ॥నిర్మలాత్మ!

వ. మఱియు శివయోగివగు నీకటాక్షసంపర్కమాత్రంబునఁ బశువు పశుపతి యగును. లోకోపకారకరణార్థంబిట్లు నీవునన్నడిగితివి-సాధులగు వారల చరిత్రంబిట్టులే. ఇఁకను లోకరక్షణం బొనర్చుచు సుఖంబునొందుమని షడాననుండు నుడివిన వామదేవముని విని వినమ్రమూర్తియై సాష్టాంగముగాఁ బ్రణమిల్లి గురుపాదారవిందమకరందరసాస్వాదనమిళిందుండై సెలవొంది యథేచ్ఛన్ జనియెనని సూతుండు శౌనకాదులకు వక్కాణించిన నవ్వారలు మురిసి సూతునిఁ గొనియాడి మహాత్మా! మున్ను నైమిశారణ్య వాసులును షట్కులీనులునగు బ్రహ్మర్షులకు బ్రహ్మచోదితుండై వాయుదేవుం డీశ్వర తత్త్వం బెఱింగించెనని విందు మద్దాని నీవెఱింగి యుందువుగావున మా కివుడయ్యది బోధింపుమని యర్థింపుదు. 103

క. సమధికతపోవిభూతి, క్షమమంత్రారాధ్యసుత! యజాతవిరోధీ!
విమలమతికలితశైవాగ మధర్మరహస్య! గళితకాలుష్యతతీ! 104

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి కైలాసఖండంబు
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## వాయవీయ ఖండము

### ప్రథమాశ్వాసము



వీరభద్రగురురా
జ్ఞ! విమలజ్ఞానదీప విలసితహృదయా!
సేవితమహేశపదరా
జీవా! నిరతాన్నదాన శీలా! జననీ!

వ. అవతరింపు మక్కథకుండు మంగళమధ్యంబుగ జగన్మంగళుండగు పరమేశ్వరు
నిట్లు భజనంబొనర్చె 2

తే. సోముఁడునుసగణుండుస సూనుఁడును బ్రధానపురుషేశుఁడును జగ త్సర్గరక్ష
ణాంతహేతువునై కరం బలరునట్టి, శివునకేను బ్రణుతులను జేయువాఁడ. 3

తే. ఇఁక ననన్యాదృశంబయి యెసఁగునెవని, శక్తి యైశ్వర్య మెవనిది సర్వగంబు
స్వామియై విభుఁడై జగం బోము నెవఁడు, అట్టిశివుని భజింతు నే నన్వహంబు 4

తే. అయజుని విశ్వకర్మను నవ్యయాత్ము, శాశ్వతుని శివు శ్రితలోక శరణు శర్వు
నమ్మహాదేవు వరదు మహాత్ము నాత్మఁ, గోరి పూజింతుఁ గోర్కులు గొనలుసాగ

వ. ఇట్లు వాఙ్మయోపాస్తిఁ బొనరించి శౌనకాది మహామునుల కిట్లనియె.

చ. మును చిరకాలమందుఁ గడు పూర్వపుఁ గల్ప మతీతమైన నం
తన మఱినూత్నకల్పమిది తారసిలంగఁ బ్రవృత్తమయ్యె నం
దనువుగ సృష్టికార్యమిఁక నయ్యెడ బోద్ధలుగాఁ దనర్చు స
న్మునివరులందు నెక్కుడుగఁ బుట్టె వివాద మొకండు బిట్టుగన్. 7

—* మునులు-బ్రహ్మజిజ్ఞాసులై చతుర్ముఖునియొద్దకుఁ బోవుట *—

చ. ఇది పర మిద్ది కాదనుచు • నెంతయు భూరివివాదశీలులై
వదలక తత్త్వవస్తువును • బ్రౌఢి నిరూపణసేయలేక య
వ్వదనున నంద ఱేకమయి • బ్రహ్మపదంబును జేరఁబోవఁగా
మదినిఁ దలంచి మేరుగిరి • మధ్యమశృంగముఁ జేరి యందొగిన్. 8

సీ. సిద్ధచారణయక్ష•సేవితంబగు దాని, ఘనమణీమయగుహల్ • గలుగుదాని
శుకపికశారికా • సుస్వనంబులదాని, కలహంసయూథముల్ • గలుగుదాని
సరసనరోవర • స్తోమంబెసఁగు దాని, స్వర్ణదీకూలమై • వరఁగుదాని
మత్తభ్రమరదీవ్య • మానతరులదాని, తరుణార్కసదృశమై•తనరుదాని

గీ. వేదఘోషపరీతమై•వెలయుదాని, దురితపరుల కగమ్యమై•తోఁచుదాని
నన్మనికదంబకంబుల•జానుమీఱు, దాని బ్రహ్మవనంబును•దరిసిమునులు. 9

గీ. ఆ వనముమధ్య సుందరం•బై తనర్చు
నొకఁడు పురము గలదు నూరు • యోజనముల
పొడువు పదియోజనమ్ముల • వెడలుపును గ
లిగి పసిఁడిమాడుగుల బారు • లొగివెలయఁగ. 10

వ. అందు

గీ. స్ఫటికమణిమయమై యాక•సముకు లేలి
హానముగ నొప్పు నొక సము•దారహర్మ్య
రాజమున హేమరాజీవ • రాజదగ్ర
పీఠమునఁ గనకాద్రినా • వెలయువాని 11

క. దివ్యధవళ వసనుండై, దివ్యకుసుమదామ నిచయ • దీప్తతనుండై
దివ్యానులేపనుండై, దివ్యరుచిప్రచయభూరి • దిగ్గుండగుచున్. 12

గీ. దేవఋషిగణస్తుతులచేఁ • దేజరిల్లు
వానిఁ బ్రభయట్టి చామర•పాణియైన
వాణితో సేవితుండగు • వాని నజునిఁ
గాంచి సాష్టాంగపడి మ్రొక్కి • శిరము భక్తి. 13

## — * మునులు బ్రహ్మను నుతించుట * —

క. మూఁగురు మూర్తుల రూపున, బాగుగ సర్గస్థితిలయ ♦ వైఖరులను బల్
రాగిలుచుఁ గూర్చువ్రధికి వ, చోగురుతన్ బొల్చుదొరకు ♦ జోతలివియగున్.

ఆ. ఆ ప్రధానతనున ♦ కాప్రధానక్షోభ, కున కిరువదిమూఁడ ♦ గు వికృతులను
జెందినను వికార ♦ మొందని యట్టివా, నికిఁ బురాణపురుషు ♦ నకివె నుతులు. 15

క. పరమాత్మకు బ్రహ్మకు భా, సురసర్వజగత్పదార్థ ♦ సురుచిరలీలా
కరునకు జగన్మయున కిదె, పరగ నొనర్చెదను భక్తి ♦ వందనశతముల్. 16

క. మించుగ జగంబులను సృ, ష్టించియుఁ బెంచియు హరించి ♦ చేవమెసఁగ రా
ణించుచు నున్నను నిను భా, వించఁగ లేమైతి మకట! ♦ బిట్టగుమాయన్ 17

గీ. అని నుతించుచు నున్న య ♦ మ్మునులఁ జూచి
వనజసంభవుఁ డనియెఁ దా ♦ పసవతంసు
లార! మీరంద ఱిచటికిఁ ♦ జేరినట్టి
కారణం బేమొ చెప్పుఁడన్నఁ ♦ గడఁగి వారు. 18

క. కంజోద్భవునకు నెంతో స, మంజసముగ మరల మ్రొక్కి ♦ యతిశయభక్తిన్
సాంజలిబంధంబుగ నిటు, లం జనవునఁ దెలిపి రాత్మ ♦ లన్ గలకుందున్. 19

ఉ. దేవర! యంధకారమున ♦ దెంపనునట్టిది లేకయుండి యే
వేవొ యనేకవాదముల ♦ నిచ్చలు సల్పుచునుందు మజ్ఞతన్
నీవు జగన్నిదానుఁడవు ♦ నేతవు ధాతవు సర్వకారణం
బీవిఁక నీవెఱుంగనిది ♦ యెందును లేదొక యించుకేనియున్. 20

ఉ. ఎవ్వఁడు సర్వభూతముల ♦ కెల్లఁ బురాణుఁడుగాఁ దనర్చు? నిం
కెవ్వఁడు శాశ్వతుండు? పర ♦ మేశ్వరుఁ డెవ్వఁడు? నిత్యశుద్ధుఁడౌ
నెవ్వఁడు? చిత్రకృత్యముగ ♦ నెవ్వనిచే జనియించె నీజగం
బెవ్వనియందు సర్వము ల ♦ యించునొ? మాకెఱుఁగంగఁ జెప్పుమా! 21

క. ఎవనికి వశ్యములగు నీ, వివిధములగు భూతములును ♦ వినియోజకుఁ డిం
కెవఁడగు సర్వమునకు నా, యవికారునిఁ జూచుటెట్టు ♦ లజ! తెల్పగదే! 22

## — * బ్రహ్మదేవుఁడు మునులకుఁ బరతత్త్వంబును జెప్పుట * —

క. అనియిట్లడిగినఁ బద్మజుఁ, డనఘుల సమ్మునివరులను ♦ నబ్రిములే న
వ్వును దొలుకు వీక్షణంబుల, గని తడవాత్మమున నోజ ♦ గాంచి 'శివుఁ' డనెన్. 23

గీ. అనియు నానందకలితస ర్వాంగుఁ డగుచు
దోయిలిన్ జెంది యిటులనెఁ • దోయజజుఁడు
సకలజగదంతరాత్మయా • శర్వవిభవ
మరసి చెప్పెద వినుఁడు స త్యముగ మునులు! 24

గీ. వాక్కులెచ్చోటనుంచి భా వంబుతోడ, మరలునెవ్విధి నిర్ణయిం పంగడక్క
యెవనియానందమెఱిగిన • యిద్ధమూర్తి, యెందునుండియుభయమొందఁ డెవ్వఁడేని

ఉ. ఎవ్వనిచేత నీయఖిల • మీవిధివిష్ణులు రుద్రశక్రులున్
జివ్వనఁ బంచభూతములు • శ్రీయలరారెడు నింద్రియంబులున్
నివ్వటిలంగ నాదిఁదగె • నేటగుకారణకోటికెల్లఁ దా
నెవ్వఁడు కారణంబయి ర హించునొ శంభుఁడు మింటిమధ్యలోన్. 26

క. ఎవఁడు గనె సుతుని నను మొద, లెవఁడిడె జ్ఞానంబునాకు • హెచ్చుగనిటులిం
కెవని ప్రసాదంబున నీ,కవినుతమగు బ్రహ్మపదము • గాంచితి నేనున్ 27

క. మ్రానువలె నిశ్చలుండై, మానుగ నెవఁ డొకఁడు గగన • మధ్యవసించున్
బూనిక నీయఖిలంబును, బూని మహాత్మకుఁడెవండు • పూర్ణముగాగన్. 28

చ. ఎవఁడొక బీజముగా ధర న నేకవిధంబులఁ బుట్టఁజేయు నిం
కెవఁడు సమస్తలోకముల • నేపునఁగూర్చెడు బీజరాజిచే
నెవఁ డఖిలప్రజాహృదయ • మింపుగఁ జెంది కనన్ బడండొ తా
నెవఁడొకఁడట్టి రుద్రుఁడు మ హేశుఁడు లేఁడు ద్వితీయుఁడెందునున్. 29

క. కాలాత్మయుతములై కడు, గ్రాలెడు కారణములను స కలముల నెవ్వం
డోలిగ ననంతశక్తి, కీలలితుండగుచు నధివ సించును చేర్మిన్. 30

గీ. కటికచీఁకటి తగి పవ ల్గాని రేయి, గాని లేకయసత్తు స త్తైని లేని
తఱి శివుండొకఁడుండె నా తండె సవితృ, వంద్యుఁడాతనిచేతనే • ప్రజ్ఞ వెడలె.

క. ఆతనికిఁ గార్యకరణము, లేతఱినిన్ గలుగనేర • వీడగునట్టిం
డాతనికి మిన్నయును లేఁ, డాతనినిజశక్తి నిత్య మై జ్ఞానదయా. 32

క. క్షరమగు ప్రధాన మమృతా, క్షరమగు పరమాత్మహరుఁడు • శంకరుఁడొకఁడే
క్షరరూప జీవుఁడగు నిది, యరసి యెఱుంగఁదగుదేవు • నాత్మజ్యోతిన్. 33

క. వెలుఁగఁడు భానుం డచ్చోట, వెలుఁగఁడు చందురుఁ డుభములు • విద్యుల్లతలున్
వెలుఁగవు హవ్యవహుండును, వెలుఁగడు తత్తేజమున నె వెలుఁగు నఖిలమున్,

క. ఒక్కఁడే దేవుఁడు శంకరుఁ, డకలంకాత్ముఁడు మహేశుఁ డాతఁడె సేవ్యుం
డిఁక నాపరమునకన్న న, ధికమగు పద మొండులేదు తెలియుం డీరల్. 86

క. ఆతని ధ్యానమువలనను, నాతని యోజనమువలన నాతనితత్త్వం
బూతగ దెలియుటవలనను, నాతనిమాయ యది దొలఁగు నవని నరునకున్

ఉ. అందరికన్న మీఁదఁదగు నావసథంబున నుండువాఁడు బి
ట్టందరియందు నుండెడు మహాత్ముఁ డెల్ల నెఱింగినట్టివాఁ
డందిక షడ్విధాధ్వమయమైన జగంబునకెల్ల వల్లభుం
డండ తెలుంగుఁడీరు పరమాత్ముని నిట్లు మహామునీశ్వరుల్! 87

గీ. ఉత్తరోత్తరభూతాళికుత్తరుఁడు ని, రుత్తరుండును నానంద రుచిరభూమి
ప్రభుఁ డరయ ననవచ్ఛిన్నవైభవుండు, నైజశక్త్యమృతాస్వాదనరసికుండు

గీ. అవిరతానందభూరిరసైకమాళ, రందసందోహభోగమిళిందమూర్తి
అఖిలజగదండపిండక్రియాచతురుఁడు, అరయ స్వేచ్ఛానియుక్తచరాచరుండు

క. ఈతఁడె యాది జగంబుల, కీతఁ డనంతుండు పరముఁ డీతఁడె నాథుం
డీతఁడె స్వతంత్రుఁ డెంతయు, నీతఁడె పరిపూర్ణమూర్తి యెఱుఁగుఁడిఁక మునుల్!

గీ. ఇఁకను నెక్కుడుభక్తిచే నీశ్వరుండి, తండు పొడసూపుఁగాని వేఱొండువిధమ
తోడ నెప్పుడుఁ గనరాఁడు దొడ్డతపసు, లేని దానంబులేని యవ్వాని కొఱకె.

గీ. శివునిరూపంబు త్రివిధమై చెలఁగు స్థూల, సూక్ష్మపర భేదములతోడ స్థూలమస్మ
దాదిదృశ్యంబు సూక్ష్మమాయలఘు యోగి, దృశ్యము పరంబు నిత్యమై తేజరిల్లు

వ. ఆ పరరూపంబు జ్ఞానరూపం బానందమయం బిఁక పరమేశ్వరనిష్ఠులును దద్వ్రతపరాయణులునగు నప్పరమేశ్వరులచే నద్ది చూడంబడు నట్టివారు ముక్తులని యెఱుంగుఁడు.

గీ. భక్తిపొడమును శివుని దివ్యప్రసాద, మున నది జనించు శివుని ప్రభూతభక్తి
బీజ మంకురమున నట్లు బీజమునను, నంకురంబు జనించెడు నవనియందు.

వ. సర్వంబులగు నర్థసిద్ధులు ప్రసాదపూర్వకంబులగు నందుచే సకలసాధనంబులు శివప్రసాదంబుచేత సాధింపఁ జెల్లు ప్రసాద సాధనంబె పరమధర్మంబని వేదంబునఁ జూపఁబడినది. 46

గీ. అధికధర్మపరుండై నసఘము పొలియు. గళితమలునకు విజ్ఞానకలితభక్తి
సాంబశివునందుఁ బొడము దృఢంబుదాన, జగతిభావసమేశ ప్రసాదమమరు.

ఆ. ఆ ప్రసాదమనను • నఖిలకర్మత్యాగ, మొనరునది స్వరూప • మునను గాదు
ఫలము గూర్చియగును • ఫలపరిత్యాగము నను మహేశధర్మ • మనువు వడును.

వ. అదియు గుర్వపేక్షంబగియు దదనపేక్షంబగియు రెండు తెఱంగుల నొప్పు నం
దనపేక్షంబుకన్న సాపేక్షంబు శతగుణాధికంబు. ఇఁక శివధర్మాన్వయంబున
శివజ్ఞానసమన్వయంబును నద్దాన సంసారదోషదర్శనంబును దాన విషయవైరా
గ్యంబును, వైరాగ్యంబున భావశోధనంబును– భావశుద్ధునకుఁ గర్మయందుఁ
గాక ధ్యానమందు నిష్ఠయును జ్ఞానధ్యానయుక్తుఁడగు పురుషునకు యోగలబ్ధి
యును, యోగంబున నుత్తమ భక్తియును ననంతరంబునఁ బ్రసాదంబును,
ప్రసాదంబున మోక్షంబును బ్రాప్తించు. ముక్తుఁడగువాఁడు శివసముండగు.
ననుగ్రహ ప్రకారక్రమంబిట్లు మీకుఁ జెప్పఁబడియె. 48

గీ. ఎట్టి యోగ్యతగలిగిన • నట్టనుగ్ర
హముగలుగు బూరుషునకు గర్భముననున్న
వాఁడు ముక్తుఁడగు మఱొక్క • వాఁడు పుట్టఁ
జెందినంతనె మోక్షంబుఁ • జెందు మునులు! 49

క. బాలుఁడు తరుణుఁడు ముదుకఁడు, కాలునినరకమున నున్న • ఖలుఁడును దిర్య
గ్జాలములోఁ బ్రాణియునున్, మేలుగ ముక్తిఁ గొను శివుని • మేలిమికరుణన్

క. స్వపదక్షయమున జనుఁడిఁక, నపరపదంబొంది మోక్ష • మందు నొకఁడు క్షీ
ణపదుఁడయి మఱొకజన్మము, విపులమతుల్! జెందిమోక్ష • విభవమునొందున్

గీ. ఊర్ధ్వలోకంబులొంది యం • దుండియుండి
యొకఁడు మోక్షంబుఁ దడవుగ • నొందఁగలఁడు
యిట్లనేక ప్రకారంబు • లెసఁగ దేహు
లల్లమోక్షంబుఁ జెందెద • రరయుఁడీరు. 52

వ. జ్ఞానభావానురూపంబగు శివప్రసాదంబున నె మోక్షంబు లభించు వేఱొక్క
మార్గంబులేదు. 53

ఆ. కావున మీరలెల్లరును • గారుణికాగ్రణియైన యమ్మహా
దేవుని సుప్రసాదమును • దేఁకువ నొందగఁ గోరి వాఙ్మనః
శ్రీవెలయంగ బుత్రకులు • చేడెలుఁ గూడి శివున్ మహేశ్వరున్
భావన జేయఁ డెల్లవుడు • భక్తి నొనర్పుఁడు కొల్వుఁడీ రహిన్. 54

గీ. దీర్ఘసత్త్రమొకఁడు దివ్యవర్షసహస్ర, కముగఁ గూర్చుఁడందుఁ గడకు నాదు
సెలవుతో మరుత్తు చేరరాఁగలఁ డతం, డానతిచ్చు శ్రేయ మా తెఱఁగు. 55

క. అటుమీఁద వారణాసీ, పుటభేదనమునకుఁ బ్రీతి బొం డాశ్రితలం
పటుఁడగు విశ్వేశుం డచ్చోట నీశ్వరితోడనుండు శుభకరుఁడగుచున్. 56

గీ. అందు నక్కజమును గాంచి యవల నాదు
సన్నిధికిఁ జేరరందు మోక్షంబు చంద
మంతయును జెప్పెదను నొక్కఁడైన జన్మ
మందె మోక్షంబు దొరకు మీ యఁజలి యెడ. 57

—* నేమిపతనంబున వనంబు నైమిశారణ్యసంజ్ఞన్ దాల్చుట *—

వ. మనోమయచక్రంబొకండు నిర్మించి యిదియె విడుచున్నా నద్దాని నేమి యెచ్చట వ్రాలునో యద్ది పావనంబగు తపోయోగ్యప్రదేశంబని యెఱింగి యాదు వసించి సత్త్రంబు సల్పుఁడని యట్లు చక్రంబు నిర్మించి విడిచిననంత మునులెల్లఁ బితామహునికి మ్రొక్కి సెలవొంది చక్రంబు వెంటనడచి రయ్యది యొకవిమల స్వాదుపానీయశోభితంబగు నొకదివ్యవనంబున నొక్కశిలాతలంబున నేమి వ్రాలి యొరగిన నలుప సెలవుచొప్పున మునులందు వసించిరయ్యది నైమిశవనంబని పేరొందె. 58

క. పదునెనిమిది ద్వీపంబులు, పదవిగ నేలిన పురూరవస్సమ్రాట్టా
పదమున యూర్వశిలీలా, స్పదుఁడయ్యెను దైవయత్నపరతంత్రుండై. 59

ఉ. ఎచ్చట మున్ను విశ్వసృజు లింపుగ సత్త్రముఁ గూర్చిరో మఱిం
కెచ్చట వేదవేత్తలు జయింతురో వేదబహిష్కృతావళిన్
హెచ్చుగ వేదవిజ్ఞులును లెచ్చట వేదవిధుల్ పొనర్తురో
యచ్చటఁ జేరి మౌనివరు లాఁదటఁ గూర్చిరి సత్త్రయాగమున్ 60

గీ. స్ఫటికమయపర్వతాశ్మప్రసరదమృతని, ర్ఝరంబు రమ్యం బతిరసఫలాగమంబు
వ్యాలసత్వంబు లుండని మేలివనము, మునులతపసుల కుచితమైతనరెమిగుల.

గీ. అట్టినుస్థలమందు దివ్యబుధు లంద, ఱొలసి సత్త్రంబు నారంభ మొనరఁజేసి
సంతతంబు శివార్చన సలుపుచును స, మాప్తిచేసిరి దక్షిణల్ చాలనొసఁగి, 62

—— *బ్రహ్మాజ్ఞచే మునులయొద్దకు వాయుదేవుఁడు వచ్చుట *——

గీ. అంత బ్రహ్మాజ్ఞనొంది మహాబలుండు, వారిఁ జేరుటయును నంత వారు మురిసి
యెదిరికొని వందనము చేసి హేమమయపు, విష్టరంబునొసంగి బల్ వేడ్కమిగుల

క. ప్రాణాదులచే నిఖిల, ప్రాణుల సర్వాంగములను । భాస్వద్గతులన్
బూనఁగఁ బ్రేరణచేసెడు, వాని శరీరములఁ దాల్చు । వాని మహాత్మున్. 64

క. చదలున బుట్టినవానిన్, బొదలఁగ శబ్దంబు స్పర్శ । మును గలవానిన్
వదలక తనయందగ్నిని, నొదవించెడువాని నెందు । నుండెడువానిన్. 66

గీ. బ్రహ్మదేవుని శిష్యుఁడై । పరఁగినట్టి, వాని నణిమాదిశిద్ధుల । చే నితాంత
మలరువాని నటకువచ్చి । నట్టివానిఁ, బూజచేసిరి ప్రియమంది । మునితిలకులు.

—* ముని వాయుదేవ సంభాషణము *—

వ. అంత గంధవహుండు మునులన్ గలియన్ గని పరితోషంబున నిట్లనియె.

చ. కుశలమె మీకు నందఱకు । గొప్పదనర్చిన నిమ్మఖంబునన్
బిశితభుగగ్రిణుల్ బొదవి । విఘ్నములన్ బొనరింపకుండిరే
వశులయి దేవతాపితృల । వాసిగ నర్హాగతిన్ భజించి కీ
దృశమగు చెట్టలేకయె వి । ధిన్ బొనరించినవారె సత్రమున్. 68

వ. వెండియు సత్రానంతరం బిపుడు మీ రేమిసేయఁ గడంగియుంటిరి చెప్పుఁడన్న
వాయుభట్టారకునకు మునులు సంతసంబుతో నిట్లనిరి. 69

శా. మాకెల్లన్ గుశలంబు సేకుతెఁ గడున్ । మాన్యత్వమున్ మాతప
శ్శ్రీకిన్ జెందె మహాత్మ! నీవిటకు మా । శ్రేయార్థివై వచ్చుటన్
లోకేశుండగు పద్మసంభవుని మున్ । యోజించి పూజించ ను
శ్లోకుం డాతఁడు మమ్ము మెచ్చి యనియెన్ । శుభ్రాంతరంగంబునన్. 70

గీ. దీర్ఘసత్రంబుఁ దొడరి య । ద్దేవదేవు, పరమకారణు రుద్రుని । భక్తిఁ గొలువ
నామఖానంతరమున మ । హాబలుండు, మిమ్ముఁ జేరి విజ్ఞానంబు । మీకొసంగు.

క. అనిచెప్పిన మేమందఱ,మును దోయజసంభవునకు । మ్రొక్కి వెడలి యీ
ఘనమై మిశవనమున సవ,మును బొనరించితిమి యబ్ద । ముల నొకవేయిన్. 72

గీ. అజునినుడి తీరు మీ రిట । కరుగుదెంచి, తిరి మతొండెుక లేదెద్ది । తృట్టుమాకు
మీవలనఁ జెందువారమ । మేయతేజ!, జ్ఞానబోధంబనిన జగ । త్ప్రాణుఁడలరి.

వ. మీకెద్ది ప్రష్టవ్యంబెద్ది సందిగ్ధంబది యడుగుఁడన్న మునులు వాయుదేవున
కిట్లనిరి. 74

గీ. ఈశ్వరజ్ఞాన మెట్టుల • నెఱుకఁ జెంది
తరయ నవ్యక్తజన్ముఁడౌ • యబ్జభవున
కెట్లు శిష్యుఁడ వైతివి • యెఱుఁగఁ జెప్పు
మయ్య! మాకందఱకు మహాత్మా! ముదమున. 75

గీ. అని యడుగ వారలకు వాయు • వనియె శ్వేత
లోహితంబగు కల్పంబు • లోన మున్ను
నాచతుర్వదనుండు సర్గాభిలాషఁ
జేసి తపియించె నెంతయు • వాసిమీఱ. 76

క. ఘనమగు నాతపమున విధి, కనుపుగ శంకరుఁడు శ్వేతుఁడను మునియై ద
ర్శనము నొసఁగి గాయత్రీ, మనువును విజ్ఞానధనస • మస్తము నొసఁగెఁ. 77

గీ. దాన విజ్ఞానమొంది పద్మజుఁడు సర్వ, భూతములను జరాచరంబుల రచించె
దేవదేవునివలన నం • తేనిబడసి, నట్టిజ్ఞానామృతము నాకు • నర్థినొసఁగె. 78

వ. అనిన మునులిట్లనిరి.

గీ. ఎట్టిజ్ఞానంబు నొసఁగె ద్రుహిణుఁడు నీకుఁ
దథ్యమగునది యెఱిఁగింపు • తజ్ఞతిలక!
యెందు నిష్ఠనుబొనరించి • యీజగమునఁ
బురుషుఁడు సుఖంబుఁ జెందును • బుణ్యమూర్తి!

వ. అనిన వాయుదేవుం డిట్లనియె.

—వాయుదేవుఁడు మునులకుఁ బశుపాశపతి స్వరూపంబుఁ జెప్పుట—

క. పశుపాశపతిజ్ఞానము, విశదంబుగఁ బడసినాఁడ • విధివలన మునుల్!
విశయంబుదీఱ నాయెడ, పశులైకడు నిష్ఠసేయు • భావుక మమరున్ 80

గీ. అవని నజ్ఞానజన్యమై • నట్టిదుఃఖ, మెల్ల జ్ఞానోదయంబున • నింకిపోవు
నరయ వస్తుపరిచ్ఛేద • మగును జ్ఞాన, మట్టివస్తువు త్రివిధమై • యలరుమునులు!

గీ. అజడము జడంబువానిని • యంతయనియు, పశువు పాశము పతియని • పరగుమూఁడు
నక్షరంబు క్షరంబు క్ష • రాక్షరపర, మనియు నవె చెప్పఁబడియె వి • జ్ఞులచేత

క. అరయుఁడు పశు వక్షరమగు, క్షరమగు పాశంబు తాప • సతిలకులు క్షరా
క్షరపరమగు పతియన న, మ్మరుత్తు కిట్లనిరి మరల • మౌనిశ్రేష్ఠుల్. 83

గీ. ఎద్దిక్షరః మక్షరంబిఁక • నెద్దియాద్య
యిఁకఁబరమమెద్ది? యన నతం • డిట్టులనియె
ప్రకృతి క్షరము పురుషుఁ డక్షరంబు వానిఁ
బ్రేరణముసేయు బరముఁడు • విశ్వవిభుఁడు. 84

వ. అనిన మునులిట్లనిరి.

గీ. ఏదిప్రకృతి యది పురుషుం • డెవఁడు వీని,కరయ నెద్దాన సంబంధ • మమరు నెవఁడు
ప్రేరకుండగునీశుండు • ప్రియముతోడఁ, దెలియఁజెప్పుమనఁగన • నిలుఁడు నుడివె

క. మాయయె ప్రకృతి వినుం డ,మ్మాయయావృతుఁడా పురుషుఁడు • మలకర్మలచేఁ
జేయంబడు సంబంధం, బాయీశుఁడు ప్రేరకుండు • నగు శివుఁడు మునుల్! 86

వ. అనిన మునులిట్లనిరి.

గీ. మాయయనునది యెద్ది య • మ్మాయచేత, నెట్టిరూపంబుతోడ తఁ • జుట్టఁబడియె
పురుషుఁడా మల మెట్టిది • పరగనిట్లు, శివుఁ డెవఁడు చెప్పుమా | మాకు • సేవ్యమూర్తి!

వ. నావుడు వాయు దేవుండిట్లనియె

—* వాయుదేవుఁడు మునులకు మాయాస్వరూపంబుఁ జెప్పుట *—

గీ. మాయయన శివశక్తియ • మ్మాయచేతఁ, జుట్టఁబడియెఁజిద్రూపుఁడు • సొంతమైన
మలమెయాచ్ఛాదకంబయ్యె • మతివిశుద్ధుఁ, డాశివత్వాస్పదుండర • యంగఁదగును

వ. అనిన మునులిట్లడిగిరి.

గీ. వ్యాపియగువాని నెట్లు మా • య యది యావ
రించు నెక్కారణమున నా • వృతి పురుషున
కేటికింతకు నయ్యెది • యెట్లుపాయుఁ
గడగిచెప్పుము మాకు ని • క్కముగ దేవ! 89

వ. వాయుదేవుం డిట్లనియె.

గీ. వ్యాపియైనను గలుగు నా • వరణమిఁకను
నెందునఁ గలాదివ్యాపియై • యెసఁగుచుండు
హేతువగు కర్మభోగార్థ • మిఁక మలము
యంబుననునది దొలఁగు ధృ • వంబుగాను ౯౦

వ. మును లిట్లనిరి.

గీ. ఏదియగుఁగలాది? యక్కర్మ • మేది? యేది
మొదలుగాఁగల? దెయ్యది • తుదఁదనర్చు
నట్టి దీక్ష దీని ఫలమేది? • యాశ్రయ మెది?
మెందు కీభోగ మాభోగ్య • మేదొ చెపుము! 91

వ. మఱియు మలక్షయంబునకు హేతు వేది ? క్షీణమలుండగు పురుషుం డెట్లు లుండు నెఱుంగఁజెప్పు మన్నఁ బవమానుం డిట్లనియె. 92

— * వాయుదేవుఁడు మునులకుఁ గలాదిపంచకంబు నెఱింగించుట * —

గీ. కలయు విద్యయు రాగంబు • కాలమును ని
యతియు నను నైదు నవ్వి క•లాదు లనుచు
ఖ్యాతిఁజెందెఁ బురుషుఁడు భో•క్త యన నెగడెఁ
గర్మమనఁ బుణ్యపాపాత్మ•కం బరయుఁడు. 93

గీ. అది యనాది నిజమలభో•గాంతమై త
నర్చు సుఖదుఃఖఫలక మ•జ్ఞాన వేష్టి
నాత్మసంశ్రయ మిఁక భోగ•మగును గర్మ
నాశమునకయి తెలియుండు • జ్ఞానధనులు! 94

వ. భోగ్య మవ్యక్తంబు బాహ్యాంతఃకరణద్వారంబగు శరీరంబే భోగసాధనంబు. భవాతిశయలభ్యంబగు ప్రసాదంబుచే మలక్షయంబగు. క్షీణమలుండగు పురుషుండు శివసముండనిన మును లిట్లనిరి. 95

ఆ. అక్కలాదులైన • నైదుతత్త్వముల ప్ర, త్యేక మొప్పుకర్మ • మెద్దియాత్మ
పురుషుఁడనుచు నిఁకను•భోక్తయనుచును నె,ద్దాన నేర్పడును స•దాచరిష్ణు! 96

వ. అవ్యక్తంబే స్వరూపంబుగనుండు. ఎట్టియాకారంబుచేఁ గర్మఫల మనుభవింపం గలండు, మఱి యిఁక శరీరంబనిన నెట్టిది యనినఁ బ్రభంజనుం డిట్లనియె,

— * వాయుదేవుఁడు మునులకుఁ గలాపంచకస్వరూపంబుఁ జెప్పుట * —

గీ. దృక్క్రియావ్యంజకములు వి•ద్దయుఁ గలయును
రాగము ప్రవర్తకమయి ప•రగెడుఁ గాల
మగు నవచ్ఛేదకంబు ని•యతి నియామి
క యగు నరయుఁడు మౌనిప్ర•కాండులార! 98

వ. ఇట్టి గారణంబగు నవ్యక్తంబు త్రిగుణజనకం బిద్దానినే తత్వశాస్త్రవేత్తలు ప్రధానంబనియుఁ బ్రకృతియనియుఁ జెప్పుదురు. మఱియు నీయది యనభివ్యక్త రూపం బైనను గలావశంబున నభివ్యక్తంబగు. ఇట్టి సత్త్వరజస్తమోగుణములఁ ద్రివిధమై సుఖదుఃఖవిమోహాత్మంబు కర్మఫలంబు ననుభవించును. 99

—* వాయుదేవుఁడు మునులకు గుణత్రయస్వరూపంబుఁ జెప్పుట *—

గీ. సత్త్వము రజంబుఁ దమమునాఁ • జను గుణత్రి
యము ప్రకృతిసంభవంబయి • యలరు నిదియుఁ
బ్రకృతియందున సూక్ష్మరూ • పమున నుండుఁ
దిలలయందెట్లు తైలంబు • వెలసియుండు.

గీ. సుకము సుఖహేతు వలను సా • త్త్వికముగాఁగఁ
జెప్పఁబడుఁ దద్విరుద్ధంబు • చెప్పఁబడును
దామసంబుగ మోహంబు • స్తంభమును వ
చింపఁబడు రాజసంబుగ • శిష్టమునులు! 101

వ. సాత్త్వికి యూర్ధ్వగతియుగను దామసి యధోగతియుఁగను రాజసి మధ్యమ గతిగను జెప్పఁబడుచున్నవి. 102

గీ. వినుఁడు శబ్దాదులైదును • బృథ్వి మొదలు
గాఁగఁదగు నైదుభూతముల్ • గరిమ మెఱయు
జ్ఞానకర్మేంద్రియములు మ • నంబు బుద్ధ్య
హంకృతులును బ్రధాన మ • వ్యక్తమగును. 103

వ. మఱియు నది కారణదశాపన్నంబై యవ్యక్తంబనియును గార్యదశాపన్నంబై ఘటాదివలె శరీరాది యగును. 104

గీ. ఘటము మున్నగు కార్యంబు • గడఁగి మృత్తు, మున్ను గాఁగలయవ్వాని • కన్నభిన్న
మెపుడుగానట్లువ్యక్తమా • నిశరీర, మల్లయవ్యక్తమునకు న • న్యంబుగాదు. 105

వ. అందువలన నవ్యక్తమునే ముఖ్యకారణంబుగఁ దెలియుఁడు. ఇట్టి నాయవ్యక్తమే యాధారంబుగాఁగల శరీరంబు భోగసాధనం బనిన మునులు బుద్ధీంద్రియ శరీరంబులకన్న భిన్నమైన యాత్మ యెద్ది? అయ్యది యట్టులుంటకు హేతువెద్ది యనిన వాయుభట్టారకుం డిట్లనియె. 106

—* వాయుదేవుఁడు మునుల కాత్మస్వరూపంబును జెప్పుట *—

గీ. వినుఁడు బుద్ధీంద్రియశరీర • భిన్నమయి వి
భువునయి ధ్రువంబగుచు నాత్మ • పొలుచు నొకఁడు
అందు హేతువు దుర్విభా • వ్యముగఁ దెలియఁ
దఖిలవేదముల్ గొండాడు • నాత్మఁగుఱిచి. 107

గీ. సర్వమాత్మనుగొలుచు నా • సర్వమందు, శాశ్వతంబయి వ్యాపించి • చక్కనుండు
నాత్మమటులైన నెవ్వరి • కైన నెందు, వ్యక్తమయి చూడఁబడదు తా • పసతిలకులు!

క. కాదిది స్త్రీయుం బురుషుఁడు, గాదు నపుంసకము గాదు • కరమూర్ధ్వమునన్
లేదింక నెక్కుడు క్రిందన్, లే దడ్డంబయిన చోట • లేదు మునీంద్రుల్! 109

గీ. ఆరయ శరీరముల నశ • రీరమగుచుఁ, జలములందును నెల్లెడ • స్థాణువగుచు
నురుఁగ కున్నట్టియాత్మను • జూచు నెపుడు, ధీరుఁడైన నరుఁడు జ్ఞాన • దీప్తిచేత.

క. పలుమాటలేల? వినుడీ!, యలపురుషుఁడు దేహభిన్నుఁ • డని తెలియం డ
ట్టులగాక దేహమేయని, తెలిసినవాఁ డెపుడు నిజము • తెలియని వాఁడౌ.

గీ. ఆపదలకెల్ల బీజమై • యమరు స్వీయ, కర్మమునఁగూడి నరుఁడు దుః • ఖంబుసుఖము
ననుభవించును మూఢుఁడై • యరయుఁడీరు, మానులార! మహాతమో • భానులార!

క. నీటఁ దడుపంబడిన భువి, నీటుగ మొలకెత్తఁ జేయఁ • నేర్చు నో యిటులన్
గాటమగు నజ్ఞతావర, పాటిన్ గర్మంబు దేహ • వర్గముఁ గూర్చున్. 112

గీ. మిగుల సుఖమిాయు నట్టియుఁ • దెగులు కెప్పు
డాటపట్టయినట్టియు • నంతకునికిఁ
జేర్చునట్టియు మునుఁగడ • చినవి గడవఁ
దగు శరీరము లాత్మ కమరు సం • తతము వినుఁడు! 114

వ. శరీరంబులు జీర్ణంబులగుచుండ రానురా నీయాత్మ కెచ్చటను వసతియు లభింపదు. 115

గీ. ఆత్మమిది పెక్కుతనువుల • నావరింపఁ, బడుచు విడువబడుచునుండుఁ • బరఁగ నెపుడు
చంద్రమండల మెట్లాక • సంబునందుఁ, దరళధారాధరావళిఁ • దగిలియుండు.

గీ. వీనికై యొకఁడుఁడఁడు • వీఁడొకనికి, నై వసింపఁడు బందుగు • లాత్మసుతులు
బాటయందు గలియుదురు • పథికులట్లు, వృథగ మోహంబుఁగాంతురు • విత్తములను

గీ. కడలియం దట్లు కఱ్ఱలు గలిసి మెలఁగి
యంత నొకపరి యెడఁబాయు నట్లె యవని
భూతములుఁగూడ నెడఁబాయుఁ బొందుమాలి
యెఱుఁగుఁ డిట్టులు బ్రహ్మము నీంద్రులార! 118

సీ. అతఁడు సూచు శరీరంబు నవిరతంబు, నాతనిన్ జూడదు శరీర మాతని శ
రీరమును బరికించు నాధారుఁ డీశుఁ, డా యురువుఁ దెలియఁగఁ జాల రరయుఁ డీరు. 119

గీ. బ్రహ్మదేవుఁడు మొదలు స్థావరమువఱకు
బశువులుగఁ గీర్తితంబులై పరఁగుచుందు
రిట్టి పశువులకెల్లను నిది నిదర్శ
నంబుగాఁ జెప్పఁబడియె నిక్కం బరయుఁడు. 120

గీ. అజ్ఞుఁడై సుఖదుఃఖంబు లందుఁ దాఁ బ్ర, వేశ నిర్గమములయెడ విభుఁడుగాక
యుండు నీ దేహి విభుచోదితుండయి త్రిదివమ్మునన్ గాని చెందు శ్వభ్రమ్ముగాని.

గీ. అనిన మునులిట్టులనిరి మహానుభావ!, యెవ్వఁడా పశు వా పాశ మెద్ది వీని
కిన్ విలక్షణుఁ డెవ్వఁడొకో విభుండు, మాకెఱుఁగఁ జెప్పుమీవు సుశ్లోకతిలక!

వ. అనిన వాయుదేవుం డిట్లనియె.

— * వాయుదేవుఁడు మునుల కీశ్వరవిషయంబును జెప్పుట * —

సీ. అపరిమితరమణీయగుణాశ్రయుండు, పశువులకుఁ బాశములకు వేఱు పరఁగువాఁడు
విశ్వనిర్మాతయై కడు వెలయువాఁడు, కలఁడు పతియొక్కరుఁడు బ్రహ్మకల్పులార!

గీ. అతఁడు లేకున్న సర్గమెట్లమరుఁ గనుఁడు, అజ్ఞుఁడగు పశువును జడంబై తనరు
పాశరూపప్రకృతిచేతఁ బరఁగునొక్కొ, బుద్ధిమత్కారణము లేక భూతసృష్టి.

వ. జగంబు గర్తృసాపేక్షంబును గార్యంబును సావయవంబు నగుటం దత్కర్తృ
త్వంబు పశుపాశంబులకు సంభవింప దిక నీపశుపాశపతులయొక్క సత్యంబైన
యంతరంబెఱింగినవాఁడు బ్రహ్మవేత్తయై ముక్తుఁడగును.

గీ. తిలలయందున నూనె దధిన్ ఘృతంబు
నదిని నీళుల నరణి ననలముపోల్కి
జగమున నెసంగు నొక్కఁ డీశ్వరుఁడు విభుఁడు
చూతు రవ్వానిఁ దపమున సూనృతమున. 126

గీ. జాలవంతుండు నొక్కఁడీశానుఁడాత్మ, శక్తిబృందంబుచేత నీజగములెల్ల
సృష్టిచేసి ప్రభుత్వంబుఁ జేయు నెవ్వఁడతఁడు రుద్రుండు లేఁడిఁక నన్యుఁడెటను.

గీ. విశ్వతశ్చక్షుఁ డిఁకను విశ్వతోముఖుండునుఁ విశ్వతః ప్రవేశ్యుండు విశ్వ
తోంఘ్రియుండునునగు మహాత్ముఁడొకండు, పుడమిదివి నెల్లసురలను బొడమఁజేసె.

గీ. అరసి విశ్వాధిపుండు మహర్షి యైన, రుద్రుఁడాది హిరణ్యగర్భుని జనింపఁ
జేసెనాతనికన్నను శ్రేష్ఠుఁడునుగ, నీయుఁడును లేఁడు తన్మయంబీ యఖిలము.

క. ద్రుమానువలె నిశ్చలుండై, జానుగ నొక్కరుఁడు గడఁగి చదలుననుండున్
బూనిక జగములసలుపఁగఁ, బూనినమాత్రమునఁ బొడము భువనములెల్లన్.

ఉ. ఎల్లెడ నొప్పు నెమ్మొగము లెల్లెడనొప్పు శిరస్సులింకఁదా
మెల్లెడనొప్పుఁ గంధరలు నెల్లెడనొప్పు కరాంఘ్రులట్టులే
యెల్లెడనొప్పు వీనులును నెల్లెడనొప్పెడు నీక్షణంబులున్
గొల్లగనొప్పి సర్వజన కోశములందు శివుండు వెల్గెడున్. 132

గీ. కనులు లేకున్నఁ గాంచు లోకముల నెల్ల, వీనులును లేక యున్నఁ దా వినున ఖిలము
సర్వమును నారయునతండు సర్వమతని, నారయఁగ లేదు వినుఁడిఁక ధీరులార!

గీ. సూక్ష్మమునకన్న మిక్కిలి సూక్ష్మమగుచు, సలిలమధ్యంబునందు విశ్వంబు సృష్టి
చేసియవ్విశ్వమును జుట్టి చెలఁగు శివుని, బహువిధాకారు నెఱిఁగి తాపంబు విడుఁడు

గీ. ఈతఁడే పరదైవతం బీతఁడే మహేశ్వరుఁడు విశ్వకర్మ యిట్టితని నొకని
జన్మభీతులజాతుగాఁ జక్కఁ దెలిసి, రుద్రుదక్షిణముఖముఁ జేరుదురు నిత్య. 134

గీ. ఈశ్వరులలోన నెవఁడు మహేశ్వరుండు
దైవతములందును బరమ దైవమెవఁడు
పతులలోపల నెవ్వండు పరమపతియు
భువనవిభుని నెఱుంగుఁడా భూతనాథు. 135

క. కొందఱు స్వభావమనియున్, గొందఱు కాలంబనుచును గొణుగుదురదిరో
పొందెడు శివుమహిమ యెయ్యా, చందము భ్రమ మొందఁజేయు సర్వజనములన్.

గీ. కారణంబులకెల్లను గారణమయి
సర్వభూతాంతరాత్మయై సాక్షియై ప
శియును నై యాత్మయందుండు సేవ్యు నెవ్వ
రెఱుఁగఁ జాలుదురో వారికే సుఖంబు. 137

గీ. ఎపుడు చర్మంబు పోలికి నీనభంబు
చుట్టుకొనఁజాలుదురొ మనుజులు ధరిత్రి
నపుడు శివుని నెఱుంగక యనవుమీఱి
దుఃఖమును బాయఁగాఁ జాలుదురు జగమున. 138

గీ. బ్రహ్మముఖమున నాచేతఁ బడయఁ బడిన
పావనాశనమైన యీపరమగుహ్య
మిట్లు మీకెఱిఁగించితి నిపుడు మీరు
శమము లేనట్టి వాని కొసంగఁ దగదు. 139

వ. అనినంత మునులిట్లనిరి.

—* మునులు వాయుదేవునిఁ గాలస్వరూపంబుఁ జెప్పుమనియడ్గుట *—

క. కాలమునఁ బొడము సకలము, కాలమున విపత్తిఁజెందు గంధవహా! య
క్కాలంబు నపేక్షింపని, దేలాటిది సుంతయెచట నెసఁగదుగాదే. 140

వ. మఱియును.

క. కాలాంతర్గతమై జగ,మోలిగ సర్గంబు లయము నొందుచు మిగులన్
మేలగు చక్రంబట్టులఁ, జాలఁగఁ బరివర్తనంబు సల్పుచునుండున్. 141

గీ. ద్రుహిణుఁడును గేశవుండు రుద్రుండు లోఁతి
నిర్జరులు కాలకృతమగు నియతిఁ జెంది
దాఁటఁగా వలఁతులుగారు తథ్యమిద్ది
కాలమే సర్వమున కధికారియే మొ? 142

గీ. అట్టి యీ కాలమెట్టిది యెట్టివాని, కిద్ది వశవర్తిగా నుండు నెవఁడు దీని
వశుఁడుగాకుండుఁ జెప్పుము వాయుదేవ! ,సర్వమును దెలిసినయట్టి జాణవనుఁడు.

వ. వాయుదేవుం డిట్లనియెఁ గలకాష్ఠానిమేషాదికలాఘటితంబగు కాలంబనునది
యుత్కృష్టంబగు మహేశ్వర తేజంబు.

గీ. వినుఁడు సర్వచరాచర విశ్వమున క,లంఘ్యమైనట్టిదియును బలమయినట్టి
దియు శివాజ్ఞాస్వరూపమై తేజరిల్లు, నద్ది విశ్వనియామకంబై తనర్చు. 145

క. అక్కాలమునఁ గాలవశమగుఁ, జక్కఁగ జగమది జగతికి స్వాధీనముగా
దక్కాలము శివవశమగు, నక్కాలవశత్వమొందఁ డాశివుఁ డెపుడున్. 146

గీ. అడ్డులేకయెసఁగుశార్వ • మైనతేజ, మెలమిఁగాలంబునన్ నెల • కొలువఁబడియె
నట్టికాలంబు నెవఁడు ప్ర • జ్ఞాతిశయము, చేత మీఱఁగఁజాలెడు • క్షితితలమున

క. ఏకచ్ఛత్రంబుగ నీ,లోకంబును నెల్ల నేలు • లోకోత్తరుఁడున్
వీఁకన్ దాఁటఁగ జాలం, డీకాలముఁ గడలి దాఁటు • నెట్టుల వేలన్ 149

గీ. ఎవ్వరింద్రియముల నిగ్ర • హించి సకల, మీజగంబును గడిమి జ • యించియున్న
వారలేని జయింపఁగ • లేరు కాల, మునునిఁకన్ గాలము జయించుఁ • బూనివారి.

గీ. శీలమున రూపమున బల • శ్రీలఁ గులము
చేతఁ జేతనుఁ డేదేనిఁ • జింతసేయుఁ
గాలమిఁక నన్యమాపని • గడఁగి సేయుఁ
గాలము దురతిక్రమమెందుఁ • గనుఁడు మునులు! 150

గీ. యువయు ముదుసలియగు బలీ • యుఁడును గరము
దుర్బలుండగు భాగ్యవం • తుఁడును పేద
యగును గాలవిపర్యయం • బైనఁ జిత్ర
మగుఁ దదీయప్రసక్తి సం • యమితిలకులు! 151

గీ. ఆభిజాత్యంబు బలము శ్రీ • లాభివృత్తి, నైపుణియుఁ గార్యనిర్వహ • ణక్షమములు
గావు కాలము ప్రతిబంధ • కముగనున్న, నారయుండెడ నిద్ది మ • హర్షులార! 153

క. వినుఁడు రసాయనములునున్, ఘనమగు నౌషధములును న • కాలంబున సి
ద్ధినిఁ గూర్పవు కాలంబది, యనుకూలించిన ఫలంబు • నందఁగఁ జేయున్. 154

గీ ఇఁక నకాలంబునను నెవ్వఁ • డేని సురుగఁ
డెవ్వఁడేనియు జనియింపఁ • డెవ్వఁడేని
పుష్టినొందఁడు సుకమును • బొగులుటయును
గాలమునుబట్టి కలుగు ని • క్కంబు వినుఁడు.

గీ. కాలమున వీచుఁ జల్లనై • గాడ్పు పుడమి, గాలమున వృష్టి చేయు మే • ఘములగములు
కాలమున నెల్ల సస్యముల్ • గమియఁబండుఁ, గాలమున సర్వజీవలో • కంబు మెడు

## —* కాలప్రమాణములు *—

వ. కావున నిట్లు కాలాత్మకంబు తత్త్వంబు నిజంబుగ నెవండెఱుంగునో యవ్వాఁడు
కాలాత్మకంబు నతిక్రమించి కాలాతీతంబగు పరమాత్మకంబును బరికించు ననిన

సూతునకు మునులు మహాత్మా! యీకాలంబునం దెట్టిమానంబున నాయు
స్సంఖ్య కల్పింపఁబడినదో సంఖ్యారూపంబగు నిక్కాలంబునకుఁ బరమావధి
యెద్దియో యెఱింగింపుమనుడు మునులకు సూతుండిట్లనియె-కనుఱెప్పపాటగు
కాలంబు నిమేషంబని కీర్తింపఁబడును. అయ్యది యాద్యమానం బట్టి నిమేషం
బులు పదియైదైన నొకకాష్ఠయగును. అట్టికాష్ఠలు ముప్పదియైనఁ గలయనఁ
బడును. అవి ముప్పదియైన నొకముహూర్తం బవ్వి ముప్పదియైన నొక
యహోరాత్రంబగును. ముప్పది యహోరాత్రంబులైన సితాసితపక్ష
ద్వయాత్మకంబగు నొకమాసంబగును. అద్ది పితృదేవతల కొక్కయహోరా
త్రము, మాసంబు లాఱైన నొక్కయయనంబగు నివ్వి రెండైన సంవత్సర
మగును. ఈయది దేవతలకొక్క యహోరాత్రము. అందు దక్షిణాయ
నంబు రాత్రియును నుత్తరాయణంబు దినంబునగును. ఇట్టివి ముప్పది యహో
రాత్రంబులైన మనుష్యమాసంబువలెనే దేవమాసంబగును. ఆ దేవమాసం
బులు పదిరెండైన దివ్యవత్సరంబగు నివ్విధంబున మూఁడువందలయఱువది
మనుష్యసంవత్సరములైన నొక్క దేవవత్సరంబగును. దివ్యసంవత్సరప్రమా
ణంబుచేతనే యుగసంఖ్య ప్రవర్తిల్లుచున్నది. ఈ భారతవర్షంబునఁ గృత
త్రేతా ద్వాపర కలియుగంబులను నాల్గుయుగంబులు పండితులు పరిగణించిరి.
అందుఁ గృతయుగంబున నాల్గువేలవత్సరంబులును నాల్గువందలేండ్లు సంధ్యాం
శంబుగను దక్కిన మూఁడుయుగంబులందు నేకాపాయంబుగ సహస్రశతంబులు
వరఁగుననుటచేఁ ద్రేతాయుగంబందు మూఁడువేల వత్సరంబులును సంధ్యాత
దంశంబు లాఱునూఱులును ద్వాపరంబున రెండువేల వత్సరంబులును సంధ్యా
తదంశంబులు నాల్గునూఱులును గలియుగంబున వేయి వత్సరంబులును సంధ్యా
తదంశంబు లిన్నూఱేండ్లు నగును. ఇట్లు నాల్గుయుగంబులు పదిరెండువేల
సంవత్సరంబులగు నీచతుర్యుగసహస్రంబు కల్పంబనఁబడును మఱియు
డెబ్బదియొక్క చతుర్యుగంబు లొకమన్వంతరంబగును. కల్పంబందుఁ బదు
నాల్గు మన్వంతరంబులు పరివర్తనంబుసేయును. ఈ క్రమముచేతఁ గల్ప
మన్వంతరంబు లనేకంబులు గడిచినవి. అవ్వియందఱకుఁ దెలియనివాటను
లెక్కించుటకు శక్యంబుగాని వాటను వాని నానుపూర్విగఁ జెప్పుటకు శక్యము
కాదు. 156

గీ. ఇఁకను గల్పంబనునది ద్రుహిణున కొక్క
పగలగు నదేవిధంబు విభావరియును

గల్పయుగ్మంబు దినమిట్లు • కంజజునకు
నవి సహస్రంబయిన నబ్దమగు నతనికి. 157

గీ. అం దజునిపగలున సృష్టి • యగును రాత్రి
యందుఁ బ్రళయం బొనరు నహ•రంతమందుఁ
బ్రజలు తత్పతులును దేవ • రాక్షసులును
భూతపంచకతన్మాత్ర • ములును బొలియు. 158

గీ. అటులె రాత్ర్యంతమందు సు•రాసురులఁ బ్ర
జాపతులను బ్రజల భూత • సమితి దైవ
తములలో సృష్టిచేయు నెం•తయును ధాత
శంకరుని యాజ్ఞచేత ని•చ్చలును మునులు! 159

వ. ఇట్లు బ్రహ్మయొక్క సంవత్సరంబు లేఁబదియైన నొకపరార్ధంబనియుఁ దక్కిన యేఁబది మఱొకపరార్ధంబనియు ననఁబడును. మొత్తంబీబ్రహ్మ వత్సరంబులు శతంబైన బ్రహ్మయుర్దాయంబు నిండు. అవుడు శంకరుని మాయయందు సకల లోకంబులడిందు. ఇంకను పెద్దకాలంబునకుఁ దారతమ్యప్రకారంబుగ విష్ణు రుద్రేశ్వరుల కాయుర్దాయంబమరు. అటుపైన సదాశివునకు లోఁబడి కాలంబు ప్రవర్తించు సనాదినిధనుండగు సదాశివుండొకండు పునస్సర్గంబు వఱకు నిండారు తమంబునదుమ ప్రకాశమాత్రుండై వెలయు నిద్దికాలతత్త్వస్వరూపం బిట్లు చెప్పితి నీకేమి విననెంతురనిన వాయుదేవునకు మునులు మహాత్మా! పరమేశ్వరుండెట్లు జగంబురచించి క్రీడనొనర్చుచుండునో మొదట నెయ్యది జనించినదో దేనిచే జగమువ్యాప్తంబైనదో పృథుకుక్షియగు నెద్దానజగంబుగ్ర సింపఁబడునో యెఱింగింపుమనిన వాయుభట్టారకుం డిట్లనియె. 160

— * వాయుదేవుఁడు మునులకు సృష్టిప్రకారంబుఁ జెప్పుట * —

క. శాంత్యతీతపదోత్తర•శక్తి శక్తి, మంతుఁడగు శివువలన సం•భవము చెందె
దానమాయ జనించె న•ద్దాన వెడలెఁ బరమ మవ్యక్త మద్దితా•పసతిలకులు. 161

వ. మఱియును

క. శాంత్యతీతపదముచేత • శాంతిపదము, దాన విద్యాపదమ్మ న•ద్దాని చేత
నాప్రతిష్ఠాపదంబును•నలరె దానఁ,దనరెను నివృత్తియను నెడుప•దంబు మునులు!

వ. ఈ పంచకముచే నవ్యక్తకారణంబగు నీవిశ్వంబు వ్యాప్తంబై యాత్మాధిష్ఠి
తంబై యొసంగునీశ నీకలలయొక్క యానులోమ్యంబున సృష్టియును బ్రాతి
లోమ్యంబున సంహృతియును బ్రవర్తించు మఱియునీశ విశ్వకర్తృత్వం బవ్య
క్తంబున కౌపచారికంబుగఁ జెప్పఁబడినదికాని యథార్థంబుకాదు. ప్రధాన
పరమాణ్వాదులెల్ల నచేతనంబులు. 165

క. అట్లచేతనమగుటచే । నాప్రకృతికి, నజ్ఞుడైన కతమ్మున । నాపురుషున
కీ జగత్కర్తృతఘటిల్ల । దిద్దియెట్లు, బుద్ధిమత్కారణములేక । పొసఁగుమునులు!

వ. జగంబు కర్తృసాపేక్షంబును గార్యంబును సావయవంబునగుట నద్దానికి

సీ. సర్వశక్తిసంపన్నుండు । సర్వవేత్త
శక్తుఁడు స్వతంత్రుఁడును మహైశ్వర్యయుతుఁడు
ఆదిమధ్యాంతరహితుండు । నన్యకల్పుఁ
డీశ్వరుఁడు కర్త యదియుఁ దదిచ్ఛఁబొందలు. 166

—* వాయుదేవుఁడు మునులకు లయంబుతీ రెఱింగించుట *—

వ. మఱియు బ్రహ్మయొక్క నూఱుసంవత్సరములకాలముతో నొప్పు బరంబనెడు
పేరుగల బ్రహ్మయుర్దాయ మ్మెపుడు ముగియునో యప్పటివఱకీ పొడమిన
జగంబు వృద్ధిపొందుచు నప్పుడు ప్రలయంబు నొందును. ఈ పరంబునందలి
సగము పరార్థంబని చెప్పఁబడును. పరార్థద్వయకాలాంతంబగు సర్వప్రల
యంబుచేకూరినపుడు 167

గీ. ఆత్మకార్యంబయి తగు న । వ్యక్తమును గ్ర
హించి యాత్మము వెలయఁగా । నెల్లవికృతు
లింకు నుద్రేకముండక్క । యేర్పడుదురు
ప్రకృతిపురుషు లోతప్రోత । భావయుతులు. 168

వ. అపుడు సర్వము మహాకాలుండగు నీశ్వరునియందె లయించు నంత 169

గీ. శాంతవాతైకనీరమై । సమగుణంబు, నైన యవిభాగపుఁ దమోద । యంబునందు
నట్టిజగమును గనుపట్ట । నట్టియప్పు, డేకముగనుండుఁ దానమ్మ । హేశ్వరుండు.

గీ. ఇట్టి మాహేశ్వరియగు నా । గట్టిరజని, నెల్లఁగడపి యుషస్సున । నీశ్వరుండు
పొరిఁబ్రధానపురుషులని । ర్వరను జెంది, మాయతోక్షోభపఱచున । మరుజగములు.

వ. ఇట్లు పరమేశ్వరాజ్ఞచే నవ్యక్తంబునుండి జగత్సృష్టి యేర్పడు నియ్యది సృష్టి ప్రకారం బెఱిఁగించితి నింకేమి వినుదురనిన మునులు దేవా! సృష్టిస్థితి సంహారంబంతయు నీశ్వరవశంబై యున్నట్లును బ్రహ్మవిష్ణులకా మహేశ్వరుండు కారణంబైనట్టు నీ నుడులఁ దెలియఁబడె నింక లోకంబున రుద్రుండు బ్రహ్మపుత్రుండని యొకవచనంబుఁ జెప్పుదు రద్దియెట్లుపపన్నంబగు నీవాదద్వయంబందు సత్యంబేదియో యెఱిఁగింపుమనుడు గంధవాహుండిట్లనియె.

ఉ. మూఁగురు కారణాత్ములు సమున్నతులా పరమేశ్వరాత్మజుల్
యోగధనుల్ విరించిహరిసోములు శాంభవశాసనంబునన్
బాగుగ విశ్వసర్గపరిపాలనసంహృతులన్ బొనర్చుచున్
లోఁగఁగఁజేయ నొండొరుల లోనఁదలంచి కడున్ జవంబునన్ 173

గీ. తండ్రియగు పరమేశు నుదారతపము, చేత మెప్పించి శక్తులఁ జెందిరంత
రుద్రుఁడొక కల్పమందు సరోజభవుని, విష్ణునిన్ సృష్టిచేసె బల్విఁకదనర. 174

గీ. అట్లె వేఱొకకల్పమం దజుఁడు విష్ణు, రుద్రులను సృష్టిచేసెబల్ రుచిరతనుల
మఱొకకల్పమునందు నమ్మాధవుండు, బ్రహ్మరుద్రులసృష్టించెఁ బ్రౌఢమతుల

వ. ఇట్లు బ్రహ్మ విష్ణుని రుద్రుం డజుని ననేకప్రకారంబులఁ బరస్పరజయేచ్ఛులై గల్పగల్పంబులందుఁ బరస్పరము సృష్టిచేయుచుండు రొక్కొక కల్పంబునం దొక్కొక రధికులై యుండుట, ఆయాకల్ప వృత్తాంతంబు ననుసరించి యవ్వారి యాధిక్యంబు మహర్షులచేఁ జెప్పఁబడియె నీ ముప్వురకుఁ బరమేశ్వరుండు కారణుం డాతండే జగత్కారణుండని యెఱుంగుఁడన్న మునులు మహాత్మా! మున్ను శివుండు మృత్యువును సంహరించి మరల నుత్పాదించినట్లు వినియుంటి మదియెట్టు లెఱుంగఁ జెప్పు మనిన వాయుభట్టారకుం డిట్లనియె. 176

## —✱ మార్కండేయచరిత్రము ✱—

ఉ. శ్రీహిమభూధరాంతికముఁ జెందిన పుణ్యవనప్రదేశమం
దా హరిదశ్వతేజుఁడు మహాత్ముఁడునైన మృకండుమౌని త
ద్గేహినియా మరుద్వతిసతీతిలకంబును భూరిశిష్యసం
దోహము గొల్వఁగా నియతితో శివుఁగొల్చుచునుండె నిచ్చలున్. 178

ఉ. కంటికి రెప్పవోలెఁ దనకన్నకుమారులయట్లు శిష్యులన్
దంటయటండు సాఁకుచు సతమ్మును నర్థుల గోకులమ్ములన్

గుఁటువడఁగ నీరు కడుఁ • గూరిమిఁ బ్రోచుచు నెల్లవారికిన్
బంటవలెన్ దనర్చెడు వి•భాసురభూసురరాజమౌళియై. 179

గీ. ఆ మరుద్వితీయను నత్త•మా వలఁచు, బ్రీతిమై సేవఁజేయుచుఁ • బెన్మిటికి స
తమ్ము ప్రియ మొనరించుచుఁ • జమదుశివ్య,జనుఁ దల్లివలెన్ గాంచు • సంబరమున.

ఉ. ఆముని దంపతుల్ సతత • మావనియందు గృహస్థధర్మమున్
బ్రేముడి నిర్వహించుచును • బెంపెసఁగంగ వసించి రేకో!
యామహనీయమూర్తులకు • నక్కట! సంతతి లేకయుండె వా
రేమియుఁ జింతసేయకయె • యీశ్వరుఁగొల్చుచునుండి రిమ్మగన్. 180

—• మృకండుముని బ్రహ్మసభాద్వారంబున నవమానపడుట •—

మ. ఒకనాఁ డమ్ముని బంగరంపుమలయం • దొప్పొందుపైతామహ
ప్రకటారామముఁజేరి బ్రహ్మసభఁజే•రన్ బోవ ద్వారంబునం
దకలంకుండగు నామృకండుని యప•త్యం బడ్డ దౌవారికుల్
రకమా నావిభవంబు లేదని మునీం•ద్రశ్రేష్ఠుఁ డవ్వారితోన్. 181

గీ. అంత వారు మహాత్మ! బ్ర•హ్మసభ కీవు,చేరుట కనర్హుఁడవు సంతు•చెందనట్టి
వారు చేరఁగఁ జాల ర•వ్యైర్థసము స,భాలయంబిఁక మరలిపో•మ్మవలి కిపుడు,

చ. అనవిని మౌనియంత హృద•యంబున నెవ్వగఁజెంది కుంది య
వ్వనమునుబాసి స్వీయమగు • వాసముఁజేరఁగ వచ్చుచుండె నా
దినమున కొంద ఱింటికి వి•దేశమునీంద్రులభార్య లిద్దఱో
గిను లరుదేర నత్తపసి•గేహిని వారలఁ గాంచి ప్రేమమై. 183

గీ. ఎదురుకొనితోడికొనివచ్చి•యింపుమీరఁ,బీఠములనిచ్చికూర్చుండఁ•బెట్టియర్ఘ్య
సత్కృతులనెల్లసలిపిభో•జనముకొఱకుఁ,బంచభక్ష్యాన్నములనుంచెఁ•బాత్రలందు

క. వారలు గని నీబిడ్డలఁ, జేరఁగఁ బిలువు మిట శిశులు • చేరిన మేమున్
వారను భోసేయుద మిట, ధీరమతీ! యనిన నాపె • దిగులుఁగొని యనెన్.

ఉ. నోములు నోఁచలేదు కొఱ • నోములదానను దల్లులార! న
న్నోముఁ డిఁకెట్టులేనియును • నోదనముల్ దగ నారగించుఁడీ!
శ్రీమహితుల్ దయానిధులు • చెల్వగు మీదు సమాగమం బిఁకన్
నామది వేడ్కఁ దీర్చెడు ప్ర•ణామము లివ్వె యొనర్తు నర్మిలిన్. 186

—* మరుద్వతి మునిభార్యలచే నవమానపడుట *—

గీ. అనిన వారంద ఱరసి రా యమునఁ బీట
లవలికిన్ ద్రోసి శిశులు లేనట్టివారి
యన్నములు మేము సాపడ మంచుఁ గదలి
పోయిరి మరుద్వతియుఁ గడుఁ బొగులఁ వగల. 187

ఉ. అంత మృకండుమౌని తన యాశ్రమభూమికిఁ జేరవచ్చుడున్
జింతమెయిన్ మరుద్వతియుఁ జెచ్చెర నాథున కాయుదంత మ
త్యంతముఁదెల్పి చాలఁ బరితాపముఁజెందఁగఁ జూచి మౌనిభా
స్వంతుఁడు స్వీయమౌ పరిభవంబును దెల్పెను భార్య కంతయున్. 188

వ. అంత

సీ. భూరితరదుఃఖభరమునఁ బొగులుచున్న, యాత్మదేవినిఁ గనిహృదయమున మౌని
వరుఁడు కొండొక తేఁకువఁ బడసియిట్టు, లనియె నాకెమనంబెంతొ హరుసమొంద

చ. వనరకు మింక దేవి! భగవానుఁడు రాజకిరీటుఁ డున్నవాఁ
డనితరతుల్యుఁ డాతఁడు దయాళుఁడు భక్తవరప్రదాత య
ఘునునిగుఱించి నేఁ దపము గాటముగా నొనరించి మంచిపు
త్త్రినిఁ బడయంగఁజాలుదు సరోజముఖీ! ముద మొందు మాత్మలో. 190

ఉ. మున్ను శిలాదమౌనిజనముఖ్యున కిచ్చెను సత్కుమారు దీ
వ్యన్నలినాక్షుఁడైన యదుభర్తకుఁ బుత్త్రులనిచ్చెఁ బల్వురన్
బన్నుగ నిచ్చె నందనుని భర్గుఁడు నాకును సందియంబులే
దన్నగజామనోదయితు నాదృతిఁ గొల్వుము చెల్వ! యీవునున్. 191

చ. అనుటయు నాసతీమణియు నాత్మమునందుఁ బ్రమోదమంది యి
ట్లనె మునినాథుతో హరుసమయ్యె మహాత్మక! ధన్యురాల నౌ
దును దమ కిట్టిభావ మది తోఁచిన సర్వసమర్థు లీర లా
యనఘుఁడు శంకరుండు కరుణాలుఁ డొసంగును బుత్త్రిభాగ్యమున్. 192

చ. తడవిఁక నేల? యీక్షణమె తాము మహేశ్వరు మానసంబునన్
బడసి తపంబు సేయుటకుఁ బొల్పడుఁ దేనునుగూడ డెందమం
దొడిసి యుమాకళత్రుని సముజ్ఞతిఁ గొల్చుచునుందు నాథ! యే
ర్పడెడు శుభంబు వేగ నిదె స్పందనమొందెను వామనేత్రమున్. 193

## —* మృకండుముని తపస్సొనరించుట *—

ఆ. అనినఁ దత్క్షణమునఁ దీర్థమాడి మౌని, బూదినిధరించి గణపతిన్ బూజచేసి
యగ్నినిఁ బ్రతిష్ఠచేసి పంచాక్షరీమంత్రాత్మకతపంబు దీక్షఁ దానపుడుఁ జెందె.

గీ. కడఁగి ఫలమూలదళములఁ గ్రమముగను వి
సర్జనముచేసి మారుతాశనమె గొనుచు
రేయుఁ బవలును నేకాగ్రరీతి శంభు
ధారణ నొకంటఁ దవిలి యతండు దనరె. 195

తే. సతి గుణవతియైన మరుద్వతి తన పెనిమిటి నరయుచుఁ దాను సమ్మోదం
యుతునిఁ బశుపతిని మానక, సతము మదిఁ గొలుచుచుండె సముచితభక్తిన్

ఆ. అట్టులాయిరువురు నిద్ధమైనభక్తిఁ, గోమలేందుని సిగయందుఁ గొన్నదొరను
గుఱిచి తపమొనరించుచుండిరి కరంబు, తడవు కాలంబుజరిగె నంతట నొకప్డు

క. నారదమౌనీంద్రుండ, వ్వారలఁ జేరంగవచ్చి వారితపంబున్
గూరిమిఁ గని రజతాద్రికిఁ, జేరి యుమాశివుల కెరఁగి క్షిప్రమిటులనెన్.

చ. కనికరమారయన్ వలదె? గాదిలి భక్తుల సాఁకరాదె? నీ
మనము దయామయం బిటుల మాన్పడనేలొకో! తండ్రి! యింకనై
నను మునియుగ్మమున్ దలఁపు నమ్మికతో నినుఁ గొల్చుచున్నవా
రనిశము లెమ్ము రమ్ము రయ మాదటఁ గావఁగ వారలన్ విభూ! 199

క. మాతల్లి యేనియును దన, జేతంబున నిన రొకింతఁ జెంది నిను వడిఁ
బ్రీతిమెయిఁ బంపకుండిన, దాతురతన్ మునిమిథునము నారసి కావన్. 200

చ. అనినఁ ద్రిలోకమాత దన యాత్మము పుల్లవడంగ నిట్లనెన్
విను ముని! నేఁ బ్రతీక్షణము వేఁడుచునుంటిని నిమ్మహాత్మునం
దనుఁడు జనించునట్లు వరదానము వారికిఁ జేయుమంచు జా
గును బొనరించుచుండె మదిఁ గొంకుచునుంటిని నేను నిట్టులన్. 201

వ. అని యిట్లు నారదమునితోఁ జెప్పి యా యఖిలాండేశ్వరి ప్రాణేశ్వరున కిట్లనియె.

ఉ. పోదము వేగ నవ్వనికిఁ బూనికి నొక్కక్షణంబు నేనిఁ గా
లూదివసింప నిప్పుడె దయోన్నత! లెమ్మిఁక రమ్ము నాదుపై
నాదరముంపు భక్తజనులం దిటు జాలము సేయ వెన్నఁడుఁ
మోదముతో నిఁకన్ బయనమున్ బ్రకటింపుము నంది కిమ్ముగన్. 203

వ. అనుటయు నంత

చ. పరమశివుండు వారల కృపావచనంబుల నాలకించి తాఁ
జిరునగవొంది నేను నదె • చింతయొనర్చుచునుంటి నల్లె వే
గిరముగఁబోద మచ్చటి కొగిర వృషమున్ గయిసేయు నందికే
శ్వర! యవి యానతిచ్చె గరువంబును జెందఁగ నద్రిజాతయున్. 204

గీ. మేలుమేలని కిన్నర • మేళగించి, శంభుకరుణను గానంబు • సల్పి దేవ
మునియథేచ్ఛన్ జనియెనంత• ముగ్ధచంద్ర, ధరుఁడు పార్వతితోఁ సవృత్తిముగ వేగ

—* పార్వతీ పరమేశులు మునిదంపతులకు సాక్షాత్కరించుట *—

వ. నందికేశాదిగణపాలురతోఁగూడ యానంబులెక్కి ప్రయాణంబుచేసి మృకండు
ముని యున్న బిల్వవనంబుఁజేరి యవ్వారిఁదడిసిన వారలును 206

క. కనుఁగొని గౌరీకాంతుని, మనమున ముదమొంది వే నమస్కృతిశతముల్
బొనరించి సంస్తుతులఁ జే, కొకనరిచి నిలువంబడుదు మహోల్లాసమునన్.

చ. శివుఁడును మానిఁజూచి యనె • జిత్తమునన్ దగమెచ్చినాఁడ నీ
దువిమలమైన చిత్తమును • దోరపుభక్తిఁ దపంబు పెంపు నా
యఁవు కడుఁగల్గువారల నయోగ్యులఁ గొడుకుల నిచ్చునట్లు నెం
తువా? పదియాఱు వర్షములతోఁ బరమేగు సుపుత్త్రిఁగోరెదో? 2(8

క. అని యడిగిన విని మానియు, మనమున సంకోచమొంది • మఱిఁగి తఱిఁగి యం
తనె సర్వము శివవశమని, యనఘునిఁ బదియాఱుసముల • యర్భకు గోరెన్.

—* శివుఁడు మృకండునకు వరమిచ్చుట *—

గీ. ఓమని వచించి గణములతో మహేశుఁ, డంత నంతర్ధిఁ జెందె సంయమివతంసుఁ
డపుడు దీక్షాంత మొనరించి యాత్మదయిత, యగుమరుద్వతితో నిట్టులనియెనరసి

క. ఎప్పటి మేలప్పుడె శివుఁ, డెప్పుడుమున్ గలఁడు మనకు • నిందుముఖి! నీ
వప్పటిమాటఁ దలంపకు, మప్పుడున్ దోడుపడెడు • సఖలేశుఁ డొగిన్. 311

వ. ఇఁకను

గీ. పలువురుకుమారకులు కులపాంసనులు జ, నించి దీర్ఘాయ వొందిన మంచిదగునె?
కులము సత్పుత్త్రిఁడొక్కఁడు గలిగెనేని, నెల నభంబట్లు సన్నుతి నెగడుజగతి

వ. అనినంత నా సాధ్వియును

క. కాఁగలదగు సర్వేశుఁడు, బాగే యొనరింపఁగలఁడు • పరిస్తుతమున నెం
తే గరువము మనమొందని, లాగున నిమ్మౌనిక్రిగాఁ దలంచి యిటులనెన్.

వ. అని యిరువురు పూర్వంబట్లకలంకమనస్కులై సుఖంబుగనున్నఁ గొన్నినాళ్ళకు

చ. నెలమసలెన్ మరుద్వతికి • నెట్టనఁ జూచుకముల్ పొరిం బొరిన్
బలుపును నల్పుఁ జెందెఁ గడుఁ • బాండురతన్ జెలువొందెఁ జెక్కులున్
లలితపుదేహయష్టియును • లావుదొరంగె నెసంగెఁ గోర్కులి
ట్టలముగఁ జిట్టుముల్ దగెనడల్ జడనుం గడు నొప్పె నొవ్వగా. ౨౧౫

గీ. పుంసవనమును సీమంతమును మృకండు
మౌని సతి కొనరించి యుమామహేశు
లను మది న్నమ్మియుండె నెలలను దొమ్మి
దియును నిండిన నొక మంచి • దినమునందు. ౨౧౬

—* మృకండు పుత్రోదయము *—

గీ. సౌమ్యమైనట్టి మేలినక్షత్రమందు, జీవుఁడు విశేషముగఁ జూచు • శ్రీకరమగు
లగ్నమందుఁ గుమారునిలాగు నామృకండుసతిగర్భమున బాలకుండు వొడమె.

వ. అంత నమ్మునీంద్రుండు స్నాతుండై.

గీ. సౌరభేయీగణంబుల • సన్మునులకు
దానములఁ బొనరిచి నిజతనయునకును
జాతకర్మ మొనర్చి సత్సుముఖమందు
నాహ్వయంబు మార్కండేయుఁ • డనుచు నిడెను. ౨౧౮

క. నెలబాలునివలె బుడుతఁడు, చెలువుగ దినదినము పెంపుఁ జెందుచుఁ గడుఁ గాం
తులఁ దనరుచుండెఁ దల్లిదండ్రులు బంధుగులునుమదులఁగఁదున్ ముదమొందన్

గీ. పెన్నిధినిఁ బడసిన యట్టి • పేదలట్టు
లామృకండుఁడు తత్సతి • యనవరతము
ముద్దుఁగొమరునిఁ గాంచుచు • హద్దులేని
యరుసమున నోలలాడుదు • రన్ని విడిచి. ౨౨౦

గీ. శివుని వరమును దప్పదు • చిత్తమునకుఁ
దాఁకుచుండినఁ గొంకి యంతటను దిటము

సేయుచుఁగా మానసంబున • శివుఁడె మరల
సాఁకఁగలఁడనుచును ముని • చక్కనుండు. 221

వ. అంత బాలుండు క్రమంబుగ వర్ధిల్లుచు

## —* మార్కండేయుని బాల్యవర్తనము *—

సీ. నడువఁగావచ్చిన • నాఁటనుండియు శివు, దేవళంబుల కేగు • దెంచుచుండు
పలుకఁగావచ్చిన • ప్పటినుండియు "నమశ్శి, వాయ" యంచే ప్రొద్దు • పలుకుచుండు
చదువఁగా వచ్చిన • సమయంబునుండి శై, వప్రబంధములను • బఠనసేయు
వ్రాయఁగావచ్చిన • వరుసనే శివకోటి, మించిన వేడ్క లి • ఖించుచుండు.

గీ. బూది సర్వాంగములనెప్డుఁ • బూయుచుండుఁ
దవిలిరుదురాకలను మెండు • దాల్చుచుండుఁ
బార్థివేశార్చ యేరోజుఁ • బాయకుండు
భూషణంబయి తనరు న • మ్మునిసుతుండు. 222

వ. గర్భాష్టకంబరసి యంత మునిదంపతులు బాలున కుపనయనంబును బాశుపత దీక్షయు నొనర్చి వేదాధ్యయనంబునకై యొజ్జకప్పగించిన.

ఉ. వేదములన్ షడంగముల • వేగ నేర్చి శివాగమంబు ల
త్యాదరమొప్పఁగాఁ జదివి • యారసి దర్శనజాలమంతయున్
మీఁదట శైవతత్త్వమును • మేల్మి నెఱింగి శివుండె సర్వసం
పాదకుఁడంచు లోఁ దెలిసి • పాయక కొల్చుచునుండె శంకరున్. 224

వ. అంత మృకండుదంపతులును,

ఉ. చిన్నతనంబునుండి తమ • చిన్నికుమారుని సత్తపోర్థసం
పన్నుల కెల్లపెద్దలకు • బంధుగులై తగువారి కెంతయున్
మన్ననతోడ జోతల స • మర్పఁగఁ జేయుచు వారిదీవెనల్
చెన్నగునాయువిచ్చు నని • చేతమునందుఁ దలంతు రిచ్చలున్. 225

గీ. అట్లు పదియైదువర్షంబు • లరిగి పదియు, నాఱవశరత్తు ప్రాపింప • నారదర్షి
వారిఁజేరఁగవచ్చి కు • మారుఁగాంచి, యలరివారలతో నిట్టు • లనియె నపుడు.

ఉ. మేలగు నందనుం డిటుల • మీ కుదయించెఁ గులంబు వెల్గఁగాఁ
జాలఁగ సంతసం బొడవె • సద్గుణశాలి యితండు సంతత

శ్రీలెసఁగంగ నివ్వడమి • శ్రీయము లందఁగలందు గాని మీ
రాలముసేయ కొక్కనుడి • నారయఁగావలె మానిదంపతుల్! 227

—* నారదుఁడు మృకండునకు మార్కండేయుని యాయువు చెప్పుట *—

ఉ. చేరఁగవచ్చుచున్నయది • చేటొకఁ డీతనిజాడఁ జూచుచున్
మీ రిఁక సప్రమత్తులయి • మీఱి తదీయవిధం బెఱింగి వి
స్తారపుభక్తి యేర్పడఁగ • దాని హరింపఁగఁ జేయఁబూనుఁ డే
తీరున నేని పుత్త్రునిమృ•తిన్ దొలఁగించుకొనుడు పూన్కిమై. 228

క. అనినంతన వారలు మే, దినిఁ బడి యొడ లెఱుఁగకయె యు•దీర్ణవిషాదం
బున వాపోవుచు నారద, మునియడుగులఁబడిన నతఁడు • భూరితరకృపన్.

ఉ. ఉండఁగనేల? మీరిటులు • కోమలచంద్రధరుండె భక్తులన్
వంచురనీక సాఁకు నదె • వాసిసుమీ! యలశూలపాణి కే
కండరగోళమున్ గొనక • గాదిలిపుత్త్రుఁ దపింపుమంచు ము
న్నుమ్మందుగఁ బంపుఁడంత శుభ•ముల్ సమకూరుఁ దొలంగు నంగదల్ 230

క. అని వేగ నతఁడు చనియెను, మునులును నిట్టూర్పువిడిచి • ముద్దుఁగొమరునిన్
గనిపాయలేక యెంతయు, వనరుచునుండుటయుఁ గాంచి • బాలకుఁడనియెన్.

—* తలిదండ్రులకు మార్కండేయుఁడు ధైర్యము చెప్పుట *—

ఉ. ఏటికి? తల్లి! తండ్రి! యిటు • లేడుచుచుంటిరి తద్విధంబు నా
కేటికి చెప్పరైతి? రిఁక • నేనియుఁ జెప్పుఁ డనుగ్రహించి చే
డ్పాటది యేమొ దానిని దృ•ఢంబుగఁ బాపి సుఖంబుఁ గూర్తు నా
రాటముఁ బాయుఁడీ! మనకు • రాజకిరీటి గలండు తోడుగన్. 232

వ. అనిన నవ్వారలు శివునివరప్రకారంబునంతయుఁ దెలిపి తనకుఁ బంచదశవత్సరంబులు గడచుటయు షోడశవత్సరంబారంభ మగుటయు నేఁడు నారదమునీంద్రుండాపదను సూచించి తత్పరిహారంబునకై తన్నుఁ దపంబున కనుపుమన్నటయుఁ జెప్పిన నతండువిని యిట్లనియె.

ఉ. ఇంతకె గొప్పచేసియిటు • లెంతయునున్ విలపింపఁ జెల్లునే?
యంతయుఁ జక్కనయ్యె విడ•నాడుఁడు దైన్యము మన్యువేగముం
గ్రాంతినిఁ జెందఁ డిప్పె యల • శంకరుఁ గూర్చి తపింపఁ బోయెదం
జింతలఁ దీర్చి యఘ్నుఁడు • సిద్ధినొసంగుఁ బొసంగు సౌఖ్యముల్. 234

—* మార్కండేయుఁడు తల్లిదండ్రుల సెలవొంది తపంబునకేగుట *—

మ. అనుమానం బొకసుంత యేనియును మీ • రాత్మంబులన్ జెందఁగాఁ
బనిలేదమ్మరో! నాయనా! వినుఁడు ది • వ్యంబౌ తపంబొంది నే
ననఘున్ జంద్రకలావతంసుని శివున్ • హర్షింపఁగాఁ జేసి మి
త్తిని భంగంబొనరించి నిశ్చితముగా • దీర్ఘాయువున్ జెందెదన్. 235

చ. తగునొకొ! యంతకుండు ననుఁ • దారసిలంగ మహేశభక్తకో
టి గతు సహించునే యలత • టిద్రుచిరోరుజటాకలాపుఁ డిం
పగునది మీఁదటన్ దెలియ • నయ్యెడు మీకిది చెప్పనేల? యి
మ్ముగ నిఁక నాజ్ఞ నీయుఁడిదె • పోయి శుభంబును జెంది వచ్చెదన్. 236

చ. అనిన మృకండుఁడంత దన • యాత్మము దిట్టమొనర్చి పుత్రకున్
గని యిటు పల్కెఁ తండ్రి! నినుఁ • గన్నఫలంబుఁ గనంగఁ జేయు మా
కనుపమశక్తియుక్తుఁడు మ • హాకరుణామయమూర్తి శంకరుం
డనయము నీకు భద్రముల • నాఁదటనిచ్చుతఁ బోయి రమ్మిఁకన్. 237

వ. అంత మరుద్వతియును

ఉ. కానక కానకిట్లు నినుఁ • గంటిఁ దపస్సొనరించి, యింతలో
మానకపోయె తాపము కు • మార! మనం బురియాడుచుండె నే
నీనగుమోముఁ జూడకెటు • నేర్తు దినంబులఁ బుచ్చనక్కటా!
దీనత దాపరిల్లెనల • దేవుఁడె తీర్పఁగలండు సర్వమున్. 238

చ. హిమకరశేఖరుండు నుమ • యిందిర యల్ల రథాంగహస్తుఁడున్
కమలజుఁడున్ దదీయసతి • కంజహితుండు కువేలబంధుఁడున్
క్షమయును నాకసంబును ది • శల్ సురభివ్రజముల్ గ్రహంబు లిం
పమరఁగ నిన్నుఁ బ్రోచెద ర • హర్నిశలాత్మజ! తోడునీడలై. 239

గీ. ఇట్లు దీవింప వారంత నెలమిఁ జెంది
మునికుమారుఁడు జననికి • జనకునకును
మ్రొక్కులొనర్చి శుభలగ్న • మునఁ బ్రయాణ
మునుబొనర్చి హిమాచలం • బునకుఁ జనియె. 240

సీ. అభ్రగంగాతరంగిణీ • వారివిమల, వారిపరిపూరితమై సిరిఁ • బరఁగునట్టి
బిల్వవనమొందు చేరి సం • ప్రీతి శంభు, లింగసంస్థాపన మొనర్చి • లీలమెసఁగ,

క. శతరుద్రీయ జపంబునఁ, బ్రీతిఁ ద్రిసంధ్యలందుఁ బదునాల్గమాఱుల్
గుతుకమున నర్చనంబున్, యతిమీఱఁగ సల్పుచుండె నతిశయనిష్ఠన్. 242

వ. కందమూలఫలాశనంబుల విడనాడి శ్రీబిల్వదళమాత్రభోజనుండై యాఱు మాసంబులు గడపిన నంత సంయమినీపురంబునందు 243

— * యముడు మార్కండేయునియొద్దకు దూతలను బంపుట * —

శా. కాలుం డుగ్రతరాత్ముఁడై యడరి మార్కండేయు హింసింప నా
భీలాకారుల నాత్మదూతలఁ గడున్ భీమక్రియాధుర్యులన్
వైళంబారసి పంప వారలు మహావష్టంభ మేపారఁగాఁ
బ్రాలేయాద్రితటిన్ వసించు మునిరాడ్బాలున్ వడిన్ జేరుదుర్. 244

గీ. యమునిదూతలఁ గాంచి సంయమికుమారుఁ
డించుక చలింప కాత్మ మహేశునందె
స్థిరముగా నుంచి పూజనం బురువు మీఱ
సల్పుచుండఁగ వారలా చందమెఱిఁగి. 245

ఉ. కోపాలోని కేఁగుటకుఁ గొంకి మునీంద్రజఘోరదివ్యతే
జోవిసరాగ్నులని బడలి చూడఁగఁ జాలక మౌనిపుత్త్రకున్
భీవశులై వడిన్ మరల బిట్టుగ నంతకుఁ జేరఁబోయి య
ప్పావనవృత్తమంతయును భాస్కరికిన్ దెలుపంగ నాతఁడున్. 246

చ. కడుపడి రోషవేగమునఁ గన్నుల నిప్పులురాల వీఁకమై
నడరి చనుండు వీరలు భయాకులు లెంతయుఁ బ్రల్లదంబులన్
బడుగులవోలె నాడుదురు బాలు వధింపఁగ నేన పోయెదన్
కడిఁదిమగం డెవం డొకనుఁ గానఁగవచ్చును గాక యుద్ధమై. 247

చ. అనియనుచుండ నాక్షణమె యంబరభాగము నుండి నారదుం
డనఘుఁడు చేరవచ్చిన దినాత్మజుఁ డమ్మునికిష్టసత్కృతుల్
పొసఁగఁగఁ జేయఁడుర్ మునియుఁ బొంకముగా నవియేవొ ముచ్చటల్
వినిచి మృకండుపుత్త్రకుని వృత్తముఁ గూర్చి వచించెఁ బ్రీతిమై. 248

చ అతఁడను నాలకించి ముని! యమ్మునిబాలుని జీవనంబు ను
ద్ధతిఁ గొని తేరఁ బృథ్వికిఁ బ్రయాణము సేయుచునుంటి నీదు నా

గతిఁగని యింతకాఁగితి నిఁ•కన్ జరుటొవ్వ ననంగమాని యా
ధృతిమెయిఁబల్కె నప్పితృప•తిన్ గని యల్లనఁ జల్లఁగానిటుల్. 249

చ. వినుము దయానిధీ! నీ వఖిల•వేదివి యమ్మునిదంపతుల్ గడున్
ఘనతరపుణ్యవర్తను లొ•కల్మషు లేకసుమాను లర్భకుం
డనఘుఁడు శంభుభక్తుఁడు ద•యాళు వెదఁజల్లుము కొల్లగా నెటో
మనువు మృకండునందను•ి మాన్పుము తత్పరితాప మిమ్మగన్. 250

క. అనుటయు నంతకుఁడది విని, వినుముని! యాయువదినిండ • వేఁగుఁదలఁపక
జనునే యుడుగుమిఁకన్ బో,దునిదే తజ్జీవితంబుఁ • దొలగించుటకై. 251

గీ. అనిన నారదుఁడిట్లనె•నరయవైతి, వకట! నానుడి మునిబాలుఁ•డభవుఁగొలుచు
చున్నవాఁడిఁక నీకసా•ధ్యుండు వానిఁ, జంపలే వీవు కానవు•శమన! యిపుడు

వ. అనినంత యముం డాగ్రహంబున నౌడుగఱచి నారదా! నారద! యేమంటి
వేమంటివి? వినుము వినుము.

మహాస్రగ్ధరావృత్తము:

దిననాథుం డంతయేనిన్ • దికమకపడి ధాత్రీతలం బొందెనేనిన్
కనకక్ష్మాభృత్తునున్ లా•ఘవమమరఁ గడున్ •గంపమున్ జెందెనేనిన్
వనజాక్షుండున్ హరుండున్ • వనరుహభవుఁడున్ • వచ్చి పోరాడిరేనిన్
ఘనశక్తిన్ బట్టి తెత్తున్ • గడసి కడిఁది వీఁ•కన్ మునిప్రాణరాజిన్. 254

క. అని రయమునఁబాశంబులఁ, గొని సైరిభమెక్కి కడిమి•ఘూర్ణిల్లుచు న
మ్మునిసుతునిఁజేరి తద్వ,ర్తనమంతయుఁ గాంచి యనియెఁ•దామసమొదవన్.

— * యముఁడు మార్కండేయుని దర్శించుట * —

చ. చాలును జాలుఁ బూజనము • శర్వుఁడు సంతసమొందె నీకిఁకఁ
గాలము చేరువయ్యె మృతిఁ•గాంచెదు వెల్పలకేగుదెమ్మ నేఁ
గాలుఁడ నీదుప్రాణములఁ • గైకొనఁగా నిటువచ్చితిన్ జుమీ!
మేలుగ నీకు మోక్షమది • మేకొను సందియమొందు లేఁదికన్. 256

మ. అనినన్ బాలకుఁ డంతకున్ గని రవం•తైనన్ భయంబొంద కి
ట్లనియెన్ భానుజ! నే మహేశ్వరుని ని•ప్డర్చించుచున్నాఁడ న

యన ఘుండాఢ్యుఁడు సర్వలోకవిభుఁ డాహ్లాదంబునన్ నన్నుసాఁ
కును నాజీవితమున్ హరింపఁదర మెవ్వఁడో! నీకుఁ బో పొమ్మికన్. 257

వ. అనుటయు నంతకుండును

చ. తెలియదు పిల్లకాయ విటు తెంపుగ నోటికి వచ్చినట్టులన్
బలుకుచునుంటి వోచ్చెముగ బైసికజెల్లదు లేచిరమ్మ వే
ల్పులు నిను సాఁకువారె? కడముట్టఁగ జేయుదు నిప్డె కన్మ నా
యలవును బాళపుంబలిమి నర్భక! నిర్భయనూత్న లింకఁగన్. 258

క. శివుఁడు గివుఁ డడ్డమే? యాయువు చెల్లినవెన్క నీకను యోగ్యుఁడవని యి
ట్లవబోధము నొనరించితి, నవునిది కాదని యెఱుంగ వశటా తగునే? 259

—* మార్కండేయుఁడు యముని నిరసించి పలుకుట *—

వ. అనిన మార్కండేయుం డిట్లనియె.

ఉ. ఏటికిటుల్ ప్రగల్భముల నెంతయు గర్వము మీఱినాఁడఁగా
మేటితనంబె? శంకరుఁడు మిన్నగఁ గన్పడఁడయ్యెనే? యికన్
మాటలు వేయునేల? నను మన్పఁగలండు శివుండు నీవికన్
మోటుతనంబు పాల్పడక ముందటిపాటుఁ దలంచుకొమ్మదన్. 260

గీ. మంచిసెబ్బర లరయక మందమతులు, ముక్కునూటిగఁజని కర్మములఁబొనర్చి
ముప్పుఁజెందుదురిందు మో మోటపడక, చెప్పుచుంటిని దలపోయు చిత్తమందు

చ. అనినఁ గడుఁగ్గడున్ గినుక నంది మహాద్భుతదారుణధ్వనిన్
బొనరిచి చూడు చూడు మిదె పొంకమణంగు నురుంగుఁ బ్రాణముల్
మునిసుత! యంచు దేహళికి ముందటనుండి కరాళపాశమున్
గొని శిశుకంధరన్ వయిచి కొంకక లాగఁదొడంగె నత్తఱిన్. 263

వ. అంత మార్కండేయుఁ డంతకుని చెయ్వోఁతింగి తనకు శంకరుండే శరణంబని కడంగి శివలింగంబు నాలింగనంబు నొనర్చికొని స్థిరమతి నిట్లు శివుని వాఙ్మయోపాస్తిఁ జేయుచుండె. 264

—* మార్కండేయకృత శివస్తోత్రము *—

సీ. బంగారుమలవిలుఁ బరఁగఁ బట్టెడువాని, వెండికొండను నెలం బుండువానిఁ
బావరానారితోఁ బరిఢవిల్లెడువాని, వెన్నుండు తూపుగా వెలయువానిఁ

గడు వేగఁ ద్రిపురముల్ • గాల్చిమీఱినవాని, జేజేలజోతలఁ • జెందువాని
వేల్పుచెట్టులవిరుల్ • వెలయు నడ్గులవానిఁ, గామునిఁ గాల్చిన యగ్గికంటివాని

గీ. బూదిఁబూసిన మెయివానిఁ • బొలియనట్టి
వాని దోసంబులను నెడఁ • బాపు వాని
నెన్నుచర్మంబుఁ బైఁగప్పి • యెసఁగు వానిఁ
గొలుతు నెలతలదొర మిత్తి • గెలుతు నిపుడు

సీ. నల్లవెన్నెలయర్చ్చనఁదగు నడ్గులవాని, చదలేటిసిరొందు • జడలవానిఁ
జలువరాపోగులఁ • జెలఁగు వీనులవాని, గిత్తకిలాతంబు • సొత్తువాని
నారదాదుల నుతుల్ • నయముగ వినువాని, నెల్లజగంబుల • నేలువాని
అంధకుండను మేటి • యసుర గూల్చినవానిఁ, జేరుభక్తుల వేల్పు • చెట్టువానిఁ

గీ, జక్కులొడయని చెలిమి నెనంగువాని, భగునికను లూడబెఱికిన • బలియుఁడైన
వానిఁ బాములసొమ్ముల • వాని నెలమిఁ, గొలుతు నెలతలదొర • మిత్తి గెలుతు నిపుడు

సీ, విసము మెక్కుట నల్పు • వెలయు కుత్తుకవాని, గొడ్డలి లేడిఁ గైఁ • కొనెడువాని
భవరుజలిక్కట్లు • పాపఁగాఁ దగువానిఁ, ద్రిగుణాత్ముఁడై తేజ • రిల్లువానిఁ
గడగి దక్షసవంబు • నడఁగఁ ద్రొక్కినవాని, మూడుకన్నులుగల్గి • మురియువాని
శోనంబుముత్తినిఁ • బొసఁగ నిచ్చెడువానిఁ, జెలఁగి దోసముల భం • జించువాని

గీ. భక్తులందునఁ బ్రేముడిఁ • బరగువాని, క్షయములేనట్టివానిఁ బ • చ్చనివలువలఁ
గట్టువానినిఁ గొలతలే • నట్టివానిఁ, గొలుతు నెలతలదొర మిత్తి • గెలుతు నిపుడు

గీ. పొలియఁ జేయుచునున్నను • భువనములను
మరల జనియింపఁగాఁ జేసి • మనుచువానిఁ
బ్రమథగణములచేఁ గొల్వఁ • బడెడువానిఁ
గొలుతు నెలతలదొర మిత్తి • గెలుతు నిపుడు.

గీ. అవని నీళులు నగ్గి గా • డ్పాకసంబు
చదలు మానికమును నీక • జలువలదొర
యాజి యనుతనువులఁ జెంది • యమరువానిఁ
గొలుతు నెలతలదొర మిత్తి • గెలుతు నిపుడు. 268

క, కొండలయొడయనికూఁతును, గొండగు తమిసాము మేనఁ • గొన్నట్టిదొరన్
నిండారు నెనరుకడలిని, నిండగుబత్తిన్ గొలుతును • నిరసింతు జమున్.

క. అవిరతము రుద్రుఁ బశుపతిఁ, గవిసన్నుతు స్థాణు నీలకంఠు నపర్ణా
ధవుఁ గాలానలమూర్తిన్, శివుఁ గొలిచెదఁ గాలుఁ డేమి సేయఁగలఁడిఁకన్. 270

క. కాలగళుఁ గాలమూర్తిన్, గాలనియామకునిఁ గాలకాలు ననంతున్
శూలాయుధధరుని మహా, వ్యాళధరున్ గొలుతు గెలుతు నంతకమూర్తిన్.

క. అవ్యయుని శాంతు యోగిజ, నవ్యక్తుని నక్షసరక నఘనకరునిన్
దివ్యజనేశ్వరుఁ బరమున్, భవ్యాత్మున్ గొలుతు గెల్తు వైవస్వతునిన్. 272

క. ఆనందమయుని నిత్యుని, గోనాథధ్వజుని హరునిఁ గువలయహితరే
ఖానద్ధపాటలజటున్, దీనశరణుఁ గొలుతుఁ బితృపతిన్ గికురింతున్. 273

క. భస్మోద్ధూళితవిగ్రహు, నస్మితముఖు మోక్షదానచణు సర్వేశున్
విస్మయకరవైభవు నా, కస్మికకారుణ్యుఁ గొలుతుఁ గాలుని గెలుతున్. 274

క. శివ! శంకర! యీశ! సదా, శివ! శర్వ! మహేశ! శ్రీశసేవితచరణా!
భవ! కల్పాయువు నాకి, మ్మవిరళకృపఁ దెవులులేని యట్టులు చక్కన్. 275

వ. అని యిట్లు చిఱుతతపసి మదిన్ గట్టిచేసి గట్టువిలుతుదొర నర్థించుచుండు నంతలో

గీ. నారదుం డట్లు యముని సన్నాదరించి
మునిసుతుని రక్షయందుఁ బూన్కిని వహించి
వేగమున నాకసంబున వెడలి యల్ల
రజతశైలంబుఁ జేరి బల్ రాణగదుర. 277

—* నారదుఁడు మార్కండేయుని రక్షింపుమని పార్వతీశివుల నర్థించుట *—

శంకరప్రియ వృత్తము
కావఁగరావే గణపతిలోలా!, ప్రోవఁగలేవే మునిజనపాలా!
ఈవె శరణ్యం బిదిగనుమాత్మన్, బావనమూర్తీ! పరమసుకీర్తీ!

మ. అని గానం బొనరించుచున్ గిరిసుతాప్రాణేశ్వరున్ దేవదే
వునిఁ జేరంజని మ్రొక్కి మౌనినుతువిస్ఫూర్జత్తపోరీతిఁద
జ్జననీగుర్వనపాయదుఃఖగతినిన్ జండాత్మతన్ మిత్తి పై
కొని వేగంబునవచ్చు నుద్ధతిని సంకోచంబులే కెంతయున్. 279

సీ. నాఁడివి రక్షింపుమనుచు నాయకుఁ డుపతిధరు, దేవియగు జగదంబను దేవురింప
శివయురయ మునబాలురక్షింపుమనుచు, విభుని నెంతయు బ్రతిమాలి వేడహరుఁడు

చ. మునితనుజన్ముఁ గంఠమున • మ్రొక్కలుఁడై యముఁ డేసినట్టి య
ఘునమగు కాలపాశమది • కంఠగతంబయి కానుపట్ట నం
తనె పెనుద్రోఁత బిట్టడర • దారుణరోషపరీతచిత్తుఁడై
యనువుగ లింగమధ్యమున • నద్భుతరీతిగఁ దోఁచి యుద్ధతిన్. 281

* శివుఁడు త్రిశూలధారచే యమునిఁ గూల్చి మార్కండేయున కభయ మిచ్చుట *

చ. కరతలశూలధార యము • కంఠముఁ గ్రుచ్చ నతండు శోణితం
బురవుగఁ గ్రక్కుచున్ దొలఁగి • యుర్వి నమాంతము గూలినంత నా
దరమున బాలు నెత్తి పయిఁ • దాఁ జెయి నుంచి కుమార! యావిఁకన్
వెఱపును మాని యిష్టములు • వేడుము వాడముగా నొసంగెదన్. 282

సీ. అనిన మునిపుత్త్రుఁడు భవుని • యడుగులందు
వ్రాలి యిక్కాలుఁ బ్రదికింపు • రాజమకుట!
యెట్లులైనను నాకోస • మీతఁ డిట్టు
లయ్యె నందఱకును శుభం • బగుత సతము. 283

— * శివుఁడు మార్కండేయు ప్రార్థనచే యముని జీవింపఁజేయుట * —

వ. అనిన నమృతాంశుమౌళి యంతకున్ మరల జీవింపఁజేసి యాతని కిట్లనియె.

చ. ఎఱుఁగవె? నాదుభక్తుల మహిన్ ఘనశక్తులఁ బుణ్యయుక్తులన్
మఱచితివే? నను బలసి • మానసమందు నిఁకేని యెప్డిటుల్
గరువముఁ జెంది నాయలరు • గాదిలిభక్తులపైనఁ జేయిడన్
దొరకొన కిట్టి బెట్టిదవుఁ • దుందుడుకుల్ పొనరింపఁ బోకుమీ! 284

వ. అనిన నంతకుండు నుదుట నంజలిన్ గదియించి మ్రొక్కి యిట్లనియె.

గీ. దేవరయె పదియాఱేడు • లీ వటునకు, నాయువంచు వచించుట • యరసి యేను
పాశమును వేసితిని ముని • బాలునిపయిఁ, దలఁపునకు రాదు నాకు నా • తప్పిదంబు.

వ. అనిన శివుఁడు మందహాసంబు చేసి యిట్లనియె.

గీ. ఎప్పటికిఁ బదియాఱేండ్ల • యెలవయసున్న, తోడ నొప్పెడు నాయువుఁ • బాడిమీఱ
నిచ్చితిని దాని నిప్డు నీ • వెఱుఁగ కిట్టు, లాఱడికి నొడిగట్టితి • వైనఁ జనుము.

వ. అనుచుండ నారదోద్బోధితులై మృకండుమునియును మరుద్వతియును కుమా
రుని జాడ లరయుచు నచ్చటికి వచ్చి యవ్విధమంతయున్ గాంచి యఖిలేశ్వరుని.

దయామయత్వంబుఁ బెక్కుభంగులఁ బ్రశంసించుచుండిరి. నారదుండును నచ్చటికి వచ్చి మహేశ్వరునకు మ్రొక్కి యమునిఁ గుశలం బడిగిన నంతమీఁద యముండు విన్నఁబోయి శివుని సెలవొంది నిజపురంబునకుఁ జనియె. శివుండును శివయును మార్కండేయునిఁ జూచి యిట్లనిరి. 289

## పార్వతీపరమేశ్వరులు మార్కండేయునకు బ్రహ్మకల్పాంతాయువు నిచ్చుట

గీ. ఎప్పు డజకల్పమగునో యిఁ కెప్డు గడలి
జలజనయనుండు వటపత్రశాయి యగునో
అంతవఱ కీవు పుడమిపై నధివసింపు
కరము చిరజీవియగుచు మృకండుతనయ! 290

వ. మఱియు నీవొనరించిన స్తవరాజం బెవ్వరేని యస్మదీయలింగసన్నిధిఁ జేరి పఠించిరేని యవ్వారలు మృత్యుభయంబుఁ జెందరని వరంబిచ్చి మృకండు మునినిఁ జూచి మునీంద్రా! వరంబు లింకేమేనిఁ గోరుదువేని నిచ్చెద ననిన నతం డిట్లనియె. 291

గీ. ఇంతకన్న వరంబు నాకేమివలయు, దేవ! తీర్చితివయ్య! నా దీనదశను
దయకుఁ బాత్రునిఁ జేసి నన్ దనిపినావు, వరద! యేమనికొనియాడ వలఁతినగుదు

వ. అని యమ్మునిదంపతులు మార్కండేయుండును మహేశ్వరులకు మ్రొక్కిన యంత మహేశ్వరు లంతర్ధానంబు నొందిరి. నారదుండును శివుని గానంబు సల్పుచు యథేచ్ఛఁ జనియె. మృకండుదంపతులు గొమరునిఁ దోడ్కొని స్వాశ్రమంబున కరిగి సుఖంబుండిరి. 293

క. ఈచరితం బెవ్వఁడుగా,నీ చదివిన విన్న మిత్తి నెట్టి చిరాయు
శ్శ్రీచెలువుమీఱ సౌఖ్యము, లాచంద్రకిరీటుదయను నందుదురు భువిన్.

వ. ఇట్లు శివుండు మిత్తిన్ భంజించి మరల సంజీవితున్ జేసె ననిన వాయుభట్టారకునకు మునులు దేవా! మున్నుపమన్యుమునీంద్రుండు శ్రీకృష్ణునకు శైవదీక్ష యొసంగిన పిదప శివతత్త్వరహస్యం బఖిలంబును దెల్పెనని విందు మా యనఘుండు గోవిందున కెద్ది తెల్పెనో యద్ది బోధింపుమనిన ననిలుం డిట్లనియె. శివదీక్షఁ జెందిన శ్రీకృష్ణుం డుపమన్యుంజేరి యిట్లర్థించె. 295

క. దేవా! వినఁదలఁతు మహా, దేవోక్తము వేదసారదీపిత మాత్మ
శ్రీవిజ్ఞానము నిజభ,క్తావళికి ముక్తిజనక మగు నద్దానిన్. 296

గీ. భక్తిలేనట్టివారి క ప్రాజ్ఞులకును, గోచరముగాని దేంతయు గూఢమైన
దాశ్రుతిదడంగములనుసాం ఖ్యమునుద్ధృ, తంబయినదాని దెల్పుము తాపసేంద్ర

— * ఉపమన్యుముని శ్రీకృష్ణునకుఁ దెల్పిన ఆత్మజ్ఞానము * —

క. అనుడు నుపమన్యుఁడిట్లనె, వినుమీకఁ దెల్పెదను సర్వ దేవోత్తము శ
ర్వునిచేఁ బరిభాషితమును, ఘనము ననాయాసమోక్ష కారణము హరీ! 298

మ. మును నవ్యక్తమునుండి శర్వుఁడు జగమ్ముల్ సృష్టిచేయంగ నీ
హను మున్ముందుగ దేవపూర్వు నల బ్రహ్మన్ బ్రీతిఁ బుట్టించె న
ఘునుఁడున్ దండ్రిని సర్వకారణునిఁ దాఁ గాంచెన్ మహాదేవు నం
తనె రుద్రుండు సృజింపు విశ్వమని వేదంబుల్ సమర్పింపుడున్. 299

గీ. అతఁడు జగముసృజించి వర్ణాశ్రమవ్య, వస్థ వేత్వేఱు చేసె స వంబుగొలుసు
సోము వెడలించె నాతని చొప్పునన్ధ, రాగ్ని రవి సుర రాద్యజ్ఞ హారులమరిరి. 300

క. వారందఱు వేగంబుగ, శ్రీరుద్రాధ్యాయగీతి శివుని నుతింపన్
భూరికరుణాలుఁడై య, వ్వారలముందఱను దోఁచె వైభవములరన్. 301

గీ. అంత లీలార్థమై యమ్మ హాత్ముఁడవ్వ, వారిజ్ఞానంబును హరింప వారలపుడు
నీవెవండవనుచు మోహ నిష్ఠితులయి, యడుగ సురలకు రుద్రుఁడిట్లనియె వేగ.

గీ. నేనొకండనె పూర్వుండ నెనె తొలుత, నుండియుండితి నిప్పుడు నుంటి నుండఁ
గలను నాకంటె నన్యుఁడొక్కండు లేఁడు, నేనె నడిపెద జగముల నెమ్మిఁ గనుచు

ఆ. ఇట్లు చెప్పి రుద్రుఁ డెలమినంతర్థినిఁ, జెందె నంత సురలు చేవదక్కి
పరమశివునిఁ గనక భక్తితోడ నథర్వ, శిరసుతోడ నుతులు చేసిరంత. 304

క. వారల ననుగ్రహింప ను, మారమణుఁడు దేవితోడ మర్త్యుల యెదుటన్
భూరికరుణాహృదయుఁడై, చేరఁగ నవ్వారుగాంచి చెలఁగి ప్రణతులై. 305

గీ. పరమశక్తి యెడమప్రక్క భాసిలంగ, సిద్ధులా పాశుపతు లోలి సేవసల్ప
యోగులకు నెదఁ గన్పడుచుండువాని, శివునిఁ జూచి నుతుల్ పెక్కు చేసిరంత.

వ. పరమేశ్వరుండును గృపచే నవ్వారిన్ గాంచి సంతుష్టుండనైతి ననుడు దివ్య
జను లాదరంబున నిట్లడిగిరి. 307

గీ. దేవ! నీకపచితి యెట్లు దీర్చవలయు, నెవనికర్చయుం దధికార మేర్పడునొ య
థార్థమంతయు మాకిప్పు డానతిమ్మ, నుడు శివుండల్పహాసంబు నుంబొనర్చి.

—* శివుఁడు దేవతలకు సూర్యాత్మక విజతనువుఁ జూపుట *—

క. దేవినిఁ గని యంత మహా, దేవుఁడు సూర్యాత్మకంబు • దివ్యతనువు స
ద్భావంబునఁ జూపుటయున్, దేవతలంతయును జూచి • తేఁకువ మెఱియన్.

గీ. ఘోరమునుసకలాశ్చర్య•గుణయుతము ను,సర్వతేజోమయంబును•శక్తియుతము
అష్టభుజము చతుర్వక్త్ర•మద్భుతము ను,నర్ధనారీకమునుగాంచి•హరుసమొందె.

క. తెలిసి దివాకరుశివునిఁ, గలుషహరాభైన దేవిఁ • గనుఁగొని భువనం
బులు తన్మయములుగాఁగని సలిలము నర్ఘ్యమునుబట్టి • సల్పి రిటు నుతుల్.

క. సింధూరవర్ణునకు సం,క్రందనగోవిందధాతృ•కారణునకునున్
సుందరసుమండలున కర, విందధరున కబ్జనేత్ర•విలసితునకునున్. 812

క. కనకమణిభూషణునకును, ఘనరవిరూపునకు నాది•కారణునకు వి
ష్ణునకును బ్రహ్మకునున్ రు, దునిన కార్యాసహితునకు సు•తులివె శివునకున్.

గీ. రత్నపూర్ణాంబు సనువర్ణ•రసము సకుశ
సుమమును సుకుంకు మాధ్యంబు • సుప్రశస్త
మును సహేమపాత్రింబును • మోదమెసఁగఁ
గొను మెసంగెద మర్ఘ్యమున్ • గోకలాంగ! 814

వ. అని ప్రార్థించి పరమపురుషున కర్ఘ్యంబు లొసఁగిరి.

గీ. ఇట్టి లినమండలంబున•సింపుమీఱ, శివుని నవధానమునఁ బూజ•చేసి యెవ్వఁ
డర్ఘ్యమిచ్చునో కాలత్ర•యంబునందు,వాని కిలదుర్లభము లేదు•పడయుముక్తి

వ. మఱియును

క. ఈస్తుతి నెవ్వండేనిఁ బ్రశ, స్తమతిన్ జపముసేయు • జదువుచునుండున్
నిస్తులవిభవములొందును, స్వస్తిన్ జేకొను నతండు • సత్యమిదియగున్. 816

— * తిరోహితశాస్త్రప్రతిష్ఠ *—

వ. అంత మండలాంతర్గతుండగు హరుండు సర్వాగమోత్తరంబగు శాస్త్రంబు
నొసఁగిన నందుఁ బూజాధికారంబు ద్విజాతుల కని యెఱింగి మహే
శ్వరుని సెలవొంది బృందారకు లందఱు యథాగతంబుగఁ జనిరంతఁ బెద్దకాలం
బున శాశాస్త్రంబు తిరోధానంబగుడు నొకప్పుడు మహేశ్వరిచే సంబోధితుండై

శివుండు మరల సర్వాగమోత్తరంబగు శాస్త్రంబు ననువదించె, నద్దిబ్రహ్మను మఱి నాచే నగస్త్యునిచే దధీచి మున్నగువారిచే స్వయంబుగ శివావతారంబులచేతను లోకంబునం బ్రవర్తితంబయ్యెననుడుఁ గృష్ణుఁడు మహాత్మా! యీశను జగత్కారకునిఁగూర్చి బోధింపుమనిన నుపమన్యుండిట్లనియె. మున్నొక మాఱు ముముక్షులగు మునులు గొందఱు బ్రహ్మవాదులై సంశయావిష్ట మనంబులతో నిట్లు విమర్శించిరి.

— * ఉపమన్యుఁడు కృష్ణునకు జగత్కారకునిగూర్చి చెప్పుట * —

సీ. ఎద్ది కారణమగుబ్రహ్మ • మేమువలన, బుట్టినారమిఁ కెద్దానఁ • బోషితులము
ఎందునున్నారమిట్టుల • నీసుఖ తది,తరములంను వర్తింతుము • తవిలిసతము,

గీ. కాలమొ స్వభావమొక్కొ య • క్కడిఁదినియతి
యో యదృచ్ఛయో భూతంబు • లో బ్రకృతియొ
పురుషుఁడో వీనిసంయోగ • మో యరయఁగఁ
గారణము లౌన జడము లె • క్కడనుగాని. 319

క. పూరుషుఁడుసుఖదుఃఖయుతుఁ, గారణమగునొక్కొ • విభుఁడు • గానియతఁడిటుల్
సారెకుఁ బరస్పరంబు వి,చారణ యొనరించి ధ్యాన • సంగతినంతన్. 320

సీ. అపుడు చూచిరి మునులు దే • వాత్మశక్తి, నీశ్వరినిఁ ద్రిగుణంబుల • నెంతయుఁ గు
గూఢమగుదానిఁ బాశంబుఁ • గుశలగతినిఁ, ద్రెంచుదాని వివేకంబుఁ • బెంచుదాని

గీ. ఆపెచే భిన్నపాశులై • యచ్ఛదృష్టి, సర్వకారణకారణు • శక్తిమంతు
నమ్మహాదేవుఁ బొడఁగని • రప్రమేయు, నేకతేజమై యెల్లెడ • నెసఁగువాని. 322

వ. అద్దేవుని ప్రసాదయోగంబునఁ బరమంబగు యోగంబునను దృఢంబగు భక్తియోగంబునను దివ్యపదంబు నొందిరందున. 323

గీ. అట్టి చిచ్ఛక్తితోఁ గూడ • నమ్మహేశు
నెవఁడెఱిఁగి హృదయంబున • నెన్నఁ జూచు
అట్టి వానికి శాశ్వత • మైన శాంతి
యమరుఁ బెఱకెవ్వ డమర ద • ట్లరయ మొదను. 324

గీ. విప్రయోగంబు శక్తితో • వెలయ దేవుడు
మశక్తింతుండు శివునకే • చందమునను

ఈ ద్వయంబు ప్రసాదంబు • నెలమిఁ జెంది
కరతలస్థితముగ ముక్తిఁ • గాంచు జనుఁడు. 325

ఉ. శివుఁడెటు సర్వకర్తయయి • చెన్నసలారునొ విశ్వకోటికా
శివయును సర్వకర్త్రియయి • చెన్నలరారు నటుల్ సతంబికిఁ
కవకు వియుక్తియుండదు వి•కర్తనమూర్తికి దీప్తికిన్ వలెన్
గువలయనాథ కౌముదుల•కున్ వలెనారయ మబ్జలోచనా! 326

గీ. శివుఁడు లేకయె శక్తి రా•జిల్లదెపుడు, శక్తిలేకయె శివుఁడట్లు•చెల్వమరడు
శక్తిశక్తిమంతులకిట్లు•సంతతము వ,రస్పరాపేక్షలోనుండు•రాణవెలయ. 327

క. శివతో శక్తుండయి తా,శివుఁడు జనంబులకు నెప్డు•సేయు సకలవై
భవములఁ గైవల్యంబును, శివ చిన్మయి యాద్యశక్తి•శివునకు శౌరీ! 328

చ. అనవుడుఁ గృష్ణుఁడిట్లనె ష•డాననసన్నిభ! జ్ఞానమూర్తి! నీ
వనయము శిష్యపాళహర•ణాఢ్యుఁడ వీశ్వరతత్త్వయోగచిం
తనుఁడవు నీముఖాబ్జశివ•తత్త్వసుధారసధార లాని తృ
ప్తినిఁ గొనజాలకుంటి నిటు • దెల్పుము శార్వవిభూతి నింకనున్. 329

గీ. మును జగన్మాతశర్వాంక•మునవసించి, లోకనిశ్రేయసంబెంచి•లోకగురుని
శివుని నేమిప్రశ్నించెనో•శివకునాథుఁ,డేమి తెల్పెనో యెఱిగింపు•మివుడుదయను.

వ. అనిన నుపమన్యుం డిట్లనియె.

— * ఉపమన్యుఁడు కృష్ణునకు ముఖ్యాంశంబును జెప్పుట * —

చ. విను యదువంశమౌక్తికమ! • విశ్వగురుండు హరుండు మందరా
ద్రిని నొక చారుకందరస•రిత్తటదివ్యవనస్థలిన్ జగ
జ్జననియుఁ దా విహారమును • సల్పుచు నెచ్చెలి దెచ్చినట్టి నూ
తనవికచప్రసూనదళ•దామములన్ గయిసేయఁగా నుమన్. 331

గీ. తనదుతొడ నెక్కఁజేసి ని•తాంతకౌతు,కమున కీల్జడఁగైసేసి • కడిఁదిహర్ష
మొప్పనున్నతటిన్ దేవి•యొప్పమీఱ, విభునిలోకోపకృతి కిటుల్•వేగనడిగె.

గీ. దేనిచే వశమయ్యెదు•దేవదేవ!, అల్పశక్తులు నకృతాత్మ•లైన యట్టి
మానవులకీవువచియింపు•మా!కరంబు, నాదుచిత్తంబుపొంగనా•నందముననుఁ.

వ. అనియడిగిన మహేశ్వరికి మహేశ్వరుండాదరంబున నిట్లనియె

గీ. కాన వశ్యుఁడ నెపుడు నకర్మమునను, జపమునఁ దపమునను విజ్ఞానమునను
నన్యమున దేనిచేనిఁ గానవధరింపు, భక్తిచేతను వశమగుదు భక్తతతికి. ౪౩౬

గీ. భక్తి యెక్కుడుగ లిగినఁ బణఁతి! మాని, సుంకు వశమగుదు బ్రేమతోఁ జూడఁబడుదు
మాటలాడుదు ముట్టుదు మఱియు నెంత, యేని బ్రియమొనరింపుదు నిగురుఁబోఁడి!

కం. దానఁ బడయఁగ వలయు నన్యూనంబగు భక్తి భువి ననుం గోరెడు న
మ్మానవులు వర్ణయుక్తులు, మానిని! ధర్మాభివృద్ధి మనుమరుదీనన్. ౪౩౮

గీ. భామ! వర్ణాశ్రమాచారపరులకే యొసంగు నచ్చంపు భక్తి పొసంగ దన్య
జనులకిది మామకాజ్ఞచే వనజభవుఁడు, వారలకుఁ గూర్చుచుండును వైభవముగ

వ. మఱియు వర్ణాశ్రమధర్మంబుగూడ నాచే నుత్పాదింపఁబడి చతుర్ముఖునిచేఁ బ్రవర్తింపఁ జేయఁబడిన దౌట నన్నుఁ గోరువారెల్ల నియతితో వర్ణాశ్రమధర్మంబు ననుష్ఠింపవలయును. అట్టి వర్ణధర్మానుష్ఠాతలకే మదీయభక్తిజ్ఞానంబులం దధికారం బన్యులకు లేదు.

ఆ. అందుఁ జేసి మామకాజ్ఞానువర్తులై, వర్ణధర్మనిరతి వాసిమీఱ
భక్తిఁ జెంది పాపపాశంబులను బాసి, నన్నుఁ జేరవలయు నలిననేత్ర! ౪౪౦

వ. అనియిట్లు చెప్పినంత నమ్మహేశ్వరి సంతుష్టయై భక్తిభావంబునఁ బరమేశ్వరు నుపాసించె ననిన శ్రీకృష్ణుం డాముష్మికఫలదాయకంబగు శివపూజాక్రమంబు నుపదేశింపుమనుడు నుపమన్యుం డిట్లనియె.

—* ఉపమన్యుఁడు శ్రీకృష్ణునకు శివపూజాక్రమంబును జెప్పుట *—

సీ. విను ముంజకేశ! విశ్వేశపూజాక్రమం, బాముష్మికఫలంబు నంతనిపుడు
దీనిఁబోలెడు నద్ది త్రిభువనంబుల లేదు, పుణ్యాతిశయయుక్త భూరిగరిమ
అజహరిరుద్రులు హరిహయుండాదియౌ, దిక్పతుల్ భాస్కరాదిగ్రహములు
అలవశిష్ఠాది మహర్షివరేణ్యులు, నంది మహాకాలనాథ ముఖ్య ౪౪౧

గీ. గణములు రసాతలాదిలోకములనొప్పు, తక్షకానంత ముఖ్యులౌ దందశూక
రాజులీ యర్చనంబును రాణగదుర, సలిపి వడసిరి తత్పదంబులను సతము.

వ. కావున నట్టి యర్చనాప్రకారం బుపదేశించెద సావధానంబుగ వినుము.

గీ. తెల్లనౌ మంచిగంధంబు తీర్థమునను, శంభులింగంబునకు శివన్ స్నానమాడ
జేసి యవదాతవికచకుశేశయములఁ, బూజ యొనరించి భక్తి మై మ్రొక్కవలయు.

వ. ఇఁక ధనవంతుఁడగు నేని

గీ. రత్నములచేతఁగాని స్వర్ణమునఁగాని, పద్మపీఠంబుఁ దీరిచి పరగ కేస
రముల మధ్యమునందు లింగమును గంధ,లిప్తమంగుష్ఠనిభము లలిఁగ ఘటించి.

వ. లింగంబుయొక్క వామభాగంబునందుఁ బరాంబికను సంయోజించి బిల్వపత్రంబుల గౌరీశంకరుల నర్చించి

గీ. అగరు దక్షిణపార్శ్వంబునందు నునిచి, మణిశిలన్ బశ్చిమమున నమర్చి యుత్త
రమునఁ జందనమొసఁగి పూర్వదిశయందు,నిఁబుగా హరిదళమర్పణంబు చేసి.

క. సురభికుసుమంబులను రుచిరబిల్వదళంబులను విచిత్రసుమములన్
హరువుగఁ బూజించి ఘృతా, గరుగుగ్గులు ధూపమును దగ నొసఁగి యంతన్.

వ. అతిసూక్ష్మంబులు ధవళంబులగు వస్త్రంబుల సమర్పించి సర్పిర్దీపంబుల వెలిగించి ఘృతమిశ్రితంబగు పాయసంబును నివేదించి ప్రదక్షిణనమస్కారస్తవంబు లొనర్చి క్షమాపణంబు నర్థింపవలయు ననంతర ముపాసకుఁడు దక్షిణామూర్తి నాశ్రయించి సర్వోపహారసమ్మిశ్రితంబగు నైవేద్యంబును శివమంత్రంబులతో శివునకు సమర్పింపవలయు నిట్లు పంచగంధమయంబును శుభంబును నగు లింగంబు నెవ్వఁడు నిత్యం బర్చించునో యట్టివాఁడు సర్వాఘముక్తుండై శివలోకంబు నొందు నిందుసందియంబు లేదీ రహస్యంబగు శివలింగ మహావ్రతంబు భక్తుండవగు నీకుఁ జెప్పితి నీవును శివభక్తుఁడవుఁ గాక మఱియొకని కొసంగకు మనుటయు శ్రీకృష్ణుండింకను శివలింగతత్త్వంబును బూజావైభవంబును యోగరహస్యంబులను గుఱించి యడిగి తెలిసికొని కృతార్థుండయ్యెనని వాయుదేవుండు మునులకుఁ జెప్పి యంతర్హితుఁడయ్యె నంత మఱునాఁటి ప్రభాతంబునఁ దపోధనులగు నానైమిశీయ ఋషులు సత్రాంతంబున నవబృథంబు నొనర్చి ప్రసన్నస్వాదుసలిలయగు సరస్వతీనదిన్ జేరి యందు శివంబులగు తజ్జలంబుల స్నానమాడి దేవాదితర్పణంబు లొనర్చి పూర్వవృత్తాంతంబును స్మరించి వారణాసి కేగిరి.

గీ. అందు నుత్తరవాహినియైన గంగ, మునుకలొనరించి యల యవిముక్తనాథ
లింగమును విధి నర్చించి లీల మరలు, చుండ నచ్చోట నొక తేజ ముద్భవించె ౮౪౭

క. ఆ తేజ మర్కకోటిప్రాతప్రతిమానమగుచు పరుసగ రోదః
స్ఫీతంబై కరమలరుచు, గౌతుకమున మునులు మహము గాంచుచునుండన్.

గీ. పాశుపతులగు సిద్ధులు • పరమమునులు, భస్మసంఛన్నతనులు తా • పస్వు లట్టి
తేజమున వచ్చి చేరి యం • దే విలీను, లైరి యత్తేజ మటుమీఁద • నంతరించె. ౮౪౯

క. అదిగని నైమిశవనమునఁ, బొదలెడు నమ్మునివరులు ప్ర • భూతాశ్చర్యం
బొదవఁగ నిది యేమని యడ, సదనమునకు మేరువనికిఁ • జనిరి రయమునన్. ౮౫౦

—* నారదుఁడు తుంబురునితో సామ్యంబుఁ బడయుట *—

క. ఇంతకుమున్నె పవనుం, డెంతయు వేగముగ నటకు • నేగి విధికిఁ గా
లాంతకతత్త్వము మునులకు, నంతయుఁ జెప్పితిని సత్ర • మవసితమయ్యెన్. ౮౫౧

గీ. నీవు సెల వొనరించితి • నిగమవంద్య!
యనుచు విజ్ఞప్తి యొనరించి • యబ్జభవుని
యానతిఁ గొని నిజపురి • కరిగె నంత
బ్రహ్మ యాస్థానికేగె సు • రలు గొలువఁగ. ౮౫౨

ఆ. అందుఁ దుంబురుతోఁ గల • హాశనర్షి
గానమున స్పర్థసేయుచుఁ • గడిఁది పూనిక
నాఁడు తనశక్తిఁ జూపింప • వేఁడుటయు వి
రించి యియ్యకొనియెను జేరిరి పలువురు. ౮౫౩

వ. గంధర్వు లప్సరోజనంబులు గీతవాద్యకుశలులగువారు చేరి రా సమయంబున సభాప్రదేశంబు మిక్కుటంబుగ నిండియున్న కతంబున ద్వాస్స్థజనులు నైమిశారణ్యమునుల నడ్డగించుటఁ జేసి యవ్వారు సభాలయంబుఁ బ్రవేశింపలేక తత్పార్శ్వంబునఁ గూరుచుండి యుండిరంత. ౮౫౪

గీ. నారదుం డాటతేటి గానమున నాఁడు
తుంబురునితోడఁ దాఁ దులఁ • దూగె నపుడు
బ్రహ్మదేవుండు మెచ్చి నారద మునికినిఁ
దుంబురున కనపాయసఖ్యంబుఁ గూర్చె. ౮౫౫

వ. అంత నారదుండును

క. కైలాసపర్వతంబున, శైలాదిమునీంద్రునకును • శంభునకును వీ
ణాలలితకౌశలంబును, జాలఁగఁ జూపింప గీత • చతురుల తోడన్. ౮౫౬

వ. తుంబురుఁ దోడ్కొని బిరబిరఁ జనుచుండ నైమిశమునులు డాసి బ్రహ్మసభాప్రవేశంబు నర్థింపుడు నతండు బ్రహ్మ కెఱిఁగించి యాస్థానముఁ జేర్పుఁడని

దౌవారికులకుఁ జెప్పి చనుటయు వార లట్లొసర్ప నమ్మనులు బ్రహ్మన్ జేరి సాష్టాంగ మొంది నిలిచిన నలువయు నవ్వారల కుశలం బడిగి యిట్లనియె. 357

గీ. మీసమాచార మంతయు • నాసదాగ, తి ముఖమునవింతకున్ మున్నె • తెలిసికొంటి
నతఁడు మీసముఖముఁ బాసి • యవలకేగి, నంతమీఁదియుదంతంబు • నంతఁ జెపుడు

వ. అనుటయు మను లవబృథావసానంబున వారణాసి కేగుటయు నందు గంగా స్నానం బొనరించి దేవప్రతిష్ఠితంబులగు శివలింగంబుల దర్శించుటయు నవి ముక్తేశ్వరలింగంబు నర్చించుటయును నాకాశంబున మహాతేజం బొకఁడు గనృట్టుటయు నందుఁ బాశుపతసిద్ధమునులు చెంది తిరోధానంబు నొందుటయు నద్దాని యాథాత్మ్యంబు దెలియకుండుటయు నటుమీఁదఁ దమ సన్నిధానంబున కరుగుదెంచుటయును జెప్పి ప్రణమిల్లిన విని చతుర్ముఖుండు శిరఃకంపం బొన రించి గంభీరవాక్కుల నిట్లనియె. 359

ఉ. దాకొనె మోక్షలక్ష్మి నియతమ్ముగ సత్రమునందు శంకరున్
లోకగురున్ భజించితిరి • లోలతఁదక్క మునీంద్రతల్లజుల్!
మీకిది భావిసూచకము • మీరలు గన్గొనినట్టి తేజమా
శ్రీకరుఁడౌ మహేశ్వరుఁడు • చెందుదు రీరలు తత్ప్రసాదమున్. 360

గీ. అట్టిసమయమునడగ్గతె • నభవకృపను, మీరలీక దక్షిణంబగు • మేరుశిఖర
మునకుఁ జేరుఁడు మామక • పుత్త్రుఁడౌస, నత్కుమారుండచటనుండు • నందికొలికి

—• బ్రహ్మ సనత్కుమారుఁడొకఁడైయె శాపమోక్షమొందిన తెఱఁగు చెప్పుట •—

చ. శివుఁడును మున్ను నాకొమరుఁ • జేరఁగవచ్చినఁ జూచి నాతనూ
భవుఁడు భ్రమంబుఁ జెంది గరు • వంబున వందనపూజనాదికా
ర్యావిధుల సల్పకున్నఁగని • యక్కట తండ్రుఁడు గిన్క మేటిలో
ట్రైవయి చరింపుమిందని కడిందిరయంబున శావమీయఁడున్.

గీ. పుత్త్రకుఁడు లొట్టియై కడుఁ • బొగులుచుండ
నే మహాదేవు నంబను • నిమ్మఁగొలిచి
నందినిన్ బుజ్జగించి నా • నందనునకు
నుప్రితనుబాపితి స్వమూర్తి • నొందెనతఁడు

ఉ. అత్తటి దేవదేవుఁడు మ • హాద్భుతి నందినిఁ జూచిపల్కె ధీ
రోత్తమ! బ్రహ్మపుత్త్రుఁడితఁ • డుల్లమునన్ ననుఁబోల్చలేక కిం

చిత్తవరాఁకఁజెంది యిటు శిక్షితుఁడయ్యెనీశ మదీయ భా
స్వత్తరతత్త్వమున్ దెలుపు చక్కని శిష్యుఁడునీకుఁ జేకుఱెన్. 864

గీ. ఇట్లు నందికిఁ జెప్పె మహేశ్వరుండు, నందియును జిత్తమందు నానంద మొంది
విభుని యాజ్ఞతలన్ దాల్చి వేగ నిటకు, రాఁగడఁగియుండె నీలోన వేగ మీవు,

గీ. నాదు సెలవున నందిప్రసాద మొంద, నందుఁ దపియించుచున్న నానందనుఁడు స
నత్కుమారుని కడ కేగి నందికేశ, బోధలను వినుఁడీ కమీఁద మునితిలకులు!

— * నైమిశమునులు స్కందసరోవరంబుఁ జేరుట * —

వ. దాన మీ కచిరంబుగ శివప్రసాదంబు సమకూరుననుటయు నవ్వారలు సుమేరు దక్షిణంబందలి కుమారశిఖరమ్మునఁ దనరు నమృతాచ్ఛస్వాదుశిశిరాగాధ లఘూదకంబును సర్వర్తుస్ఫుటకుసుమమంజరీరంజితానేక తరువాటికాచ్ఛాదితాఖిలదిఙ్ముఖంబును, పరితస్సంఘటితాయతవిభాస్వరస్ఫాటికోపల వేదీవిరాజితంబును స్థూలనీలశిలామయసుఖావతరణారోహవిలసితంబును గాంచనారవింద సంచయానేక కుముదేందీవరసుందరంబును, రంగదుత్తుంగాభంగతరంగసంక్షోభితంబును నగు స్కందసరోవరంబుఁ గాంచి యందు

సీ. ఒకచోటమునుఁగుచు నొకచోటఁ దేలెడు, గజయూథపతులనక్కజముఁగనుచు
నొకచోటఁ బల్దూప నొందిబల్ పరువుల, బఱతెంచు లేళ్ళ యాతురతఁగనుచు
నొకచోటఁ దటమున నుత్ఖాతకేళుల, నొనరించు వృషముల యొప్పుఁగనుచు
నొకచోట నుదకంబు నొందియచ్చటినుండి, వెడలెడు నెమ్మల వేడ్కఁగనుచు

గీ. నొక్కచో నవగాహంబు లొంది దేవ, మునిపితలతర్పణము సేయు మునులఁగనుచు
నొక్కచో నంచపిండుల నొక్కచోటఁ, గోకములమూఁకఁగనుచు బల్ కుతుకమునను

వ. అన్వేషింపుచుఁ జని సరోవరోత్తరతీరంబందుఁ గల్పవృక్షంబు నీడను వజ్రమయ వేదియందు మృదులంబగు మృగచర్మంబందుఁ గూర్చుండియుండిన వాని నప్పుడే సమాధినుండి బహిర్గతుండయిన వాని యోగీంద్రులగు పలువురు మునీంద్రులచే సేవింపఁబడుచున్న వానిఁ గుమారాకారుని సనత్కుమారమునినిఁ గన్గొని ప్రణతులై తత్ప్రశ్నంబుననుసరించి తమ వచ్చినకతంబుఁ జెప్పుచున్నంత నాకసంబునందు దివ్యాలనగారాంమోఁతలతో భానుసన్నిభంబగు నొకవిమానంబు దోఁచి యందు గణేశ్వరబృందంబులతోఁ బరివేష్టితుఁడై సేవింపఁబడుచున్న సుకీర్తిపాణివల్లభుం డపరహరుండు పొడసూపిన సనత్కుమారుం

జదుర్ముఖుని జోతఁగావించి సముచితార్చనలఁ బ్రీతుఁజేసి దోయిలొగ్గి షట్కు లీయు లగు నైమిశమునులు బ్రహ్మానుజ్ఞచేఁ దమయనుగ్రహార్థమై వచ్చిరని చూపిన నద్దేవుఁడు సనత్కుమారునినుడు లాలకించి దృష్టిపాతమాత్రంబున మునులపాశంబులఁ ద్రెంపివేసి యైశ్వరంబగు శివజ్ఞానయోగంబు సనత్కుమారునితోఁగూడ మునుల కొసంగి జయధ్వానములతోఁ దిరుగ శివసన్నిధానంబున కేగె ననుడు శౌనకాదిమునులు సూతుఁ గాంచి మహాత్మా! నందికేశుండు సనత్కుమారునకును షట్కులీయమునులకుఁ జెప్పిన శివజ్ఞానయోగంబందలి ముఖ్యసారంబు మా కెఱింగింపుమనిన సూతుం డిట్లనియె. 369

నందికేశుఁడు సనత్కుమారునితో మునులకుఁ జెప్పిన ముఖ్యసారము

— * లింగధారణము * —

గీ. వినుఁడు జ్ఞానసారంబును • విమలమును బవిత్రమును నగు శివలింగ • వితతధార ణముఁ గుఱించి వచించెను • నందికేశుఁ, డెఱుఁగుఁడీ యదిమీరు మ • నీంద్రులార!

గీ. భ్రమరసంగతి కీటంబు • భ్రమరమైన, కరణి శివలింగసంగతిఁ • గాంచి జీవుఁ డభవుఁడగు నిట్లు శ్రుతి చెప్పు • హరివిరించి, ముఖులు శివలింగధారణం • బునుబడసిరి

క. మఱియును గౌతమముఖముని, వరులును దిక్పాలకులును • వాసిగ బాణిన్ శిరసునఁ బవిత్రమనుచును, హరువుగ శివలింగ మొంది • రరయుఁడు తపసుల్!

వ. ఆ లింగధారణంబునందును

గీ. స్ఫాటికంబును బాణంబుఁ • జంద్రకాంత
మయమునున్ దినమణికాంత • మయము హేమ
రావ్యకృతమును శ్రీగిరి • గ్రావకృతము
నైన లింగంబు ధరియింప • నగును మునులు! 373

వ. తక్కినవి పూజ్యంబులు గావు, ధారణార్హలింగంబులెల్లఁ బంచసూత్రఘటితంబులై యుండవలయు నీ లింగధారణంబు నిగమాగమశాస్త్రోక్తప్రకారంబుగ నొంది యావజ్జీవం బనపాయంబుగ శివలింగంబు నర్చింపవలయు నిది వేదసారంబు జ్ఞానసారం బని యుపదేశించె. 374

క. పులిపాకపంకమత్తా, ఫలమంజులమూర్తి! పరమ • పావనకీర్తీ!
లలితస్వచిత్తపద్మభ, సలదంబా! గిరిశమిథున • జననీ! లక్ష్మీ! 375

క. ధవళేశలింగసంగత, ధవళపురీరాజ్యవిభవ • దక్షిణభగినీ!
కవిజనసన్నుతచరితా! శివతత్త్వవిచారపూత • శేముషి! జననీ! 376

క. నాగేడ్భూషణపదరత, నాగాంబానుజ! నగేంద్ర • నాథకుమారీ
నాగాజినచేలార్చా, జాగరహృదయా! దయావ • శా! లక్ష్మ్యంబా! 377

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి వాయవీయఖండంబు
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శి వ పు రా ణ ము

## వి ద్యే శ్వ ర ఖ ం డ ము

### ప్రథమాశ్వాసము



యాద్భటకులమండన!
శ్రేయస్సంపాదకేందు • శేఖరపూజా
వ్యాయత్తాత్మాంబుజ! యన
పాయయశోధుర్య! వీర • భద్రారాధ్యా!

వ. అవధరింపుము

క. సూతునితో మునితల్లజు, లాతతసంప్రీతి నిట్టు • లనిరి మహాత్మా!
చేతము శుద్ధంబయ్యెం బు, నీతులమైతిమి కరంబు • నీదగుబోధన్. 2

సీ. లింగపూజాప్రకారంబు • లింగభేద, సంగతిని భూతి రుద్రాక్ష • సంగతులను
క్రమములోడుతనవ్వానిఁ • గల్పమెఱిఁగి, తెలియఁజెప్పుము మాకిందుఁ • దేటపడఁగ

వ. నావుడు సూతుండు

చ. మునివరులార! లింగమును • బూజయొనర్పఁగఁజెల్లుఁ బీఠమం
దున నిఁక హస్తపీఠమునఁ • దోరపుభక్తి చెలంగ వేదవ
ర్త్మనియతి నాగమోక్తవిధిఁ • దద్విధమున్ మును గొంతదెల్పియుం
టిని నిపుడున్ వచింతు వినుఁడీ సకలంబు ముదంబుమీఱఁగన్. 4

— * హస్తపీఠంబునందుఁ లింగమును బూజించిన ఫలములు * —

సీ. రహిఁ శివార్చనమందు బేరమునులింగ, మును యజించెద రద్దాన • ముఖ్యముగను
లింగసంపూజనం బొప్పెసంగుచేవ, పూజనము కూడ యుక్తమై • పొల్పుమీఱు

త. పెఱవేల్పులకెల్లను నె, ప్పరుసునఁ బ్రతిమార్చనంబె • పరిధవిలు నీకన్
బరముఁడగు శివునకొక్కని, కరుదుగ నిత్తెఱఁగు ద్వివిధ•మర్చ తనర్చున్. 6

గీ. ధరఁ బ్రవృత్తపథంబునఁ•దనరి సతత,మైహికసుఖంబులనుమాత్ర•మభిలషించు
వాఁడు పీఠస్థలింగంబు•వాసియమరఁ, బూజసేయఁగవలయును • బొంకముగను.

వ. శాల్యన్ననైవేద్యం బొసంగి పూజావసానంబున సంపుటంబునందుంచి పూజా
గృహంబున నుంచవలయును. 8

గీ. ఇఁకఁ బ్రవృత్తినివృత్తుల•నెసకమెసఁగ, భోగమోక్షంబులను జెందఁ•బూనువాఁడు
ఆత్మకరపీఠమున లింగ•మర్థి సముచి,తార్చనముసేయవలయు నా•హ్లాదమొప్ప

వ. స్వభోజ్యపదార్థంబు నివేదనం బొనరించి పూజావసానంబందు లింగంబును
శిరోముఖ్యోత్తరకాయంబునందు ధరించవలయును. 10

—* లింగభేదంబులు *—

గీ. క్షత్రియునకెప్డు బాణలిం•గంబు రాజ్య,సంపదావహమగు సూరు•జాతునకు సు
వర్ణలింగంబు ధనధాన్య•వర్గమిచ్చుఁ, బాదజుల కశ్మలింగంబు•వైభవమిడు. 11

గీ. స్ఫాటికము బాణలింగంబు•సర్వులకును, సర్వకామద మగును యో•షాజనంబు
లందుఁ బార్థివలింగమా•యైదువులకుఁ,బటికపున్ లింగము వితంతు•భామినులకు

వ. పూజార్హంబై యభీష్టావహంబై యొప్పు

క. మఱియు నివృత్తిపథంబునఁ, బరఁగెడు విధవలు యజింప•వలె రసలింగం
బిరవుగ బాలలు వృద్ధులు, ధరఁ బటికపులింగమర్థిఁ • దగఁగొల్వవలెన్. 13

వ. ఇఁక నెవరికెట్టిలింగంబులు విధించినను దాదృశలింగంబు దొరకమి నితరలిం
గంబు నర్చించుటయందుఁ బ్రత్యవాయంబులేదిఁకను బార్థివలింగంబుఁగూరిచి
వినుండు. 14

—* పార్థివలింగపూజోత్కృష్టత *—

గీ. లింగములలోనఁ బార్థివ•లింగముత్త, మంబయితనర్చు నద్దాని•మహిని నేక
మునులు పూజించి సిద్ధులఁ•బొందిరఖిల,సురలునున్ గొల్చివడసిరి•సిరులనుగడు

గీ. ప్రథమయుగమున శ్రేష్ఠంబు•రత్నలింగ, మల్ల త్రేతాయుగంబున•హైమలింగ
మాతృతీయయుగమున ర•సాద్యలింగ,మిఁకఁ గలిఁ బార్థివపులింగ•మేహితంబు

క. శివు నెనిమిది మూర్తులలో, భువి యెట్టుల ముఖ్యమగుచు • బొలుపొందెనొ పా
ర్థివలింగ మట్టులే యీ, వివిధములగు లింగములను • వెలయును సిరులన్. 17

మ. సురలం దెక్కుడు శ్రేష్ఠతన్ దనరునో • శుభ్రాంశుచూడుండు ని
ర్ఝరిణీవర్గమునందు జాహ్నవియెటుల్ • రాజిల్లునో శ్రేష్ఠమై
ధరలో వర్ణములందు బ్రాహ్మణుఁడెటుల్ • దైవాఱునో ముఖ్యుఁడై
సిరిమీఱన్ బ్రణవంబు వర్ణములలో • శ్రేష్ఠత్వమెట్లొందెనో! 18

క. ఎట్టులఁగాశి నగరులం, దెట్టుల దేవీతతి మ • హేశ్వరి యురవౌ
నట్టులఁ బార్థివలింగము, నెట్టన లింగంబులందు • నేటు మునీంద్రుల్. 19

గీ. తనకు నుపలబ్ధమగు పదా • ర్థములతోడ, నాస్థఁ బార్థివలింగస • మర్చనంబు
సేయువాఁడాయురున్నతిన్ • శ్రీలఁ బుత్ర, సంతతినిఁ జెందుఁ బరమున • శంభుఁడగును.

సీ. ఇంకఁ ద్రిసంధ్యంబునం దెవఁ • డింపుమెఱయఁ
బార్థివేశ్వరలింగంబుఁ • బట్టుదలను
బ్రాణమోక్షంబు వఱకు స • మర్చనంబుఁ
జేయునో దానిఁగూర్చి నేఁ • జెపుదు వినుఁడు. 21

ఆ. శివలోకమునకుఁ జని యట, శివసవిధంబునఁ జిరము వ • సించి తిరుగ నీ
భువియందు వేటి యగు పా • ర్థివుఁడై జనియించఁగలఁడు • తేజం బెసఁగన్

వ. సకాముఁడై యర్చించినవాఁ డివ్విధం బిఁక నిష్కాముఁడై యర్చించినవాఁడు శివసాయుజ్యంబునొందును మఱియుఁ గను

గీ. పంచసూత్రఘటితమైన • పార్థివంపు, లింగ మిట్టులఁ గల్పోక్త • లీలఁ బూజ
సేయవలయుఁ గుతర్కంబు • సేయరాదు, వేదశాస్త్రాభిమతమిది • విజ్ఞులార! 24

క. మేలగుఁ బ్రాణత్యాగము, మేలు శిరఃకర్తనంబు • మేదినిలోనన్
బాలశశిమౌళిలింగము, లోలతఁ గొలువక యెకుడుచు • లోలువునకిలన్. 25

క. భువి విప్రుండయి పొడమియు, శివలింగము నెవఁడు • ప్రీతి సేవింపఁడొ యా
యవివేకి నరకమున నను, భవించు దుఃఖములఁ బెక్కు • వత్సరశతముల్.

వ. మఱియు నీలింగంబులలో స్థావరలింగంబులందు ద్విఖండంబులుగ చరలింగంబు లం దఖండంబులుగను సమకూర్చుకొనవలయు నిఁక రత్నస్వర్ణపారదస్ఫాటిక పుష్యరాగ పార్థివలింగంబులం దఖండలింగంబులనే స్వీకరించవలయును.

గీ. స్థావరంబు నఖండంబు • చరమిం క ను ద్వి, ఖండ మువుగ ను లింగంబు • గడంగి పూజ
సేయుటొప్పదిది యెఱింగి • సేయుఁడీవు, శంభులింగార్చనంబు ప్రశ స్తము గను 23

క. ఇఁక పార్థివలింగార్చా, ప్రకారమంతయును నిప్పు • బ్రహ్మాదులుల్ వై
దికమార్గముతో మీకిటఁ, బ్రకటముఁ జేసెద వినుండు • బద్ధాదరులై.

వ. సూత్రోక్తవిధి నుషఃకాలంబున స్నాతులై సంధ్యనుపాసించి బ్రహ్మయజ్ఞ
తర్పణములనొనర్చి నైత్యకకర్మల నన్నిటన్ జక్కనొనర్చి శివస్మరణతో
భస్మరుద్రాక్షధారియై పార్థివలింగంబును బూజింపవలయును.

గీ. అరసి పుణ్యనదీతీర • మందునుం జ, లాశయాంతికమున శైల • మందు వనము
నందు శ్రీశంకరాలయ • మందు శుద్ధ, తలమునన్ బార్థివార్చన • సలుపవలయు.

క. తెల్లనిమృత్తున బాపం, డల్ల నృపతి యెఱ్ఱమట్టి • నర్యకులుందున్
నల్లనిమట్టిని లింగము, నుల్లమలర సల్పవలయు • నున్నతచరితుల్! 32

వ. అంఘ్రిజుం డెద్ది సంభవించిన నద్దానితో లింగంబుసల్పి పూజింపఁదగు

గీ. శుద్ధమైన ప్రదేశంబుఁ • జూచి యచటి
మృత్తికనుదెచ్చి యింటిలో • మిగుల శుద్ధ
మైన సుస్థలమందు న • ద్దాని నుంచి
దినదినమును లింగంబులఁ • దీర్పవలయు. 34

వ. మఱియు సద్యోజాతమంత్రపఠనంబొనరింపుచు మృదాహరణం బొనరించి
వామదేవమంత్రంబున నుదకప్రక్షేపం బొనరించి, యఘోరమంత్రంబున
లింగనిర్మాణం బొనరించి, తత్పురుష మంత్రంబున నావాహనం బొనర్చి,
యీశాన మంత్రంబున వేదీసంయోజనంబు సేయవలయు. 35

ఆ. మఱియు నంతఁదా "న • మశ్శివాయ" యను మం
త్రంబుతోడ వస్తు • రాజిపై ను
దకముఁ జల్లి చేయఁ • దగు క్షేత్రశుద్ధిని
'భూరసి' యనుమంత్ర • మునను మునులు. 36

వ. అనంతరమం 'దాపోస్మా'ననుమంత్రింబున జలసంస్కారం బొనరించి 'నమస్తే
రుద్ర' యనుమంత్రింబున క్షేత్రశుద్ధినిఁబొనర్చి 'నమః' పూర్వకంబగు నద్దానఁ
బంచామృతంబులకుఁ బ్రోక్షణం బొనర్పవలయును. 'నమోనీలగ్రీవాయ'యను

మంత్రింబున శివలింగప్రతిష్ఠ బొనర్చి 'ఏతత్తేరుద్రాయ' యనుమంత్రింబున లింగమున కాసనంబీయవలయు 'మానోమహాంత'మనుమంత్రింబున నావాహనం బొనరించి 'యాతేరుద్ర' మంత్రంబున నుపవేశనంబు భావింపవలయు 'యామిషు' మను మంత్రంబున న్యాసంబొనరించి 'అధ్యవోచ' యను మంత్రంబునఁ బ్రేమతోనధివాసం బొనర్పవలయు. 'జీవ' యనుమంత్రంబున దేవతాన్యాసం బొనరించి 'అసౌయోవసర్పతి' యను మంత్రంబున నుపసర్పణంబు చేయవలయును 'నమస్తేనీలగ్రీవాయ' యనుమంత్రంబునఁ బాద్యంబును రుద్రగాయత్రీ మంత్రంబున నర్ఘ్యంబును 'త్ర్యంబక' మంత్రంబున నాచమనంబు నొనర్పఁదగు 'పయఃపృథివ్యామ్' అను మంత్రంబున క్షీరస్నానంబును 'దధిక్రావ్ణ్ణ' మంత్రింబున దధిస్నానంబును 'ఘృతయావ'యను మంత్రంబున ఘృతస్నానంబును 'మధువాతా' యనుమంత్రంబున మధుస్నానంబును 'తాచ్ఛర్కరా' యనుమంత్రంబున శర్కరాస్నానంబును నొనర్పఁదగు 'నమసోమాయేతి'మంత్రంబున శుద్ధోదకస్నానంబునొనర్పఁదగు అటుపైన 'మానస్తోకే'యనుమంత్రంబునఁ గటిబంధనం బొనర్చి'నమోధృష్ణవే' యనుమంత్రంబున నుత్తరీయమును ధరింపఁ జేయవలయును. 'యాతేహేతి'యను మంత్రచతుష్టయంబులో శివునకు వస్త్రసమర్పణం బొనరించి'నమశ్వభ్య' యనుమంత్రంబున శ్రీగంధంబును'సమస్తక్షభ్య'యను మంత్రింబుననక్షతలను సమర్పించవలయును, 'నమఃపార్యాయ' యనుమంత్రంబునఁబుష్పంబులను 'నమఃపర్ణ్యాయ'యనుమంత్రంబున బిల్వపత్రంబులను'నమఃకపర్ది నే'యనుమాంత్రంబునధూపంబును'నమఆశవ'యనుమంత్రంబున దీపంబును 'నమోజ్యేష్ఠాయ' యనుమంత్రంబున నుత్తమంబగు సన్నబియ్యంపుటన్నంబు నైవేద్యంబును 'త్ర్యంబక' మనుమంత్రంబున బునరాచమనమును, 'ఇమారుద్రాయ' యనుమంత్రంబున ఫలసమర్పణంబును 'నమోవ్రజ్యాయ' యనుమంత్రంబున తాంబూలాది సకలమును శివున కర్పింపవలయును 'మానోమహాంత' మనునట్టియు 'మానస్తోకే' యనునట్టియు మంత్రద్వయంబులతో నేకాదశాక్షతలతో నేకాదశ రుద్రులఁగూర్చి లింగమును బూజింపవలయును. 'హిరణ్యగర్భ' యనుమంత్రంబున దక్షిణనిచ్చి 'దేవస్యత్వా'యనుమంత్రంబునఁ బునరభిషేకంబుఁ జేయఁదగు దీప మంత్రముచేతఁ గర్పూరనీరాజనంబిచ్చి 'ఇమారుద్రాయ' యనుమంత్రంబునఁ బుష్పంబులనొసఁగి 'మానోమహాంత' మనుమంత్రంబునఁ బ్రదక్షిణంబొనర్చి 'మానస్తోకే' యనుమంత్రంబున సాష్టాంగ

వందనంబొనర్చి 'ఏష తేరుద్ర' యనుమంత్రంబున శివముద్రనుజూపి 'యతేయత' యనుమంత్రంబున నభయముద్రను 'త్ర్యంబక' మంత్రంబుచే జ్ఞానముద్రను, 'నమఃసేనాయ' యనుమాత్రంబున మహాముద్రను 'నమోగోభ్య'యనుమంత్రంబున ధేనుముద్రను నిట్లు పంచముద్రలను జూపించి శివమంత్రంబును శతరుద్రీయంబును జపింపవలయును ననంతరంబునఁ బంచాంగపఠనం బొనర్చి "దేవాగాతు" మనుమంత్రంబున శివుని విసర్జనము సేయవలయు నిది వైదికశివపూజా విధాన మిఁక మఱొకపద్ధతి వినుఁడు. ౩౭

క. గురుదత్తమైనపంచా, క్షరమనువున షోడశోపచారంబుల శం
కరలింగపూజనంబును, సరవిగ నొనరింపవలయు సన్మౌనివరుల్! ౩౮

వ. వెండియు నిఁక వేఱొండుపద్ధతి.

శ్లో. భవాయ భవనాశాయ । మహాదేవాయధీమహే
ఉగ్రాయచోగ్రనాశాయ । శర్వాయ శశిమాళినే ॥ ౩౯

ఈ మంత్రముచే శివలింగమును బూజింపవలయును నీయవి వైదికపూజన క్రమములింకను వేఱొకరీతి నారయుఁడు. మృదాహరణంబు మొదల్కొని ప్రతిష్ఠాహ్వానస్నపనపూజన విసర్జనాంతము "ఓం హరాయనమః ఓం మహేశ్వరాయనమః ఓం శంభవేనమః, ఓంశూలపాణయేనమః ఓంపినాకధారిణేనమః ఓం శివాయనమః ఓంపశుపతయేనమః, ఓంమహాదేవాయనమః" అను నీ నామంబులచేఁ గ్రమంబుగ సర్వోపచారంబుల భక్తితోఁ బూజింపవలయును. అటుమీఁద షడక్షరీ మంత్రంబున షడంగన్యాసములొనర్చి యిట్లు ధ్యానము సేయవలయును.

శ్లో. కైలాసపీఠాసనమధ్యసంస్థం । భక్తైస్సనందాదిభి రర్చ్యమానమ్ ।
భక్తార్తిదావానలమప్రమేయం । ధ్యాయేదుమాలింగిత విశ్వభూషణమ్ ॥

శ్లో. ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం । చారుచంద్రావతంసం
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశుమృగవరా । భీతిహస్తం ప్రసన్నం
పద్మాసీనం సమంతాత్ స్థిత మమరగణై । ర్వ్యాఘ్రకృత్తింవసానమ్
విశ్వాద్యం విశ్వవంద్యం నిఖిలభయహరం । పంచవక్త్రం త్రినేత్రం ॥"

ఈ మంత్రంబులచేతను శతరుద్రీయము మున్నగువానిచేత శివుని ధ్యానము చేసి యిట్లు ప్రార్థింపవలయును.

క. నీవాఁడను నీభక్తుఁడ, నీవిమలగుణముల ననవరు • నిలిపితి నీయం
దే వెలయించితి మదినిఁ గృ, పావార్ధీ! భూతనాథ! • పాలింపఁగదే! 40

క. ఎఱిఁగిరొ యెఱుఁగరొ యిటు, వరద! జపార్చల నలిపితి • వాసిగ నీబం
ధురకృప సఫలమొనర్పుము, పరమేశ్వర! సర్వలోక • పాలనచతురా! 41

గీ. కడిఁదిపాపుఁడనేను నిక్కముగ దేవ! పావనుఁడవీవు లోకైక • పాలమూర్తి!
దీనినారసి నీకెట్లు మానసమునఁ, దోఁచునో యట్లు లొనరింపు • తుహినధవళ! 42

గీ. వేదములచేత బహుశాస్త్ర • వితతిచేత, వివిధదర్శనసిద్ధాంత • వేములైన
ఋషివతంసులచేతనీ • కెఱుకపడక, యుండ నిఁక మాదృశులెట్టు • లూహసేయు

క. ఎట్లుఁగాని యింకను నేఁ, గట్టిగ నీవాఁడ వినుము • గౌరీశ్వర! నీ
కెట్టులో యుక్తిగ టికని గొని, నెట్టన రక్షింపవలయు • నేనుపురారిన్ 43

వ. ఇట్లర్చించి పుష్పాంజలినొసంగి ప్రదక్షిణవందనంబు లొనర్చి విసర్జనము సేయవలయు నిట్లు పార్థివపూజావిధానం బనేకవిధంబు లుపన్యసించితినని మును లిట్లనిరి. మహాత్మా! జగజ్జేయమానంబుగ నిట్లు శివపూజనంబు ప్రతిపాదితంబయి యుండఁగా.

క. శివలింగనివేదితములు, భువనఫలాశఫలపుష్ప • ములు నగ్రాహ్యం
బవునని సాలగ్రామపు, నవిధమ్మున శుద్ధమని • చాటుదురెట్టుల్. 45

వ. ప్రసాదంబుఁగొనక పూజించుటెట్టు లీసందియంబుఁ బాయ నెఱింగింపుమనుటయు సూతుండిట్లనియె.

— * శివనిర్మాల్యము శైవదీక్షితునకు గ్రాహ్యము * —

గీ. శుచియు శుద్ధుఁడు సద్వ్రత • స్థుఁడనునైన, శంభుభక్తుండొకింతయు • సందియంబు
లేక యా శివప్రసాద మాస్తికభక్తి, ననుభవింపఁగఁ దగును మహాత్ములార!

క. శివనైవేద్యముఁ జూచిన, నవియును ఘోరంబులైన • నఘతతు లింకన్
శివనైవేద్యముఁ దినగఁ, వివిధమహాపుణ్యతతులు • వేగమె చెందున్. 48

క. చాలును యజ్ఞసహస్రము, చాలను యజ్ఞార్బుదములు • చక్కఁగ నిఁక నా
బాలేందుధరుప్రసాదము, మేలుగ భుజియించి నరుఁడు • మేకొను ముక్తిన్ 49

క. వచ్చిన శివనైవేద్యము, మచ్చికతోఁ గాంచి తనదు • మస్తకమునఁ దా
హెచ్చుగ మ్రొక్కుల నిడి శివు, మెచ్చుచు భోజనము సేయు • మేలగుమానుల్!

క. ఎవనికి శివనైవేద్యము, న విరుద్ధమనీపపాదమి । నట్టుచు విడునో
యవిరళనరకాగ్నులఁబడి, యవిరతముఁ దపించుచుండు । నాతండుమునుల్! 51

క. శివదీక్షఁగొనిన భక్తుం, డవని నిఖలలింగవితతి యందుఁ బ్రసాదం
బవునని కాదనియెంచక, ప్రవిమలమతి నారగింప । వలయుమునీంద్రుల్! 52

వ. ఇఁకను శివేతరదీక్షఁ జెందినవారలకొఱకై మునికృతనిర్ణయంబిట్లు వక్కాణించెద వినుండు.

సీ. హృదయమున స్వర్ణ రౌప్యాభి । హృద్యలింగ
మునను శశికాంతమణి । లింగమునను రత్న
లింగమునను స్ఫటికరస । లింగములను
బాణలింగంబునందు బా । షాణమునను. 54

క. జ్యోతిర్లింగములందును, ఖ్యాతమహాసిద్ధమారి । కలితములయెడన్
బ్రీతి స్వయంభూలింగ, వ్రాతములఁ బ్రసాదభుక్తి । వ్రతవైభవమా. 55

వ. తక్కినచోట్ల

క. చండాధికార మెచ్చట, నుండునొయట సావడఁగ న నుచితంబగునా
చండాధికారమెచ్చొట, నుండదొయట నారగింప నుచితమెఱుఁగుఁడీ. 56

సీ. బాణలింగములందు । స్ఫటికలింగములందుఁ, గాంచనరౌప్యలిం । గములయందు
సరవి సాలగ్రామ । జాతలింగములందు, రసలింగములయందు । రత్నలింగ
మందు లోహికలింగ మందు జ్యోతిర్లింగ, ములయందును సుసిద్ధ । మునివరప్ర
తిష్ఠితములయెడ । దేవప్రతిష్ఠిత, ములయెడలను స్వయం । భువులయెడల

గీ. ప్రతిమలందెల్లయెడల ని । ష్ప్రాక్షికముగ, లేదుచండాధికారంబు । లేమదోస
మరసి తత్ప్రసాదంబుల నారగించ, వలయు శ్రేయంబులొందఁగాఁ । దలఁచువారు

సీ. బ్రహ్మహింసకుఁడైనను । భర్గలింగ, మూర్తినైవేద్య మర్థిమై । భోజనంబు
చేసెనేనియుఁ బాపంబుఁ । బాసిసుఖము, లొందు నిశ్చితమిందు వే । ఱొందులేదు

గీ. వీరభద్రునిచేత శ । పింపఁబడిన, వారలు మహేశభక్తి వి । వర్జితులును
నిఁక శివేతరభక్తులై । యెసఁగువారు, శివప్రసాదచతుష్కంబు । జెందఁదగదు.

గీ. విధియుతంబుగ లింగంబు । విమలవారి, స్నానమొనరింపఁజేసి యా । సలిలమర్థి
మూఁడుమాఱులుగొ్రిలిన । మాడిపోవు, త్రివిధదురితము లీధరిత్రితలమున. 60

వ. ఇట్లు మీకు నై వేద్యనిర్ణయం బెఱింగించితి నింక బిల్వమాహాత్మ్యంబుఁ జెప్పెద వినుఁడు. 61

## — * బిల్వమాహాత్మ్యము * —

చ. ఇలపయిఁ బుణ్యతీర్థతతు • లెన్ని విరాజిలుచుండునో సిరిన్
వెలసిన యవ్వియన్నియును • వేడుక మీఱఁగఁ జెందియుండు శ్రీ
ఫలతరుమూలమందు నిఁక • భర్గుని నచ్చటఁ బూజచేసినన్
విలసిలు వైభవంబు లిఁక • విశ్వగురుండు హరుండు ప్రీతుఁడౌ. 62

గీ. మఱియు నిఁక బిల్వమూలంబు • మంత్రియుక్తి
గంధపుష్పాక్షతాదులఁ • గరముభక్తిఁ
బూజచేసిన సుఖములఁ • బొంది శంభు
లోకమున కేగి శివునితో • జోకనమరు, 63

వ. ఇఁకను బిల్వదళంబుల స్వయముగఁ గోసి తెచ్చి శివునిఁబూజించిన వాఁడును బిల్వాలవాలంబు నుదకంబునఁ బూరించిన వాఁడును బిల్వసాన్నిధ్యంబున మహేశభక్తునకు జగ్గినిడువాఁడును నక్షయంబగు శివలోకంబుఁ జెందుదు రిందు సందియంబు లేదిఁక భస్మమాహాత్మ్యంబుఁ జెప్పెద నాకర్ణింపుఁడు. 63

## —* భస్మవిషయము *—

గీ. భస్మమిది రెండువిధములఁ • బరఁగు నిల మ
హాభసిత మల్పభసితమం • చాద్యమిఁకను
శ్రౌతమని స్మార్తమని లౌకి•జాతమనియు
త్రివిధమై యొప్పుచుండు నం•తేని దీప్తి. 64

క. శ్రౌతస్మార్తములైనవి, భూతులురెండును • ధరింపఁబోలు ద్విజాతుం
జేతదితరమగు లౌకిక, భూతిని నితరుండు దాల్పఁ•బూనఁగవలయున్. 65

గీ. "అగ్నిరితి" యను మంత్రంబు • నగ్రజనుఁడు
చదువుకొనుచు భస్మంబును • సలిలమునను
దడిపి ధరియింపవలయు మం•త్రంబు లేక
యితరులీ భస్మమును ధరి•యింప వలయు. 66

గీ. పరఁగ యజ్ఞాగ్నిభస్మ మౌ•పాసనాగ్ని, భస్మమును దగ్ధగోమయ•భస్మరజము,
బిల్వకాష్ఠాగ్నిభస్మంబుఁ•(బీతితోగ్రి), హిం విధరియిం౦వ వలయును•నీందు)ిలాం!

క. శివుఁడును బంకజనేత్రుఁడు, శివయును నిందిరయునున్ గుణశీలయగర్భో
ద్భవుఁడును దత్సతి బూదిన్, దవిలిధరించెదరు మేటితర్షముతోడన్. 68

గీ. బ్రాహ్మణక్షత్రియోరుజ పాదజులును, సంకరకులులు భస్మంబు సంతరించి
తనువులధరించి బహుపాపతండములను, బాయఁజిమ్మెదు రెంతయుఁ బరమమునులు

వ. ఇఁకను

సీ. భస్మత్రిపుండ్రముల్ వ్రాఁగఁదాల్పనివాఁడు, వర్ణాశ్రమాభ్యుపపత్తిఁ గనఁడు
భస్మత్రిపుండ్రముల్ వ్రాఁగఁదాల్పనివాఁడు, భవదుఃఖముల నెడఁబాసిపోఁడు
భస్మత్రిపుండ్రముల్ వ్రాఁగఁదాల్పనివాఁడు, ఘనదురితంబులఁ గడపలేఁడు
భస్మత్రిపుండ్రముల్ వ్రాఁగఁదాల్పనివాఁడు, దివ్యశివజ్ఞాన దీప్తిఁ గనఁడు

గీ. భస్మమునను త్రిపుండ్రముల్ వ్రాఁగఁదాల్పఁ, నట్టిఁడు విరుద్ధఫలముఁ నందఁగలఁడు
ఘోరపాపావళులఁగూడు కొన్ననరున, శమరు భస్మత్రిపుండ్రంబులందు నరతి

క. ఎనలేనిదోసకారియుఁ, జనవున మెయిబూదినొందఁజను దోసములిం
కను దేవమాన్యుఁడగు భ, క్తున కమరిన నద్ది యెంతొ గొప్పగునో మునుల్! 

వ. 'మానస్తోక' యనుమంత్రంబున మంత్రితంబొనర్చి బ్రాహ్మణక్షత్రియులును త్రియంబకమంత్రంబున వైశ్యుండును పంచాక్షరమంత్రబున స్త్రీలును వృష లుండును భస్మంబును ధరింపవలయును. మఱియు బ్రాహ్మణులలోఁ బంచబ్రహ్మ మంత్రపఠనంబుతో గృహస్థులును త్రియంబకమంత్రపఠనంబులోఁ బ్రహ్మచారు లును, అఘోరమంత్రపఠనంబున వానప్రస్థులును బ్రణవోచ్చారణంబున యతు లును భస్మంబును ధరింపవలయును. భస్మధారణంబులేక భుజించితేనిఁ దత్ప్రా యశ్చిత్తంబుగ నాశ్రమత్రితయులు గాయత్రీజపంబునను జతుర్థాశ్రమంబు వారు ప్రణవజపంబునను శుద్ధిఁగాంతురు. 72

గీ. శ్రాద్ధమున యజ్ఞ జప హోమ సమయములను
దాన వేదాధ్యయనసుకృత్యములయందు
భూతిపుండ్రముల్ దనువునఁ బూసినట్టి
వాఁడు మృత్యుని గెలువంగ వలఁతి యగును. 73

వ. మఱియు స్నానంబులలో నెల్ల భస్మస్నానం బుత్తమంబై సర్వపాపహారంబై యలరారు. 74

గీ. ఉదకమునఁ దానమాడిన • నుడుగు రజము
భస్మమున స్నానమొనరింపఁ • బరఁగు శుద్ధి
మంత్రజపమున జలమాడ • మలముడుల్లు
జ్ఞానమున స్నానమొనరింపఁ • గలుగు ముక్తి. 75

క. కాదది శుద్ధిస్నానము, కాదది హరిహరులధ్యాన • కలనం బింకన్
కాదది యాత్మజ్ఞానము, బూదియొకఁడు దాల్పకున్న • మునికులచంద్రిల్!

గీ. వితయగును భస్మమొందని • వెడఁగు మొగము
వితయగు శివాలయములేని • వెడపురంబు
వితయగు శివున్ గొలఁవని దు • ర్గతితనువది
వితయగున్ శివుఁ జెందని • వెఱ్ఱివిద్దె. 77

వ. ఇఁక భస్మరేఖాత్రయంబున నొక్కొకదానియందుఁ దొమ్మండుగురు వేల్పులుండు రాకట్టిమం బెఱింగింతు వినుఁడు. ప్రథమరేఖయం దకారము, గార్హపత్యాగ్ని భూమియు ధర్మంబు రజోగుణంబు ఋగ్వేదంబును క్రియాశక్తియుఁ బ్రాతస్సవనంబును మహాదేవుండు నుఁడును ద్వితీయరేఖయం దుకారంబు దక్షిణాగ్ని నభము సత్వము యజుర్వేదము మధ్యందినసవన మిచ్ఛాశక్తి,అంతరాత్మము మహేశ్వరుఁడు నుండును, తృతీయరేఖయందు మకారం బాహవనీయాగ్నియు పరమాత్మయు తమము దివఁబును జ్ఞానశక్తి సామవేదంబును సాయంసవనమును శివుండునునుండు నిట్లుశివదీక్షాపరులు దెలిసికొని స్థానదేవతలన్ భక్తితోఁ దలఁచి కొలిచి భస్మత్రిపుండ్రంబుల ధరింతురుగాక. మఱియు నీ భస్మపుండ్రములు ముప్పదిరెండుస్థానములందుఁ గాని పదియాఱుస్థానంబులందుఁగాని యెనిమదిచోటులందుఁగాని యైదుచోటులందుఁగాని త్రియాయుష మంత్రంబులతో ధరింపవలయు నవి వక్కాణింతు వినుండు. 78

సీ. శిర సలికమ్మును • చెవిదోయి కనుఁగవ, ముకు నోరు కుత్తుక • భుజయుగంబు
మఱియు మోచేతులు • మనికట్లు లెదయును, ప్రక్కలజతయును • బొక్కిలియును
ముష్కద్వయం బఁక • ములు చీలమండలి, జానులు జంఘలు • జరణములును
వరఁగునీయవియెము • ప్పదిరెండ స్థానంబు,లిఁక, బదియాఱుచో • ట్లెఱుఁగఁ జెప్పుదు.

గీ. శిరసునిటలంబును గగండ • సీమలంస, యుగమునున్ భుజకూర్పర • యుగ్మములును
బరఁగుమనికట్టు లెదనాభి • ప్రక్కలకవ,పృష్ఠమివిపదియాఱు చో • ట్లెఱుఁగుఁ డెలమి

వ. ఇఁక నష్టస్థానంబులు వినుఁడు

గీ. అలికమును శ్రుతియుగ్మంబు • నంసయుగ్మ
మెదయుఁబొక్కిలి గుహ్య మి•ట్లెనిమిదియగు
చోటు లింకను వినుఁ డైదు•చోట్లు శిరసు
భుజయుగము హృదయంబును • బొక్కిలియును. ౪౬

వ. ఈ స్థానంబుల నెఱింగి శక్త్యనుసారంబుగ భస్మత్రిపుండ్రంబుల నొనర్పందగు. ఈ నాల్గువిధంబులందుఁగూడ నశక్తుండైన త్రినయనుండును త్రిగుణాధారుండును త్రిమూర్తిజనకుండు నగు శివుని స్మరింపుచు లలాటంబున భస్మత్రిపుండ్రములు ధరించునది. ఇట్లు ధరించినవాఁడు సర్వతీర్థస్నానఫలంబును సర్వవేదాధ్యయనఫలంబును సకలమంత్రజపఫలంబును జెంది సకలభోగంబు లొంది దేహావసానంబున శివసాయుజ్యంబు నొందు. ఈభస్మమాహాత్మ్యంబు శ్రద్ధతోఁ జదివిన వినిన యట్టిఁడును గృతార్థుఁడగు నింక రుద్రాక్షమహిమంబు వినుండు.

—* రుద్రాక్షధారణము - తన్మాహాత్మ్యము *—

క. మును బరదేవత కీయది, పినాకధరుఁ డెఱుఁగఁ జెప్పె • బ్రీతిమెయి భవుం
డున కెఱిఁగించెను మోదం, బున శ్రీకాలాగ్నిరుద్ర•మూర్తి మునీంద్రులార! ౪౭

వ. నేమును దత్ప్రకారంబు మీ కెఱింగించెద నిప్పు డాలకింపుఁడు.

గీ. చిరముదపియించి యాశశి•శేఖరుండు, కనులు దెఱచిన జలజల•కాండకణము
లవనిరాలినయంత రు•ద్రాక్షతరులు, పొడమె రుద్రాక్షఫలములు•పొలిచెనందు

క. ప్రియతమములు రుద్రాక్షలు, త్రయీతనుఁడు శివునకెప్డు • దర్శనముననున్
మెయి ధరియించుటవలనన్, గయికొనిమంత్రజపకృతినిఁ•గలువములడఁచున్.

గీ. గౌడదేశంబునజనించుఁ•గాశిమధుర, యలయయోధ్యనులంక•సహ్యాద్రియందుఁ
బేర్మిఁ బొలుచువిశదరక్త • పీతకృష్ణ, వర్ణములతోడ విప్రాది • వర్ణములయి.

గీ. బ్రాహ్మణుఁడువిశదంబును•బరఁగ క్షత్రి, యుండునున్ లోహితంబువై•శ్యుండుపీత
మునుజఘన్యజుఁడునుగృష్ణ•మునుధరింప, వలయురుద్రాక్షములయందు•వరుసమీఱ.

క. ఈ రుద్రాక్షలఁదాల్చి దివారాత్రి కృతాఘతతులఁ • బాయుదురు జనుల్
తేఱకన లక్షపుణ్యము, ధారణమొనరింప కోటి • తనరు మునీంద్రులార! ౪౯

ఆ. నిరతధారణమున • నెగడుపుణ్యముకోటి, శతము తజ్జపమునఁ • జక్కనొందు
లక్షకోటిశతము • లక్షకోటిసహస్ర, ముల సుకృతఫలంబు • పొందుమీఱి.

చ. ఉసిరికపండ్లఁ బోలినవి • యొప్పుగ శ్రేష్ఠ్యముఁ గాంచు రేగుపం
డ్ల సరిగనున్నయవ్వియు దృ•ఢంబుగ మధ్యమరీతినొందు సాం
పెసగు చణాకృతిన్ బొలిచి • యేవుదనర్చిన వేకనీయముల్
పసఁదగు వీనివైభవము • బాగుగఁ జెప్పితి మీకు వీఁకతో. 91

క. సమములు దృఢంబులును స్నిగ్ధములును స్థూలములు కంట•కయుతంబు శ్రే
ష్ఠములై తనరుచ్చవాని ముదముతో ధరియింపవలయు • ధార్మికవర్యుల్! 92

గీ. వినుఁడు క్రిమిదష్టమును ఛిన్న•భిన్నమును నిఁ
శను సకంటకమును వ్రణ • కలితమును న
యుక్తమును నగు నద్దాని • నొంది ధార
ణంబు సేయంగఁ దగదు త్యా•జ్యం బరయుఁడు. 93

గీ. స్వయముగనె ద్వారయుక్తమై • వాసి నమరు
నట్టి రుదురక్ష యుత్తమం • బగును బురుష
యత్నసంయోజితద్వార • మైనదాని
మధ్యమంబుగఁ జెపుదురు • మానివరులు. 94

గీ. కుందనపురేక చందంబుఁ • జెందు రేక, నొప్పు రుదురాక్ష శ్రేష్ఠమై • యొప్పుమీఱు
నిట్టివానిని మెఱయుచు • నెసఁగునట్టి, వానిఁ బట్టునగుచ్చి తా•ల్పంగవలయు.

వ. ఆధారణం బిట్లు లెక్కయెఱింగి యొనర్పఁదగు.

సీ. సిగయందు నొక్కటి • శిరమున మున్నూఱు, పరఁగఁ గళమున ము•ప్పదియునాఱు
బాహుద్వయంబునఁ • బదియాఱు బదియాఱు, మణికట్టులందును • బదియురెండు
బదియురెండును స్కంధ•పదమున నేనూఱు, వందపై నెనిమిది • జందియంబు
గాఁ జేసి ధరియింపఁగా • నొప్పఁగంఠంబు, నందుఁ బెక్కుసరంబు • లొందవలయు.

గీ. మఱియు రుద్రాక్షకుండల•మకుటములును, గర్ణికాహారకేయూర•కటకములును
నమరుకటిబంధనమును శ్రే•ష్ఠముగఁ గూర్చి, ధారణము సేయువారలు • ధన్యులెందు.

గీ. నిదుర నొందుచునున్నను • నీరు ద్రావు, చున్న రుదురాక్షలను దాల్చి • యుండవలయు
వేయి లేకున్న నేనూఱ•వియును లేక, యున్న మున్నూఱు నేని దా • నొందవలయు.

## —* మంత్రపూర్వకరుద్రాక్షధారణము - తత్ఫలము *—

వ. సహస్రధారణం బుత్తమం బీకను శిరమున నీశానమంత్రంబుచేతను, గంఠమునఁ దత్పురుషమంత్రముచేతను, గళహృదయంబుల నఘోరమంత్రంబుచేతను హస్తంబులం దఘోరబీజమంత్రంబుచేతను, ఉదరంబున వామదేవమంత్రంబునను బంచబ్రహ్మాంగమంత్రంబులచేతను బంచదశరుద్రాక్షగ్రథితంబులగు మూడుగాని యైదుగాని యేడుగాని మాలలను ధరింపవలయును. మఱియు మాలమంత్రంబుచేఁ దక్కినచోట్లను నెల్లెడ దక్కిన రుద్రాక్షంబుల ధరింపవలయు నీకను నీరుద్రాక్షము లనేకముఖంబులై యొప్పొందు నవ్వాని భేదంబులను దత్కృతఫలంబులను దెల్పెద వినుండు. ఏకవక్త్రంబగు రుద్రాక్షంబు పరతత్త్వస్వరూపంబు ఓంహ్రీంనమః అని ధరింపవలయు నద్దానిధారణంబున జనుం డింద్రియజయంబును బడసిఁ తత్త్వంబున లీనంబగు మఱియు నీయది పూజింపఁబడుచున్నచోట మహాలక్ష్మి సాన్నిధ్యమొందు నుపద్రవంబులెల్ల దొలఁగును. సర్వకామార్థంబులు సంఘటిల్లును. ద్విముఖం బర్ధనారీశ్వరాత్మకంబు నద్దాని ఓంనమః యను మంత్రంబున ధరింపవలయు నట్లు ధరించుటచే నర్ధనారీశుండు ప్రియంబొందు. త్రిముఖరుద్రాక్షంబు త్రేతాగ్నిస్వరూపం బద్దాని క్లీంనమః యనుమంత్రంబున ధరింపఁదగు నట్లు దాల్చుటవలన నగ్ని సంతోషించు. చతుర్ముఖరుద్రాక్షంబు బ్రహ్మస్వరూపంబు. ఓంహ్రీంనమః యనుమంత్రంబున నద్దాని ధరింపవలయు నిట్లుధరించిన బ్రహ్మదేవుండు ప్రీతుండగు. పంచముఖంబు పంచబ్రహ్మస్వరూపంబు. ఓంహ్రీంనమః యనుమంత్రంబున నద్దాని ధరింపవలయు నట్లు ధరించినఁ బంచవక్త్రుండు బ్రహ్మహత్యాదోషంబుఁబాపు. షణ్ముఖంబు కార్తికేయవినాయకాధిదైవతంబు ఓంహ్రీంహుంనమః యనుమంత్రంబున నద్దాని ధరింపవలయును. అట్లు ధరించిన నుత్తమారోగ్యము నొందును మఱియు మేధాసంపత్తిఁగోరువారల కీయది ముఖ్యంబు సప్తముఖంబు సప్తమాతృధిదైవతంబు. ఓంహుంనమః యను మంత్రంబున ధరించిన నుత్తమారోగ్యంబుఁ జెందును. జ్ఞానసంపత్తియు గొప్పఁగాఁ గలుగును. అష్టముఖరుద్రాక్షంబు వస్వష్టకాధిదైవంబు. ఓంహుంనమః యనుమంత్రంబున నద్దాని ధరించినఁ బూర్ణాయుర్దాయంబును నవసానంబున శివత్వంబును జెందును. నవముఖంబు నవశక్త్యాధిదైవతంబు. ఓంహ్రీంహుంనమః యనుమంత్రంబున ధరించిన జనుండు శివసమానుండగు. దశముఖంబు యమదైవతంబు.

ఓంహ్రీంనమః యనుమంత్రంబున ధరించిన సర్వపాపక్షయంబగు నేకాదశ
ముఖంబు రుద్రైకాదశదైవతంబు. ఓంహ్రీంహుంనమః యనుమంత్రంబున ధరిం
చిన సౌభాగ్యవృద్ధియగు. ద్వాదశముఖంబు ద్వాదశాదిత్యదైవతంబు. ఓంక్రోం
క్షౌంరౌంనమః యనుమంత్రంబున ధరించిన నాదిత్యరూపంబుఁజెందును. త్రయో
దశముఖంబు కామదైవతంబు. ఓంహ్రీంనమః యనుమంత్రంబున ధరించిన
గామదేవుండు ప్రసన్నుండగు. సర్వకామంబులు సంఘటిల్లుఁ జతుర్దశముఖంబు
శివాధిదైవతంబు ఓంనమః అనుమంత్రంబున ధరించిన నఖిలరోగపరిహారంబును
నారోగ్యంబును జెందునిట్లు మంత్రజపంబుతో రుద్రాక్షలఁ దాల్పవలయు.
మంత్రము వినాగ ధరించిననది యెక్కుడు ఫలసిద్ధి నీయదు.

గీ. ఎలమి రుద్రాక్షముల ధరియించినట్టి, వానిఁగని భూతపైశాచవర్గములును
శాకినీడాకినీప్రేతసంతతులును, నాభిచారికదుర్విధులంత మొందు. 99

వ. ఇఁక నీరుద్రాక్షంబుల సర్వవర్ణాశ్రమంబుల వారలు స్త్రీలుం బురుషులు కన్ని
యలైదువులు వితంతులు, సర్వజనంబులు ధరింపఁజెల్లు. 100

క. శివుఁడును శివయును లక్ష్మీధవుఁడును సిరి తమ్మిచూలి తద్గేహినియున్
రవియును గణనాథుండును, మివులన్ రుద్రాక్షమొంద మెచ్చెదరు మునుల్!

గీ. వినుడి రామాంసములును లశునపలాండు
శిగ్రువిడ్వరాహంబుల శేలువును*న
భక్ష్యములు గాఁగ నరసి చెప్పంబడుటను
వర్జనమొనర్ప వలయును వానినరుఁడు. 102

గీ. అలరు రుద్రాక్షమాలంబునందు బ్రహ్మ,నాళమందుననరవిందనయనుఁడుండు
మొఁకమునందునరుద్రుండు పొలుచునిఁకఁద, దీయబిందుననుందురు దివ్యులెల్ల.

గీ. గ్రహణమున విషువమున సంక్రమణమందు
నయనమునఁ బున్నములయందు నమవసలను
నిండురోజుల రుద్రాక్ష దండినిష్ఠఁ
దాల్చినట్టివానికి దురితములు సమయు. 104

సీ. ధరలోన రుద్రాక్షఁ దలఁచినవానికిఁ, బదియాలదానంబు ఫలముగలుగు
చేత రుద్రాక్షము స్పృశియించి తాల్ప ద్వి,సాహస్రగోదాన శర్మమమరు

* టిప్పణి:— శేలువు=విరిగిచెట్టు

చెవులందు రుదురక్కఁ • జేర్చినఁ బడకొండు, వేలయావులయీవి • శ్రీలనొందు
శిరమున రుద్రాక్షఁ • జెందింపఁగోటియా, వులదాన మొసఁగిన • ఫలముఁ జెందు

గీ. సక్తి జాబాల సదుపని • షత్తు నవఁడు, నిత్య మధ్యయనము సేయు • నేర్పుమీఱ
బాలుఁడైనను యువయైనఁ • బ్రౌఢుఁడగుచు, సర్వులకు మంత్రగురుఁడగు • శాసకుఁడగు

క. గురుడుత్తము రుద్రాక్షం, బిరవుగ గళమందుఁగాని • యిఁక బాహలఁగా
నిరహిం సికయందు నేనియు, నరుఁడొందిగురునకు దక్షిణను సీయఁదగున్. 106

వ. సప్త ద్వీపపతియగు వసుమతినంతను దక్షిణనొసంగినను జాలదట్లు గావున భక్తితో నొక్క పాడియావును సమర్పింపవలయునిఁక సీరుద్రాక్షోపనిషత్తును ప్రాతస్సాయంబుల బఠించినవారలనేక జన్మార్జితంబుల బాయుదురు. లక్షయు నాఱువేల గాయత్రీజపఫలంబు లొందుదురిఁక పంచమహాపాతకంబులనుండి విడువఁబడుదురు. పక్తిశత సహస్రంబును బావనంబుచేయుదురు. శివ సాయుజ్యంబు నొందుదురట్టివారలకు మరలఁ బుడమిజన్మంబు లేదిఁక శివనామవైభవంబును గూర్చి కొండొకవినుండు. 107

## — శివనామ పుణ్యము —

సీ. సర్వపాప జనిత దుఃఖ • సంచయములు
సమయు శివనామ సంస్మరణమున నిఁకమ
లొందుచే నట్లుగాదంత్య • జుండుగాని
శివుని స్మరియింపఁ దనబంతిఁ జేర్పఁదగును. 108

క. వాఁడే వైదికజనుఁడును, వాఁడే పుణ్యాత్ముఁడుండు • వాఁడే ధన్యుం
డీడనయని పుణ్యుం డే, వాఁడిల శివనామజపము • వాసినొనర్చున్. 109

క. శివనామం బిలనగు జాహ్నవి భసితము యమునయై • తనర్చను రుదురా
క్షవిధివధూటియునగు నీ, త్రివేణిఁబూతుఁడగు జనుఁడు • దివ్యుండు భువిన్. 110

చ. చెలఁగి సనత్కుమారముని • చేతను మాగురుఁ డీ సమస్తమున్
దెలిసి కడింది పేర్మి నుప • దేశము నాకొనరించె నేనునున్
జెలువుగ మీకుఁ జెప్పితిని • చెప్పకుఁ డెప్పుడు నాస్తికాళికిన్
ఖలులకు భక్తకోటికిని • గాదని చెప్పినఁ గల్గు దోసముల్ 111

## — పురాణఫలశ్రుతి —

గీ. మఱియు వేదానుగతమగు మార్గమునను, నీశివపురాణమును నెవ్వ రేనిఁ జదివి
రేని విని రేనిఁ బొత్తము నిచ్చి రేని, గొనెదరు త్రివర్గమును దుదిఁ గొంద్రు ముక్తి

క. హరువుగ నాచే మీచేఁ, బురాణయజ్ఞోత్సవంబు పుణ్యశ్లోకుల్ !
జరుపఁబడె నిట్టు లుపశ్రుతి, పరస్పరం బమరె జనుడు భద్రము మీకౌ 113

గీ. ఇట్టులాశీస్సులిడి సూతుఁ డేగినంత, నానువృత్తులు మునులు యాగావసాన
మవుడు పొనరించి వేగమె యచటినుంచి, కాశి కేగిరి నిర్వాణ రాశిఁ గలరి, 114

క. అందును బహుకాలము ము, క్కందనరుచు పశుపతిప్రశస్తవ్రతమున్
పొంది యధిగతసుబోధ న, నిందితులై యొందిరంత నిర్వాణంబున్. 115

గీ. శివపురాణంబు ప్రియమగు శివునకును శి, వకును దత్పుత్రులకు గణపాలురకును
నీఁకను బాఠకులకుఁ భక్తి నిచ్చు మిగుల, భుక్తిముక్తిప్రదంబగు మునులరయుఁడు

గీ. శివపురాణంబుఁ జదివిన శిష్టులకును
శివపురాణంబు వినిన సుశ్రీకులకును
శివుఁడు శివయును దత్సుతుల్ శివగణములు
శివము నిచ్చుచు మనుతురు స్థిరముగాను. 117

మత్తకోకిల. మంగళంబగుఁ శంభుమూర్తికి మంగళంబగు గౌరికిన్
మంగళంబగుఁ దారకారికి మంగళంబిభమాలికిన్
మంగళంబు శిలాదసూనికుమారముఖ్యులకెంతయున్
మంగళంబగు సంతతంబు సమస్తశాంభవకోటికిన్. 118

క. ఆశశితారార్కముగా, నీశైవపురాణకృతి మహేశుఁడు విబుధా
ధీశు లలరసాఁకుతఁగా, వ్యైకుల కిడుఁగాత మోక్ష మెంతయుఁ బ్రీతిన్. 119

క. కుసుమశరాంతకపూజా, ప్రసక్తబసవార్యసహజ! బహుశిష్యసము
ల్లసదర్చనాభిరామాం, ఘ్రిసరోరుహ! బుధజనాళి గీతచరిత్రా! 120

క. సారశివలింగయోగవి
శారద వీరేశలింగశర్మాగ్రజ! వి
స్తారకరుణాంతరంగా!
శ్రీరాజచ్ఛరభమంత్రిసిద్ధవశంసా! 121

వనమయూరవృత్తము. శ్రీమనుమహాజవను । సిద్ధమహిమా!యు
ద్ధామరసవత్సుకవి।తా ప్రబలకామా!
తామరసపత్రసమ।తా మహితనేత్రా!
హేమవరవర్ణవద।హీన శుభగాత్రా! 122[illegible]

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ ప్రణీతంబైన శివపురాణంబందలి విద్యేశ్వర ఖండంబు సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము

ఓరియంటల్ ప్రెస్, 6:83, మార్కెటు స్ట్రీటు, సికింద్రాబాదు-దక్కన్.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 10 | ముఖుఁగొలచెదన్ మదిలోన్ | ముఖుఁదలఁతుమదిభక్తిన్ |
| 4 | 24 | దిరమగు | దిరవగు |
| 5 | 13 | రంజించె పార్వతీ | రంజించెఁబార్వతీ |
| ,, | 26 | పేరుపెంపు | పేరుఁబెంపు |
| 6 | 9 | పట్కాలి కేష్ట | పాట్కాలి కేష్ట |
| 7 | 23 | పదమూడేండ్లు | పదుమూడేండ్లు |
| 8 | 2 | నెచి | నెంచి |
| 10 | 15 | వినుతన | వినుతున |
| 11 | 28 | గామాదిని | గామారిని |
| 12 | 12 | యొద కేగి | యొద్ద కేగి |
| 14 | 11 | దరియానగ్గరితన్ బరిగ్రహము సేయంజాలనేనిన్ బొరిం | దరియానగ్గరితన్ బరిగ్రహము నొంఁ దంజాలనేనిన్ బొరిం |
| 16 | 16 | యనుదుఁబురు | యనుచుఁబురు |
| 19 | 14 | గుణత | గుణిత |
| 20 | 13 | యప్రతిమంబగు | యద్భుతమైతగు |
| 22 | 5 | య భర్గుఁడపుడు | యాఁ భర్గుఁడపుడు |
| ,, | 10 | గొనియన్ | గొనియెన్ |
| 24 | 5 | బ్రణుతు | బ్రణతు |
| ,, | 20 | చెన్నసలారన్ | చెన్నసలారెన్ |
| ,, | 21 | నీరజాక్షుండు | నీరేజాక్షుండు |
| 27 | 25 | కానానల | కాలానల |
| 29 | 1 | బికారమా | బకారమా |
| ,, | 25 | ఆ యజుర్వేదమిటు సెప్పనట్లె | అని యజుర్వేదము వచింపఁ నట్లె |
| 31 | 22 | మను బరితోష మొందితిసుఁ రొత్తములార! | నునుబరితోష మొందితినఁ నుత్తములార! |
| 33 | 3 | మార | మీర |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 35 | 10 | ♦ చందమోాయె | చాప్పామేమె |
| 36 | 16 | ప్రితిప షష్ఠీ | ప్రతిపత్ షష్ఠీ |
| 37 | 20 | నిరోధానంబును | నిరోధంబును |
| 38 | 25 | సిదులును | సిద్ధులును |
| 39 | 15 | యిట్లయె | యిట్లనియె |
| 40 | 8 | కీయుడు | కిచ్చుడు |
| ,, | 25 | అంత | అక్కతన |
| ,, | 22 | లకుఅన్నంబు | లకన్నంబు |
| 51 | 14 | ♦ రనఘుమతులు | ♦ రలఘుమతులు |
| 52 | 2 | ♦ భర్గుండాపెౕ | ♦ దాశివుండాపెౕ |
| 53 | 13 | నుండె | నుండు |
| 56 | 3 | డత | డత్త |
| 57 | 14 | యాపాతివ్రత్య కుశలయా నే గృహిణీ। | యోపాతివ్రత్యకుశల! యో సిపురంధ్రి! |
| 59 | 5 | దీక్షితాయిని! | దీక్షితాయని! |
| 62 | 26 | యంబుల్ శౌరా ప్రేమాతిశయం। బౌరా సౌభాగ్య | యంబా। రౌరా ప్రేమాతిశయం। బౌరా సౌభాగ్య |
| 63 | 6 | కరండ శిల్పయా | కరండ నేత్రియా |
| 66 | 7 | గాని | గొని |
| 68 | 25 | చుండెర | చుండెనుర |
| 69 | చివర | నాతరమొందు | నాతురమైన |
| 73 | 26 | శ్రీకుఁడును | శ్రీకుఁడును |
| ,, | 23 | లందు యావనప్రభవమందు | లందునుౕ యావ ♦ నంబునందు |
| 76 | 4 | ట్లనెయొనరించెదసీపను। పునునైన యొకండు | ట్లనెనొనరించెద సీపను। పునునైన నొకండు |
| ,, | 5 | నాకస్త్ర్రచెలువ యదియు | నాకస్త్ర్రమింతియదియున్। |
| 80 | 23 | క ♦ లాలంకరున్। | క ♦ లా శేఖరునిౕ |
| 84 | 25 | జలహారమై | జలాహారమై |
| 86 | 2 | కొనన్ వెడగాగ నిల్చినన్ | కొనంగనెడన్ వసించినన్ |

| పేజి | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 82 | 9 | చ. "కొమరిరెనొసంగు" అను పద్యమంతయు—— | |
| | | చ. కొమరిలినిమ్ము రుద్రునకుఁ ♦ గోమలి చేసిన సద్వ్రతంబున<br>ర్సముసమకూరమెచ్చియెన ♦ రంభొసఁగెఁ సతిఁగాఁగొనన్ శివుఁ<br>డమరెమనంబు లందుముద ♦ మగ్గలమైదయివార సర్వయ<br>త్నముఁలను సల్పివేగిరము ♦ దక్ష! యొనర్పు వివాహమీవిఁకన్ ॥ | |
| 88 | 2 | నందఱు | నందల |
| ,, | 18 | బొడుపఁజూడుడు | బొడుపఁజూడుడు |
| 89 | 21 | నచ్చటనే చేర్చు | నచ్చటనెచేర్చు |
| 91 | 21 | వెలసెడు మేఘములతోడ ♦ | తనరెడు మేఘమ లతోడఁ ♦ |
| | | విశ్వేశ్వర! యీ | దత్వజ్ఞా! యీ |
| 92 | 18 | బ। వ్విందులు | బల్ విందులు |
| ,, | ,, | నివృ – ధా | నక – టా |
| ,, | 24 | దవ్వుఁజేసి భసి – తాననురై | ఁబాసిబూదినిభృ – శమ్ముగ |
| | | చరియింత్రుగాక | బూసి చరింత్రుగాక |
| 99 | 18 | వెడచేసి | నెడచేసి |
| 104 | 17 | శర్వునిఁ దెలియకిట్లు | శర్వుఁదె – లియకయిట్లు |
| 105 | 2 | విశ్వబంధు ♦ నలిగి | విశ్వవిభునకలిగి |
| | 13 | మెట్టికర్మయేని యెసగదు | మెట్టికర్మమేని ♦ యెసఁగదు |
| | | బ్రహ్మయం | బ్రహ్మమం |
| | 21 | జిహ్వఁదెగేయఁగ | జిహ్వను గోయఁగజెల్లు |
| | 22 | చోవెడ | చోనెడ |
| | 27 | నామ ♦ నమునొచ్చు నిఁకన్ | నాదు మన మిఁక నొచ్చున్ |
| | 105 | వేదమందు వేఱు ♦ వేఱుగావి | మద్రితయిన్ విభేద ♦ మమరఁగావి |
| 106 | 16 | కార్చెన ♦ య్యొడలువడిగ | దహియించె ♦ వడిగనొడలు |
| 109 | 18 | కాష్టాగూడుండును | కాష్టాంగుష్టుండును |
| 111 | 18 | మాద్యద్ఘట | మాద్యద్భట |
| 114 | చివర | జీవనః | జీవినః |
| 115 | 3 | దత్తుం | దత్తున్ |
| 116 | 10 | వెడంజేసి | వెలింజేసి |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 117 | 2 | యింబొ | యింబై |
| | 16 | నారదబ్బలునున్ నారికడముల్ | నారదబ్బలున్ నారికడములు |
| | | కజూరముల్ క్రముకములును | కజ్జూరముల్ క్రముకములును |
| 129 | 23 | ధార్మికసముఖా ! | ధార్మికసుముఖా ! |
| 131 | 8 | ధారుణన్ | ధారణన్ |
| 132 | 19 | జెలువు దనర్చె | జెలువునఁ దనరెన్ |
| 134 | 4 | జెఁపుడనిరి | జెఁపుమనిరి మానుల్ |
| 136 | 18 | లగ్గయ్యెడునని | లగ్గయ్యెడుమని |
| | చివర | శానవాటుల వనస్థలములనుచు | శానమ్మునందు నుద్యానమనుచు |
| 142 | 12 | నిలుఁబాసె | నిలు-వాసె |
| 147 | 21 | కఁబూజించు | కపూజించు |
| 148 | 19 | మవక్రవిక్రమా | మవార్యమాకృపన్ |
| 152 | చివర | ఁబుడమి | నెలమి |
| 156 | 23 | నరుదొప్పఁగా | బ్రియమొప్పగా |
| 157 | 10 | దావ్యి | విద్యా |
| 161 | 14 | స - రేశ్వరుండు | స - ర్వేశ్వరుండు |
| ,, | 18 | నరుతభాగ్యంబు వాని | నరుతచా-యగలవానిఁ |
| 162 | 9 | వైభవము నిలన్ | వైభవగరిమన్ |
| 167 | 15 | ప్రకృదాటిన | ప్రకృతి దాటిన |
| 163 | చివర | పోయిరీని | పోతిరేని |
| 165 | 2 | నవని రమణీ | నమర రమణీ |
| 166 | 2 | తపసులువుడమిన్ | తపసులగవరా! |
| 169 | 7 | నగ్గిరి రాజకుమారి | (ఈ యక్కరములను వదిలివేయ వలయును) |
| 172 | 16 | సార్థక ముప్పన్ | సార్థకతదగన్ |
| 178 | 10 | కదిరి | కదరి |
| 181 | 19 | దేరు నెక్కి | దేరి నెక్కి |
| 183 | 7 | ఘనమిఁకన్ జగత్రయీా | ఘనతయిఁకజగత్ర -యీా |
| 184 | 15 | మీకు | నీకు |

| పేజి | బంతి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 186 | 7 | రేఁచి | మీాఁటి |
| ,, | 8 | లిం గాడానుపమోప...లిగా | లింగావింపఁగడంగిరెంతయును పాశ లిం గామతృష్ణాళులై |
| 188 | 24 | మహేశు పైఁబ్ర ♦ హార మొప్పఁగుప్పిన్గ | మహేశుపై న ♦ భంగ భంగి గుప్పిన్గ |
| 189 | 11 | మా ।రు రతీకామిని సూచి మూర్ఛి లె సువర్యుల్ తీవ్రదుఃఖార్తిదు— | న।మ్మరుఁ దద్దేహినిసూచి మూర్ఛిలె సురల్ మానుల్ గభీరార్తిదు— |
| 190 | 6 | పరవసంబున నేను | బరవసంబున నేను |
| 192 | 12 | ర♦తీసహాయు | ఁబ♦త్నీసహాయు |
|  | 13 | ననవరతము | నమరులార ! |
|  | 18 | ఘటించి | ఘటించు |
| 200 | 16 | మచ్చికము | మచ్చికను |
|  | 26 | నానుడిని | నానుడిఁ |
| 206 | 19 | నక్రనే | నక్రకే |
| 207 | 15 | నిక్కముక | నిక్కముగ |
| 212 | 13 | కెంచక యాలకింపు | కెంచకకొంచక యాలకింపు |
| 213 | 4 | కాముకక్రీడలఁ♦ గాశలుండాహరి | కామనిర్మాణై క ♦ కారణంబా హరి— |
|  | 5 | కృత్తి ♦ వసనుఁడితఁడు | కృత్తి ♦ వసనమూర్తి |
| 217 | 1 | ఎవ్వనికూఁతు | ఎవ్వనికన్య |
| 221 | 23 | బుద్ధి | ఋద్ధి |
| 222 | 5 | తపంబిడ్డ | తపంబడ్డ |
| 225 | 7 | ప్రభాసితుండును | ప్రభాభాసితుండును |
|  | 16 | మయవునైన | మయువినైన |
| 226 | 11 | క్రమ ♦ మంతయు | శ్రమ మంతయు |
| 233 | 6 | మేనివాసము | మేటనివాసము |
|  | 21 | వాకిలిలేనినాఁడు | వాకిలిలేనివాఁడు |

